# తొలి పలుకు.

---

నేను మద్రాసు ఆయుర్వేద కాలేజీయందు విద్యాభ్యాసముకొరకు ప్రవేశించిన కొలదికాలముననే ఆంధ్రదేశమందు ప్రసిద్ధములైన యోగముల విషయమై కలుగుచున్న యిబ్బందులను గ్రహించి నాటినుండియు యెటులైనను ఈయోగములనన్నిటిని సమకూర్చి యొకగ్రంథరూపమున వ్రాసి ముద్రింపదలచి 10 సంవత్సరములనుంచియు అనేక ప్రాచీనగ్రంథములను లిఖితగ్రంథములను సంపాదించియు సామాన్యవైద్యులు మొదలుకొని గొప్పవైద్యులువరకు కనుపించిన ప్రతివైద్యులయొద్దనుంచియు ఏదోయొక విధమున వారివద్దనున్న ఔషధయోగములను సంపాదించియు ఈపుస్తకమును వ్రాసితిని. ఇటువంటియోగములను సమకూర్చి ఈ పుస్తకమును వ్రాయుట ఎంతటికష్టమో ప్రతిమానవునకును తెలిసినవిషయమే. ప్రసిద్ధఔషధయోగములన్నియు తెలియకపోవుటచేతచే ప్రతివైద్యులును చేసుకునలేకపోవుటయేగాక వాటియొక్క పూర్తిఅయిన గుణములనుకూడ గ్రహించలేకున్నారు. ప్రసిద్ధఔషధములన్నియు ప్రత్యక్షమగుటచే ప్రతిమానవునకును వాటియొక్క స్వభావము కరతలామలకమగును. అందుచే లోకమునకు మిక్కిలి ప్రయోజనమును ఆయుర్వేదౌషధములకు బహువ్యాప్తియు కలుగగలదు. ఇందువిషయమై ఇదివరకు ధన్వంతరి మొదలగు పత్రికలయందు వ్యాసములను వ్రాసియుంటి. ఇటువంటి గ్రంథము ఆంధ్రదేశమున ఇదివరకే వెలుబడవలసియున్నను వెలుబడియుండలేదు. ఇందు ప్రసిద్ధములును దుర్లభములును రత్నములవంటి ఔషధయోగములు మాత్రము వ్రాయబడినవి. ఇందుచేతనే ఆయుర్వేదౌషధరత్నాకరము లేక కృష్ణపంక్తీయము అను పేరుచే విరాజిల్లుచున్నది. నేను ఈయోగముల నన్నిటిని సంపాదించు

టకు అనేకవ్యయప్రయాసలకు లోనైతిని. అందుచే రత్నమువంటిఔషధ యోగము 1 కి వకకాని (0-0-3 పై) ఖరీదు అయినచో సర్వజనగ్రాహ్య మగునని తలచి ఈగ్రంథమునకు రూ. 6-0-0 లు వెల ఏర్పరచితిని.

శీతాంశురసము, సన్నిపాతభైరవి మొదలగు కొన్ని యోగములు బసవ రాజీయాదిగ్రంథములయందు లభ్యములు గనున్న సుప్రసిద్ధ యోగములతో ఇవికూడ ఏకగ్రంథమున్నచో మందులు చేసుకొనుటకు యోగములనిమి త్తము ఇంకను ఏ ఇతరపుస్తకమును చూడవలసిన అవసరము లేకుండుటం జేసి వైద్యులకు మిక్కిలి ఉపయోగము కాగలదని తలచి ఏకముఖమున వ్రాసితిని. నిజముగా వైద్యులకు యోగములనిమిత్తము ఇతరపుస్తకములు ఏమియు అవసరము లేదు. ఈపుస్తకమునందలి యోగముల వ్యాఖ్యా నము ఇంతకన్నను విమర్శించి వ్రాయుటకు అవకాశము కలగదు. ఎట్లనగా మూలమగుశ్లోకములయందు సామాన్యముగా దగ్గులమీద పనిచేయునని చెప్పబడియున్నను కాంతవల్లభరసము శ్లేష్మదగ్గులమీద పనిచేయు ననియు సిందూరభూషణము వేడిసంబంధమగు దగ్గులమీద పనిచేయు ననియు, మహాలక్ష్మీవిలాసము ద్వంద్వసంబంధమగు దగ్గులమీద పని చేయుననియు ఈ మొదలగు అనేకవిశేషాంశములు వ్రాయవచ్చును. కాని మూలాతిక్రమణమునకు ఇష్టము లేకను గ్రంథవిస్తరభీతిచేతను ప్రస్తు తము ఇట్లు ముగించితిని. ఇందలి యోగములను వక్కొక్క యోగమునకు అటువంటి అనేకయోగములను సరిచూచి వ్రాసితిని. సరియైన వాడుక నిమిత్తము కొన్ని యోగములయొక్క పేరులుమాత్రము కొద్దిగ మార్చ వలసివచ్చినది. ఈ యోగములన్నియు చాలవరకు అనేకమందివద్ద వ్రాత పుస్తకములనుండి సంపాదించుటచేత గ్రంథనిర్దేశము చేయుటకు పూర్తి అయిన అవకాశము కలుగ లేదు.

వ్యాఖ్యానమునందు శుద్ధిచేయబడిన అనుటకు శు, అనెడి అక్ష రమును భస్మలకు ప్రతిచోట భస్మ అనియు వ్రాయబడియున్నది. కొన్నిస్థలములయందు అట్లు వ్రాయబడియుండ లేదు కావున ఈ యోగములయందు చెప్పబడిన, రసము, గంధకము, తాళకము,

శిల, నాభి, పాషాణములు, నేపాళములు మొదలగునవి శాస్త్రప్రకార ము శుద్ధిచేయబడినవియు, అభ్రకము, కాంతము, ఖడ్గలోహము, వంగము, సీసము, మొదలగునవి శాస్త్రప్రకారము భస్మము చేయబడినవియు వేసుకొనవలయును. ఈమందులకుఅనుపానములు, మోతాదులు, మొదలగునవి చెప్పబడని స్థలములయందును చెప్పినస్థలములయందుకూడను ఆయామాత్రజ్ఞులును, దేశకాలాదునుబట్టి బుద్ధిబలముచే ఉపయోగించుకునవలయును. బుద్ధికుశలతచే మందుల యొక్క ఆశ్చర్యజనకములగు గుణాతిశయములనుకూడ కనుగొనుటకు అవకాశముకలదు ఒకేస్వభావముకల ఒకమందునందు ఎక్కువగుణములు చెప్పబడి ఇంకొకమందునందు అన్నిగుణములు చెప్పబడియుండకపోయినను ఈమందు కూడ ఆగుణములన్నియు కలిగియున్నట్లు ఊహించుకునవలయును. ఉదాహరణము—రజతలోహరసాయనము మొదలగునవి.

నాకు ఈ ఔషధయోగములను దయచేసిన శ్రీరాజా వాసిరెడ్డి చంద్రమౌళీశ్వరప్రసాద్ బహద్దర్ మన్నెసుల్తాన్ ముక్త్యాల జమీందారువారికిని, శ్రీరాజా నల్లపరాజు మీర్జా అచ్యుతరామరాజుగారికిని (తుని,) శ్రీరాజా వాసిరెడ్డి దుర్గాసదాశివేశ్వరప్రసాద్ బహద్దర్ మన్నెసుల్తాన్ జయంతిపుర జమీందారువారికిని, శ్రీ కవిరాజ శ్రీ వత్సవాయ నీలాద్రిరాజుగారికిని (తునియస్టేట్ విద్వత్ కవులు), పెద్దిభొట్ల వీరయ్యపంతులు, బి.ఎ., బి.ఎల్., గారికిని (బెజవాడ) శ్రీ మాడపాటి వెంకటేశ్వరరావుపంతులుగారి వ్రాతపుస్తకములన్ను చూచి వ్రాసుకొనుటకు యిప్పించినారు) డాక్టర్ యస్. రామలింగయ్యగారికిని (వరంగల్) సీతారామావధూతగారికిని (పడమటలంక) ఔషధయోగముల నిచ్చిన ప్రతివారికిని నాయందు ప్రత్యేకాభిమానముతో త్వరలో ఈ గ్రంథమును ముద్రింపించి యిచ్చిన వాణీప్రెస్ ప్రొప్రయిటర్ దాసు కేశవరావు పంతులుగారికిని, నాకు అనేకవిధముల ప్రోత్సాహమును కలుగజేసిన శ్రీపి రంగేశ్వరసోమయాజులుగారికిని, కూచిభొట్ల నాగభూషణంపంతులుగారికిని, నండూరి శోభనాద్రిఆచార్యులగారికిని ఈగ్రంథమును వ్రాయుటకు నాకు తగినఅవకాశమును కలుగజేసిన బొడ్డపాటి వెంక

టప్పయ్యపంతులుగారికిని, ఈగ్రంథముద్రణము నిమిత్తము ధనసహాయ ముచేసిన శ్రీరాజా శోభనాద్రి అప్పారావు బహద్దర్ జమీందార్, ఎలమర్రు, అంబారుపేట వగైరా యస్టేట్సు వారికిని, శ్రీరాజా బొమ్మదేవర నాగన్ననాయుడు బహద్దర్ జమీందార్, వల్లూరు వగైరా యస్టేట్సువారికిని మిక్కిలి కృతజ్ఞుడను.

ఇట్లు,

సకలసహృదయవిధేయుడు,

గ్రంథక_

# విజ్ఞాపన

ఈ పుస్తకమునందలి చాలా యోగములు అనేక ప్రాచీనశిథిల గ్రంథములనుండియు అనేకమందియొద్ద వ్రాతపుస్తకములనుండియు గ్రహించబడి వ్రాయబడియున్నవి. ఆయోగములలో కొన్ని అసంపూర్ణముగను సందిగ్ధముగను తప్పులుగను భేదములుగను యున్నవి. మరియు ఆశ్చర్యజనకమగు వ్యాఖ్యకూడ కలిగియున్నవి. అటువంటి ఆయోగములయొక్క స్వరూపమును ఇంతవరకు సవరించి వ్రాయుటకు నేను పొందిన శ్రమ వ్రాయనలవికాదు. అందుచే ఇంతకన్నను పరిశుద్ధముగను వ్యాఖ్యానము ఇంకను విపులముగను వ్రాయుటకు ఈముద్రణయందు ఇంతకంటె అవకాశము కలుగలేదు. భగవంతుని దయవలన కొద్దిగ సంస్కృతమును, కొద్దిగ ఆయుర్వేదమును తెలుయుటచేతను, 10 సంవత్సరముల నుంచియు అనేకవిధములగు యోగములను సంపాదించియుండుటచేత నున్ను ఇంతవరకైనను వ్రాయగలిగితిని.

మరియు గవర్నరుపేటయందలి రామమోహన ధర్మవైద్యశాలయదును, బెజవాడయందలి ధర్మవైద్యశాలయందును ప్రధానవైద్యుడగ నుండి ఆపనినంతయు నెరవేర్చుకునవలసి వుండుటచేతనున్ను, రామమోహన ఆయుర్వేదకళాశాలయందు ప్రధానోపాధ్యాయునిగా నుండి పాఠ్యక్రమమును అభ్యసింపచేయవలసివుండుటచేతనున్ను, మూలికావనమునందలి కార్యక్రమమును పరిశీలించవలసివుండుటచేతనున్ను, వైద్యశాలయందు వసంతకుసుమాకరము సిద్ధమకరధ్వజము, అభ్రకము మొదలగు ఘనఔషధములనన్నిటినికూడ తయారుచేయించవలసివుండుటచేతనున్ను గ్రామాంతరములయందలి జమీందారుల గృహములయందు వైద్యము చేయవలసివుండుటచేతనున్ను ఈమొదలగు ఇంకను అనేక

కార్యభారముల చేతనున్ను ఎంతమాత్రమును అవకాశము లేక ఈరత్నాకరమును ఇట్లు ముగించవలసివచ్చినందులకు క్షమింతురుగాక.

తెలిసియుకూడ సవరించుటకు వీలులేక అచ్చటచ్చట స్త్రీ నపుంసకాదిలింగములు వ్యాకరణశాస్త్రవిరుద్ధముగను శ్లోకపాదములయందు అక్షరవ్యత్యాసముగను వ్రాయవలసివచ్చెను. ధ థ మొదలగు వర్ణవ్యత్యాసములును అక్షరపొరపాటులును గ్రామ్యపదములును చాలనుండును. సీసపద్యములయందు పాదవిభాగములయందు వ్యత్యాసము కలదు. పదవిభాగావకాశములు సరిగా వేయుబడలేదు. ఇటువంటి సూక్ష్మపొరపాటులు చాలవరకు వుండవచ్చును. అవన్నియు ముందు ముద్రణయందు విశేషముల పరిశోధించి ముద్రింపించగలను. కావున విషయప్రధానులగు తాము విషయమును గ్రహించి పొరపాటులను సవరించుకుని మీకు కలుగచేసిన శ్రమకు నన్ను మన్నించ ప్రార్థించుకునుచున్నాడను.

ఇట్లు,

గ్రంథకర్త.

# ఔషధానుక్రమణిక.



ఓమ్

శ్రీరస్తు. ఆరోగ్యమస్తు.

ఆంధ్రతాత్పర్య సహిత

# ఆయుర్వేదౌషధరత్నాకరమ్

## ప్రథమ గుచ్ఛము.

శ్లో॥ నమామి ధన్వంతరిమాదిదేవం సురాసురైర్వందితపాద పద్మమ్। లోకేజరారుగ్భయమృత్యునాశం దాతారమీశం వివిధౌషధీనాం॥

వ్యా॥ ఆదిదేవుడైనటువంటివాని, దేవతలచేతను రాక్షసులచేతను నమస్కరించబడిన పాదపద్మములు కలిగినటువంటివాని, లోకమందు ముసలితనము యొక్కయు వ్యాధులయొక్కయు భయమును మృత్యువును నశింపజేసినట్టియు, సమస్తమైన ఓషధులయొక్కయు, జ్ఞానమును యిచ్చినట్టియు, ప్రభువైనట్టియు, ధన్వంతరిని నమస్కరించుచున్నాడను.

శ్లో॥ యోగేనచిత్తస్య పదేనవాచాంమలం శరీరస్యచ వైద్యకేన। యోపాకరోత్తం ప్రవరం మునీనాం పతంజలిం ప్రాంజలిరానతోస్మి॥

వ్యా॥ యోగశాస్త్రముచే మనస్సుయొక్కయు, వ్యాకరణ శాస్త్రముచే వాక్యములయొక్కయు, వైద్యశాస్త్రముచే శరీరముయొక్కయు, మాలిన్యమును పోగొట్టినట్టియు, మునిశ్రేష్ఠుడైనటువంటియు, పతంజలిని దోసెలివగ్గి నమస్కరించుచున్నాడను.

శ్లో॥ ఆయుర్వేదం మహాశాస్త్రం ధర్మార్థసుఖసాధనం। అధ్యాపకాన్ గురువర్యాన్ గోపాలాచార్యాదీంస్తథా। ప్రణమ్యశిరసాసమ్యక్ నిధింప్రథితౌషధానాం। సర్వలోకహితార్థాయ గ్రంథంపరమదుర్లభం। కరోమి సూక్ష్మయాబుద్ధ్యాలోకరంజకముత్తమం॥

వ్యా॥ మహాశాస్త్రమైనట్టియు, ధర్మార్థసుఖసాధనమైనట్టియు, ఆయుర్వేదమును అభ్యసింపచేసినటువంటి, గురుశ్రేష్ఠులైన గోపాలాచార్యులు మొదలగువారిని శిరస్సుచే బాగుగనమస్కరించి ప్రసిద్ధౌషధములకు నిధి అయినటువంటియు, మిక్కిలి దుర్లభమైనటువంటియు, లోకమును సంతోషింపజేయునట్టియు, శ్రేష్ఠమైనటువంటియు గ్రంథమును లోకముయొక్క హితవునిమిత్తము సూక్ష్మబుద్ధిచే చేయుచున్నాడను.

శ్లో॥ పరమపూజ్యం పితరం సోమయాజ్యాఖ్యానం గురుం। దైవ స్వరూపిణీం శివాంశాంతాది గుణయుక్తాం గుర్వీం। అనేక సుగుణోపేతాం వంద్యాంచ మాతృదేవతాం। ప్రణమామి తథానిత్యం సర్వశ్రేయో భివృద్ధయే। సుబ్బమాంబాభిధానాం హినిత్యస్మరణ గుణినీం॥

వ్యా॥ మిక్కిలి పూజించదగినట్టియు గౌరవనీయులైనట్టియు సోమయాజి యనెడి తండ్రిని, దైవస్వరూపురాలైనట్టియు, మంగళప్రదురాలైనట్టియు, శాంతాది గుణములతో కూడుకున్నటువంటియు, గౌరవనీయురాలైనట్టియు, అనేక సుగుణములతో కూడుకున్నటువంటియు, నమస్కరించదగినట్టియు, మాతృదేవతయైనట్టియు, ఎల్లప్పుడు స్మరింపదగిన గుణములు కలిగినట్టియు, సుబ్బమాంబయనెడి తల్లిని సర్వ శ్రేయోభివృద్ధికొరకు ఎల్లప్పుడు నమస్కరించుచున్నాడను.

శ్లో॥ సుబ్బమాంబాఖ్య మాతృకః సోమయాజ్యాఖ్య పితృకః। వెంకటేశ్వర నామాచ సుబ్రహ్మణ్య మితినామకః । రామమూర్తిసత్య నారాయణః శేషయాఖ్యశ్చయః । నరసింహేతి నామాచ షట్సోదర సమాహితః । సుబ్బమాంబా రామమాంబా వేంకటరత్న మిత్యపి। సోదరీ త్రయ సహితో శ్రీపాదేత్యుపనామకః । కృష్ణమూర్తి శాస్త్రినామా కౌశికసగోత్రోద్భవః । గోదావరీ మండలస్థే అమలాపుర సమీపకే । కోనసీమేతి ప్రథితే మోడేకుర్రు సమాభిధే। గ్రామకేజన్మభూమిశ్చ అహం రచయామి గ్రంథం । ఆయుర్వేదౌషధరత్నాకరం నామాతిదుర్లభం॥

వ్యా॥ సుబ్బమాంబయనెడి తల్లియు, సోమయాజియనెడి తండ్రియు, వెంకటేశ్వరులు, సుబ్రహ్మణ్యము, రామమూర్తి, సత్యనారాయణ, శేషారావు, నరసింహము, అనెడి ఆరుగురు సోదరులును సుబ్బమాంబ, రామమాంబ, వేంకటరత్నము, అనెడి ముగ్గురు తోబుట్టువులును కలిగినట్టియు, కౌశికసగోత్రమందు పుట్టినట్టియు, శ్రీపాద అనెడి ఇంటిపేరు కలిగినట్టియు, కృష్ణమూర్తిశాస్త్రియనెడి పేరు కలిగినట్టియు, గోదావరిజిల్లాయందును అమలాపురమునకు సమీపమందును ఉన్నటువంటి కోనసీమయని ప్రసిద్ధమైన మోడేకుర్రు యనెడి గ్రామము జన్మభూమిగా కలిగినట్టియు నేను మిక్కిలి దుర్లభమైన, ఆయుర్వేదౌషధరత్నాకరము, అనెడి ఈగ్రంథమును రచియించుచున్నాడను.

# గ్రంథ ప్రారంభము.

## కాంతవల్లభరసమ్.

శ్లో॥ కాంతంషోడశభాగంచ చతుర్దశమయోరజః । కిట్టంద్వాదశకంచైవ దశభాగంతుటంకణం । మనశ్శిలాష్టభాగంచ షడ్భాగంచశిలాజతు । సర్వేణచసమంసూతం గంధకంచాపితత్సమం । ఆర్ద్రమూషోదరేన్యస్య వాలుకాయంత్రకేక్షిపేత్ । పాచయేత్సప్తరాత్రంతు సంగ్రాహ్యంసూక్ష్మచూర్ణితం । సేవితంమధునాయుక్తం నిష్కార్ధేనసమన్వితం పాండురోగంక్షయంగుల్మం గ్రహణీరోగనాశనం । కాసంశ్వాసంజ్వరం ఛర్దింప్లీహోదరమరోచకం । మందాగ్నింకుష్ఠరోగంచ మూలరోగం భగందరం । వాతశూలహరంవృష్య మత్యంతమతిదీపనం । తుష్టిపుష్టికరంకాంతి వర్ధనంబలవర్ధనం । కాంతవల్లభనామాయం విష్ణునానిర్మితం పురా । సర్వపాండుక్షయంచైవ లోకస్యారోగ్యకారణం ॥

వ్యా॥ కాంతభస్మ, 16. భా. ఖడ్గభస్మ, 14. భా. మాండూరభస్మ. 12. భా. శు. వెలిగారం 10. భా, శు, మణిశిల 8. భా. శిలాజితు. 6. భా. వీటికిసమము, శు. పాదరసము. పాదరసముతో సమానము, శు. గంధకము. వీటినన్నిటిని ఆర్ద్రమూసయందుంచి వాలుకాయంత్రమందు ఏడురోడులువండి తీసి మెత్తగాచూర్ణించి అర్ధనిష్కప్రమాణము తేనెతో సేవించిన. పాండురోగము, క్షయ, గుల్మము, గ్రహణిరోగము, కాస, శ్వాస, జ్వరము, వాంతి, ప్లీహోదరము, అరోచకము, అగ్నిమాంద్యము, కుష్ఠరోగము మూలరోగము. భగందరము, వాతశూల వీటిని హరించును వీర్యవృద్ధి, అగ్నిదీపనము, మనస్సంతోషము, శరీరపుష్టి, శరీరకాంతి, బలము, వీటిని కలిగించును, ఇదివిష్ణువుచే నిర్మింపబడిన కాంతవల్లభరసంబనబడును. సర్వపాండువులను. సర్వక్షయలను హరింపచేయును. లోకమునకు ఆరోగ్యమును కలిగించును.

## సువర్ణ కాంతవల్లభ రసమ్

శ్లో॥ కాంతంషోడశభాగంచ చతుర్దశమయోరజః । కిట్టంద్వాదశకంచైవదశభాగంతుటంకణమ్ । మనశ్శిలాష్టభాగంచషడ్భాగంచశిలాజతు। సువర్ణంఏకభాగంచరౌప్యకంచద్విభాగకం । సర్వైస్సమంశుద్ధసూతంగం

ధకంసూతతుల్యకం । జంబీరఫలసారేణదృఢంమర్ద్యంచయత్నతః । ఆర్ద్రిమూషోదరేన్యస్యవాలుకాయంత్రకేపచేత్ । పాచయేత్సప్తరాత్రంతుసంగ్రాహ్యంసూక్ష్మచూర్ణితం । జలేనచవిమర్ద్యంచవటకాన్ చైవకారయేత్ సేవితంమధునాయుక్తం చతుర్గుంజాప్రమాణతః । పాండురోగంక్షయం గుల్మం గ్రహణీరోగనాశనం । కాసంశ్వాసంజ్వరంఛర్దింప్లీహోదరమరోచకం । మందాగ్నింకుష్ఠరోగంచమూలరోగంభగందరం । వాతశూలహరంవృష్యమత్యంతమతిదీపనం । తుష్టిపుష్టికరంకాంతివర్ధనంబలవర్ధనం । వీర్యవృద్ధికరంచైవఅగ్నిదీప్తికరంనృణాం । కాంతవల్లభనామాయం సువర్ణపదపూర్వకం ॥

వ్యా॥ కాంతభస్మ 16 భా. ఖడ్గలోహభస్మ 14 భా. మాండూరభస్మ 12 భా. వెలిగారం 10 భా. శు. మనశ్శిల 8 భా. శిలాజతు 6 భా. సువర్ణభస్మ 1 భా. వెండి భస్మ 2 భా. వీటిఅన్నిటికి సమానం శు. రసం రసముతో సమానం శు. గంధకం ఇవిఅన్నియు ఖల్వములోవేసి నిమ్మకాయల రసముచే దృఢముగ మర్దించి ఆర్ద్రిమూసయందుంచి వాలుకాయంత్రమందు ఏడురోజులు వండి తీసుకొని మెత్తగనూరి ఉదకముచే మర్దించి మాత్రలు కట్టుకొని నాలుగు గురివిందగింజల ప్రమాణము తేనెతో సేవించిన పాండురోగము, క్షయ, గుల్మము, గ్రహణిరోగము, కాస, శ్వాస, జ్వరము, వాంతి, ప్లీహోదరము, అరోచకము, అగ్నిమాంద్యము, కుష్ఠు రోగము, మూలరోగము భగందరము, వాతశూల, వీటిని నశింపజేయును. మిక్కిలి వృష్యంబు మరియు తుష్టి పుష్టి కాంతి బలము వీర్యవృద్ధి అగ్నిదీప్తి వీటిని కలుగ జేయును. ఇది సువర్ణకాంతవల్లభ రసంబనెడి పేరంబరగు.

## మహాసువర్ణ కాంతవల్లభ రసం

శ్లో॥ కాంతంషోడశభాగంచ లోహభస్మ చతుర్దశ కిట్టంద్వాదశకంచైవ చతుర్భాగంచ అభ్రకం । తామ్రభస్మఅష్టభాగం. షడ్భాగంచ మనశ్శిలా । టంకణంచచతుర్భాగం ద్విరౌప్యంచైకస్వర్ణకం । సర్వైస్సమంశుద్ధసూతం గంధకంసూతతుల్యకం । హంసపాదిరసైర్మర్ద్యం వాలుకాయంత్రయోగతః । పాచయేత్సప్తదివసం సంగ్రాహ్యంసూక్ష్మచూర్ణకం । నీరేణచవిమర్ద్యంచ వటకాన్ చైవకారయేత్ । సేవితంమధునాయుక్తం గుంజాత్రయప్రమాణతః । పాండురోగంక్షయంగుల్మం గ్రహణీరోగనాశనం । అజీర్ణంవివిధంహంతి జీర్ణజ్వరవినాశనం । కాసంశ్వాసంజ్వ

రం ఛర్దిం ప్లీహోదరమరోచకం । శోఫంచవివిధంహన్యా త్కామలాంచ హాలీమకం । కుష్ఠరోగమతీసారం మూలరోగంభగందరం । వాత వ్యాధిహరం శ్రేష్ఠం శూలఘ్నం శ్లేష్మరోగహృత్ । అనుపానవిశేషేణా సర్వరోగహరంపరం । తుష్టిపుష్టికరంకాంతి వర్ధనంబలవర్ధనం । వీర్య వృద్ధికరంచైవ శ్రేష్ఠంచైవరసాయనం । కాంతవల్లభనామాయం సువర్ణ పదపూర్వకం లోకానాంరక్షణార్ధంచ లక్ష్మీనాథప్రకల్పితం॥

వ్యా॥ కాంతభస్మ 16 భా. ఖడ్గలోహభస్మ 14 భా. మాండూరభస్మ 12 భా. అభ్రకభస్మ 4 భా. తామ్రభస్మ 8 భా. మనశ్శిల 6 భా. వెలిగారం 4 భా. వెండిభస్మ 2 భా. సువర్ణభస్మ 1 భా. వీటిఅన్నిటికి సమానము శు. రసము రస ముతోసమానము శు. గంధకం వీటిఅన్నిటిని హంసపాదిరసముచే మర్దించి వాలుకా యంత్రమందు ఏడుదినములువండి అందలి సూక్ష్మచూర్ణమును గ్రహించి ఉదకముచే మర్దించి కుప్పెలుచేసుకుని మూడుగుంజలప్రమాణము తేనెతోసేవించినపాండురోగము క్షయ, గుల్మము, గ్రహణీరోగము, అన్నివిధములైన అజీర్ణము, జీర్ణజ్వరము, కాస, శ్వాస, జ్వరము, వాంతి, ప్లీహోదరం, అరోచకం, అన్నివిధములైన నంజులు, కామిర్లు, హాలీమకము, కుష్ఠురోగము, అతిసారం, మూలరోగం, భగందరం, వాత వ్యాధులు, శూల, శ్లేష్మరోగము, వీటినినశింపచేయును. అనుపానవిశేషముచే సర్వ రోగములను హరించును. తుష్టి, పుష్టి, కాంతి, బలము వీర్యవృద్ధిని చేయును. మిక్కిలి రసాయనంబు, ఈ మహాసువర్ణకాంతవల్లభ రసములోకరక్షణార్ధము లక్ష్మీనాథునిచే కల్పింపబడెను.

## రజతలోహ రసాయనమ్

శ్లో॥ భాగైకం సూతరౌప్యంచ ద్విభాగం జీవలోహకం । గం ధకం త్రీణి భాగాని సర్వం ఖల్వే వినిక్షిపేత్ । కుమారీ రస సాంబ్రాణి భృంగరాజ పునర్నవాః । శృంగవేరం వజ్రవల్లీ ప్రత్యేకం మర్దయే ద్దినం । కూపికా వాలుకా యంత్రే పచేద్యామ చతుష్టయం । భావితం పూజ్య పాదేన రజత లోహ రసాయనం । గుంజాద్వయం ప్రదాతవ్యం అనుపాన విశేషతః । రాజ యక్ష్మాదికాన్ రోగాన్ శ్లేష్మపిత్తాధికాన్ జయేత్ । అజీర్ణం తిమిరం శ్వాసం కాసం చైవాతిదుస్తరం । పాండుం శోఫంచ హృద్రోగం కామలాం కుంభకామలాం । పక్షాఘాతార్దితం హంతి వాతవ్యాధి వినాశనం॥

వ్యా॥ రసం 1 భా. వెండి 1 భా. లోహ రజను 2 భా. గంధకం 3 భా. ఇవ న్నియు ఖల్వమందుంచి కలబంద సాంబ్రాణి గుంటగలగర గలిజేరు అల్లం నల్లేరు

వీట్లరసములచే ప్రత్యేకముగా వక్కొక దినముమర్దించి కుప్పెయందుంచి వాలుకా యంత్రమందు 4 ఝాములు వండేది. ఈ రజతలోహరసాయనము పూజ్యపాదునిచే చెప్పబడినది ఇది రెండు గురివిందగింజల ప్రమాణం అనుపానవిశేషముచే యిచ్చిన రాజయక్ష్మ మొదలగు వ్యాధులను శ్లేష్మము పిత్తము ప్రధానమైన వ్యాధులను అజీర్ణము తిమిరము శ్వాస కాస పాండువు నంజు హృద్రోగము కామిర్లు కుంభకామిల పక్షవాతము అర్దితము వాతవ్యాధులు వీటిని నశింపజేయును.

# రజతలోహ రసాయనం

ప॥ రసమేకభాగంబు రజతజీవపులోహ । బలియుగ్మభాగముల్ బాగుగాను । ఖల్వంబులోనుంచి కలుబందసాంబరేణి భృంగపునర్నవ శృంగవేర । వహ్నివజ్రవల్లి రసములచేనూరి వజ్రమూసనుంచి । వాలుకాయంత్రాన వండి చల్లార్చి మునుపటి రసముల మరలమర్దనజేసి మాషమాత్రము తగినయనుపానమిడిన । సర్వరోగంబులనుమాపు సంజీవనీరసంబు । రజతలోహరసాయనంబు॥

టీక॥ రసం 1 భా. వెండి 2 భా. లోహరజను 2 భా. గంధకము 2 భా. ఇవి ఖల్వమందుంచి కలుబంద సాంబరేణి గుంటగలగర గలిజేరు అల్లము చిత్రమూలము నల్లేరు వీట్లరసములచే నూరి వజ్రమూసయందుంచి వాలుకాయంత్రమందు వండి చల్లారనిచ్చి తీసి పైరసములచే మరలమర్దించిమాషప్రమాణము తగినయనుపానముతో యిచ్చిన ఈ రజతలోహ రసాయనము సంజీవనివలె సర్వరోగములను నశింపజేయును. మరియు పాండు నంజు క్షయ వాతవ్యాధులు ప్రమేహములు దగ్గు వగర్పు శ్లేష్మవ్యాధులు వీటిని నశింపజేయును.

# రజతలోహ రసాయనం
## (పుటయోగం)

శ్లో॥ రజతా ద్ద్విగుణం తీక్ష్ణం ద్వయోస్తుల్యంతు పారదం । పారదాద్ద్విగుణం గంధం కుమారీ రసమర్దితం । మూషామధ్యే వినిక్షిప్య బంధయే ద్వస్త్రమృత్తికాం । తతస్సూక్ష్మపుటే పాచ్యం స్వాంగశీతలముద్ధరేత్ । పునర్నవా కుమారీ చ బ్రాహ్మీ జంబీర జద్రవైః । వజ్రవల్లీరసేనాపి పేషయే ద్దివసత్రయం । ఔషధం గులికాన్ కృత్వా ఛాయాయాం శోషయే త్తతః । మాషద్వయం ప్రదాతవ్యం అనుపాన విశేషతః । కాస శ్వాస క్షయ హారం మేహవ్యాధి వినాశనం । పాండురోగం నిహంత్యాశు వాతఘ్నం కఫ నాశనం । రక్తపైత్యాతిసారంచ ఛర్ది హిక్కా వినాశనం । సర్వశూలవినాశంచ సర్వజ్వరహారం పరం । తత్త్

ద్రోగానుపానేన సర్వరోగ నికృంతనం । సంజీవనీసమం జ్ఞేయం రజత లోహ రసాయనం॥

వ్యా॥ వెండి 1 భా. ఖడ్గలోహం 2 భా. ఈరెండిటికి సమానము ( 3 భా. ) పాదరసము పాదరసమునకు రెట్టింపు (6. భా.) గంధకము. వీటిని కలబందరసముచే మర్దించి మూషమధ్యయందుంచి మట్టిపూసిన గుడ్డలుచుట్టి చిన్న పుటముపెట్టి సాంగశీతలమున తీసి, గలిజేరు కలబంద సరస్వతీఆకు నిమ్మకాయలు నల్లేరు వీట్లరసములచే మూడురోజులు మర్దించి మాత్రలు చేసుకొనినీడను ఎండించి అనుపాన విశేషముచే రెండు మినపగింజల ప్రమాణముయిచ్చిన దగ్గు, వగర్పు, క్షయ, మేహవ్యాధులు, పాండురోగము, వాతము, కఫము, రక్తపైత్యము, అతిసారము, వాంతి ఎక్కిళ్ళు, శూలలు, జ్వరములు, వీటిని హరించును. ఆయారోగములకు తగిన అనుపానములతో యిచ్చిన సర్వరోగములను హరించును. రజతలోహ రసాయనం సంజీవనితో సమానంబైనదిగ ఎరుంగవలెను.

# తారలోహరసాయనం

## (రజతలోహ రసాయనం)

శ్లో॥ అయోరజస్త్రిభాగం చ త్రిభాగం సూతసంయుతం । షడ్భాగం గంధమాదాయ తారమభ్రక సంజ్ఞకం । కుమారీ రస సంమర్ద్యం సాంబరేణి రసం తథా । నిర్గుండీ భృంగరాజం చ ఆర్ద్రికంచ పునర్నవా । వహ్నిమూలం వజ్రవల్లీ ఏవం అష్ట రసైస్తథా । మర్దయే దష్టరాత్రం తు వాలుకా యంత్రపాచితం । తారలోహ రసోనామ విష్ణునా నిర్మితం పురా । పాండుక్షయ శ్వాస కాస మజీర్ణారోచకం హరేత్ । శోఫం జీర్ణ జ్వరం హంతి శూలఘ్నం కఫనాశనం । అనుపాన విశేషేణ సర్వరోగహరం పరం॥

వ్యా॥ లోహరజను 3 భా. రసం 3 భా, గంధకం 6 భా. వెండి 1 భా. ఇవి కలబంద సాంబరేణి వావిలి గుంటగలగర అల్లము గలిజేరు చిత్రమూలము నల్లేరు ఈ ఎనిమిదిరసములచే ఎనిమిది దినములు మర్దించి వాలుకాయంత్రమందు వండవలెను. ఇయ్యది విష్ణువుచే నిర్మించబడిన తారలోహరసాయనంబనబడుఇదిపాండు, క్షయ, శ్వాస, దగ్గు, అజీర్ణము, అరోచకము, వంజు, జీర్ణించినజ్వరము, శూల, కఫము వీటినినశింపజేయును మరియు అనుపానవిశేషములచే సర్వరోగములను హరించును.

# రజతలోహ రసాయనం

## (పుట యోగము)

సీ॥ ఖడ్గరాపొడితులము గంధకంబును తులము । రజతచూర్ణ

ముత్తులము రసము తులము । ఖల్వంబులో నుంచి కలగరరసమును । సాంబ్రాణిరసమును సరసముగనువజ్రవల్లిరసము వహ్ని పునర్నవకలుబంద యల్లముకాకరాకు । యిన్ని రసంబుల విడువకుండగజాల। రెండురోజులు నూరి రేయిబగలు । యదిబిళ్ళవలెజేసి యార్చిప్రమిదలోబెట్టి । ప్రమిద గప్పియుమన్ను ప్రబలరాసి। గజముపొడవున పుటముఘనము వేగాసియు । శీతలంబునదీసి శీఘ్రముగను ॥ ముందు రసము లమరనూరి ముదముమీర అనుదినంబున నౌషధ మడ్డిగెత్తు । యనుభవించిన జనుల కమృతమగును । సర్వవ్యాధుల మాన్పునుముదముమీర లోకమందుదీని రజతలోహ రసాయనంబనిరి మదనవైరీ ॥

ఖడ్గరాపొడి 1 తు. గంధకము 1 తు. వెండిరాపొడి 1 తు. రసము 1 తు. ఇవి ఖల్వమందుంచి, గుంటగలగర, సాంబ్రాణి. నల్లేరు, చిత్రమూలము గలిజేరు, కలుబంద అల్లము కాకరాకు, ఈ రసములచే రెండు రోజులు రాత్రింబగళ్ళు విడవకుండనూరి బిళ్ళవలెచేసి ఆరనిచ్చి ప్రమిదలో పెట్టి పయిన ప్రమిదమూసి బాగుగా మన్నుబూసి గజముపొడువున బాగుగ పుటము పెట్టి చల్లారిన పిదప తీసి పూర్వపు రసములచే మరలనూరి ప్రతిదినము అడ్డిగఎత్తు జౌషధము పుచ్చుకొనిన అమృతతుల్యంబయి సర్వవ్యాధులను పోగొట్టును పూర్వపు యోగములయందు చెప్పిన, పాండు, క్షయ, నంజు అజీర్ణము జీర్ణజ్వరము, మొదలగు వాటిని నశింప జేయును.

# జ్వరగజాంకుశం

శ్లో॥ రసామ్లసారగంధంచ సేపాలం బీజటంకణం । కజ్జలీనాంచ సంమర్ద్యం ముద్గమాత్ర ప్రమాణకం । చణమాత్రంచ వాసీతం నాగవల్లీ దల్లాన్వితం । దేయం సర్వజ్వరం హంతి సంతతం తరుణంజ్వరం । పథ్యం చైవ ప్రదాంతవ్యం దధి క్షీరంచ శర్కరాం । పూజ్యపాదేనచ ప్రోక్తం సర్వ జ్వర గజాంకుశం॥

వ్యా॥ శు. రసము, శు. అమ్లసారగంధకము, శు. నేపాళములు, వెలిగారము, వీటిని సమభాగములుగ ఖల్వమందుంచి కజ్జలివలె నూరి పెసరగింజలంత లేక సెనగగింజలంత మాత్రలుచేసి తామలపాకులతో యిచ్చిన సమస్తజ్వరములు, సంతతజ్వరము తరుణజ్వరము, వీటిని నశింపజేయును. పెరుగు, పాలు, పంచదార, యివి పథ్యము లుగా యివ్వవలయును. ఈ సర్వజ్వరగజాంకుశము పూజ్యపాదునిచే చెప్పబడెను.

# సూచికాముఖ రసము

శ్లో॥ రుచకం చాభ్రగంధంచ నేపాలంచ మనశ్శిలా । కర్పరీ మైలతుత్థంచ తాలకం టంకణం తథా । దరదం సైంధవం చైవ సర్వ తుల్యం తు పారదం । మధు బీజస్య తైలేన మర్దితం దివసత్రయం । డోలాయంత్రే పచేద్యామం తం నీత్వా ఖల్వమధ్యకే । కృష్ణసర్పస్య పిత్తేన భావితం దివసద్వయం। బ్రహ్మద్వారే క్షురేణైవ క్షతం గుంజావి మర్దితం । జంబీర నీరే యుంజీత సన్నిపాతాన్నిహంతిచ । హిక్కాం మూర్ఛాంచ కంపంచ మూకత్వం బధిరస్యచ । కాసాక్ తథోర్ధ్వశ్వా సంచ మధువాతం నికృంతనం । సూచికా ముఖ నామోయం రసః ప్రాణప్రదాయకః॥

వ్యా॥ సౌవర్చలవణము, అభ్రకభస్మ, శు. గంధకము, శు. నేపాళములు, శు. మణిశిల, శు. కపరి, శు. మైలతుత్తము, శు. తాళకము, శు. టంకణము, శు. ఇంగిలీకము, సైంధవలవణము, ఇవి సమభాగములు వీటి అన్నిటితోను సమానము శు. రసము, వీటిని ఇప్పవిత్తులతైలముచే మూడు రోజులు మర్దించి డోలాయంత్రమందు ఏకఝాము వండుకొని తీసి ఖల్వమందుంచి నల్లత్రాచుపాము పిత్తముచే రెండురోజులు భావన చేసి బ్రహ్మరంధ్రమునుగీరి గురిగింజయెత్తు నిమ్మపండ్లరసములో కలిపి ఆగాయమునందు రాయుచుండిన సన్నిపాతములు హరించును. మరియు, ఎక్కిళ్లు, మూర్ఛ, వణుకు, మూగతనము, చెముడు, దగ్గు ఊర్ధ్వశ్వాస, వధువాతము, వీటిని హరింపజేయును. ఈ సూచికాముఖరసము, ప్రాణమునుయిచ్చును.

# పంచవక్త్రరసం

శ్లో॥ శుద్ధసూతం విషం గంధం మరిచం టంకణం కణాం । మర్ద యేద్ధూర్త జద్రావై ర్దినమేకంతు శోషయేత్ । పంచ వక్త్రో రసో నామా ద్విగుంజః సన్నిపాతజిత్ ।అర్కమూల కషాయంతు త్ర్యూషణం చానుపాయయేత్ । యుక్తం దధ్యోదనం పథ్యం జలయోగం చ కార యేత్। రసేనానేన శామ్యంతి సక్షౌద్రేణ కఫాదయః। మధ్వార్ద్రకర సం చానుపిబేదగ్ని వివృద్ధయే। యథేష్టం ఘృతమాంసాసీ శక్తో భవతి పావకః॥

వ్యా॥ శు.రసము, శు.నాభి,శు.గంధకము. మిరియాలు.శు.టంకణము, పిప్పళ్ళు, ఇవి సమభాగములు ఉమ్మెత్తరసముచే ఏకరోజుమర్దించి ఎండించకునిన, పంచవక్త్రి

రస మనబడును. ఇది రెండు గురిగింజలంత ప్రమాణము జిల్లేడువేళ్లు, త్రికటుకములు, వీటికషాయము అనుపానముతో యిచ్చిన సన్నిపాతమును నశింపజేయును. పెరుగు అన్నము పెట్టవలయును. స్నానము చేయించవలయును. ఇది తేనెతో యిచ్చిన కఫ రోగములు మొదలగునవిపోవును. ఇదిసేవించి తేనె అల్లపురసము, త్రాగిన అగ్నిదీప్తి కలిగి నెయ్యి, మాంసము, యథేష్టముగా తినినను బాగుగ జీర్ణమగును.

## చండభానురసం

శ్లో॥ సూతం త్రైగుణ్యగంధం పరిమిత మమృతం తీక్ష్ణకం భానునేత్రం । హరితాలం తచ్చతుష్కం గగనమథయుగం మారిచం సర్వతుల్యం । ఏతం దద్యాన్నిహంతి జ్వరవన దహనస్తామసాహేః ఖగేంద్రః । కాస శ్వాసాపహంతా క్షయతరుదహనః పాండు రోగా పహంతా । వాత వ్యాధిభసింహో హ్యుదర జలనిధేః శోషకో బాడబాగ్నిః । నష్టాగ్నేర్దీపకః స్యాజ్జఠర మల మహా క్లేశ హృద్రోగ హారీ ॥ మూలవ్యాధ్యంధకారప్రశమన తపనః కుష్ఠ రోగాపహంతా । నామ్నాయం చండభాను స్సకలగదహరో భాషితం పూజ్యపాదైః॥

వ్యా॥ శు.రసము 1 భా, శు.గంధకము 3 భా, శు.నాభి 3 భా, లోహభస్మ 3 భా, తామ్రభస్మ 3 భా, శు. తాలకము 4 భా, అభ్రకభస్మ 2 భా, మిరియములు 19 భా, వీటిని నూరుకుని యిచ్చిన, జ్వరమనువనమునకు కారుచిచ్చయి, సన్నిపాత మనే పాముకు గరుత్మంతుడై, దగ్గువగర్పులను హరించునదై, క్షయయను వృక్షము నకు అగ్నియై, పాండురోగమును హరించునదై, వాతవ్యాధులను గజములకు సింహంబై, ఉదరరోగమను సముద్రమునకు శోషింపజేసెడి బాడబానలమై, నష్టమైన అగ్నికి దీపకమై, జాఠరాశ్రితమల జనితవ్యాధులను, హృద్రోగములను, హరించునదై మూలవ్యాధియనే చీకటికి సూర్యునివంటిదై, కుష్ఠరోగములను హరించునదై, చండ భానురస మను పేరున సమస్తవ్యాధులను హరించును. ఇది పూజ్యపాదునిచే నిర్మించ బడెను.

## సన్నిపాత భైరవరసం.

శ్లో॥ తాలకం గంధకం సూతం వత్సనాభం త్రిభిస్సమం । శిలాచ టంకణం చైవ సర్వత్రసమహింగులం । మర్దితం చిత్రజంబీరే శార్ఙ్గ్రికేన దినత్రయం । అనుపాన విశేషేణ సన్నిపాతక భైరవం । త్రిదోషం చాతి సారంచ కఫం పాండు మరోచకం । కుక్షి శూల ముదావర్తం సన్ని పాత నిక్నంతనం॥

వ్యా॥ శు. తాలకము, 1 భా. శు. గంధకము, 1 భా. శు. రసము 1 భా. శు. నాభి, 3 భా. శు. మణిశిల, 3 భా. శు. వెలిగారం, 3 భా. శు. ఇంగిలీకం, 12 భా. ఇవన్నియు, చిత్రమూలము, నిమ్మకాయలు, అల్లము వీటిరసములచే మర్దించి అనుపాన విశేషములచే యిచ్చిన, త్రిదోషములు, అతిసారము, కఫము, పాండువు, అరోచకము, ఉదరశూల, ఉదావర్తము, సన్నిపాతజ్వరము, వీటిని ఖండించును.

నోటు—శు. మణిశిల, 1 భా. శు. వెలిగారము, 1 భా. శు. ఇంగిలీకము, 8 భా. ఇట్లు వేయుటకూడ కలదు.

# వైష్ణవీ రసమ్.

శ్లో॥ హింగులం వత్సనాభం చ చక్రాంగీ కటుకత్రయం। చిత్రమూల కషాయేణ సమభాగం విమర్దయేత్ । డోలాయంత్రే యామమాత్రం పచే న్నిష్పాదితో భవేత్ । ఆర్ద్రికస్యానుపానేన మాష మాత్రం జ్వరాపహః । ద్వంద్వజ్వరం సన్నిపాతం పురాణం విషమజ్వరం। నాశయేదఖిలాన్ రోగాన్నా మ్నాయం వైష్ణవీ రసః॥

× వ్యా॥ శు, ఇంగిలీకం, శు, నాభి, కటుకరోహిణి, త్రికటుకములు, ఇవి సమభాగములు, చిత్రమూలకషాయముచే మర్దించి డోలా యంత్రమందు ఏకజాము వండి, మాష ప్రమాణము అల్లపు రసముతో యిచ్చిన జ్వరములు, ద్వంద్వజ్వరము సన్నిపాతజ్వరము, పురాణజ్వరము, విషమజ్వరము, వీటిని సమస్తమైన రోగములను హరించును.

# సూచికాభరణరసం

శ్లో॥ విషం పలమితం సూతః శాణిక శ్చూర్ణయే ద్ద్వయం। తచ్చూర్ణం సంపుటే క్షిప్త్వా కాచలిప్త శరావయోః ముద్రాం దత్వాచ సంశోష్య తతశ్చుల్యాం నివేశయేత్ । వహ్నిం శనైశ్శనైః కుర్యా త్ప్రహరద్వయ సంఖ్యయా । తత ఉద్ఘాట్య తన్ముద్రాం ఉపరిస్థ శరావకే । సంలగ్నో యో భవేత్సూతః తం గృహ్ణీయాచ్ఛనైః శనైః । వాయు స్పర్శో యథా నస్యా త్తథా కూప్యాం నివేశయేత్ । యావ ముఖే లగ్నం కూప్యా నిర్యాతి భేషజం । తావన్మాత్రో రసో దేయో మూర్ఛితే సన్నిపాతిని ।క్షురేణ ప్రచ్ఛితే మూర్ధ్ని తత్రాంగుల్యాచ ఘర్షయేత్ । రక్త భేషజ సంపర్కాన్మూర్ఛితో పిహి జీవతి

తథైవ సర్పదష్టస్తు మృతావస్థోపి జీవతి। యదా తాపో భవేత్తత్ర మధురం తత్ర దీయతే॥

వ్యా॥ శునాభి 1 పలము, శురసము 1 శాణము, వీటిని చూర్ణము చేసి గాజు పూసిన మూకుళ్ళయందుంచి సంధిబంధనము చేసి ఎండించి పొయ్యిమీద పెట్టి రెండుఝాములు మెల్లిగా మంటవేసుకొని పిదప సంధి బంధనము విప్పుకొని మూకుటిని అంటియున్న పాదరసమును మెల్లిగ తీసుకుని గాలి తగలకుండ సీసాయందుంచుకొని సూదిమొనకు వచ్చినంతమందును మూర్ఛపొందిన సన్నిపాత రోగికి శిరస్సుయందు కత్తితోగీరి ఈయౌషధమును ఆగాయమందుంచి వేలుతో రుద్దవలయును. ఔషధము రక్తముతో కలిసినంత మాత్రముననే మూర్ఛపొందిన రోగికూడ జీవించును. ఈప్రకారము చేసిన పాముకరచి మృతావస్థ యందున్న వాడుకూడ జీవించును శిరమునందు మంటగలిగిన తోడనే మధురౌషధము ప్రయోగించవలయును.

# వాతవిధ్వంసి.

శ్లో॥ రసం గంధకం నాగవంగం చ లోహం తథా తామ్రజం వ్యోమని శ్చంద్రకం చ। కణాటంకణం చోషణం నాగరం వై పృథగ్భాగమేకం క్షిపేత్తల్వ మధ్యే। తతో వత్సనాభం చతుస్సార్ధభాగం దృఢం మర్ద యేద్వ్యోషజై స్త్రీవారం। వరాచిత్రకై ర్మార్కవై౯ః కుష్టజాద్భిః పృథగ్భావయే త్సింధువారా ర్ద్రివాసైః। తథా మోహినీ జంబసీరైః పృథగ్భావయే ద్వాత విధ్వంసనోయం। సమీరేచ శూలే తథా శ్లేష్మ రోగే గ్రహణ్యాం తథా సన్నిపాతే చ సర్వే। అపస్మారాగ్ని:మాంద్యే శీత పిత్తే తథా ప్లీహోదరే కుష్ఠరోగేచ దద్యాత్। స్త్రీయ సూ్నతికా వాతరోగే తథైవ ద్విగుంజం ప్రదద్యా దిమం సూతరాజం॥

వ్యా॥ రసం, గంధకం, సీసభస్మ, వంగభస్మ, లోహభస్మ, తామ్రభస్మ, తళుకులేని అభ్రకభస్మ, పిప్పళ్లు, వెలిగారం, మిరియాలు, శుంఠి, ఇవి ప్రత్యేకముగ వక్కొక భాగము. నాభి 4½ భా. వీటినన్నిటిని ఖల్వమందుంచి శుంఠి, పిప్పళ్లు, మిరియాలు, నేలతాడి, చిత్రమూలము, గుంటగలగర, చంగల్వకోష్టు, వావిలి, అల్లము. అడ్డసరము, గంజాయిఆకు, నిమ్మకాయలు, వీటిరసములచే ప్రత్యేకముగ మూడు రోజులు దృఢముగ మర్దించి, వాతరోగము, శూల, శ్లేష్మరోగము, గ్రహణి, సమస్త సన్నిపాతములు, అపస్మారము, అగ్నిమాంద్యము, శీతపిత్తము, ప్లీహోదరము, కుష్ఠరోగము, స్త్రీలకు సంభవించు సూతికావాతరోగములు వీటియందు వాత విధ్వంస నమనెడి ఈ రసశ్రేష్ఠమును రెండు గురివింద గింజల ప్రమాణము యివ్వవలెను.

## బృహద్వాత విధ్వంసి.

సూతాభ్ర తీక్ష్ణ కాంతాని తామ్రతాలక గంధకం। స్వర్ణం శుంఠీ బలాధాన్యం కట్ఫలం చాభయావిషం । పథ్యా శృంగీపి ప్పలీ చ మరిచం టంకణం తథా । తుల్యం ఖల్వే దినం మర్ద్యం ముండీ నిర్గుండిజ ద్రవైః । ద్విగుంజాం వటికాం ఖాదేత్ సర్వవాత ప్రశాంతయే । సాధ్యాసాధ్యం నిహంత్యాశు బృహద్వాత విధ్వంసకః ॥

వ్యా॥ రసము, అభ్రకము, తీక్ష్ణలోహము, కాంతము, తామ్రము, తాలకము, గంధకము, బంగారము, శుంఠి, ముత్తవపులగము, ధనియాలు, పెద్దముష్టిడు, కర క్కాయ, నాభి, ఉసిరికపప్పు, కర్కాటకశృంగి, పిప్పళ్లు, మిరియాలు, వెలిగారం, ఇవన్నియు సమభాగములు ఖల్వములోవేసి బోడసరం వావిలి వీట్లరసములచే దినం మర్దించి రెండు గురివింద గింజల ప్రమాణం మాత్రను సేవించిన సాధ్య అసాధ్యము లైన సర్వవాతములను శాంతింప జేయును.

## మహావాత విధ్వంసి

శ్లో॥ సూత తారకాభ్రగంధ తామ్రకాంత నాగవంగ తాలకం శిలా । కృష్ణ లోహ మాక్షి తీక్ష్ణ శుక్తి వరాటశంఖకం తథా । పీరవృక్ష వజ్రి వహ్ని మూలఅర్కజరసేన మర్దితం సహ । మాష మాత్రకా చ కూపి వాలుకా యంత్ర పాచితం తథా । దినత్రయం సాంగశీతల మౌషధం సతుల్య వత్సనాభకం । మర్దయేద్వై జయంతి వక్త్రిసింధువారార్క భృంగ నింబనీరేణ పృథక్ । త్రివాసరం చపేషితం ముద్గమాత్ర మౌషధం విభుక్తయేత్ । త్రయోదశ సన్నిపాతసూతికా దివాతకంఠ రోగ శాంతిదం।మహా వాత విధ్వంసి నామకం సమస్తరోగ ఖండనం ఆశ్వినేయ భాషితం॥

వ్యా॥ శు. రసము, రజతము, అభ్రకము, శు. గంధకము, తామ్రము,కాంతము సీసము, వంగము, శు. తాలకము, శు. మణిశిల, మాండూరము, మాక్షి కము, ఖడ్గలోహము, ముత్యపుచిప్పలు, పగడము, గవ్వలు,శంఖము, వీటి భస్మములు సమభాగములు గ్రహించి వెలుతురివేళ్లు, నల్లేరు, చిత్రమూలము, జిల్లేడు వీట్లరస ములచే మర్దించి మాషప్రమాణము మాత్రలుచేసి కాచకుప్పెయందుపోసి వాలుకా యంత్రమందు మూడురోజులువండి సాంగశీతలమైన పిదప తీసి దీనికి సమము, నాభికలిపి, తెక్కలి, నేలమర్రి వావిలి, జిల్లేడు, గుంటగలగర, వేప, వీటి రసము చే

ప్రత్యేకముగ మూడురోజులనూరి పెసరగింజ ప్రమాణము ఔషధమును భుజించిన త్రయోదశ సన్నిపాతములు, సూతికావాతము మొదలగు వాతములు కంఠరోగములు, సమస్తరోగములు, శాంతించును. ఈమహావాతవిధ్వంసియనెడి ఔషధము అశ్వినీదేవతలచే చెప్పబడియే.

## మహావాత విధ్వంసి (గ్రంథాంతరే)

శ్లో॥ వజ్రం హేమాభ్రకం తామ్రం కాంతం రజత లోహకం। మృతంక్రమోత్తరం సర్వం మాక్షికం గంధకం శిలా । తాలకం తత్ప్రవాలం చ సర్వం తుల్యం సమాంశకం । సర్వం ఖల్వోదరే స్థాప్యపాదాంశంరసభస్మకం। కాచకుప్యాంవినిక్షిప్యవాలుకాయంత్రమధ్యతః।సాంగశీతలముద్ధృత్య వత్సనా భాష్టభాగికం । స్నుహ్యర్కక్షీర సర్పాక్షి భృంగరాజ కురంటకైః।ప్రత్యేకం భావయేత్ఖల్వే భావయేద్దివసద్వయం విష ముష్టి కషాయేణ భావయే ద్దివసద్వయం । మాతులుంగరసేనైవ భావయేద్దివసద్వయం । సర్వం జంబీరజద్రావైఃఆర్ద్రకస్య ద్రవేణచ।ఇయం సిద్ధరసం సేవ్యం మహావాతవిధ్వంసకం। త్రయోదశసన్నిపాతాన్ సర్వవాతగదానపి । సూతికా రోగ జాలం చ నాశయే న్నాత్ర సంశయః॥

వ్యా॥ వజ్రభస్మ,1 భా. సువర్ణభస్మ, 2 భా. అభ్రకభస్మ, 3 భా. తామ్రభస్మ 4 భా. కాంతభస్మ 5 భా. రజతభస్మ, 6 భా. ఖడ్గలోహభస్మ, 7 భా. మాక్షికం 1 భా. గంధకం, 1 భా. మణిశిల, 1 భా. తాలకం 1 భా. ప్రవాళం 1 భా. రస భస్మ, ¼ భా. ఇవన్నియు ఖల్వమందుంచి మర్దించి కాచకుప్పెయందుంచి వాలుకా యంత్రమందువండి సాంగశీతలమున తీసి వత్సనాభి 8 భాగములుకలిపి జెముడుపాలు, జిల్లేడుపాల చేతను సర్పాక్షి గుంటగలగర గోరింటరసములచేతను విషముష్టిగింజలకషాయముచేతను మాదీఫలరసము నిమ్మపండ్లరసము చేతను అల్లపురసముచేతను ప్రత్యేకముగా రెండేసిరోజులు భావనచేయవలెను. సిద్ధమైన ఈమహావాతవిధ్వంసకరసమును సేవించిన త్రయోదశ సన్నిపాతములు సమస్తవాతవ్యాధులు సూతికారోగములుతప్పక నశించును.

## సువర్ణవాత విధ్వంసినీరసం

సీ॥ కాంచనభస్మమొక్కటి తామరభస్మ మిరుపాళ్ళు విసము
గంధకము పాదరసముమూడు పాళ్ళు। వైక్రాంతభస్మంబు నొకపాలు
రెండువంగంబును రెండునాగ భస్మంబు । నభ్రకభస్మంబు మూడును
పరిశుద్ధటంకణ భస్మనాలుగు । పగడభస్మంబును బలుతీక్ష్ణలోహంబు

నొక్కొకపాల్గూర్చి। నిక్కమైన కాంతభస్మంబై దుగాగూర్చి। వావిలి చిత్రమూలము భానుపత్ర రసముల నాలుగుదినములు బాగుగామర్దించి। కాచకుప్పెను వాలుకమునవండి తీసిగోవులచేదు భాసురమహాచాపచే దులు ఖల్వానచేర్చికల్పి। మాతులుంగరసాన మర్దనంబై దురోజులుసల్పి కస్తూరికల్పి నూరి పూటకు చిన్నంబుపాటి గ్రోలిన।వాతమండతల్ సన్నులు సమయజేయు మందాగ్నులనుదుష్టమూరు తంబులు। దోషచయంబుల నెల్లను సమయజేయు పక్షఘాతామయంబుల బారద్రోలు। వాతశోఫ లనెల్లను వడిహరించు, దాహ కరపాదదాహ ముల్దగ్ధపరచు, ధరణిసు వర్ణవాత విధ్వంసియనగా॥

టీక॥ బంగారభస్మ 1 భా. తామ్రభస్మ 2 భా. నాభి 3 భా. గంధకము, 3 భా. పాదరసము, 3 భా. వైక్రాంతభస్మ 1 భా. వంగభస్మ, 2 భా. సీసభస్మ 2 భా. అభ్రకభస్మ 3 భా. టంకణభస్మ 4 భా. పగడభస్మ 1 భా. ఖడ్గలోహభస్మ 1 భా. కాంతభస్మ 5 భా. ఇవన్నియు వావిలిచిత్రమూలము. జిల్లేడుఆకులు వీట్లరసములచే నాలుగుదినములు బాగుగమర్దించి కాచకుప్పెయందుంచి వాలుకాయంత్రమందు వండి తీసి ఖల్వానవేసి గోవులచేను చాపచేములు కలిపి మాదీఫలరసముచే అయిమర్దించి జాలు మర్దించి కస్తూరికలిపినూరి పూటకు చిన్నంబుచొప్పున పుచ్చుకునిన వాతములు సన్నిపాతములు అగ్నిమాంద్యములు చెడువాతములు దోషసముదాయములు పక్షవాతములు వాతనంజులు తాపము అరకాళ్ళు అరచేతులుమంటలు, వీటిని ఈ సువర్ణవాత విధ్వంసి వెంటనే హరించును.

## జ్వరమురారిరసం

శ్లో॥ త్రిస్సప్త జంబీరజభావిత ఖర్పరస్యచూర్ణం విమర్ద్య నవనీత సమానయుక్తం। వల్లద్వయం హారతిశర్కయానుపానం సద్యోజ్వరం జ్వరమురారి సమాఖ్యమేతత్॥

వ్యా॥ శుకఫరిని ఖల్వమందుంచి 21 సారులు నిమ్మకాయలరసముతో భావన చేసి దీనితోసమానము వెన్నకలిపి నూరుకుని రెండువల్లముల ప్రమాణము పంచదార అనుపానముతో పుచ్చుకునిన జ్వరమును వెంటనేహరించును. ఇది జ్వరమురారి యనబడును.

## జ్వరగజకేసరిరసం

శ్లో॥ జలదదరదయుక్తం శుద్ధసూతం సుగంధం ప్రహారమధు

సుపిష్టం వల్లయుగ్మంచదద్యాత్ । జ్వరగజహారి సంజ్ఞం శృంగవేరోదకే
న ప్రథమజ్వరితదాహే క్షీరభక్తంచభోజ్యం॥

వ్యా॥ తుంగగడ్డలు, శు ఇంగిలీకము, శు రసము, శుగంధకము, ఇవి సమభాగ
ములు తేనెతో పకర్షూమునూరుపని ఈ జ్వరగజహారి యనెడిమందును అల్లపురస
ముతో మొదట జ్వరమువచ్చినపుడు యిచ్చి పాలుఅన్నము పెట్టవలయును.

# పైత్యాంతకరసం.

వ॥ అల్లము, 6 భా. జీలకర్ర, 6 భా. సైంధవలవణం, 1 భా. శు నాభి,
1 భా. రససిందూరం, 2 భా. శు ఇంగిలీకం, 3 భా. వీటిని నిమ్మకాయలరసముచే
మర్దించుపని మాషప్రమాణము సేవించిన సమస్తమైన పైత్యవ్యాధులు అజీర్ణము,
అరోచకము, అగ్నిమాంద్యము, వళ్లుతిరుగుట, కడుపులోమంట, నోటిపూత,
ఎక్కిళ్లు, మొదలగునవి నశించును.

# పైత్యాంతకరసం.

(ప్రకారాంతరమ్.)

వ॥ అల్లము, 1 భా. జీలకర్ర, 1 భా. ఉసిరికపప్పు, 1 భా. సైంధవలవణము,
1 భా. రససిందూరము, 1 భా. వీటిని నిమ్మకాయల రసముచే 2 నెలలు మర్దించి
సేవించిన, వాంతులు, అరుచి, అమ్లపిత్తము, ఎక్కిళ్లు, కడుపులోమంట, వికారము,
తలతిరుగుట, నోటనీరూరుట, మొదలగు సమస్తపైత్యవ్యాధులు పోవును.

# పైత్యాంతకరసం.

వ॥ ధనియాలు, 3 భా. ఉసిరికపప్పు, 3 భా. నాగకేసరములు, 3 భా. జీలకర్ర
3 భా. శుంఠి 3 భా. సైంధవలవణం 3 భా. ఇంగిలీకం, 3 భా. ఇవన్నియు, అల్లము
రసముచేతను నిమ్మకాయల రసముచేతను 2 నెలలు మర్దించుపని గురిగింజంత పుచ్చు
కునిన, అమ్లపిత్తము, నోటనీరూరుట, అరోచకము, కడుపులోమంట, వళ్లు తిరు
గుట మొదలగు సమస్త పైత్యవికారములు పోవును.

# హేమసుందరరసాయనం

శ్లో॥ హేమతారం లోహసూతం సమభాగాని కారయేత్ ।
గంధకంచ చతుర్భాగం ఖల్వమధ్యే వినిక్షిపేత్ । వజ్రవల్లీ రసేనై
వపిష్ట్వా మూల రసేనచాద్వినైకంమర్దితం చైవ మూషామధ్యే వినిక్షిపేత్।
మూషాముఖంబంధయిత్వామృదా సంలేపయేద్బహిః । దేయంగ

జపుటే పాచ్యం సాంగశీతల ముద్ధరేత్ ॥ ద్విగుంజం భక్షయేన్నిత్యం సర్వరోగ వినాశనం । వీర్యనష్టంతథా కాసం ప్రమేహానపి దుస్తరాన్ । క్షయం పాండు మజీర్ణంచ శ్వేతరక్త ప్రదరం తథా । దౌర్బల్యంచ తథావృష్యం శ్రేష్ఠంచైవ రసాయనం । హేమతారరసోనామ సీతానాథ ప్రకల్పితః ।

వ్యా॥ సువర్ణం. 1 భా. రజతము భా. లోహం 1 భా. రసం 1 భా. శు. గంధకము 4. భా. వీటినెల్లను ఖల్వమందుంచి నల్లేరురసము చిత్రమూల రసములచే వకరోజు మర్దించి మూసయం దుంచి మూసముఖము కప్పి పైన మట్టిచే పూసి గజపుటముపెట్టి సాంగశీతలమున తీసి రెండు గురివిందగింజల ప్రమాణము పుచ్చుకునిన వీర్యనష్టము, దగ్గు, ప్రమేహములు. క్షయ, పాండు, అజీర్ణము శ్వేతప్రదరము, రక్తప్రదరము, దౌర్బల్యము వీటిని సర్వరోగములను హరించును. మరియు వీర్యవృద్ధి జేయును. ముసలితనమును పోగొట్టును. ఈ హేమతార (రజత) రసాయనము సీతానాథునిచే చెప్ప బడినది.

## వాతకుఠారం

శ్లో॥ దరదంచ శిలాగంధం సమభాగాని కారయేత్ । రసేంద్రం చతథాకుర్యా న్నింబ నీరేణ మర్దితం । ఛాయాంశుష్కంతు తంకృత్వా లోహపాత్రేతు ద్రావితం । గుంజాభాన్ వటకాన్ కృత్వా వాత రోగేషు యోజయేత్ । అనుపాన విశేషేణసర్వశ్లేష్మ గదేషుచ । కాసే శ్వాసే తథాకుష్ఠే నామ్నా వాతకుఠారకమ్॥

వ్యా॥ శు, ఇంగిలీకం శు, మణిశిల శు, గంధకం, శు, రసము ఇవి సమభాగములు నిమ్మకాయ రసముచేనూరి నీడను ఎండించి లోహపాత్రయందు కరగించి గురిగింజ ప్రమాణము మాత్రలు చేసుకొని అనుపాన విశేషములచే సమస్తవాత వ్యాధుల యందును సమస్త శ్లేష్మవ్యాధుల యందును. దగ్గు, వగర్పు కుష్ఠు, వీటి యందును యివ్వవలెను.

## వాతగజాంకుశం

శ్లో॥ అష్టభాగా రసస్యాపి విషతిందో స్తథైవచ । గంధకస్యత్రి భాగంచ కటుత్రయ ఫలత్రయం ॥ గుంజామాత్రాం వటీం ఖాదే దశీతి వాతనాశనమ్ । వాతగజాంకుశో నామ్నా హన్యాదురుస్తంభం నిహంతిచ ॥

వ్యా॥ శు. రసము, 8 భా. శు. విషముష్టిచూర్ణము, 8 భా. శు. గంధకము, 3 భా. త్రికటుకములు, 3 భా. త్రిఫలములు 3 భా. వీటిని ఉదకముచే నూరి గురివింద గింజంత మాత్రను సేవించిన ఎనుబదివాతములు ఊరుస్తంభము నశించును.

నోటు—గంధకము 8 భాగములని కొందరును గంధకము, 3 భా. శుంఠి, 3 భా. పిప్పళ్లు, 3 భా. మిరియాలు, 3 భా. కరక్కాయ, 3 భా. తాడికాయ, 3 భా. ఉసిరికాయ, 3 భా. అని కొందరును అర్థమును కల్పించుచున్నారు.

## సింహ ప్రతీపాలనం

శ్లో॥ సూతంగంధకి వత్సనాభగరళం చైకైకభాగాన్వితం । సర్వంమర్ద్ధిత హంసపాది స్వరసేగుంజేన మాత్రామితం। తైలాభ్యంగ జలోపచారకథితం పథ్యంచదధ్యోదనం।సర్వశాంతిమనేక దోషశమనం సింహ ప్రతీపాలనం॥

వ్యా॥ శు. రసము, శు. గంధకము, శు, నాభి, గరళము వీటిని సమభాగము హంసపాదిరసముచే మర్దించి గురిగింజప్రమాణము ఇచ్చిన అనేకదోషములచేజనించిన జ్వరములు శాంతించును. దీనియందు తైలాభ్యంగము, శీతలజలోపచారము. పెరుగు అన్నము పెట్టుట చేయించవలెను.

## రజత చంద్రోదయమ్

శ్లో॥ ద్విభాగం రజతంచైవ అష్టభాగం తుపారదం । షోడశం గంధకంచైవ కన్యారసవిమర్ద్దితం । త్రిదినం వాలుకాయంత్రే పాచితం స్వాంగశీతలం । అనుపాన విశేషేణ ప్రమేహాన్ హంతిదుస్తరాన్ । శుక్ల నష్టం తథాకాసందౌర్బల్యం శ్వాసమేవచ । పాండుం జీర్ణజ్వరం హంతి మందాగ్నిం క్షయనాశనం । తత్తద్రోగానుపానేన సర్వరోగ వినాశనం

వ్యా॥ వెండి. 2. భా. పాదరసము, 8 భా. గంధకం 16 భా. ఇవి కలబంద రసముచే మర్దించి వాలుకాయంత్రమందు మూడురోజులువండి సాంగశీతలమునతీసి అనుపానవిశేషములచే యిచ్చిన కఠినమైన ప్రమేహములను హరించును. మరియు శుక్ల నష్టము, దగ్గు, బలహీనత, ఉబ్బసము, పాండు, జీర్ణజ్వరము, అగ్నిమాంద్యము, క్షయ వీటిని నశింపజేయును. అనుపానభేదములచే సర్వరోగములను నివారించును.

# తారచంద్రోదయం (రజతచంద్రోదయం)

శ్లో॥ రజతంచ చతుర్భాగం అష్టభాగం తుపారదం। గంధకాచ్చ షోడశస్యాత్కన్యారసవిమర్దితం । రక్తకార్పాసకుసుమైర్మాసమేకంవిమర్దితం । క్రమాగ్నౌ వాలుకాయంత్రే పాచితంతుదినత్రయం । స్వాంగశీతలముద్ధృత్యత్వగేలాపత్రకేసరైః । అనుపానవిశేషేణ మిశ్రితం సర్వరోగనుత్ । క్షయంపాండుం ప్రమేహాంశ్చ దౌర్బల్యం కాసమేవచ । అజీర్ణంచ తథా హిక్కాంగ్రహణీం మూలరోగనుత్ ।వీర్యవృద్ధిం కరోత్యేషః శుక్రస్తంభంచ కారయేత్ । హర్షేణ మనసానిత్యం నరోగచ్ఛేచ్ఛతప్రమదాశతం । తారచంద్రోదయ మితిఖ్యాతం నిర్మితం నిజతేజసా॥

వ్యా॥ వెండి 4భా. పాదరసము. 8భా. గంధకం, 16భా. వీటిని కలుబందరసముచేతను, ఎఱ్ఱప్రత్తిపువ్వుల రసముచేతను నెల దినములు మర్దించి వాలుకాయంత్రమందు క్రమాగ్నులచేమూడురోజులు వండి స్వాంగశీతలమునతీసి దాసెనచెక్క, ఏలకులు, ఆకుపత్రి, నాగకేసరములు.వీటితోగాని ఇతర అనుపానములతోగాని మిశ్రమముచేసి యిచ్చిన క్షయ, పాండు, ప్రమేహములు. బలహీనత, కాస, అజీర్ణము, ఎక్కిళ్లు, గ్రహిణీరోగము మూలరోగము వీటిని సర్వరోగములను నివారించును. వీర్యవృద్ధిని చేసి వీర్యస్తంభనముచేయును. మనస్సంతోషముతో నిత్యము నూరుగురు స్త్రీలను రమించును. ఇయ్యది తారచంద్రోదయమని ప్రసిద్ధమైనది.

# వాతరాక్షసం (పుటయోగం)

సీ॥ రౌప్యభస్మంబును రససిందురము నభ్రకము లోహకములీ క్రమముతోడ । కాంచనభస్మంబు ఘనతామ్రమును గంధకము వత్సనాభియు సముచితంబుగను ॥ సమంబులుగూర్చి ఖల్వంబునందుంచి యొప్పుమీరంగను తిప్పతీగె । తెల్లగలిజేరువేళ్లు నల్లము తులిశాకు వహ్నిాద్రనంబుల వరుసగాను । మర్దనల్జేసియు మహిత కుక్కుటపుటం బొనరించి చల్లార్చి దనరనదియు । తద్రసంబులచేత తగ రెండు దినములు మర్దనమొనరించి మానితముగ । గుటికలు గావించుకొని పూటకడ్డిగెత్తనుపానములతోడ నలరగొనిన । పక్షఘాతము పార్శ్వరుజ కంపవాతముల్ పదమూడుసంధుల బలములణచి। సూతికావాతముల్ శూలరోగంబులు సొంపులణచియుచాల నింపుగాను। సర్వరోగంబులను దంతిసముద

యంబు । కోదమసింగంబు రీతిని మదమణంచి । వాతరాక్షసమను పేరు వన్నెమీర । దాల్చివిహరించునని పల్కెనీశ్వరుండు॥

టీక॥ వెండిభస్మ, రససిందూరము, అభ్రకభస్మ, లోహభస్మ, కాంతభస్మ, బంగారుభస్మ, తామ్రభస్మ, శు. గంధకము, శు, నాభి, సమభాగములు ఖల్వమందుంచి, తిప్పతీగె, తెల్లగలిజేరు వేళ్ళు, అల్లము, తులసిఆకు, చిత్రమూలము, వీటిరసములచే వరసగా మర్దనచేసి కుక్కుటపుటంవేసి చల్లారినపిదప తీసి మరలపైరసములచే రెండురోజులు మర్దించి కుప్పెలుకట్టుకని పూటకు అడ్డిగఎత్తు అనుపానవిశేషములచే నిచ్చిన పక్షవాతము పార్శ్వశూల, కంపవాతము, 13 సన్నిపాతములు, సూతికావాతములు, శూలరోగములు సమస్తరోగములను ఏనుగుల మదమును సింహము అణంచు రీతి అణంచి వాతరాక్షసమును పేరుతో ప్రసిద్ధికెక్కెనని ఈశ్వరుడు పలికెను.

# వాతరాక్షసం (వంటయోగం)

శ్లో॥ శుద్ధ సూతం తథాతామ్రం కాంతం చాభ్రకమేవచ । తారహేమంచ తాలం చ మౌక్తికం విద్రుమంతథా । మనశ్శిలా మాక్షికంచ సర్వత్ర సమగంధకం । పునర్నవారసేనైవ హంసపాదిరసైస్తథా । మర్దితం ఛాయయాశుష్కం వాలుకాయంత్రకేక్షిపేత్ । పాచయేద్దశయామంచ స్వాంగశీతం సముద్ధరేత్ । గుంజామాత్రం నిహంత్యాశు అనుపానవిశేషతః । ఊరుస్తంభం వాతరక్తంగాత్ర భంగంతథైవచ । ఆమవాతంధనుర్వాతం కుబ్జవాతం తథైవచ । సంధివాతం పక్షవాతం సూతికావాతమేవచ । వాతరాక్షస నామాయం వాతరోగాన్వినాశయేత్॥

వ్యా॥ శు. రసం. తామ్రభస్మ, కాంతభస్మ, అభ్రకభస్మ, రజతభస్మ, సువర్ణభస్మ, శు. తాళకము, ముత్యభస్మ, పగడభస్మ, శు. మణిశిల, మాక్షికభస్మ, ఇవన్నియుసమభాగములు వీటి అన్నిటితో సమానము శు. గంధకము, ఇవిగలిజేరు హంసపాది రసములచే మర్దించినీడను ఎండించి వాలుకాయంత్రమందు పది ఝాములువండి స్వాంగశీతలమున తీసి అనుపానవిశేషముచే గురివిందగింజ ప్రమాణము సేవించిన ఊరుస్తంభము, వాతరక్తము, గాత్రభంగము, ఆమవాతము, ధనుర్వాతము. కుబ్జవాతము, సంధివాతము, పక్షవాతము, సూతికావాతము, సమస్త వాతరోగములు నశించును.

# వాతరాక్షసమ్ (పుటయోగం)

శ్లో॥ పారదంగంధ కలనాభీ అభ్రకంకాంత తామ్రకం । స్వర్ణం తారం సమంచైవ పునర్నవరసేనచ । అమృతా వహ్నితులసీ పిప్పలీ

క్వాథ కేనచ । ఏకైకం మర్దితం సమ్యగ్గినైకం చపృథక్ పృథక్ । గుళి కాన్ ఛాయయా శుష్కాన్ శరావ సంపుటేక్షిపేత్ । పక్వంలఘుపుటే నైవ సాంగశీతల ముద్ధరేత్ । ద్విగుంజం భక్షితంచైవ తాప జ్వరవి నాశనం।ఆమవాతం ధనుర్వాతం పక్షఘాతంతథైవచ। ఆక్షేపకం హనుస్తంభం మన్యాస్తంభం తథైవచ । సన్నిపాతం మహాఘోరం వివిధాన్విష మానపి। వాతరాక్షస కోనామ గౌరీనాథ ప్రకల్పితః॥

వ్యా॥ శు. పాదరసం శు. గంధకము. శు. నాభి అభ్రకభస్మ కాంతభస్మ తామ్రభస్మ సువర్ణభస్మ, రజతభస్మ, ఇవిసమభాగములు. గ్రహించి, గలిజేరు, తిప్పతీగ, చిత్రమూలము, తులసి, పిప్పళ్ళు, వీటి కషాయముచే ప్రత్యేకముగ ఒక్కొక్కదానిచే ఒక్కొకరోజున బాగుగమర్దించి మాత్రలుచేసి నీడనుఎండించి మూకుళ్ళయందుంచి లఘుపుటముచే పక్వము చేసుకొని సాంగశీతలమున తీసుకొని రెండు గురిగింజల ప్రమాణము భక్షించిన తాపజ్వరము, ఆమవాతము. ధనుర్వాతము పక్షవాతము, ఆక్షేపకవాతము, హనుస్తంభము, మన్యాస్తంభముఘోరమైన సన్నిపాతము, సమస్తమైన విషమజ్వరములు. వీటిని నశింపజేయును.

## వాతరాక్షసము (వంటయోగము)

సీ॥ తామ్రవంగములోహ తారభస్మ సువర్ణనాల్గు రసంబులు నభ్రకమును । కాంతము గంధకము కఫరినేపాలంబు సమభాగంబులు గూర్చి చక్కగాను । ఖల్వంబు లోనుంచి త్రికటుక రసముల మర్దించి కుప్పెలోనమరబెట్టి । సరసంబుగానది చట్టిలోపలబెట్టి యిసుక చుట్టునుబోసి యిష్టముగను । పదహారు గడియలు పక్వంబుగా వండి దేహమును పానమును దెలసికొనుచు। అడ్డిగెత్తు పూటకు అమరగ నిడిన వాతరోగంబు లన్నియు వదలిపోను । శోఫలును కాసలు శూలలను సాంపునణచు వాతరాక్షస మిదియును వాడిగలదు॥

టీక॥ తామ్రము, వంగ, లోహ, రజత, సువర్ణ, వీటిభస్మలు. శు, రసము, శు. రసకర్పూరము. శు, ఇంగిలీకము శు. రససిందూరముఅభ్రకభస్మ, కాంతభస్మ. శు, గంధకము కఫరి, శు. నేపాళములు, ఇవన్నియు సమభాగములు చేర్చి ఖల్వమందుంచి త్రికటుక రసముచే మర్దించి కుప్పెయందుంచి కుండలోబెట్టి కుప్పెచుట్టును ఇసుకపోసి పదహారు ఘడియలు వండి తీసి తత్వమును అనుపానములను గుర్తెరిగి పూటకు అడ్డిగెత్తు యిచ్చిన వాతరోగంబు లన్నియు వదలి పోవును. నంజులను కాసలను శూలలను చిత్రముగా అణచును. ఈవాతరాక్షసము మహావాడి గలది.

# లఘువాతరాక్షసం

మృతంసూతం తథాగంధం కాంతం చాభ్రకమేవచ । తామ్ర భస్మ కృతం సమ్యఙ్మర్దయి త్వాసమాంశకం । పునర్నవాగుడూచ్యగ్ని సురసాత్ర్యూషణం తథా । ఏతేషాం స్వరసేనైవ భావయేత్త్రి దినం పృథక్ । దత్వాలఘు పుటం సమ్యక్ స్వాంగశీతం సముద్ధరేత్ । వాతరాక్షస నామాయం వాతరోగే ప్రయోజయేత్ । తత్తద్రోగాను పానేన ద్విగుంజా మాత్రసేవనాత్ । ఊరుస్తంభం వాతరక్తం గాత్ర భంగం తథైవచ । ఆమవాతం ధనుర్వాతం వేదనావాతమేవచ । పక్షాఘాతం కంపవాతం సర్వసంధిగతం తథా । సుప్తివాతం చశూలంచ ఉన్మాదంచ వినాశయేత్ । తత్తద్రోగాను పానేన వాతాశీతి వినాశనః॥

వ్యా॥ రసభస్మ, శు, గంధకం, కాంతభస్మ. అభ్రకభస్మ. తామ్రభస్మ. ఇవన్నియుసమభాగములు. గలిజేరుతిప్పతీగ, చిత్రమూలము, తులసి, త్రికటుకములు. వీటి రసములచే ప్రత్యేకముగ మూడుదినములు భావనచేసి లఘుపుటంబిడి సాంగశీతలమున తీసి అనుపాన భేదములచే యిచ్చిన ఊరుస్తంభం, వాతరక్తం, గాత్రభంగం, ఆమవాతం, ధనుర్వాతం, వాతబాధ, పక్షవాతము, కంపవాతము, సంధివాతము, సుప్తివాతము, శూల, ఉన్మాదము, వీటిని నశింపజేయును. రోగానుసారములైన అనుపానములచే ఎనుబదివాతములను నశింపజేయును.

# మహావాతరాక్షసం

శ్లో॥ హేమం రౌప్యాభ్రకం లోహం రసేంద్రం శుద్ధగంధకం । వైక్రాంతం మౌక్తికం చైవవిద్రుమం తామ్రతాలకం । శంఖచూర్ణం మృతంవంగం మాండూరం కాంతమేవచ । ఏతత్త్రిఫల సంయుక్తం సూతార్ధం విషసంయుతం । వాశానింబరసైః పంచభావయేచ్చపృథక్పృథక్ । చతుర్యామంచ తన్మర్ద్యం ఛాయాశుష్కంచ కారయేత్ । కుక్కుటాఖ్యపుటే పక్వం సాంగశీతం విచూర్ణయేత్ । గుంజామాత్ర ప్రయోగేణ కణామధ్వాజ్య సంయుతం । ఊరుస్తంభం వాతరక్తం గాత్ర స్తంభం తథైవచ । ఆమవాతం ధనుర్వాతం సూతికావాతమేవచ । ఆధ్మానం వాన్ని మాంద్యంచ తూనీం ప్రతితూనీమపి । వాతరాక్షస నామాయం వాతాశీతి వినాశనం ॥

వ్యా॥ సువర్ణ, రజత, అభ్రక, లోహ, వీటిభస్మలు. తు, రసం, తు, గంధకం, వైక్రాంతము, ముత్యము, పగడము, తామ్రము, వీటిభస్మలు. తు, తాలకము, శంఖము వంగము, మాండూరము, కాంతము, వీటిభస్మములు. త్రిఫలములు, ఇవన్నియు సమ భాగములు. తు, నాభి శ్లే భా। వీటినన్నిటిని, అడ్డసరము, వేపచక్క, వీట్లరసములచే ప్రత్యేకముగ అయిదు సారులు భావనచేసి నాలుగు ఝాములు మర్దించి నీడను ఎండించి కుక్కుట పుటంబిడి సాంగశీతలమున తీసి చూర్ణించి గుంజాప్రమాణము పిప్పళ్లు, తేనె, నెయ్యి, అనుపానము తోయిచ్చిన ఊరుస్తంభము, వాతరక్తము, గాత్రస్తంభ ము, ఆమవాతము, ధనుర్వాతము, సూతికావాతము, కడుపుఉబ్బరం, అగ్నిమాం ద్యము, తూని, ప్రతితూని ఎనబది వాతములను నశింపజేయును. ।

# మహావాతరాక్షసం

## (ప్రకారాంతరం)

శ్లో॥ తామ్రం విద్రుమ మభ్రకాంతరజతం వైక్రాంత హేమా క్షికం । వైడూర్యాయసభస్మ నీమృతరసం హేమంచ వహ్నిం సమం । సర్వంహంస పదీద్రవై స్త్రి దివసంపిష్ట్వా శరావైరిదం । కుర్యాత్సూక్ష్మ పుటం నిహంతి మరుతో వాతాసురోయంరసః॥

వ్యా॥ తామ్ర, పగడ, అభ్రక, కాంత, రజత, వైక్రాంత, హేమమాక్షిక, వైడూర్య, లోహ, రస, సువర్ణ, వీటి భస్మములు చిత్రమూలము. వీటిని సమభాగ ములుగ ఖల్వమందుంచి హంసపాదిరసముచే మూడురోజులు మర్దించి మూకుళ్ళ యందుంచి సూక్ష్మ పుటమువేసి ఉపయోగించిన సమస్త వాతవ్యాధులను హరించును. ఇది వాతాసురం (వాతరాక్షసము) అనబడును.

# సువర్ణవాతరాక్షసం

శ్లో॥ స్వర్ణం నాగం వంగలోహం తామ్రం కాంతంచ తారకం । రసభస్మం గంధకంచనాభీనేపాల మాక్షికం । కఫరీ మైలతుత్థంచవ రాటం శంఖభస్మకం । టంకణం దరదం చైవతాలకంచ మనశ్శిలా । కృష్ణాభ్రకం సమంచైవ ఖల్వమధ్యే వినిక్షిపేత్ । కటుభద్రరసేనైవ లవంగ క్వాథకేనచ । చిత్రమూలరసేనైవ మర్దయేద్వటకాన్ కురు । కాచకుప్యాం వినిక్షిప్యవాలుకా యంత్రయోగతః । మందాగ్నినాద్వి యామంచ పాచయేత్సాంగశీతలం । ద్విగుంజం మాక్షికేణైవ ఖాదే ద్వాతవినాశనం స్నాయువాతం పిత్తవాతం సూతికావాతమేవచ

పక్షఘాతార్దితానాహం కంపవాతం చనాశయేత్ । ఊరుంజానుం కటీం సంధీన్ మూత్రపిండౌతథాగతం । అశీతివాతజాన్ రోగాన్నాశయేన్నాత్ర సంశయః । వాతరాక్షస నామాయం సువర్ణ పదపూర్వకం॥

వ్యా॥ సువర్ణభస్మ, సీసభస్మ, వంగభస్మ, లోహభస్మ, తామ్రభస్మ, కాంతభస్మ, రజతభస్మ, రసభస్మ, శు. గంధకం, శు. నాభి, శు. నేపాళములు, హేమమాక్షికభస్మ, శు. కపురి, శు. మైలతుత్థం, గవ్వభస్మ, శంఖభస్మ, శు. టంకణం, శు. ఇంగిలీకం, శు. తాలకం, శు. మణిశిల, కృష్ణాభ్రకభస్మ, ఇవన్నియు సమభాగములు ఖల్వమందుంచి, అల్లము, లవంగములు, చిత్రమూలము, వీటి రసములచే మర్దించి మాత్రలుచేసి కాచకుప్పెయందుంచి వాలుకాయంత్రమందు. మందాగ్నిచే రెండుఝాములు వండి సాంగశీతలమునతీసి రెండు గురివిందగింజల ప్రమాణము తేనెతో తినిన స్నాయువాతము, పైత్యవాతము, సూతికావాతము, పక్షవాతము, అర్దితవాతము, ఆనాహవాతము, కంపవాతము, వీటిని తొడలు, మోకాళ్లు, కటీప్రదేశము, సంధులు, మూత్రపిండములు, వీటిని పొందిన వాతమును, ఎనుబది వాతరోగములను నిస్సందేహముగ నశింపజేయును.

## రత్న వాతరాక్షసం

శ్లో॥ రసకం గంధకం వజ్రం కాంతం లోహంచ తామ్రికం । అభ్రికం దరదం తాలం నాగం వంగంచహాటకం । రౌప్యంచైవ వైక్రాంతం రాజావర్తంచ మౌక్తికం । విద్రుమం విషతార్క్ష్యంచ సర్వం ఖల్వే వినిక్షిపేత్ । సూర్యాహ్వాయస్య పయసా కృష్ణోన్మత్తరసేనచ । చిత్రమూలరసేనైవ త్రివారంచ పృథక్పృథక్ । సప్తధావ్యోమనిర్యాసైర్భావయేద్వాతరాక్షసం । శ్లేష్మోద్రేకేతి కటుకైర్వల్లమాత్రం ప్రయోజయేత్ । త్రయోదశ సన్నిపాతానష్టజ్వర నివారణం । అపస్మారం ధనుర్వాతం విద్రధింరక్తగుల్మజిత్ । ఆనాహం మూత్రకృచ్ఛ్రంచ సర్వవాతగదానపి । వాతరాక్షస నామాయం ప్రసిద్ధం రత్నపూర్వకం॥

వ్యా॥ రసభస్మ, గంధకం, వజ్రభస్మ, కాంతభస్మ, లోహభస్మ, తామ్రభస్మ, అభ్రకభస్మ, శు. ఇంగిలీకం, శు. తాలకం, సీసభస్మ, వంగభస్మ, బంగారుభస్మ, రజతభస్మ, వైక్రాంతభస్మ, రాజావర్తభస్మ, ముత్యపుభస్మ, పగడభస్మ, శు. నాభి,

పచ్చలభస్మ, ఇవన్నియు సమభాగములు ఖల్వమందుంచి జిల్లేడుపాలచేతను, నల్ల ఉమ్మెత్తరసముచేతను, చిత్రమూలరసముచేతను, ప్రత్యేకముగ మూడు సారులును, శుంఠి, పిప్పళ్లు, మిరియాల కషాయముచే, ఏడుసారులును భావనచేయవలెను. శ్లేష్మ ప్రదేకమందు త్రికటురసముచే వల్ల ప్రమాణము యివ్వవలెను. త్రయోదశ, సన్నిపాత ములను, అష్టజ్వరములను, అపస్మారము, ధనుర్వాతము, విద్రధి, రక్తగుల్మము, కడుపు ఉబ్బరము, మూత్రకృచ్ఛ్రము, సర్వవాతవ్యాధులను, జయించును, రత్నవాతరాక్షస మని ప్రసిద్ధమైనది.

## పాషాణ వాతరాక్షసము

శ్లో॥ రసభస్మం అభ్రకంచలో హంతామ్రంచ హింగులం। సువర్ణం నాగవంగంచ ఉల్లిపాషాణ టంకణం । తుత్థద్వయం శుద్ధ నాభిర్మాక్షి క్యమలతాలకం । నవాసారం మనశ్శిలా హింగు స్ఫటికసం యుతం । సర్వంసమం వినిక్షిప్య వహ్నిమూల రసేనచ । కటుత్రయర సేనైవ అజమోదాలవంగకైః। రక్కసస్య రసేనైవ మర్దయేద్ద్వాదినం పృథక్ । వటకాన్కార యేచ్ఛుష్కాన్ వజ్రమూషాంత రేక్షిపేత్ । ద్వియామం వాలుకాయంత్రే పాచయేత్స్వాంగశీతలం । ఆర్ద్రికస్యచ నిర్గుండీల శునస్వరసేనచ । త్రిదినం మర్దితంచైవ అనుపాన విశేషతః । ఖాదయేదతి శీఘ్రంచ వాతాశీతి వినాశనం। వాతరాక్షసనామాయం వాణీనాథ ప్రకల్పితం॥

వ్యా॥ రసభస్మ, అభ్రకభస్మ, లోహభస్మ, తామ్రభస్మ, శు, ఇంగిలీకం సువర్ణం, నాగం, వంగం, వీటిభస్మములు. శు, ఉల్లిపాషాణం, శు, వెలిగారం, శు, మైలతుత్థం, శు. పాలతుత్థం, శు. నాభి. మాక్షికభస్మ, విమలభస్మ, శు, తాలకం శు, నవానారం. శు. మణిశిల, శు. ఇంగువ, శు. పటిక, అన్నియుసమ భాగములుగ, ఖల్వమందుంచి, చిత్రమూలము, త్రికటుకములు, వాము, లవంగములు, బలురక్కసి, వీట్ల రసములచే ప్రత్యేకముగ రెండేసిరోజులు మర్దించి మాత్రలుచేసి ఎండించి వజ్రమూస యందుంచి వాలుకా యంత్రమందు రెండుఝాములు వండి స్వాంగశీతలమున తీసి అల్లము, వావిలి, వెల్లుల్లి వీటిరసముచే మూడురోజులు మర్దించి అనుపాన విశేష ముచే పుచ్చుకనిన ఎనుబదివాతములను అతిశీఘ్రముగా నశింపజేయును. ఈవాతరాక్షస ము వాణీనాధునిచే కల్పింప బడియె.

## కఫరికల్పమ్

శ్లో॥ కఫరీం మర్దయేత్ క్షీరైశ్చ తురశీతి యామకం ।

అనంతరం దివారాత్రం మర్దనే నామృతం భవేత్ । మాషమాత్రం సానుపానం జ్వరం హంతిదినార్ధతః॥

వ్యా॥ శు. కఫరిని ఖల్వమందుంచి 84 ఝాములు ఎడతెగక రాత్రింపగళ్ళు ఆవుపాలతో మర్దించిన అమృత తుల్యంబగును. పిదప మాషప్రమాణము అనుపాన విశేషములతో యిచ్చిన అర్ధదినములో జ్వరము హరించును.

## కఫరీ యోగము (ప్రకారాంతరము).

శ్లో॥ కఫరీం శోధితాం కృత్వా సమగంధక మిశ్రితం । అజాక్షీరేణ సంమర్ద్యం హ్యష్టా శీతికయామకం । గవాంక్షీరేణ దాతవ్యం జ్వరమాంద్యాది రోగకం । శమయేద్ఘటి కార్ధేన దేవానామమృతం యథా॥

వ్యా॥ శుకఫరి, శుగంధము, ఇవి సమభాగములు ఖల్వమందుంచి మేకపాలచే 88 ఝాములు మర్దించి ఆవుపాలతో యిచ్చిన, జ్వరము, అగ్నిమాంద్యము, మొదలగు వ్యాధులను అర్ధ ఘడియకాలములో శమింపజేయును. దేవతలకువలె అమృత తుల్యంబగును.

## పురాణజ్వరములకు మాలినీవసంతం

శ్లో॥ రసకయుగలభాగం వేల్లజంచైకభాగం ద్వితయమపి ఖల్వే మర్దయేత్ శ్లక్ష్ణకేన । భవతిజ్వరవిముక్తో నింబనీరేణ తావత్ జ్వరహరమధకుర్యాన్మాలినీప్రాగ్వసంతం । జీర్ణజ్వరే ధాతుగతే తిసారేరక్తాన్వితే రక్తగవిట్ స్వరూపే । జ్వరేస్థిగే మాంసగతే పురాణే వల్లద్వయం దుగ్ధమతీవ పథ్యం॥

వ్యా॥ శు. కఫరి, 2 భా. మిరియాలు, 1 భా. ఈ రెండింటిని ఖల్వమందుంచి మెత్తంగా వేపచెక్క కషాయముచే మర్దించి జ్వరహర అనుపానములతో జ్వరము, జీర్ణజ్వరము, ధాతుగతజ్వరము, అతిసారము, రక్తాతిసారము, మలాతిసారము, అస్థిగత జ్వరము, మాంసగతజ్వరము, పురాణజ్వరము, వీటియందు రెండువల్లముల ప్రమాణముయివ్వవలయును. పాలు మిక్కిలియివ్వవలయును. ఇది మాలినీవసంత మనబడును

## మహాలక్ష్మీ విలాసరసం

శ్లో॥ సువర్ణం రజతం తామ్రం తీక్ష్ణలోహాభ్రకం యుతం

నాగ వంగౌ ప్రవాలంచ మౌక్తికం కృష్ణకాంతకం । రసవైక్రాంత సంయుక్తం తత్సర్వం శుద్ధభస్మకం । సమభాగానితత్సర్వం ఖల్వామధ్యేవినిక్షిపేత్ ॥ త్రికటుక్వాథ సంమర్ద్యం లవంగక్వాథకేనచ । భావితం శోషితం చూర్ణం గుంజాద్వయ ప్రమాణకం । త్రికటోశ్చూర్ణసంమిశ్రం సేవితం రాజయక్ష్మణి । సర్వమేహాన్ ప్రణాన్ ఘోరాన్ శ్వాసకాసక్షయంహరేత్ । దృఢలింగం బలం పుష్టిం ఆయుష్యం కాంతివర్ధనం । రసం లక్ష్మీవిలాసాఖ్యం సర్వరోగాన్ వినాశయేత్॥

వ్యా॥ బంగారము, వెండి, తామ్రము, ఖడ్గలోహము, అభ్రకము, సీసము, వంగము, ప్రవాళము, ముత్యములు, మండూరము, కాంతము, రసము, వైక్రాంతము, శుద్ధమైనవీటియొక్క భస్మములను సమభాగములు ఖల్వమందుంచి త్రికటుకషాయము చేతను లవంగకషాయము చేతను మర్దించి భావనచేసి ఎండించి ఆచూర్ణమును రెండు గురిగింజలప్రమాణము త్రికటుచూర్ణముతో కలిపి సేవించిన రాజయక్ష్మ, సమస్త మేహములు, ఘోరమైనవ్రణములు, శ్వాస, కాస, కృశించుట, వీటిని హరించును. లింగదార్ఢ్యము, బలము దేహపుష్టి, ఆయువు, కాంతి వీటిని వృద్ధిపొందించును ఈ లక్ష్మీవిలాసరసము సర్వరోగములను నశింపజేయును.

## మహాలక్ష్మీవిలాసరసం (పుటయోగం)

శ్లో॥ సువర్ణతారాభ్రక తామ్ర వంగత్రిలోహనాగామృతమౌక్తికాని । ఏతత్సమం యోజ్యరసస్య భస్మఖల్వే కృతంస్యాత్కృత కజ్జలీకం। సుమర్దయే న్మాక్షికసంప్రయుక్తం తచ్ఛోషయే ద్విత్రిదినంచఘర్మే । తత్కల్కమూషోదరమధ్య గామియత్నా త్కృతంతార్క్ష్యపుటేనపక్వం । యామాష్టకం పావకమర్దితంచ లక్ష్మీవిలాసోరసరాజఏషః । క్షయంత్రిదోషప్రభవంచ పాండుంసకామలా సర్వసమీరణంచ । శోఫప్రతిశ్యాయ వినష్టవీర్యం మూలామయం చైవసశూలకుష్ఠం । ప్రమేహానగ్నిమాంద్యం సన్నిపాతం శ్వాసంచకాసంచహరే త్ప్రయుక్తం ॥ తారుణ్యలక్ష్మీప్రతిబోధనాయ శ్రీమద్విలాసో రసరాజఏషః॥

వ్యా॥ బంగారభస్మ, వెండిభస్మ, అభ్రకభస్మ, తామ్రభస్మ, వంగభస్మ, ఖడ్గలోహభస్మ, మండూరభస్మ, కాంతభస్మ, సీసభస్మ, శు. నాభి, ముత్యభస్మ, ఇవన్నియు సమభాగములు వీటిఅన్నిటితో సమానము, రసభస్మ, ఇవిఖల్వమందుంచి మనికజ్జలిచేసి తేనెవేసి బాగుగనూరి పిదప 2-3 రోజులు ఎండయందు ఎండించి

మూసయందుంచి తార్క్ష్యపుటముచే పక్వముచేసుకుని చిత్రమూలరసముచే 8 ఝాములు మర్దించుకుని సేవించిన త్రిదోషములవలన పుట్టినక్షయ, పాండు, కామిర్లు, సమస్తవాత వ్యాధులు, నంజు, జలుబు, ఇంద్రియనష్టము, మూలవ్యాధి, శూల, కుష్ఠుపు ప్రమేహములు, అగ్నిమాంద్యము, సన్నిపాతము, శ్వాస, కాస, వీటిని హరించును.

## మహాలక్ష్మీ విలాసరసం

(వంటయోగం)

సీ॥ మరితంబులగు వెండి కనక కాంతము యినుము తగ హేమమాక్షిక దరదములను । సరిగూర్చినంతటి పాదరసమేసి తద్రసతుల్య గంధకము యొసగి । తిప్పతీగెను యేడు దినములు మర్దించి పోకమన్ను లిచ్చిన కుప్పెలో బోసి । వాలుకాయంత్రాన యెనిమిది ఝాములు వండి చల్లారిన యౌషధము దీసి । అల్లపురసముచే కుప్పెలుగావించి అనుపానములచేత అడ్డిగెత్తు సేవజేయంగవలయు లక్ష్మీవిలాస । రసమని లకఫపిత్తరాజయక్ష్మార్శశ్శోఫ । పాండుకామిలగుల్మ పవనశీత సంతతతాప జ్వరముల శాంతిపరచు॥

టీక॥ వెండిభస్మ, 1. భా, బంగారభస్మ, 1 భా, కాంతభస్మ, 1 భా, లోహభస్మ, 1 భా, హేమమాక్షికభస్మ, 1 భా, శు. ఇంగిలీకము 1 భా, శు. రసము 6 భా, శు. గంధకము 6 భా, ఇవి తిప్పతీగరసముచే ఏడు దినములు మర్దించి శీలమన్నులిచ్చిన కుప్పెయందుపోసి వాలుకాయంత్రమందు 8 ఝాములు వండి చల్లారినపిదప ఔషధమునుతీసి అల్లపురసముచే నూరి కుప్పెలు కట్టుకుని అనుపానభేదములచే అడ్డిగెత్తు సేవించిన ఈ లక్ష్మీవిలాసరసము వాతవ్యాధులు శ్లేష్మవ్యాధులు, పైత్యవ్యాధులు రాజయక్ష్మ, మూలవ్యాధి, నంజు, పాండువు, కామిర్లు, గుల్మము, వాతజ్వరము, శీతజ్వరము, సంతతజ్వరము, తాపజ్వరము, వీటిని శాంతింపజేయును.

## క్రమవృద్ధి మహాలక్ష్మీ విలాసరసం

శ్లో॥ హేమభస్మంచ భాగైకం రౌప్యభస్మం ద్విభాగికం శుల్బభస్మం త్రయోభాగం కాంతభస్మం చతుర్గకం । పంచమంతీక్ష్ణ భస్మంచ షష్ఠంమాండూర భస్మకం । నిశ్చంద్రవ్యోమ కస్యైవ భస్మ...

సప్తమ భాగకం । అష్టమం వంగభస్మంచ నవమం నాగభస్మకం । దశమం మౌక్తికంచైవ మేకాదశం ప్రవాలకం । సర్వైస్సమం హింగుళోత్థ రససిందూరమిశ్రితం । మర్దయేద్భావ యేద్ద్రవ్యం భావనా జాజి పత్రకం । త్రికటు త్రిఫలాచైవ చాతుర్జాతంచ కుంకుమం । మృగనాభి రసం భావ్యం సప్తాహంచ భిషగ్వరైః । మాషమాత్ర ప్రయోగేణ సితాజ్యమధుసంయుతం । రాజరోగం నిహంత్యాశుక్షయపాండు వినాశనం । ద్వంద్వజం మూర్ఛరోగంచ శ్వాసకాసంచ కామలాం । తాప జ్వరంచ గుల్మంచ సర్వశూలంచ నాశయేత్ । ఉన్మాదంచ మతిభ్రంశ మజీర్ణ కమరోచకం । ప్రమేహం వింశతించైవ నపుంసత్వం జ్వరంజయేత్ । మందాగ్నిం కుష్ఠరోగంచ మూలరోగం భగందరం । వాతశూలహరం వృష్యమత్యంత మతిదీపనం । తుష్టిపుష్టికరం బల్యం కఫవాతవి నాశనం । అసాధ్య రోగనాశంచ మహాలక్ష్మీ విరాజితం ॥

వ్యా॥ బంగారుభస్మ, 1 భా. వెండిభస్మ 2 భా. తామ్రభస్మ, 3 భా, కాంత భస్మ, 4 భా. లోహభస్మ, 5 భా. మాండూరభస్మ, 6 భా. అభ్రకభస్మ, 7 భా. వంగభస్మ, 8 భా. సీసభస్మ, 9 భా. ముత్యభస్మ, 10 భా. పగడభస్మ, 11 భా. వీటికి అన్నిటికి సమానము ఇంగిలీకములో నుండి తీసిన రసముచే వండిన రససిందూరము వీటినన్నిటిని జాపత్రి, త్రికటుకములు, త్రిఫలములు, దాసెనచెక్క, ఏలకులు, ఆకుపత్రి, నాగకేసరములు, కుంకుమపువ్వు, వీటిచేతను కస్తూరిచేతను ఏడురోజులు మర్దించిభావనజేసి మాషప్రమాణము, పంచదార, నెయ్యి, తేనె, తోయిచ్చిన రాజయక్ష్మ క్షీణించుట, పాండువు, ద్వంద్వజ మూర్ఛరోగము, శ్వాస, కాస, కామిర్లు, తాప జ్వరము, గుల్మము, సమస్తశూలలు, ఉన్మాదము, మతిభ్రంశము, అజీర్ణము, అరోచకము, వింశతి ప్రమేహములు, నపుంసకత్వము, జ్వరము, అగ్నిమాంద్యము, కుష్టరోగము, మూలశంక, భగందరము, వాతశూల, వీటిని హరించును. మిక్కిలి వీర్యవృద్ధి అగ్నిదీప్తి, మనస్సంతోషము, శరీరపుష్టి, బలము, వీటినిచేయును. కఫవ్యాధులు, వాతవ్యాధులు, సర్వరోగములను నశింపజేయును

## వంగాదియోగం

శ్లో॥ మారితంత్రపు సంసీసం హరిణశృంగ మూషకులం । కార్పాసనా కులీత్రకం మాహిషంచ ప్రమేహజిత్ ॥

వ్యా॥ వంగభస్మ, సీసభస్మ, దుప్పికొమ్ముభస్మ, ప్రత్తివిత్తులు, తంగేడు విత్తులు, వీటిని సమభాగములు నూరి బర్రె మజ్జిగతో పుచ్చుకొనిన ప్రమేహములను నశింపజేయును.

# సుధానిధిరసం

శ్లో॥ గంధకం పారదం చాభ్రమేలాగ్రంధిక కేసరం । సమ భాగయుతం ఖల్వేజీరకేణచ మర్దితం । కాచకుప్యాం నివేశ్యాథ ద్వియామంతు తుషాగ్నినా । సాంగశీతల ముద్ధృత్య ద్విగుంజం భక్షయేత్సదా । శర్కరామధు సంయుక్తం సర్వపైత్యవికారనుత్॥

వ్యా॥ శు గంధకము, శురసము, అభ్రకభస్మ, ఏలకులు, గ్రంధితగరము, నాగకేసరములు, ఇవిసమభాగములు ఖల్వంబందుంచి జీలకర్ర రసముచే మర్దించి కాచ కుప్పెయందుంచి ఊముక నిప్పులో రెండు ఝాములు వండుకొని సాంగ శీతలమున తీసి రెండు గురిగింజల ప్రమాణము పంచదార, తేనెవీటితో సేవించిన సమస్త పైత్యవ్యాధులను పోగొట్టును.

# మహాతాళేశ్వర రసము

శ్లో॥ తాలంతాప్యం శిలా సూతం శుద్ధం సైంధవ టంకణం । సమాంశం చూర్ణయేత్ ఖల్వేస్తూతా ద్విగుణ గంధకం । గంధతుల్యం మృతం తామ్రంజం బీరైర్దిన పంచకం । మర్ద్యంపశ్చి॰పుటైః పాచ్యం భూధరే సంపుటోదరే । పుటేపుటే ద్రవైర్మర్ద్యం సర్వమేతచ్చ షట్పలం । ద్వి పలం మారితం తామ్రం లోహభస్మ చతుః పలం । జంబీరామ్లేన తత్సర్వ, దినం మర్ద్యంపు టేల్లఘు । త్రింశదంశ విషంచాస్య క్షిప్త్వా సర్వం విచూర్ణయేత్ । మాహిషాజ్యేన సంమిశ్రం నిష్కార్ధం భక్షయేత్సదా । మధ్వాజ్యైర్వాకుచీ చూర్ణం కర్షమాత్రం లిహేదను। సర్వకుష్ఠాన్ని హంత్యాశు మహాతా లేశ్వరోరసః॥

వ్యా॥ శు,తాళకము,స్వర్ణమాక్షికభస్మ,శు,మణిశిల,శు,రసము,సైంధవలవణము, పొ,వెలిగారము, ఇవి వక్కొక్క భాగము, శుగంధకము 2 భా, తామ్రభస్మ 2 భా, ఇవి నిమ్మకాయ రసముచే అయిదురోజులు మర్దించి శరావసంపుటమందుంచి భూధర యంత్రమందు పుటము వేసుకొన వలయును. తీసి మరల నిమ్మకాయల రసముచే నూరి మరల పుటము వేసుకొన వలయును. ఇట్లు ఆరుసార్లు పుటము వేసుకొనవలయును. పిదప ఔషధము 2 పలములు గ్రహించి తామ్రభస్మ 2 పలములు, లోహభస్మ 4 పలములు ఇవన్నియు నిమ్మకాయ రసముచే వకరోజు మర్దించి లఘుపుటము వేసికొని ఈమందుకు 30 వ వంతు శువాభి కలుపుకొని నూరుకొని అర్ధనిష్క ప్రమాణము బర్రె వెన్నతో పుచ్చుకొని వాకుచి చూర్ణము కర్ష ప్రమాణము, తేనె, నెయ్యి, వీటితో

వెంటనే పుచ్చుకున వలయును. ఇట్లు చేసిన ఈ మహాతా లేశ్వరరసము, సమస్త కుష్ఠు వ్యాధులను వెంటనే నశింపజేయును.

# ఛర్దులకు పూర్ణచంద్రోదయరసం

శ్లో॥ తుల్యంతుల్యం రసంగంధం ఖల్వమధ్యే వినిక్షిపేత్ । కపిత్థమూలసారేణ మర్దితంచదినత్రయం । వటకాన్ ఛాయయాశోష్యాన్ భాండమధ్యే వినిక్షిపేత్ । కాచకుప్యాం వినిక్షిప్య వాలుకాభిః ప్రపూరయేత్ । దీపాగ్నిచ ద్విషడ్యామం సాంగశీతం సముద్ధరేత్ । కపిత్థమూలసారేణ త్రిదినం మర్దయేత్ క్రమాత్ । బిల్వమూల కషాయేణ మర్దయేత్త్రిదినంపునః । చాతుర్జాతక కర్పూర లవంగ కుసుమాన్వితం। సర్వం రససమంచైవ మేలయిత్వాథ చూర్ణకం । లాజచూర్ణం సితామిశ్రం మధునాసహ సేవయేత్ । వల్లద్వయమిదం సూతం వమనస్తంభనంతథా । కాసాదిపంచ ఛర్దీనాం హ్యరుచేర్నాశకస్తథా । హృద్రోగంస్వరభంగంచ మందాగ్నించ నివారయేత్ । పూర్ణచంద్రోదయో నామనిర్మితశ్శూలపాణినా॥

వ్యా శు. రసము, శు. గంధకము, ఇవి సమభాగములు ఖల్వమందుంచి వెలగవేళ్ళరసముచే మూడురోజులు మర్దించి మాత్రలుచేసి నీడను ఎండించి కాచకుప్పెయందుంచి కుండయందిడి ఇసుకచేనింపి దీపాగ్నియందు 12 ఝాములువండి సాంగశీతలమునతీసి వెలగవేళ్ళ రసముచేతను, మారేడువేళ్ళ రసముచేతను, మూడేసిరోజులు మర్దించి చాతుర్జాతకములు, పచ్చకర్పూరము, లవంగములు, వీటిని రసముతో సమానముకలిపి వల్లప్రమాణము, పేలపిండి, పంచదార, తేనె వీటితో సేవించిన వాంతిని కట్టును. అయిదుకాసలు, అయిదుఛర్దులు, అరుచి, హృద్రోగము, స్వరభంగము, అగ్నిమాంద్యము, వీటిని నశింపజేయును. ఈ పూర్ణచంద్రోదయము, శూలపాణిచే నిర్మింపబడెను.

# విద్యాధరరసమ్

శ్లో॥ గంధకం తాలకం తాప్యం మృతతామ్రం మనశ్శిలాం । శుద్ధసూతం చతుల్యాంశంమర్దయేద్భావయేద్దినం । పిప్పల్యాస్తు కషాయేణ వజ్రీక్షీరేణ భావయేత్ । నిష్కార్ధం భక్షయేత్ క్షౌద్రైః గుల్మప్లీహాదికం జయేత్ । రసోవిద్యాధరో నామగోమూత్రంచపి బేదను॥

వ్యా॥ శుగంధకము, శు, తాళకము, మాక్షికభస్మ, తామ్రభస్మ, శుమణిశిల శు రసము, ఇవి సమభాగములు గ్రహించి నూరుకుని, పిప్పళ్లకషాయముచేతను జెముడుపాలచేతను, ఒక్కొక్కదినము భావనచేసుకుని అర్ధనిష్క ప్రమాణము తేనెతో సేవించి గోమూత్రమును త్రాగినయడల, గుల్మము, ప్లీహవ్యాధి మొదలగు వాటిని నశింపజేయును, ఇది విద్యాధరరస, మనబడును,

## రసభూపతి

శ్లో॥ రసగంధామృతం తుల్యం తీక్ష్ణమాదుం బరం సమం హంసపాదిద్రవైః ఖల్వేమర్ద్యతం దివసత్రయం । కాచకుప్యాం నివేశ్యాథ లేపయేద్మృత్రమృత్తికాం । వాలుకాయంత్ర కేప్యేస్వాశనై ర్మృద్వగ్నినాపచేత్ । ద్విషడ్యామం సముద్ధృత్యచూర్ణ యేన్మాషమాత్రకం । ఆర్ద్రికస్యాను పానేన సర్వశోఫం నిహంతిచ । రసోహ్యగ్నికుమారాఖ్యో యోగోయం రసభూపతిః॥

వ్యా॥ శు. రసము, శు. గంధకము, శు, నాభి, ఖడ్గలోహభస్మ, తామ్రభస్మ, ఇవి సమభాగములు ఖల్వమందుంచి హంసపాదిరసముచే మూడురోజులు మర్దించి కాచకుప్పెయందుంచి మట్టిగుడ్డలచే పైనచుట్టి వాలుకాయంత్రమందుంచి మెల్లిగా మృద్వగ్నిచే 12 ఝాములు వండితీసి చూర్ణించి అల్లపురసముతో మాషప్రమాణము సేవించిన అన్నివిధములైన నంజులను హరించును, ఇది అగ్నికుమారమనియు రస భూపతియనియు చెప్పబడును.

## త్రినేత్రరసం

శ్లో॥ టంకణం హారిణం శృంగం స్వర్ణం శుల్బం॰ మృతం రసం దినైకమార్ద్రికద్రావైర్మర్ద్యం రుధ్వాపుటేపచేత్ । త్రినేత్రాఖ్య రసస్యైకం మాషం మధ్వాజ్య కైర్లిహేత్ । సైంధవం జీరకంహింగు మధ్వాజ్యాభ్యాం లిహేదను । పక్తిశూలహరః ఖ్యాతో॰ మాసమాత్రాన్న సంశయః ॥

వ్యా॥ శు, వెలిగారము, జింకకొమ్ముభస్మ, సువర్ణభస్మ, తామ్రభస్మ, రసభస్మ, ఇవి సమభాగములు, అల్లపురసముచే ఒకరోజు మర్దించి మూకుళ్లయందుంచి సంధి బంధనముచేసి పుటమువేసికొని ఈ త్రినేత్రాఖ్యరసమును, ఒకమాష ప్రమాణము, తేనె, నెయ్యి, వీటితో పుచ్చుకుని, సైంధవలవణము, జీలకర్ర, ఇంగువ, ఇవి తేనె, నెయ్యి, వీటితో వెంటనే పుచ్చుకున వలయును, ఇట్లుచేసిన ఒకమాసము రోజులకు పరిణామశూలను తప్పక నశింపజేయును.

# స్వచ్ఛన్నం (స్వచ్ఛంద భైరవ రసం)

శ్లో॥ సమభాగంచ సంగ్రాహ్యం పారదా మృతగంధకం । జాతీ ఫలంచ భాగార్ధం దత్వాకుర్యాచ్ఛ కజ్జలీం । సర్వార్ధం మాగధీ చూర్ణం మర్దయిత్వా నిదాపయేత్ । గుంజాద్వయంత్రయం వాపి నాగవల్లీ రసేనచ । ఆర్ద్రికస్యర సేనాపి ద్రోణపుష్పీర సేనవా । శీత జ్వరే సన్నిపాతే విషూచ్యాం విషమజ్వరే । పీనసేచ ప్రతిశ్యాయే జ్వరే జీర్ణేత్యైవచ । మందాగ్నౌ వమనేచైవ శిరో రోగేచదారుణే। ప్రయో జ్యోభిష జాసమ్య గ్రరస్స్వాచ్ఛంద భైరవః ॥

వ్యా॥ శు రసము, 1 భా. శు నాభి, 1 భా. శు గంధకము, 1 భా. జాజికా. యలు ½ భా. పిప్పలి చూర్ణము 1¾ భా. మొదట రసగంధకములను కజ్జలిచేసి పిదప మిగతా చూర్ణములను కలుపుమని 2 లేక 3 గురువిందగింజల ప్రమాణము తమల పాకులరసముతోగాని అల్లపురసముతోగాని తుమ్మిపువ్వుల రసముతోగాని శీతజ్వ రము, సన్నిపాతము, విషూచి, విషమజ్వరము, పీనసము, జలుబు, జ్వరము, అజీర్ణము, అగ్నిమాంద్యము, వాంతి, శిరోరోగము, వీటి యందు యివ్వవలెను.

# మహాచంద్ర కలారసం

శ్లో॥ ప్రత్యేకం తోలమానేన సూతకాంతాభ్ర భస్మకం । సమం సమం గంధకంచ కృత్వాకజ్జ లికాంతథా । ముస్తామాలతి దూర్వాభిః కేతకీ స్తనవారిణా । సహదేవ్యాః కుమార్యాశ్చ పర్పటస్యన వారిణా । మృణాలస్య శతావ్హాయాః శతావర్యా రసేనచ । భావయిత్వా ప్రయ త్నేన దివసేదివసే పృథక్ । క్షిపేద్గుడూచికా సత్వం పర్పటోశీరమా గధీ । శ్రీగంధం శారిబై తేషాం సమాంశం సూక్ష్మచూర్ణితం । ద్రా క్షాదిక కషాయేణ సప్తధా పరిభావయేత్ । ఛాయాయాం పరిశోష్యాథ వట్యః కార్యాశ్చణోపమాః।అయం చంద్రకలానామ రసేంద్రః పరికీర్తితః సర్వపైత్య గదధ్వంసీ వాతపైత్య గదాపహః । అంతర్బాహ్యా మహాదా హవిధ్వంసోయం మహారసః । గ్రీష్మకాలే శరత్కాలే విశేషేణ ప్రశస్య తే । కురుతేనాగ్ని మాంద్యంచ మహాతాపజ్వరం హరేత్ । శోషం

మూర్ఛాం హరత్యాశు స్త్రీణాం రక్తమహాస్రవం । ఊర్ధ్వాధో రక్తపిత్తంచ రక్తవాంతిం విశేషతః । మూత్రకృచ్ఛ్రాణి సర్వాణి నాశయేన్నాత్రసంశయః॥

వ్యా॥ శు. రసము, కాంతభస్మ, అభ్రకభస్మ, శు. గంధకము, ఇవి సమభాగములు గ్రహించి మెత్తగనూరి, తుంగగడ్డలు, మాలతీపుష్పములు, గరికవేళ్లు, మొగలిచన్నులు, సహదేవి, కలుబంద, పర్పాటకము, తామరతూండ్లు, సదాప, పిల్లిపీచర, వీటిరసములచే వక్కొక్కరోజు భావనచేసి, తిప్పసత్తు, పర్పాటకము, వట్టివేళ్ళు, పిప్పళ్లు, చందనము, సుగంధిపాల, వీటియొక్క చూర్ణము వక్కొక్కభాగము కలిపి, మెత్తగనూరుకుని ద్రాక్ష మొదలగు వాటి కషాయముచే ఏడుసారులు భావనచేసుకునినీడను ఆరనిచ్చి సెనగలంత మాత్రలుచేసుకునవలయును. ఇది చంద్రకలారస, మనబడును. ఇది సమస్త పైత్యవ్యాధులను, వాతపైత్యవ్యాధులను, అంతర్దాహము బాహ్యదాహము, మహాతాపజ్వరము, శోష, మూర్ఛ, స్త్రీలయొక్క రక్తస్రావము, ఊర్ధ్వరక్తపిత్తము, అధోరక్తపిత్తము, రక్తవమనము, మూత్రకృచ్ఛ్రము, వీటిని నశింపజేయును, గ్రీష్మకాలమందును, శరత్కాలమందును మిక్కిలి ప్రశస్తము, అగ్నిమాంద్యమును చేయదు.

## శూలగజకేసరీ రసం

శ్లో॥ శుద్ధ సూతం ద్విధాగంధం యామైకం మర్దయేద్దృఢం । ద్వయోస్తుల్యే శుద్ధతామ్ర సంపుటే తన్నిరోధయేత్ । ఊర్ధ్వాధోగంధకం దత్వా మృద్భాండే ధారయేద్భిషక్ । తతోగజపుటే పక్వా స్వాంగశీతం సముద్ధరేత్ । సంపుటం చూర్ణయేత్ సూక్ష్మం పర్ణఖండే ద్విగుంజకం । భక్షయేత్సర్వ శూలార్తో హింగు శుంఠీ సజీరకం । వచామరిచ జంచూర్ణం కర్షముష్ణ జలై — అసాధ్యం నాశయేత్ శూలం రసోయం గజకేసరీ॥

వ్యా॥ శురసము 1 భా, శు గంధకము. 2 భా ఇవి వకఝాము దృఢముగా మర్దించి ఈరెండికి సమానము శుద్ధమయిన రాగి సంపుటమందు యుంచి శుండయుం దుంచి తామ్ర సంపుటమునకు క్రిందనుమీదను ఉప్పునుపోసి మూతమూసి సంధిబంధనముజేసి గజపుటము నందు పక్వముచేసుకుని చల్లారినపిదప తీసి ఆసంపుటమును మెత్తగనూరి రెండుగురిగింజల ప్రమాణము తామలపాకులతో సేవించి, ఇంగువ, శుంఠి, జీలకర్ర, వస మిరియాలు, వీనిచూర్ణమును, కర్షప్రమాణము వేడినీటితో వెంటనే పుచ్చుకునినయా శూలగజకేసరి రసము, సమస్త శూలలను అసాధ్యమైనశూలను నశింపజేయును.

## లఘుసిందూర భూషణం

శ్లో॥ అభ్రకం గంధకం చైవ టంకణం రససిందురం। ఏతాని సమభాగాని కృష్ణధత్తూర కేనచ। మర్దితం భిషగిత్యేవం లఘుసిందూరభూషణం। అనుపాన విశేషేణ సర్వరోగని కృంతనం। గర్భిణీ రోగనాశంచ శుష్కకాస వినాశనం। వింశతించ ప్రమేహాం నాశయేన్నాత్రసంశయః॥

వ్యా॥ అభ్రకభస్మ, శు. గంధకము, శు. టంకణము రససిందూరము, ఇవి సమభాగములు నల్లఉమ్మెత్తరసముచే మర్దించి అనుపాన విశేషముచే యిచ్చిన సర్వరోగములను, గర్భిణీరోగములను, పొడిదగ్గును, వింశతి ప్రమేహములను, తప్పక నశింపజేయును.

## సిందూరభూషణం

శ్లో॥ అభ్రకం గంధకం చైవ టంకణం రససిందురం। నాగవంగౌసమం కాంతం లోహవిద్రుమ భస్మకం। ఏతాన్దిన త్రయం ఖల్వే భావనాంబు భిరన్వహం। మర్దయేద్భిషగిత్యేవం నామసిందూరభూషణం। ఔషధం సర్వరోగఘ్నం నానా మేహవినాశనం। క్షయాదికాన శేషాంశ్చ నాశయేన్నాత్రసంశయః॥

వ్యా॥ అభ్రకభస్మ, శు. గంధకము, శు. టంకణము, రససిందూరము, నాగభస్మ, వంగభస్మ, కాంతభస్మ, లోహభస్మ, పగడభస్మ, ఇవి సమభాగములు ఉదకముచే భావనచేసి మర్దించి సేవించిన సర్వరోగములను, సమస్త ప్రమేహములను, క్షయ మొదలగు అన్నివ్యాధులను, తప్పక నశింపజేయును.

## సువర్ణసిందూరభూషణం

శ్లో॥ సువర్ణం మౌక్తికం చైవ విద్రుమం చాభ్రకం తథా। గంధకం టంకణం చైవ రససిందూరకం తథా। కృష్ణధత్తూర తోయేన మర్దితం మాషమాత్రకం। సేవితం చానుపానేన క్షయరోగ వినాశనం। చత్వారింశచ్చైవ పైత్త్యాని ప్రమేహాన పిమస్తరాన్। ప్రయోజ్యం సర్వరోగేషు గర్భిణీనాం విశేషతః। సిందూరభూషణం నామ సువర్ణపద పూజితం॥

వ్యా॥ సువర్ణభస్మ, ముత్యభస్మ, పగడభస్మ, అభ్రకభస్మ, శు. గంధకము, శు. టంకణము, రససిందూరము, ఇవి సమభాగములు నల్లఉమ్మెత్త ఆకురసముచే మర్దించి మాషప్రమాణము అనుపానముచే సేవించిన, క్షయ, నలుబది పైత్యవ్యాధులు, ప్రమేహములు, సర్వరోగములు, నశించును. గర్భిణీ స్త్రీలకు కలుగు సమస్తవ్యాధుల యందు యివ్వతగినది. ఇది సువర్ణసిందూర భూషణమనబడును.

## మహాసువర్ణ సిందూర భూషణం

శ్లో॥ సువర్ణం రజతం వజ్రం మౌక్తికంచాపి విద్రుమం । భుజంగ మభ్రకం కాంతం రససిందూర వంగకం । పృథగ్ద్విభాగం పూర్వార్థే త్వేకభాగం పరార్ధకే । జాతి పుష్కర సైశోణముని పుష్పైక్షువాలకైః పరా వారాహిలామజ్జా హిమశాల్మలివారిభిః । ప్రత్యేకం త్రిదినం పిష్ట్వామాషమాత్రం తుయోజితం । మధునా సేవయే త్ప్రాతః కుష్ఠమ ష్టాదశ కామలాం । వింశతించ ప్రమేహాణి చత్వారింశచ్చ పైత్యకం। సిందూరభూషణం నామగర్భిణీ రోగనాశనం । వీర్యవృద్ధికరం నిత్యం షండోపి తరుణాయతే॥

వ్యా॥ బంగారభస్మ 2 భా, వెండిభస్మ 2 భా, వజ్రభస్మ 2 భా, ముత్యభస్మ 2 భా, పగడభస్మ 2 భా, సీసభస్మ 1 భా, అభ్రకభస్మ 1 భా, కాంతభస్మ 1 భా, రససిందూరము 1 భా. వీటిని జాజిపువ్వులు, ఎర్ర అవిసిపువ్వులు, చెరుకు, కురువేరు, పిల్లిపీచర, నేలతాడి, వట్టివేళ్లు, రక్తచందనము, బూరుగ వీటి రసములచే ప్రత్యేకముగ మూడుదినములు మర్దించి మాషప్రమాణము తేనెతో ఉదయము పుచ్చుకునిన అష్టాదశ కుష్ఠువులు, కామిర్లు, ఇరవై ప్రమేహములు, నలుబది పైత్యములు, వీటిని నశింపజేయును. గర్భిణీస్త్రీకి సంభవించు అన్నివ్యాధులను పోగొట్టును. నిత్యము వీర్యవృద్ధినిచేసి నపుంసకునికూడ యౌవనవంతునిగా చేయును.

## మహాసువర్ణ సిందూరభూషణమ్ (ప్రకారాంతరం)

శ్లో॥ జాతరూపంచవై క్రాంతం వజ్రవిద్రుమ మౌక్తికం । భుజంగమభ్రకం కాంతం రససిందూరమతః క్రమః । పంచపక్షైకభాగంచ చతుర్భాగం పృథక్కృతః। జాతిపుష్కర సైరక్తమునిపుష్పైక్షువాలకైః। వరావారా హిలామజ్జా హిమశాల్మలివారిభిః । పృథగ్దినైకం మర్దంచ మాషమాత్రం తు సేవయేత్ । వింశతి శ్లేష్మకాన్ రోగాన్ చతుర్వింశతి

పైత్యకాన్ । అశీతిర్వాతజాన్ రోగాన్ కుష్ఠ మష్టాదశకామలాం । ప్రమేహాం స్తథాశూలం సన్నిపాతాం స్త్రయోదశ । అతిసారంచ, క్షయం(?) శ్లేష్మ పాండుజ్వరాపహం । ప్రదరంగళరోగంచ వీర్యవృద్ధి కరం తథా। నిత్యంచ సేవనా దస్యషండో పితరుణాయతే। బాలవృద్ధా దిభి స్సేవ్యంగర్భిణీనాం విశేషతః।సిందూరభూషణం నామ రేవణేనసుభాషితం॥

వ్యా॥ సువర్ణభస్మ 1 భా. వైక్రాంతభస్మ 1 భా, వజ్రభస్మ, 1 భా, పగడ భస్మ 1 భా, ముత్యభస్మ 1 భా, సీసభస్మ 4 భా, అభ్రకభస్మ 4 భా, కాంతభస్మ 4 భా, రససిందూరము 4 భా, వీటిని జాజిపువ్వులు, ఎర్ర అవిసిపుష్పములు, చెరుకు, కురువేరు, పిల్లిపీచర, నేలతాడి, వట్టివేళ్లు, రక్తచందనము, బూరుగ, వీటిరసములచే ప్రత్యేకముగా నకదినము మర్దించి మాషప్రమాణము సేవించిన ఇరవైశ్లేష్మ వ్యాధులను, ఇరవైనాలుగు పైత్యవ్యాధులను, ఎనబది వాత రోగములను, పదునెనిమిది కుష్ఠములను, కామిర్లను, ప్రమేహములను, శూలను, పదమూడు సన్నిపాతములను, అతిసారమును, రాజయక్ష్మను, శ్లేష్మ పాండువును, జ్వరమును, ప్రదరమును, కంఠ వ్యాధులను, హరించును. వీర్యవృద్ధిని చేయును, ఎల్లప్పుడు సేవించుటచే నపుంసకుడు కూడా పడుచువాడగును, బాలురు, వృద్ధులు, మొదలగువారిచే సేవించదగినది. విశే షముగ గర్భిణీ స్త్రీలు సేవించదగును.

# ఆమ కుఠార రసం

శ్లో॥ జాతీఫలం త్రికటుకం టంకణం రసగంధకం । నిర్వ్యాసం వత్స నాభంచ ముస్తాకుటజ చిత్రకం । వరాచాతి విషామోచ నిర్యా సః క్షారరామఠం । సర్వం సమ్మర్ద్య విజయా స్వరసేన దినత్రయం । వల్లప్రమాణ వటికాంశుంఠీ ద్రావానుపానతః । ఆమం శూలమతీ సారంగ్ర హణీంచ చిరంతనాం ! ఏషఆమకు ఠారాఖ్యో రస స్త్రైలోక్య పూజితః ॥

వ్యా॥ జాజికాయలు, త్రికటుకములు, పావెలిగారము, శు రసము, శు గంధ కము, శు నల్లమందు, శు నాభి, తుంగగడ్డలు, కొడిశపాల, చిత్రమూలము, త్రిఫల ములు. అతివస, బూరుగబంక, యవక్షారము, పాఇంగువ, ఇవన్నియు సమభాగములు గ్రహించి గంజాయి రసముచే మూడురోజులు మర్దించి, వల్లప్రమాణపు మాత్రను శుంఠీరసముతో పుచ్చుకనిన ఆమాభివృద్ధి, ఆమశూల, అతిసారము, చిరకాల గతమైన గ్రహణి, వీటిని హరింపజేయును, ఈ ఆమకుఠార రసము, మూడులోక ములయందు ప్రసిద్ధమైనది.

వ్యా॥ సువర్ణభస్మ, ముత్యభస్మ, పగడభస్మ, అభ్రకభస్మ, శు. గంధకము, శు. టంకణము, రససిందూరము, ఇవి సమభాగములు నల్లఉమ్మెత్త ఆకురసముచే మర్దించి మాషప్రమాణము అనుపానముచే సేవించిన, క్షయ, నలుబది పైత్యవ్యాధులు, ప్రమేహములు, సర్వరోగములు, నశించును. గర్భిణీస్త్రీలకు కలుగు సమస్తవ్యాధుల యందు యివ్వతగినది. ఇది సువర్ణసిందూర భూషణమనబడును.

## మహాసువర్ణ సిందూర భూషణం

శ్లో॥ సువర్ణం రజతం వజ్రం మౌక్తికంచాపి విద్రుమం । భుజంగ మభ్రకం కాంతం రససిందూర వంగకం । పృథగ్ద్విభాగం పూర్వార్థే త్వేకభాగం పరార్ధకే । జాతి పుష్పర సైశ్యోణముని పుష్పేక్షువాలకైః ఏరా వారాహిలామజ్జా హిమశాల్మలివారిభిః । ప్రత్యేకం త్రిదినం పిష్ట్వామాషమాత్రం తుయోజితం । మధునా సేవయేత్ప్రాతః కుష్ఠమ ష్టాదశ కామలాం । వింశతించ ప్రమేహాణి చత్వారింశచ్చ పైత్యకం। సిందూరభూషణం నామగర్భిణీ రోగనాశనం । వీర్యవృద్ధికరం షండోపి తరుణాయతే॥

వ్యా॥ బంగారభస్మ 2 భా, వెండిభస్మ 2 భా, వజ్రభస్మ 2 భా, ముత్యభస్మ 2 భా, పగడభస్మ 2 భా, సీసభస్మ 1 భా, అభ్రకభస్మ 1 భా, కాంతభస్మ 1 భా, రససిందూరము 1 భా. వీటిని జాజిపువ్వులు, ఎర్ర అవిసిపువ్వులు, చెరుకు, కురువేరు, పిల్లిపీచర, నేలతాడి, వట్టివేళ్లు, రక్తచందనము, బూరుగ వీటి రసములచే ప్రత్యేకముగ మూడుదినములు మర్దించి మాషప్రమాణము తేనెతో ఉదయము పుచ్చుకొనిన అష్టాదశ కుష్ఠువులు, కామిర్లు, ఇరవై ప్రమేహములు, నలుబది పైత్యములు, వీటిని నశింపజేయును. గర్భిణీస్త్రీకి సంభవించు అన్నివ్యాధులను పోగొట్టును. నిత్యము వీర్య వృద్ధినిచేసి నపుంసకునికూడ యౌవనవంతునిగా చేయును.

## మహాసువర్ణ సిందూరభూషణమ్ (ప్రకారాంతరం)

శ్లో॥ జాతరూపంచవైక్రాంతం వజ్రవిద్రుమ మౌక్తికం । భుజంగమభ్రకం కాంతం రససిందూరమతః క్రమః । పంచపక్త్యైకభాగంచ చతుర్భాగం పృథక్కృతః। జాతిపుష్పర సైరక్తముని పుష్పేక్షువాలకైః। వరావారా హిలామజ్జా హిమశాల్మలివారిభిః । పృథగ్దినైకం మర్ద్యంచ మాషమాత్రం తుసేవయేత్ । వింశతి శ్లేష్మకాస రోగాన్ చతుర్వింశతి

పైత్యకాన్ । ర్వాతజాన్ రోగాన్ కుష్ఠ మష్టాదశకామలాం । ప్రమేహాం స్తథాశూలం సన్నిపాతాం స్త్రయోదశ । అతిసారంచ ప్రయత్నేనం శ్లేష్మ పాండుజ్వరాపహాం । ప్రదరంగళరోగంచ వీర్యవృద్ధి కరం తథా। నిత్యంచ సేవనా దస్యషండో పితరుణాయతే। బాలవృద్ధా దిభి స్సేవ్యంగర్భిణీనాం విశేషతః।సిందూరభూషణం నామ రేవణేనసుభాషితం॥

వ్యా॥ సువర్ణభస్మ 1 భా. వైక్రాంతభస్మ 1 భా, వజ్రభస్మ, 1 భా, పగడ భస్మ 1 భా, ముత్యభస్మ 1 భా, సీసభస్మ 4 భా, అభ్రకభస్మ 4 భా, కాంతభస్మ 4 భా, రససిందూరము 4 భా, వీటిని జాజిపువ్వులు, ఎఱ్ఱ అవిసెపువ్వులు, చెరుకు, కురువేరు, పిల్లపీచర, నేలతాడి, వట్టివేళ్లు, రక్తచందనము, బూరుగ, వీటిరసములచే ప్రత్యేకముగా నకదినము మర్దించి మాషప్రమాణము సేవించిన ఇరవై శ్లేష్మ వ్యాధులను, ఇరవై నాలుగు పైత్యవ్యాధులను, ఎనబది వాత రోగములను, పదునెనిమిది కుష్ఠములను, కామిర్లను, ప్రమేహములను, శూలను, పదమూడు సన్నిపాతములను, అతిసారమును, రాజయక్ష్మను, శ్లేష్మ పాండువును, జ్వరమును, ప్రదరమును, కంఠ వ్యాధులను, హరించును. వీర్యవృద్ధిని చేయును, ఎల్లప్పుడు సేవించుటచే నపుంసకుడు కూడా పడుచువాడగును, బాలురు, వృద్ధులు, మొదలగువారిచే సేవించదగినది. విశేషముగ గర్భిణీస్త్రీలు సేవించదగును.

## ఆమ కుఠార రసం

శ్లో॥ జాతీఫలం త్రికటుకం టంకణం రసగంధకం । సిర్యాసం వత్స నాభంచ ముస్తాకుటజ చిత్రకం । వరాచాతి విషామోచ నిర్యాసః క్షారరామఠం । సర్వం సమ్మర్ద్య విజయా స్వరసేన దినత్రయం । వల్లప్రమాణ వటికాంశుంఠీ ద్రావానుపానతః । ఆమం శూలమతీ సారంగ్ర హణీంచ చిరంతనాం ! ఏషఆమకు ఠారాఖ్యో రసస్త్రైలోక్య పూజితః ॥

వ్యా॥ జాజికాయలు, త్రికటుకములు, పొంగలిగారము, శు రసము, శు గంధకము, శు నల్లమందు, శు నాభి, తుంగగడ్డలు, కొడిశపాల, చిత్రమూలము, త్రిఫలములు. అతివస, బూరుగబంక, యవక్షారము, పొంగువ, ఇవన్నియు సమభాగములు గ్రహించి గంజాయి రసముచే మూడురోజులు మర్దించి, వల్లప్రమాణపు మాత్రలను శుంఠీరసముతో పుచ్చుకనిన ఆమాభివృద్ధి, ఆమశూల, అతిసారము, చిరకాలగతమైన గ్రహణి, వీటిని హరింపజేయును, ఈ ఆమకుఠార రసము, మూడులోకములయందు ప్రసిద్ధమైనది.

## ఆనందరసం

శ్లో॥ జాతీఫలం హింగులసైంధవంచ వరాట శుంఠీ విషహేమ బీజం । సపిప్పలీకం వటికాం ప్రకుర్యాద్ధుత్తూర మూలస్యరసేన మర్ద్యం। గుంజాప్రమాణం జఠరామయఘ్నం నిహంతివాతం కఫశూలకంచ । ఆమాతిసారం గ్రహణీ వికారం నిహంతి శోషం సితయాసమేతం । రసోయ మానంద ఇతిప్రదిష్టో గ్రహణీగదానాం యమపాణి దండః ॥

వ్యా॥ జాజికాయలు, శు ఇంగిలీకము, సైంధవలవణము, గవ్వలభస్మ, శుంఠి, శు నాభి, శు ఉమ్మెత్తవిత్తులు, పిప్పళ్లు, వీటిని సమభాగములు ఖల్వమందుంచి ఉమ్మెత్త వేళ్లరసముచే మర్దించి గురిగింజలంత మాత్రలు చేసుకుని సేవించిన జఠరరోగములు, వాతవ్యాధులు, కఫవ్యాధులు, శూల, వీటిని హరించును. పంచదారతో పుచ్చుకునిన ఆమాతిసారము, గ్రహణీరోగము, కృశించుట, వీటిని హరించును. ఈ ఆనందరసము, గ్రహణీవ్యాధులకు యముని దండమువలె భయంకరమైనది.

## గ్రహణీ వజ్రకవాట రసం

శ్లో॥ మృతసూతాభ్రకంగంధం యవక్షారంసటంకణం। అగ్నిమంథం వచాంకుర్యా త్సూతతుల్యాని మాన్సుధీః । తతోజయంతీ జంబీరభృంగ ద్రావైర్విమర్ద యేత్ । త్రివాసరంత తోగోలం కృత్వా సంశోష్య ధారయేత్ । లోహపాత్రేశరావంచ దత్వోపరి విముద్రయేత్. । అధోవహ్నింశనైః కుర్యాద్యామార్థం తతఉద్ధరేత్ । రసతుల్యామతి విషాందద్యాన్మోచరసంతథా । కపిత్థవిజయా ద్రావై ర్భావయేత్సప్తధాపృథక్। ధాతకీంద్రయవాముస్తాలోధ్రప్రతి విషామృతాః।ఏతద్ద్రవై ర్భావయిత్వాదినైకంచ విశోషయేత్। రసోవజ్రకవాటాఖ్యోమాషైకం మధునాలిహేత్।వహ్నింశుంఠీం విడంబిల్వం లవణం చూర్ణయేత్సమం। పిబేదుష్ణాం బునాచాను సర్వాంచగ్రహిణీంహరేత్॥

వ్యా॥ రసభస్మ, అభ్రకభస్మ, శుగంధకము, యవక్షారము, శుటంకణము వెల్లి, వస; వీటిని సమభాగములు గ్రహించి టెక్కలి, నిమ్మకాయలు, గుంటగలగర, వీటిరసముచే మూడురోజులు మర్దించి ఉండచేసి లోహపాత్ర యందుంచి పైన మూకుడుమూసి సంధిబంధనముచేసి క్రిందను మెల్లిగ అరఝాము మంటవేసుకుని తీసి ఈమందుకు సమానము, అతివస, బూరుగుబంక కలుపుకుని, వెలగ, గంజాయి,

వీటిరసములచేప డేసిరోజులు, ఆరేపువ్వు కొండిశెవాలవిత్తులు తుంగగడ్డలు, లొద్దుగ, అతివస, తిప్పతీగ, వీటిరసములచే వక్కొక్క రోజు భావనచేసి, ఎండించుకుని ఈ వజ్రకవాట రసమును, మాషప్రమాణము, తేనెతో పుచ్చుకుని, చిత్రమూలము, శొంఠి, వాయువిడంగములు, మారేడు, సైంధవలవణము, వీటిని సమభాగములు చూర్ణము చేసుకుని వేడినీటితో త్రాగినసమస్త గ్రహణులు హరించును.

# ప్రదరరిపు రసం

శ్లో॥ రసంగంధం సీసమృతమితి సమాంశైస్తు రసకంసమానం సర్వైస్సార్యత్తులితమపిలో ధ్రంప్మషరసైః । దినం పిష్టంనామ్నా ప్రదరరిపురేషోపహార తిద్వివల్లః క్షౌద్రేణ ప్రదరమపి దుస్సాధ్యాపపిచ॥

వ్యా॥ శురసము, గంధకము, సీసభస్మ, ఇవి సమభాగములు, వీటితో సమానము శుకఫరి, వీటి అన్నిటితో సమానము లొద్దుగ చూర్ణము, ఇవిఅడ్డసర పురసముచే వకరోజు నూరికనిన, ప్రదరరిపురస, మని చెప్పబడును. ఇది రెండు వల్లముల ప్రమాణము తేనెతోపుచ్చుకునిన కఠినసాధ్యమైన ప్రదరవ్యాధినికి హరించును.

# నింబ నిర్యాసయోగం

శ్లో॥ పించుమందస్య సిర్యాసంధాత్రీక్వాథేన పేషితం। శిలాధాతు సమాయుక్తం శుక్లమేహ వినాశనం॥

వ్యా॥ వేపబంకను ఉశిరికరసముచే నూరి శిలాజితుకలుపుకొని సేవించిన శుక్లనష్టము హరించును.

# నారాచ రసం

శ్లో॥ భృష్టటంకణ తుల్యంతు మరిచంచ రసంసమం । గంధకం పిప్పలీ శుంఠీ ద్వౌద్వౌ భాగౌవిచూర్ణయేత్ । సర్వతుల్యాంశి పేద్దంతీ బీజం సర్వమకల్మషం ॥ ద్విగుంజం రేచనం హ్యైతదుదరాణి వ్యపోహతి॥

వ్యా॥ వెలిగారము 1 భా. మిరియాలు 1 భా. శు. రసము 1 భా. శు గంధకము 2 భా. పిప్పళ్లు 2 భా. శుంఠి. 2 భా. శు నేపాళములు 9 భా. ఇట్లు వీటిని చూర్ణముచేసి రెండుగురిగింజల ప్రమాణము సేవించిన విరేచనమును చేసి ఉదరవ్యాధులను పోగొట్టును.

# మృ సం ౕవనీరసం

కర్పూరం రసగంధకం చదరదంతీక్ష్ణొద్భవం భస్మకం । కాలేయేంద్రయవాజ మోదహుత భుక్చ్పించాస్థికంధాతకీ । ఏలామాం సిల వంగశాల్మలిమలం జాతీఫలం టంకణం । నీకాసింధుభవంవిమంస మమిదం ప్రత్యేక నిష్కాన్వితం । సర్వేషాం సదృశంచ బిల్వాఫలకం కాంతాభ్రసిందతారకం । సిందతారంచ సఫేనకంచ తులితం దుత్తూరబీజం క్షిపేత్ । భంగాపత్రకకోకిలాక్ష సహితం సర్వంచ చూర్ణీకృతం । దుత్తూరస్వరసేన సంతతమిదం గుంజాప్రమాణావటే । సేవ్యాచేన్మధునా భృశమిమం రక్తాతిసారంపరం । సర్వేషుగ్రహణీ గదేషు సహజేష్వా మాతిసారేషుచ।తద్వచ్చూలయుతాంశ్చదుస్తరతరాన్ నానాతిసారాన్జయేత్ ॥

వ్యా॥ కర్పూరము, శు. రసము, శు. గంధకము, శు. ఇంగిలీకము, తీక్ష్ణభస్మ, కస్తూరిపసపు, కొడిశపాల, వాము, చిత్రమూలము, చింతగింజలు, ఆరెపువ్వు, ఏలకులు. జటామాంసి, లవంగములు, బూరుగబంక, జాజికాయలు, శుటంకణము, సముద్రఫలవిత్తులు, శు నాభి, ఇవిఒక్కొక్క నిష్కప్రమాణము వీటిఅన్నిటినితో సమానము, మారేడుజేసము కాంతభస్మ, అభ్రక సింధూరము, రససింధూరము, శు నల్లమందు, శు ఉమ్మెత్తవిత్తులు, శు గంజాయిఆకు,నిరుగోలిమిడి విత్తులు, వీటి చూర్ణమును కలిపి ఉమ్మెత్తరసము చేతను నిమ్మకాయల రసముచేతను ఎడతెగక ఒక్కొక్కఝాము మర్దించి గురిగింజలవలె మాత్రలుచేసి తేనెతో పుచ్చుకునిన, రక్తాతిసారము, సమస్త గ్రహణీరోగములు, ఆమాతిసారములు, నొప్పితో కూడినటు వంటివి అసాధ్యములైనటువంటివి సమస్త అతిసారములను కూడ నశింప జేయును.

# ఉపదంశమునకు పూగాది లేపం

శ్లో॥ పూగంసు దగ్ధమేకంతు రసగంధక హింగులం । ఖదిరం తుత్థకం చైవ మర్దయేన్నింబ నీరకైః। సమభాగాని సర్వాణి గుటికాం కారయేద్బుధః । ఉపదంశే ఘృతైర్లేపః త్రిదినాద్వ్రణ రోపణః ॥

వ్యా॥ పోక చెక్కలమసి, రసకర్పూరము, గంధకము, ఇంగిలీకము, చంద్రచూర్ణము, పైలతుత్థము, ఇవి సమభాగములు నిమ్మకాయ రసముచే నూరుకుని నేతితో వ్రాసిన, కొరుకు రోగమందలి పుండ్లు మూడు రోజులకు మానిపోవును.

# స్వర్ణమాలినీవసంతం

శ్లో॥ స్వర్ణం ముక్తాదరద మరిచంభాగ వృద్ధ్యా ప్రదేయం ఖర్పర్యష్టౌ ప్రథమ నవనీతేననింబ్వాంబునాచ । యావత్స్నేహో వ్రజతి విలయం మర్దయేద్దీయతేఽ సౌగుంజా ద్వంద్వం మధుచపలయా సర్వరోగే వసంతః । జీర్ణజ్వరే ధాతుగతేఽ తిసారే రక్తాన్వితే రక్తభవే వికారే । ప్రదరం నాశయత్యాశుతథా దుర్నామశోణితం । విషమం నేత్రరోగంచ గజేంద్రమివ కేసరీ । వసంతోమాలినీ పూర్వస్సర్వరోగహరశ్శిశోః । గర్భిణ్యాస్తత్రదేయోవై జయంత్యాః పుష్పకైస్తథా। సర్వజ్వర హరః శ్రేష్ఠోగర్భ పోషణ ఉత్తమః ॥

వ్యా॥ బంగారభస్మ 1 భా. ముత్యభస్మ, 2 భా. మిరియాలచూర్ణము, 4 భా. శుకఖరి, 8 భా, వీటిని పాలు చిలకగా వచ్చిన వెన్నతోను నిమ్మకాయ రసముతోను అందలి చముర ఇగురువరకు మర్దించిరెండు గురిగింజల ప్రమానము తేనెతో యిచ్చిన, జీర్ణజ్వరము, ధాతుగతజ్వరము, అతిసారము, రక్తాతిసారము, రక్తదోషము, ప్రదరము, అర్శస్సునుంచి రక్తముస్రవించుట, విషమజ్వరము, నేత్రవ్యాధులు, వీటిని ఏనుగును సింహము హరించురీతిని హరించును. పసిపిల్లలకు కలుగు సర్వవ్యాధులను హరించును. గర్భిణీ స్త్రీలకు తెక్కలి పుష్ప రసముచే యివ్వవలెను. సర్వజ్వరములను హరించును గర్భమును పోషించుటయందు శ్రేష్ఠమైనది.

# స్వర్ణమాల్యా వసంతం

శ్లో॥ హేమభస్మచ భాగైకం మౌక్తికంచ ద్విభాగికం। దరదంచ త్రిభాగంచ చతుర్థం మరిచంక్షిపేత్ । భాగాష్టకం సూతభస్మజం బీరరసమర్దితం । నవనీత విమర్ద్యంచ గులికాంకారయేద్భిషక్ । యక్ష్మరాజం నిహంత్యా శుధాతుకజ్వరనాశనం । ఛర్ద్యతీసారనాశంచ స్వర్ణమాల్యవసంతకం॥

వ్యా॥ బంగారభస్మ 1 భా. ముత్యభస్మ 2 భా. శు. ఇంగిలీకం 4 భా. మిరియాలచూర్ణము 4 భా, రసభస్మ 8 భా. ఇవినిమ్మకాయలరసముచేతను వెన్నచేతను మర్దించి ఉప్పెలు కట్టుకుని సేవించిన రాజయక్ష్మ, ధాతుగతజ్వరము, వాంతి అతిసారము, వీటిని నశింపజేయును.

## సువర్ణవసంత మాల్యం

శ్లో॥ సువర్ణం మౌక్తికం తారం వంగం వైక్రాంత మభ్రకం। కాంతంకఘరితాలంచప్రవాలంతామ్రహింగులం। సర్వైభాగైస్సమంసూతం సూతతుల్యంచ గంధకం। సుముహూర్తే ఖల్వమధ్యే ఆదిత్యే గురువాసరే। మర్దయే ద్ద్రాక్షజరసైరక్తకార్పాసజద్రవైః। కుమారీరసనం మర్ద్యంకాచ కుప్యాం వినిక్షిపేత్। సాంగశీతలముద్ధృత్య నవనీతేనమర్దయేత్। పునర్జంబీరనీరేణ మర్దయేద్యామమాత్రకం। మాషమాత్రంప్రదా తవ్యం మధుశర్కరయాయుతం। క్షయమేకాదశం హంతి పాండుకామలనాశనం। వింశతించ ప్రమేహాణి చతుర్వింశతిపైత్యకం। నష్టేంద్రియమజీర్ణంచ కాసశ్వాసజ్వరంహరేత్। అశ్వినీదేవతైఃప్రోక్తం స్వర్ణమాల్య వసంతకం॥

వ్యా॥ సువర్ణము, ముత్యములు, రజతము, వంగము, వైక్రాంతము అభ్రకము, కాంతము, వీటి భస్మములు శు కఘరి, శు. తాలకము, పగడభస్మ, తామ్రభస్మ, శు ఇంగిలీకం, ఇవి సమభాగములు వీటితో సమానము శు పాదరసము, పాదరసముతో సమానము, శు. గంధకము ఇవి సుముహూర్తమందు ఆదివారమునగాని గురువారమునగాని ఖల్వమందుంచి ద్రాక్షపండ్లరసముచేతను ఎఱ్ఱపత్తిపువ్వులరసముచేతను కలుబంద రసముచేతను మర్దించి కాచకుప్పెయందునుంచుకుని వండి సాంగశీతలమున తీసుకొని వెన్నచే మర్దించి మరల నిమ్మకాయల రసముచే ఏకఝామము నూరుకుని మాషప్రమాణము తేనె, పంచదార వీటితో యిచ్చిన పదుకొండు క్షయలను, పాండువు, కామిర్లు ఇరవైప్రమేహములను ఇరవైనాలుగు పైత్యములను ఇంద్రియనష్టమును, అజీర్ణము దగ్గును, ఆయాసమును, జ్వరమును, హరించును. ఇది అశ్వినీ దేవతలచె చెప్పబడెను.

## సువర్ణమాల్యం

వ॥ బంగారుభస్మ 1 భా, వెండిభస్మ 2 భా. ఇనపలోహభస్మ 3 భా. ఖడ్గలోహభస్మ 4 భా. శంఖభస్మ 5 భా. మాండూరభస్మ 6 భా. ముత్యాపుభస్మ 7 భా. పగడభస్మ 8 హేమామాక్షికభస్మ 9 భా. రజతభస్మ10 భా. కాంతభస్మ 11 భా. సీసభస్మ,12 భా. వంగభస్మ 13 భా. అభ్రకభస్మ 14 భా. కఘరి $3\frac{1}{2}$ భా. ఇవన్నియుఅవు వెన్న వేపచెక్కరసము, నిమ్మపండ్లరసముతో నూరుకుని మప్పెలు కట్టుకుని సేవించిన ఏకాదశక్షయలు, ఇరవైప్రమేహములు ఇంద్రియనష్టము, శ్వేతరక్తప్రదరములు జీర్ణజ్వరము, దౌర్బల్యము, దగ్గు, పాండువు, అజీర్ణము, అతిమూత్రము, మధుమేహము

మొదలగు వ్యాధులను నశింపజేయును. మరియు వీర్యమును చిక్కపరచి వీర్యస్తంభనము చేయును. సంభోగశక్తిని హెచ్చించును.

## జలజామృతరసం

శ్లో॥ తవక్షీరం శిలాధాతుర్వంగం కుండలి సత్వకం। మేహారిబీజసంయుక్తం విదారీజీవనీరసైః । భావయేత్త్రి వారంతు సితోపలసమన్వితం । జలజామృత విఖ్యాతో రసోయం మేహకృఛ్రనుత్ ॥

వ్యా॥ వెదురుప్పు, శిలాజతు, వంగభస్మ, తిప్పసత్తు, నేలతంగేడు విత్తులు, ఇవి సమభాగములు, నేలగుమ్మడి, పాలకూర, వీటిరసములచే మూడేసి సారులు భావనచేసి పటికబెల్లముతో పుచ్చుకునిన ఈ జలజామృతరసము, మేహములను మూత్రకృఛ్రమును పోగొట్టును.

## గ్రహణ్యాదులకు లోకనాథరసం

శ్లో॥ శుద్ధసూతం విషం గంధం టంకణం లోహభస్మకం జాతీఫలం ధాతకీచ వరాంగం చిత్రమూలకం । జీరకం నాగరం సింధు చూతచీజం సపిప్పలీ । మోచాపిచ్ఛం బిల్వమజ్జాముస్తా చాతివిషా పృథక్ । సప్తభాగమఫేనంచ సర్వతుల్యం మృతాభ్రకం । దుత్తూరత్వక్కషాయేణ మర్దితం యామమాత్రకం । బదరాస్థినమంఖాదే ద్వహ్ని దీప్తికరం పరం । అనుపాన విశేషేణ గ్రహణించ చిరంతనాం । సర్వాజీర్ణ ప్రశమన మనుపానం చమాక్షికం॥

వ్యా॥ శు. రసము, శు. నాభి, శు. గంధకము, శు. టంకణము, లోహభస్మ, జాజికాయలు, ఆరెపువ్వు, దాసెనచెక్క, చిత్రమూలము, జీలకర్ర, శుంఠి, సైంధవలవణము, మామిడిపప్పు, పిప్పళ్లు, బూరుగబంక, మారేడుగుజ్జు, తుంగగడ్డలు, అతివస, ఇవి ఒక్కొక్క భాగం. శు. నల్లమందు 7 భా. వీటి అన్నిటితో సమానము అభ్రకభస్మ, ఇవి ఉమ్మెత్తవేళ్ళపట్ట కషాయముచే ఒకఝాము మర్దించి రేగుగింజంత తినిన, అగ్నిదీప్తిని చేయును. అనుపాన విశేషముచే చిరకాలగతమైన గ్రహణీరోగమునుకూడ నశింపజేయును. తేనెతో యిచ్చిన సర్వాజీర్ణములను, శమింపజేయును.

## హృదయబంధురసం

శ్లో॥ రసగంధా భ్రభస్మాని పార్థవృక్షత్వగంబునా । ఏకవింశతి ధాఘుర్మే భావితాని విధానతః । మాషమాత్రమిదం చూర్ణం మధునా సహలేహయేత్ । వాతజం పిత్తజం శ్లేష్మ సంభూతం వాత్రిదోషజం । కృమిజం చాపి హృద్రోగం నిహంత్యేవన సంశయః॥

వ్యా॥ శు. రసము, శు. గంధకము, అభ్రకభస్మ, ఇవి సమభాగములు మద్ది చెక్కరసముచే ఇరువదియొక పర్యాయము ఎండయందు యథావిధిగా భావనచేసి మాషప్రమాణము చూర్ణమును తేనెతో పుచ్చుకొనిన, వాతము, పైత్యము, శ్లేష్మము, త్రిదోషములు, కృములు, వీటిచే జనించిన హృద్రోగమును నిస్సందేహముగా నశింప జేయును..

## శూలేభ హరిరసం

శ్లో॥ రసవిష గంధక పర్ణక్షారేణ సింధుపిప్పలి విశ్వైః । అహి వల్ల్యంబు విమృష్టః శూలేభహరిర్ద్వి గుంజోయం ॥

వ్యా॥ శురసము, శునాభి, శుగంధకము. గవ్వభస్మ, ఫా, వెలిగారము, సైంధవ లవణము, పిప్పళ్లు, శొంఠి, ఇవి సమభాగములు తామలపాకు రసముతో నూరుకొని రెండుగురిగింజల ప్రమాణము సేవించిన ఏనుగును సింహము హరించురీతి శూలను హరించును.

## సువర్ణభూపతి

శ్లో॥ శుద్ధసూతం సమంగంధం మృతశుల్బంత యోస్సమం । అభ్రలోహక యోర్భస్మ కాంతభస్మ సువర్ణజం । రజతంచవిషంసమ్య క్పృథక్పూ తసమంభవేత్ । హంసపాది రసైర్మర్ద్యో దినమేకం వటీకృతం । కాచకుప్యాం వినిక్షిప్య మృదా సంలేపయే ద్బహిః । శుష్కాం తాంవాలుకాయం త్రేశనైర్మృ ద్వగ్ని నాపచేత్ । చతుర్గుం జామితం దేయం పిప్పల్యార్ద్రి ద్రవేణతు । క్షయం త్రిదోషజం హంతి సన్నిపాతాం స్త్రియోదశ । ఆమవాతం ధనుర్వాతం శృంఖలావాత మేవచ । అర్ధ్యవాతం పంగువాతం కఫవాతా గ్నిమాద్యకం । కటి వాతం సర్వశూలం నాశయేన్నాత్ర సంశయః । గుల్మశూల ముదావర్తం

గ్రహణీమతి దుస్తరాం । ప్రమేహాము దరంసర్వా మశ్మరీం మూత్ర విడ్గ్రహం । భగందరం సర్వకుష్టం విద్రధిం మహతీంతధా । శ్వాసం కాసమజీర్ణంచజ్వరమష్ట విధంతధా । కామలాం పాండురోగం చశిరోరోగం చనాశయేత్ । అనుపాన విశేషేణ సర్వరోగాన్వినాశయేత్ । యధాసూర్యోదయే నశ్యేత్తమః సర్వగతం తధా । సర్వరోగ వినాశాయ సర్వేషాం స్వర్ణభూపతిః ॥

వ్యా॥ శు, రసము, 1 భా, శు, గంధకము, 1, భా, తామ్రభస్మ 2 భా. అభ్రకభస్మ 1 భా, కాంతభస్మ, 1 భా, సువర్ణభస్మ, 1 భా, వెండిభస్మ, 1 భా, శు, నాభి, 1 భా. హంసపాది రసముచే ఏకదినము మర్దించి మాత్రలుచేసి కాచ కుప్పెయందుంచి మట్టిచే పైనపూసి ఎండినపిదప వాలుకా యంత్రమందుంచి మృద్వగ్నిచే మెల్లగ వండితీసి, పిప్పళ్ళు అల్లపురసముతో యిచ్చిన, త్రిదోషజని తక్షయ, పదమూడు, సన్నిపాతములు, ఆమవాతము, ధనుర్వాతము, శృంఖలావాతము, ఆఢ్యవాతము, పంగువాతము, కఫము, వాతము, అగ్నిమాంద్యము, కటివాతము, సర్వశూలలు, గుల్మశూల ఉదావర్తము, కఠినమైనగ్రహిణి ప్రమేహములు, ఉదరవ్యాధి, అశ్మరి, మూత్రబంధము మలబంధము, భగందరము, సర్వకుష్ఠువులు, విద్రధి, శ్వాస. కాస, అజీర్ణము, ఎనిమిది జ్వరములు, కామిర్లు, పాండురోగము, శిరోగములు, వీటిని, అనుపాన విశేషముచే సర్వరోగములను, సూర్యోదయము సర్వవ్యాప్తమైన చీకటిని హరించు రీతిహరించును.

## గుంజాగర్భరసం

శ్లో॥ నిష్కత్రయం శుద్ధసూతం నిష్కద్వాదశ గంధకం ॥ గుంజాబీజంవిషం నిష్కం నింబబీజంజయాతధా । ప్రత్యేకం నిష్కమాత్రం తుమాషంజేపాల బీజకం । జాతీజంబీర ధత్తూర కాకమాచీద్రవైర్దినం । మర్దయం సర్వంవటీం కుర్యాత్ ఘృతైర్గుం జాద్వయంలిహేత్ । గుంజాగర్భరసోనామహింగు సైంధవ సంయుతః । సమండం దాపయేత్పథ్య మూరుస్తంభ ప్రశాంతయే॥

వ్యా॥ శురసము 3 నిష్కములు, శుగంధకము 12 నిష్కములు, గురిగింజలు 1 నిష్కము, శునాభి 1 నిష్కము, వేపగింజలు, 1 నిష్కము, తెక్కలి 1 నిష్కము శునేపాళములు 1 మాషప్రమాణము, వీటినిజాజికాయలు, నిమ్మకాయలు, ఉమ్మెత్త, కాచిమూర, వీటిరసములచే వక్కొకరోజు మర్దించుకొని కుప్పెలు కట్టుకుని రెండు గురిగింజల ప్రమాణము నెయ్యితో పుచ్చుకుని, ఇంగువ, సైంధవలవణము లతోకూడిన మండము యిచ్చుచుండిన ఈ గుంజాగర్భరసము, ఊరుస్తంభమును శాంతి పరచును.

## లంకేశ్వరరసం

శ్లో॥ పలైకం శుద్ధసూతం చకర్షైకం శుద్ధగంధకం। గంధతుల్యాం మృతం తామ్రం సూతాంశం మర్దయేద్విషం । సర్వతుల్యాం పునర్గంధం దత్వాకించిద్వి మర్దయేత్ । ఘృతాభ్యక్తే లోహపాత్రే పచేద్యామం సముద్ధరేత్ । రంభాపత్రపుటే చాథపాచయేత్పర్పటీం యథా । మాషైకం చూర్ణితం ఖాదేత్సర్వ కుష్ఠంనియచ్ఛతి। నిష్కైకం వాకుచీచూర్ణం క్షౌద్రైర్లేహ్యోతథానుచ॥

వ్యా॥ శు. రసము 1 పలము, శు. గంధకము 1 కర్షము, తామ్రభస్మ 1 కర్షము శు నాభి 1 పలము, వీటిఅన్నిటితో సమానము శు గంధకము మరలవేసి కొద్దిగనూరి నెయ్యిపూసిన ఇనపపాత్రయందు పకర్షూము వండుకొనితీసి పర్పటీరసమువలెనె అరటిఆకులయందుంచుకొని చూర్ణముచేసుకొని మాషప్రమాణము సేవించి నిష్కప్రమాణము వాకుచీ చూర్ణమును తేనె కలిపి వెంటనేతినిన సమస్త కుష్ఠువ్యాధులను నశింపజేయును.

## రక్తమాహేశ్వరం

శ్లో॥ సూతం గంధం మృతం స్వర్ణం రససిందూరార కాంతకం । అభ్రకం సర్వద్విగుణం తామ్రభస్మ ద్విభాగం । నాగం వంగం తథా రౌప్యం ప్రత్యేకం సూత సామ్యకం । లోహభస్మ త్రిభాగంచముండ సిందూరకం తథా । సర్వం ఖల్వే వినిక్షిప్య మర్దయేదతి యత్నతః । ఖర్జూర యష్టికాద్రాక్షామధు పుష్పశతావరీ। లోధ్రకాశ్మర్య హ్రీబేర పద్మకేసరపద్మకం । మృణాల చందనోశీర నీలోత్పలఘనం సమం । శ్రీగంధం వాలుకం కుష్ఠం బలాశాల్మలి మూలకం । రంభా కందం గోక్షురకం మాధవీ సహదేవికా । పరూషణాం చైతద్రసైర్భావయేచ్ఛత వారకం । వల్లప్రమాణకం చైవ శర్కరా మృతమాక్షికైః । భక్షయే ద్ఘృతమిశ్రంతు రక్తపిత్తహరం పరం । వింశతించ ప్రమేహాణాం మూత్ర కృచ్ఛ్రం సుదుస్తరం । మధుమేహం వీర్యనష్టం శ్వేతరక్త ప్రదరం తథా । సర్వపైత్త్య హరోన్యాణాం రక్తమాహేశ్వరోరసః॥

వ్యా॥ శు. రసము 1 భా. శు. గంధకము 1 భా. బంగారుభస్మ 1 భా. రససిందూరము 1 భా. కాంతభస్మ 1 భా. అభ్రకభస్మ 10 భా. తామ్రభస్మ 2 భా.

నాగభస్మ 1 భా. వంగభస్మ 1 భా. రజతభస్మ 1 భా. ఖడ్గలోహభస్మ 3 భా, ముండలోహ సిందూరము 3 భా. ఇవన్నియు ఖల్వమందుంచి, ఖర్జూరకాయలు, అతి మధురము, ద్రాక్షపండ్లు, ఇప్పపువ్వులు, పిల్లితేగలు, లొద్దుగచెక్క, పెద్దమ్రానుపసుపు, కురువేరు, తామరఅగరులు, పద్మకాష్టము, తామరతూండ్లు, రక్తచందనము, వట్టివేళ్లు నల్లకలువ, తుంగగడ్డలు, చందనము, కూతురుబుడమ, చంగల్వకోష్టు, ముత్తవపులగము, బూరుగ, ముల్లంగి, అరటిదుంప, పల్లేరు, పువ్వులగురివింద, సహదేవి, చిట్టి వీటిరసములచే నూరుసార్లు భావనచేసి వల్లప్రమాణము పంచదార, తిప్పసత్తు, తేనె నెయ్యి, వీటితో భక్షించిన రక్తపిత్తము, ఇరవైప్రమేహములు, కఠినమైన మూత్రకృచ్ఛ్రము, మధుమేహము, వీర్యనష్టము, శ్వేతప్రదరము, రక్తప్రదరము, సర్వపైత్యములు వీటిని హరించును.

# రక్తమాహేశ్వరం

## (ప్రకారాంతరమ్)

శ్లో॥ సూతం గంధక చూర్ణంచ కాంతం వైక్రాంత మాక్షికం। నాగం వంగంచ తారంచ ప్రత్యేకం వేదభాగికం। లోహభస్మ త్రిభాగంచ తత్సమం కృష్ణలోహకం। తామ్రభస్మ ద్విభాగంచ తత్సమం కాకమాక్షికం। శాల్మలీరస సమ్మిశ్రం మర్దయేదేక వాసరం। పాచితం వాలుకాయంత్రే తతఉద్ధృత్య శీతలం। గగనం వింశతిభాగం సిందూరం సూతభాగకం। మిశ్రితం తువినిక్షిప్తం ఖల్వమధ్యేతు యత్నతః।ఖర్జూరయష్టికా ద్రాక్షమధు పుష్పశతావరీ। లోధ్రకాశ్మర్య హ్రీబేర పద్మకేసర పద్మకం। మృణాలచంద నోశీర నీలోత్పల ఘనం సమం। శ్రీగంధం వాలుకం కుష్ఠం బలాశాల్మలిమూలకం। రంభాకందం గోక్షురకం మాధవీ సహదేవికా। పరూషణం చైతద్రసైర్భావ యేచ్ఛతవారకం। వల్లప్రమాణకం చైవశర్క రామృత శర్కరైః। భక్షయేద్ఘృతమిశ్రంతు రక్తపిత్తహరం పరం। వింశతించ ప్రమేహాణాం మూత్రకృచ్ఛ్రంసు దుస్తరం। మధుమేహం వీర్యనష్టం శ్వేతరక్త ప్రదరంతథా। సర్వపైత్య హరో నృణాం రక్తమాహేశ్వర రోరసః॥

వ్యా॥ శు రసము 4 భా. శు గంధకము 4 భా. కాంతభస్మ- 4 భా. వైక్రాంతభస్మ- 4 భా. హేమమాక్షిక భస్మ- 4 భా. సీసభస్మ- 4 భా. వంగభస్మ-4భా. వెండిభస్మ- 4 భా. ఖడ్గలోహభస్మ- 3 భా. మాండూరభస్మ- 3 భా. తామ్రభస్మ- 2 భా. కాకమాక్షిక భస్మ 2 భా. వీటిని బూరుగ రసముచే ఒకరోజు మర్దించి

వాలుకా యంత్రమందు వండుకొని చల్లారిన పిదప తీసుకొని- అభ్రకభస్మ- 20 భా. రససిందూరము 4 భా. కలుపుకొని, ఖర్జూరపు కాయలు, యష్టిమధుకము, ద్రాక్షపండ్లు, ఇప్పపువ్వు, పిల్లిపీచర, లొద్దుగ, పెద్దముష్టి, కురువేరు, తామర అగిరిలు, పద్మకాష్టము, తామరతూండ్లు, రక్తచందనము, వట్టి వేళ్లు, నల్లకలువ, తుంగగడ్డలు, చందనము, కూతురుబుడమ, చంగల్వకోష్ఠు, ముత్తవపులగము, బూరుగ, ముల్లంగి, అరటిదుంప, పల్లేరు, పువ్వులగురివింద, సహదేవి, చిట్టీత, వీటి రసములచే నూరుసారులు భావనచేసి వల్లప్రమాణము, పంచదార, తిప సత్తు నెయ్యి, వీటితో పుచ్చుకొనిన, రక్తపిత్తము, ఇరవైప్రమేహ ములు, కఠినమైన మూత్రకృచ్ఛ్రము, మధుమేహము, వీర్యనష్టము, శ్వేతప్రదరము, రక్తప్రదరము, సర్వపైత్యములను హరించును.

# తాలకభస్మయోగమ్.

శ్లో॥ అపామార్గస్య భస్మానిఘటేనిక్షిప్యయత్నతః । తన్మధ్యే తాలకం క్షిప్త్వాపచేద్ద్వాదశయామకం । ధవలం జాయతేభస్మ సర్వ కుష్ఠ నివారణం । సర్వవాత ప్రశమనం సర్వరోగ నివారణం॥

వ్యా॥ ఉత్తరేణి బూడెదను కుండయందుంచి ఆబూడిద మధ్యయందు, శు. తాళకము,వుంచి 12 ఝాములవండిన తెల్లగ భస్మఅవును.ఇది సమస్తకుష్ఠువులను, సమస్త వాతములను, సమస్త రోగములను, నివారింపజేయును.

# క్షయకుఠారం

శ్లో॥ శుద్ధసూతం విషంగంధం అభ్ర తామ్రమవరాటకం । ప్రవా లతార భస్మంచ లోహ మండూరటంకణం । మాక్షికం నాగవంగంచ భస్మితం మౌక్తికాంతకం । ఏ తేషాం సమభాగంచ ఖల్వమధ్యే వినిక్షి పేత్ । వర్షాభూమూలసారేణ వజ్రవల్లీరసేనచ । పీలూచిత్రరసేనైవ హంసపాదిరసైస్తథా । గుడూచీ భృంగరాజంచ నాగవల్లీచ కుండలీ ఏ తేషాంచ రసేనాపి పృథగ్యామంవి మర్దయేత్ । శరావసంపుటేనైవ కుక్కుటీ పుటపాచితం । సాంగశీతల ముద్ధృత్య ఖల్వమధ్యే వినిక్షిపేత్ । శిగ్రుమూల రసేనైవదినైకం మర్దయేద్దృఢం । గులికాన్కారయిత్వాథ ఛాయాశుష్కాఞ్చకారయేత్ । తత్తద్రోగాను పానేన దేయంగుంజాచ తుష్టయం । తువరీముద్గయూషంచ తండులీయకమేవచ ! గోక్షీరం

చక్రవర్తించ అళర్కంచ అజాపయః । గోఘృతంమధుతక్రంచ సైంధవం లవణం భిషక్ । తథాపురాణశాలించ దీయతే యత్ర యత్నతః । క్షయం క్షయ కృతాన్ వ్యాధీన్ అకస్థిజ్వరనాశనం । వాతపిత్తహరం చైవపాండుగుల్మకఫాపహం । సద్యఃక్షయకుఠారోయం పూజ్యపాదేన నిర్మితం॥

వ్యా॥ శు. పాదరసము- శు. నాభి- శు. గంధకము- అభ్రకభస్మ- తామ్రభస్మ గవ్వలభస్మ- పగడభస్మ- వెండిభస్మ- ఖడ్గలోహభస్మ- మాండూరభస్మ- శు. టంకణము- హేమమాక్షికభస్మ- నాగభస్మ- వంగభస్మ- ముత్యభస్మ- కాంతభస్మ- ఇవి సమభాగములు ఖల్వమందుంచి గలిజేరు వేళ్ళు- నల్లేరు- వరగోగు- చిత్రమూలము హంసపాది- తిప్పతీగ- గుంటగలగర- తమలపాకులు- ఉప్పి- వీట్లయొక్క రసము లచే ప్రత్యేకముగా వక్కొక్కఝాముమర్దించి శరావ సంపుటమందుంచి కుక్కుటపుటం వేసి సాంగశీతలమునతీసి ఖల్వమందుంచి మునగవేళ్ళరసముచేవకరోజు దృఢముగా మర్దించి మాత్రలుచేసుకొని నీడనుఎండించి ఆయా రోగానుసారముగ అనుపాన భేద ములతో యిస్తూ కందికట్టు- పెసరకట్టు- చిర్రికూర- ఆవుపాలు- చక్రవర్తికూర- అలర్కము- మేకపాలు- ఆవునెయ్యి- తేనె- ఆవుమజ్జిగ- సైంధవలవణము- పాతవరి బియ్యము- ఇవి పథ్యముగా యిచ్చుచుండిన- క్షయ- క్షయవలన వచ్చిన వ్యాధులు- అస్థికజ్వరము- వాతవ్యాధులు- పైత్యవ్యాధులు- పాండువు- గుల్మము- శ్లేష్మవ్యాధులు- వీటిని వెంటనే హరించును. ఈక్షయకుఠారము పూజ్యపాదునిచే నిర్మింపబడినది.

## మహాక్షయకుఠారం

శ్లో॥ స్వర్ణం తాలం తామ్రలోహం నాగం వంగంచ మౌక్తికం। మాణిక్యం విద్రుమం నాభిస్సూత భస్మ సమాంశకం । గంధకం పంచ భాగాని అభ్రకం త్రీణిభాగకం। అహిఫేనం చతుర్భాగంచతుర్భాగంచ చిత్రకం । లవంగం పిప్పలీమూలం ప్రత్యేకం పంచభాగకం । మరీచం పిప్పలీచైవ ప్రత్యేకం ఏకభాగకం । ప్రత్యేకం త్రిదినం మర్ద్యం దత్తూర విజయారసైః । చతుర్దినం పచేదగ్నౌ వాలుకాయంత్ర యోగతః । ద్విగుంజం మధుసర్పిభ్యాం లవంగే నచదీయతాం । వాతశ్లేష్మం యక్ష్మ శూలం పాండురోగ మజీర్ణజిత్ । మహాక్షయ కుఠారోయం గౌరీనాథ ప్రకల్పితః॥

వ్యా॥ సువర్ణభస్మ 1 భా. వెండిభస్మ 1 భా. తామ్రభస్మ 1 భా. లోహభస్మ 1 భా సీసభస్మ 1 భా. వంగభస్మ 1 భా. ముత్యభస్మ 1 భా. మాణిక్యభస్మ 1 భా. పగడభస్మ 1 భా. శు. నాభి 1 భా. రసభస్మ 1 భా. శు. గంధకము 5 భా. అభ్రకభస్మ 3 భా. శు, నల్లమందు 4 భా. చిత్రమూలము 4 భా. లవంగములు 5 భా. మోడి 4 భా. మిరియాలు 1 భా. పిప్పళ్ళు 1 భా. వీటిని ఖల్వమందుంచి ఉమ్మెత్త, గంజాయి, వీటిరసములచే ప్రత్యేకముగా మూడురోజులు మర్దించి వాలుకా యంత్ర మందు నాలుగురోజులువండి తీసి రెండుగురివింద గింజల ప్రమాణము, తేనె, నెయ్యి, లవంగకషాయము, వీటితోయిచ్చిన వాతవ్యాధులు, శ్లేష్మవ్యాధులు, రాజయక్ష్మ, శూల, పాండురోగము, అజీర్ణము, వీటిని జయించును. ఈమహాక్షయకుఠారము గౌరీనాథునిచే కల్పింపబడినది.

# మహాక్షయ కుఠారం (ప్రకారాంతరం)

శ్లో॥ లోహభస్మ తామ్రభస్మ వైక్రాంతం కాంతమభ్రకం । నాగం వంగంచ మాండూరం శంఖశుక్తీ వరాటకం ।పారదం గంధకం చైవతాళకంచ మనశ్శిలా । సువర్ణం రజతంచైవ ప్రత్యేకంచ సమం సమం । కుమారీరససంమర్ద్యం కాచకుప్యంతరే క్షిపేత్ । పాచయే ద్వాలుకాయంత్రే క్రమాగ్నౌ యామయుగ్మకం । రక్తచిత్రక మూలం చ వ్యాఘ్రీకంద దురాలభా । కన్యా భృంగీ కాకమాచీ నిర్గుండీచ కురంటకా । వాసాముండీ కాకజంఘానీలీ నింబపటోలకం । ఏభిర్ద్రావం పృథక్ మర్ద్యం భావయేచ్చపునఃపునః । మహాక్షయ కుఠారో యంసర్వ రోగ నిబర్హణం । క్షయం కాసం జ్వరం శ్వాసం శోఫం పాండుంచ పీనసం । మందాగ్నిం తిమిరం వాతం మేహక్షయవినాశనం । కఫజా న్వివిధాన్ రోగాన్ అజీర్ణం గుల్మమేవచ । సర్వరోగహరం శీఘ్రం ఆత్రేయముని భాషితం॥

వ్యా॥ లోహభస్మ, తామ్రభస్మ, వైక్రాంతభస్మ, అభ్రకభస్మ, నాగభస్మ, వంగభస్మ, మాండూరభస్మ, శంఖభస్మ, ముత్యపుచిప్పలభస్మ, గవ్వలభస్మ, శు, రసము, శు. గంధకము, శు. తాళకము. శు. మనశ్శిల, సువర్ణభస్మ, రజతభస్మ, ఇవిసమ భాగములు, కలుబందరసముచే మర్దించి కాచకుప్పెయందుంచి వాలుకాయంత్రమందు క్రమాగ్నిచే రెండుఝాములువండి తీసి ఎర్ర చిత్రమూలము వాకుడు, అడవికంద, దూలగొండి, కలబంద, గుంటగలగర, కాచికూర, వావిలి, గోరింట, అడ్డసరము, బోడసరము, వెలుమసంధి, నీలి, వేప, చేదుపొట్ల, వీటిరసములచే ప్రత్యేకముగా

వకొ్కక్కఝాము మర్దించి మరలమరల భావనచేయుచుండవలెను. ఈమహాక్షయ కుఠారము, సర్వరోగములను నశింపజేయును. మరియు క్షయ, కాస, జ్వరము, శ్వాస, నంజువ్యాధి, పాండువు, జలుబు, అగ్నిమాంద్యము, తిమ్మిర్లు, వాతవ్యాధులు, మేహక్షయ, సమస్తమైన శ్లేష్మవ్యాధులు, అజీర్ణము, గుల్మము, వీటిని సర్వవ్యాధులను, వెంటనేహరించును. ఇది అత్రేయ మునిచే చెప్పబడినది.

## అర్శః కుఠారం

శ్లో॥ శుద్ధసూతం పలైకంతుద్విపలం శుద్ధగంధకం । మృతం తామ్రం మృతం లోహం ప్రత్యేకంచ పలత్రయం । త్ర్యూషణం లాంగలీదంతీ చిత్రకం పీలుకం తథా । ప్రత్యేకం ద్విపలం యోజ్యం యవక్షారంచ టంకణం । ఉభేపంచపలే యోజ్యే సైంధవం పలపంచకం । ద్వాత్రింశత్పల గోమూత్రం స్నుహీక్షీరంచ తత్సమం । మృద్వగ్నినాపచే త్సమ్యక్ స్థాల్యాం యావత్సు పిండితం । మాషద్వయం సదా ఖాదేద్ర సోహ్యర్శః కుఠారకః ॥

వ్యా॥ శు. రసము, 1 పలము, శు.గంధకము, 2 పలములు. తామ్రభస్మ, 3 పలములు. లోహభస్మ, 3 పలములు. త్రికటుకములు, చెన్నచర్లగడ్డ శు. నేపాళములు, చిత్రమూలము వరగోగు, ఇవి ప్రత్యేకముగా రెండేసి పలములు. యవక్షారము పొ, వెలిగారము ఇవి 5 పలములు. సైంధవ లవణము 5 పలములు. గోమూత్రము 32 పలములు. జెముడుపాలు 32 పలములు వీటి నన్నిటిని కలిపి కుండయందు చిన్నమంటచే ముద్దయగువరకు బాగుగ వండుకుని రెండు మాషముల ప్రమాణము ఎల్లప్పుడు సేవింపు చుండిన ఈ అర్శః కుఠార రసము, సమస్త అర్శస్సులను ఖండించును.

## శుద్ధామృత రసం

శ్లో॥ పారదంచ క్రియాశుద్ధం తత్తుల్యం శుద్ధగంధకం । అభ్రకంతు ద్వయోస్తుల్యం త్రిభిస్తుల్యస్తు గుగ్గులుః । సర్వాంశ మమృతా సత్వం భావయే ద్దాపద్రైః పృథక్ । నిర్గుండీ గోక్షుర ఛిన్నా కోకిలాక్షాంఘ్రిజై రసైః । సప్తవారంతతో యుంజ్యాద్వాత రక్తేతి వల్లకం । కోకిలాక్షస్య మూలానాం కషాయ మనుపాయయేత్ ॥

వ్యా॥ శు. రసము, 1 భా. శు. గంధకము, 1భా. అభ్రకభస్మ, 2 భా. శు మహిసాక్షి గుగ్గులు, 4 భా. తిప్పసత్తు, 8 భా. ఇటుల వీనిని, వావిలి, పల్లేరు, తిప్ప తీగ, నీరుగొలిమిడి వేళ్లు వీటి రసములచే ప్రత్యేకముగా ఏడేసి సారులు భావనచేసి మూడువల్లముల ప్రమాణము నీరు గొలిమిడి యొక్క వేళ్ల కషాయముతో వాతరక్త మందు యివ్వవలయును.

# అర్శోలేపం

శ్లో॥ గౌరీ పాషాణైక కర్షం స్నుహీకాండేవినిక్షిపేత్ । పాచ యేత్పుట పాకేన తత ఉద్ధృత్య యత్నతః । రేవానీచ కుష్ఠంచ కల్కీ కృత్యత్రయం సమం। లేపయేత్తేన చార్శాంసి నివార్యం తేన సంశ యః ॥

వ్యా॥ గౌరీపాషాణము వక కర్ష ప్రమాణము జెముడుకాడ యందుంచి పుట పాకముగా పచనము చేసుకుని తీసి, రేవల్చిన్ని, చెంగల్వకోష్టు, ఇవి ప్రత్యేకముగా పాషాణముతో సమముగా చేర్చి మూడింటిని కల్కము చేసుకుని లేపనము చేసిన మూలవ్యాధులు తప్పక నివారించును.

# క్షయగజ కేసరిరసం

మృతమభ్రం మృతం సూతం మృతం లోహంచ తామ్ర కం। మృతం నాగం మృతం కాంస్యం మండూరం విమలంమృతం। వంగం ఖర్పకం తాలం శంఖంటంకణమాక్షికం। మృతం స్వర్ణంమృతం కాంతం వైక్రాంతం మౌక్తివిద్రుమం।వరాటం మనశ్శిలాం చరాజపట్టం చగంధకం। సర్వమేకత్ర సంమిశ్ర్య ఖల్వమధ్యే వినిక్షిపేత్ । మర్దయే దగ్నిభాను భ్యాం ప్రపుటే త్త్రిదినంలఘు। భావయేన్మర్ద యేదేభి ర్ద్రావైరాం ప్రస్రైశ్చపృథక్ పృథక్ । మాతులుంగవరావహ్ని స్వామ్లవేతస మార్కవైః । హయమారార్ద్రి కరసైః పాచితో లఘువహ్నినా । వాతపిత్త కఫోత్థా శాన్ జ్వరాన్ సమ్మర్ది తానపి । సన్నిపాతం నిహం త్యాశు సర్వాంగైకాంగమారుతాన్ । క్షయమేకాదశ విధం శోషం పాండుం కృమింజయేత్ । కాసం పంచవిధం శ్వాసం మేహామే ద్రోమ.

హోదరం। అశ్మరీం శర్కరాం శూలం ప్లీహగుల్మం హలీమకం। సేవితంచసితాయుక్తం మాగధీ రజసాయుతః। మధుకార్ద్రకసం యుక్తం తత్త్వ్యాధి హరణౌషధైః। సర్వవ్యాధి హరోబల్యో వృష్యో మేధ్యో రసాయనః। క్షయగజ కేసరీయం బ్రహ్మణా నిర్మితాపురా॥

వ్యా॥ అభ్రకభస్మ రసభస్మ, లోహభస్మ, తామ్రభస్మ, సీసభస్మ, కంచభస్మ, మండూరభస్మ, విమలభస్మ, వంగభస్మ, శు. కపరి, శు. తాళకము. శంఖభస్మ, శు. టంకణము, హేమమాక్షిక భస్మ, బంగారభస్మ, కాంతభస్మ, వైక్రాంతభస్మ, ముత్యభస్మ, పగడభస్మ గవ్వలభస్మ, శు. మణిశిల, శు. పాషాణము, శు, గంధకము. ఇవి సమభాగములు. కలిపి ఖల్వమందుంచి చిత్రమూలము, జిల్లేడు, వీటిరసములచే మర్ధించి మూడురోజులు లఘుపుటమువేసి తీసి, మాదీఫలము, నేలతాడి, చిత్రమూలము. అమ్లవేతసము, గుంటగలగర, గన్నేరు, అల్లము, వీటిరసములచే ప్రత్యేక ప్రత్యేకముగా మూడురోజులు భావనయును. మర్దనమును చేసుకుని మందాగ్నిచే వండుకొని, పంచదార, పిప్పలిచూర్ణము, తేనె, అల్లపురసము, వీటితో సేవించిన, వాత పిత్త కఫలముల వలన పుట్టినజ్వరములు, సన్నిపాతము, సర్వాంగవాతము, ఏకాంగ వాతము, పదకొండుక్షయలు, కృశించట, పాండువు, కృమివ్యాధులు, దగ్గు అయిదు విధములైన శ్వాసలు, మేహములు, మేదోవ్యాధులు, మహోదరము, అశ్మరి, శర్కరా శూల, ప్లీహ, గుల్మము, హలీమకము, వీటిని హరించును. ఆయావ్యాధి నాశక అను పానములతో సర్వవ్యాధులను హరించును. బలమును వీర్యవృద్ధిని చేయును. జ్ఞాపకశక్తిని హెచ్చించును. ముసలితనమును వ్యాధులను నశింపజేయును. ఈ క్షయ గజకేసరి పూర్వమందు బ్రహ్మచే నిర్మింపబడినది.

# కీటమర్ద రసమ్ (కృమిముద్గర రసం)

శ్లో॥ శుద్ధసూతం శుద్ధగంధ మజమోదా విడంగకం। విషముష్టి ర్బ్రహ్మబీజం క్రమాదత్తార్ధ్వ గుణంభవేత్। చూర్ణయేన్మధునాలేహ్యాం నిష్కైకం జంతుజిద్భవేత్। కీటమర్దరసో నామముస్తాతోయం పిబేదను॥

వ్యా॥ శు.రసము 1 భా, శు.గంధకము 2 భా, వాము 3 భా, వాయువిడంగములు, 4 భా, శు విషముష్టి 5 భా, మోదుగవిత్తులు 6 భా, ఇటుల వీనినెల్ల చూర్ణముచేసి నిష్కప్రమాణము తేనెతో పుచ్చుకుని తుంగగడ్డల కషాయమును త్రాగిన ఈ కీటమర్దరసము, కృములను నశింపజేయును.

# స్మృతిసాగర రసం

శ్లో॥ రసగంధక తాలానాం సశిలాతామ్ర భస్మనాం। శుద్ధానాం మూర్ఛితానాం చచూర్ణం భావ్యం వచాశృతైః। ఏకవింశతిధా పశ్చాద్బ్రాహ్మీవారా తథైవచ। కటభీబీజతైలేనభావయేదేక వారకం। స్మృతిసాగర నామాయం రసో పస్మారనాశనః। సర్పిషా మాష మాత్రోయం భుక్తోహన్యా దపస్మృతిం॥

వ్యా॥ శు.రసము, శు.గంధకము, శు.తాళకము, శు.మణిశిల, తామ్రభస్మ, ఇవి సమభాగములు, వస కషాయముచే 21 సారులును, సరస్వతీ ఆకురసముచే 21 సారులును, జ్యోతిష్మతీ తైలముచే 1 సారియును భావనచేసుకనిన (స్మృతి సాగరరస మనబడును. ఇది మాషప్రమాణము నెయ్యితో పుచ్చుకనిన అపస్మారమును హరించును.

# శ్వాసకాసక్షయ మత్తగజకేసరిరసం

శ్లో॥ రసం విషం చాభ్రతాలం గంధకం టంకణం శిలా। గరలందరదం తుత్థం నిర్విషం విషబీజకం। తీక్ష్ణం తామ్రమయోభస్మ వంగం నాగంచ కాంస్యకం। వైక్రాంతం కాంతవిమలం మనశ్శిల వరాటకం। మృతం రౌప్యం మృతం స్వర్ణం మృతం మౌక్తిక విద్రుమం। మాణిక్యం గారుడం నీలంగోమేధం పుష్యరాగకం। వైడూర్యం వజ్రభస్మం చ సమభాగాని కారయేత్। బృహతీక్షుర గోక్షూర ముండీ మర్కట భృంగకైః। నిదిగ్ధికామృతావాసావిషముష్టి కషాయకైః। పృధక్ పృధక్ దినం భావ్యం కాచకుప్యంత రేక్షిపేత్। తామ్రోదరే చవిక్షిప్తం మృదాసం లేపయేద్బహిః। వాలుకాయంత్రకే పాచ్యం తియామం మందవహ్నినా। స్వాంగశీతల ముద్ధృత్య ఖల్వమధ్యేవినిక్షిపేత్। వాసానిర్గుండి క్వాథేన బృహతీత్రయ క్వాథకైః। చిత్రమూల కషాయే... కంటకార్యా, పృధక్ పృధక్। కాసఘ్నమూల క్వాథేన ముండీ క్వాథేన మర్దయేత్। పృధక్క్వాథైర్దినం భావ్యం ఏభిస్సమం మరీచకం। అనుపానవిశేషేణ శ్లేష్మజ్వర వినాశనం। క్షుద్రశ్వాసం

మహాశ్వాసం తమకం చోర్ధ్వశ్వాసకం । ఛిన్నశ్వాసం చపంచైతాన్ సర్వశ్వాసాన్ హరం పరం । కాసం పంచవిధాన్ హిక్కాన్ హృద్రోగం పీన సంతతః । క్షయం ఏకాదశం హంతి శ్లేష్మరోగం మహాభయం తిమిరంచ తథాశూలం వాతవ్యాధి వినాశనం । పాండుం శోఫంచ వివిధం జీర్ణజ్వర మజీర్ణకం । అనుపాన విశేషేణ మహారస ప్రభావతః । బహురోగహరం శ్రేష్టం విద్యతేనాత్ర సంశయః । నామ్నా శ్వాస కాసక్షయ మత్తగజకేసరీయం । లోకోపకరణార్థాయ శంభువానిర్మితాపురా॥

వ్యా॥ శు. రసము, శు. నాభి, అభ్రకభస్మ, శు. తాలకము, శు. గంధకము, శు. వెలిగారము, శు. పాషాణము, గరళము, శు. ఇంగిలీకము, శు. మైలతుత్థం, శు. విషముష్టి గింజలు, ఖడ్గలోహభస్మ, తామ్రభస్మ, ఇనపభస్మ, వంగభస్మ, సీసభస్మ, కంచుభస్మ, వైక్రాంతభస్మ, విమలభస్మ, శు. మణిశిల గవ్వలభస్మ, వెండిభస్మ, బంగారుభస్మ, ముత్యభస్మ, పగడభస్మ, కెంపులభస్మ, పచ్చలభస్మ, నీలభస్మ, గోమేధికభస్మ, పుష్యరాగభస్మ, వైడూర్యభస్మ, వజ్రభస్మ, ఇవి సమభాగములు ఖల్వమందుంచి, వావుడు, గొబ్బి, పల్లేరు, బోడతరము, దూలగొండి, గుంటగలగర, నేలములగ, తిప్పతీగె, అడ్డసరము, ముషిణిగింజలు, వీటి రసములచే ప్రత్యేకము వక్కొక దినము భావనజేసి మట్టిచే పూయబడిన కాచకుప్పెయందుపోసి తామ్రపాత్రయందుంచి కాచకుప్పెచుట్టును ఇసుకపోసి మందాగ్నిచే మూడు ఝాములు వండి స్వాంగశీతలమునతీసి ఖల్వమందుంచి, అడ్డసరము, వావిలి, చిన్నములగ, నేలములగ, పెద్దములగ, చిత్రమూలము, పల్లేరు, కసివింద, బోడసరము, వీటిచే ప్రత్యేకముగా వక్కొకరోజు మర్దనయు, భావనయు, చేసుకుని తయారు చేసుకొని సమానముగా మిరియాల చూర్ణము కలుపుకుని అనుపాన విశేషములచే యిచ్చిన, శ్లేష్మజ్వరము, క్షుద్రశ్వాస, మహాశ్వాస, తమకశ్వాస, ఊర్ధ్వశ్వాస, ఛిన్నశ్వాస, దగ్గు, అయిదు విధములైన ఎక్కిళ్ళు, హృద్రోగము, జలుబు, ఏకాదశక్షయలు, సమస్తమైన భయంకరమైన శ్లేష్మవ్యాధులు, తిమిరవాతము, శూల, సమస్తమైన వాతవ్యాధులు, పాండువు, అన్నివిధములైన నంజులు, జీర్ణజ్వరము, అజీర్ణము, వీటిని అనుపాన విశేషముచేతను, మహారసమగుటచేతను, సర్వరోగములను హరించును. ఈ శ్వాస కాసక్షయకేసరి లోకోపకారార్థము పూర్వమందు విష్ణువుచే నిర్మింపబడినది.

## అజీర్ణ బడబానల రసం

శ్లో॥ ద్విపలం శుద్ధసూతం చగంధ కంచ సమం మతం । లోహం తామ్రం హరితాలం విషం తుత్థం సవంగకం । శల్లప్రమాణంచ పృథక్ప్ల

వంగం టంకణం తథా । దంతీమూలం త్రివృచ్చూర్ణ మేకైకం పలసమ్మితం । అజమోదాయవానీచ ద్విక్షారలవణానిచ । పృథగ్గర్ధఫలం గ్రాహ్యమేకీకృత్యచ భావయేత్ । ఆర్ద్రికస్యరసేనైవ వింశతిః పంచకోలజైః । దశధా భావయేత్తోయైర్గుడూచీనాం రసైర్దశ । సర్వార్థం మరిచందత్వా కాచకుప్యాంచధారయేత్ । చణమాత్రాం వటీం కృత్వా ఛాయాయాం పరిశోషయేత్ । ఏషప్రకీర్తితోరసః అజీర్ణబడబానలః । అనేక కాలనష్టాగ్నేర్దీపనః పరమః స్మృతః । ఆమవాతకులధ్వంసీ ప్లీహాపాండు గదాపహః । ప్రమేహానాహవిష్టంభ సూతికాగ్రహణీ హరః । శ్వాసకాస ప్రతిశ్యాయ యక్ష్మక్షయ వినాశనః । అమ్లపిత్తంచ శూలంచ భగందర గుదోద్భవా । అష్టాదరాణిప్లీహంచ యకృతం హంతిదారుణాం । ఆకంఠం భోజయిత్వాతు ఖాదయేచ్చరసోత్తమం । అర్ధయామేన తత్సర్వం భస్మీభవతి నిశ్చితం । చతుర్విధరసోపేతం మహాభోజన మిచ్ఛతః । భోజస్య నృపతేః కాంక్షా భోజనే కృపయాకృతః । గహనానందనాథేనసర్వలోక హితైషిణా ॥

వ్యా॥ శు. రసము, శు. గంధకము, ఇవి రెండేసి పలములు, లోహభస్మ, తామ్రభస్మ, శు. తాళకము, శు. నాభి, శు. మైలతుత్థము, వంగభస్మ, లవంగములు, పొ వెలిగారము, శు నేపాళములు, తెగడ, ఇవి వక్కొక్క పలము, ఓమము, కురాసానివాము, సర్జక్షారము, యవక్షారము, పంచలవణములు, ఇవి వక్కొక్కటి అర్ధపలము, వీటినన్నిటిని కలుపుమని, అల్లపు రసముచే 20 సారులు, పంచకోల కషాయముచే 10 సారులు, తిప్పతీగ రసముచే 10 సారులు, భావనజేసి, ఈ మందునకు సగము మిరియపు చూర్ణము కలిపి సెనగ గింజలంత మాత్రలు చేసి నీడను ఎండించి సీసాయందుంచుమని సేవించిన ఈబడబానల రసము, చిరకాలముగ నుండు అగ్నిమాంద్యము, ఆమవాతము, ప్లీహ, పాండువ్యాధి, ప్రమేహములు, ఆనాహము, మలబద్ధము, సూతికావ్యాధులు, గ్రహణి, కాస, శ్వాస, జలుబు, రాజయక్ష్మ, కృశించుట, అమ్లపిత్తము, శూల, భగందరము, మూలవ్యాధి, ఎనిమిది విధములైన ఉదరవ్యాధులు, దారుణమైన, యకృద్వ్యాధులు, ప్లీహవ్యాధులు, వీనిని హరింపజేయును. మరియు కంఠము పర్యంతము భుజింపజేసి ఈమందును యిచ్చిన అర్ధఝామునకు ఆభోజనమంతయు జీర్ణమగును, చతుర్విధరసోపేతమైన భోజనమందిచ్చగల భోజమహారాజునకు యిష్టమునుగా భోజనమందిచ్చ కలుగుటకై సర్వలోక హితమును గోరిన గహనానందనాథునిచే ఈమందు దయతో చెప్పబడెను.

## ఛర్దిరిపురసం.

శ్లో॥ మనశ్శిలామాగధి కోషణానాం చూర్ణం కపిత్థా మ్లరసే నయుక్తం । లాజైః సమాంశైర్మధునావలీఢం ఛర్దిం ప్రసక్తామన కృన్ని హంతి॥

వ్యా॥ శు. మణిశిల, పిప్పళ్ళు, మిరియాలు, ఇవి సమభాగములు వెలగపండ్ల రసముచే కలుపుమని, వీటికి సమానము పేలాలు కలుపుమని నూరుమని తేనెతో పుచ్చుమనిన తరుచువచ్చే వాంతిని హరించును.

## అరోచకరిపురసం.

శ్లో॥ సూతగంధా భ్రమగధామ్లికామరిచ సైంధవైః । గుటికా రోచకహారీ జిహ్వావదన శుద్ధికృత్॥

వ్యా॥ శు. రసము, శు. గంధకము, అభ్రకభస్మ, పిప్పళ్లు, చింతపండు, మిరియాలు, సైంధవలవణము, ఇవి సమభాగములు గ్రహించి మాత్రలు చేసుమని సేవించిన అరోచకమును పోగొట్టి, నాలుకకు నోరునకు శుభ్రమును కలుగ చేయును.

## వాసాసూతం.

శ్లో॥ ఆటరూష నవపల్లవద్రవేపా లి కేసరసభస్మ వల్లకం । కర్ష సంమితమధు ప్రయోజితం ప్రాశ్యనాశయతి రక్తపిత్తకం॥

వ్యా॥ అడ్డసరపు లేతచిగుళ్ళయొక్క ఒకపలము రసమందు ఒకవల్ల ప్రమాణము రసభస్మకలిపి, కర్షప్రమాణము తేనె కలిపి సేవించిన రక్తపిత్తమును నశింప జేయును.

## త్రిభువన కీర్తిరసం.

శ్లో॥ హింగులంచ విషంవ్యోషం టంకటం మాగధీ శిఫాం । సంచూర్ణ్య భావయేత్త్రేధా సురసార్ద్రిక హేమభిః । రసస్త్రిభువన క్కీర్తిర్గుంజై కార్ద్రిరసేనవై । వినాశయే జ్జ్వరాన్సర్వాన్సన్ని పాతాంస్త్ర యోదశ॥

వ్యా॥ శు. ఇంగిలీకము, శు. నాభి, త్రికటుకములు, శు, టంకణము, మోడి. ఇవి సమభాగములు చూర్ణముచేసి, తులసి, అల్లము, ఉమ్మెత్త వీటి రసములచేమూడే:

సారులు భావనచేయవలయును. ఈ త్రిభువన కీర్తిరసము, అల్లపురసముతో గుంజా ప్రమాణము యిచ్చిన, సమస్తజ్వరములను, పదమూడు సన్నిపాతములను హరించును.

## క్రవ్యాదరసం (క్రవ్యాది లేక రసక్రవ్యాది)

శ్లో॥ ద్విపలం గంధకం శుద్ధం ద్రావయిత్వా వినిక్షిపేత్ । పారదంపలమానంతు మృతశుల్బాయసీ పృథక్ । పలార్ధమానే సంమిశ్ర్య పంచాంగుల దలేక్షిపేత్ । తతోవిచూర్ణ్య యత్నేనలోహపాత్రే విచక్షణః । నిధాపయే ద్రసం తత్ర జంబీరస్య పలం·శతం । వస్త్రపూతం తతఃకృత్వా లోహపాత్రే వినిక్షిపేత్ । మృద్వగ్నినాపచేత్తత్ర దర్వ్యా సంచాలయేన్ముహుః । సంచూర్ణ్య పంచకోలోత్థైః కషాయై స్సామ్లవేతసైః । భావనాఃకిలదాతవ్యాః పంచాశత్ప్రమితాః పృథక్ । భృష్టటంకణ చూర్ణేన తుల్యేనసహ మేలయేత్ । తదర్ధం కృష్ణలవణాం మరిచంసర్వతుల్యకం । సప్తధాభావయే త్పశ్చాచ్చణ కక్షారవారిణా । తతస్సంశోష్య సంపిష్య కూప్యాశ్చ జఠరేక్షిపేత్ । అత్యర్థం గురుమాంసాని గురుభోజ్యాన్యనేకశః । భుక్త్వాచా కంఠపర్యంతం చతుర్వల్లమితోరసః । పట్వమ్లతక్రసహితః పీతమాత్రోహిపాచయేత్ । పునర్భోజయతిక్షిప్రంకా పునర్మందవహ్నితాం । రసః క్రవ్యాదనామాయంప్రోక్తం మంథాన భైరవైః । సింహలక్ష్మోణి పాలస్యభూరిమాంసప్రియస్యచ ।దిష్టం భోజన కామస్య భైరవానంద యోగినా । కుర్యాద్దీపన మూర్ధ్వజత్రుగద హృద్దుష్టామసం శోధన స్తుందస్థౌల్య నిబర్హణో మదహరః శూలార్తిమూలాపహః । గుల్మప్లీహ వినాశకో బహురుజాం విధ్వంసనో వాతహావాత గ్రంధిమహోదరాప హరణఃక్రవ్యాదనామారసః॥

వ్యా॥ శు. గంధకము 2 పలములు కరగించి అందు శు. పాదరసము 1 పలము, తా మ్రభస్మ ½ పలము. లోహభస్మ ½ పలము వీటిని మిశ్రమముచేసి ఆముదపుఆకు యందుపోసి పిదప లోహపాత్రయందు నూరినూరుపలములనిమ్మకాయల రసముపోసి వడపోసుకుని లోహపాత్రయందుంచుకుని గరిటెతో త్రిప్పుచునుచు మందాగ్నిచే పచించుకుని పిదపచూర్ణము చేసుకుని పిప్పళ్ళు, మోడి, చవ్యము, చిత్రమూలము, శుంఠి, అమ్లవేతసము, వీటికషాయములచే ప్రత్యేకముగా ఏబది భావనలుచేసుకుని పొంగించిన

వెలిగార చూర్ణము 4 పలములు కృష్ణలవణము 2 పలములు, మిరియాలచూర్ణము, 10 పలములు కలుపుకుని సెనగపులుసు చేఏడుసారులు భావనచేసుకుని ఎండించుకునినూరుకుని సీసాయందుంచుకునవలెను. గురుమాంసములనుఎక్కువగను అనేకవిధములైనభక్ష్యములను కంఠపర్యంతము భుజించి సైంధవలవణము పుల్లటిమజ్జిగ వీటితోఈమందును నాలుగువల్లముల ప్రమాణము సేవించిన పుచ్చుకునిన వెంటనేవాటిని పచింపజేయును. మరలవెంటనే భోజనము కావలసివచ్చును. ఇట్లుండ అగ్నిమాంద్యము నశింపజేయు విషయమై ఏమిచెప్పవలయును? మంథాన భైరవులచే నిర్మింపబడిన ఈక్రవ్యాదరసము ఎల్లప్పుడును విశేషము మాంసమును భుజించుస్వభావము కలిగినట్టియు భోజనప్రియుడైనట్టియు సింహాలద్వీపపు రాజునకు భైరవానందయోగిచే చెప్పబడినది. ఇది అగ్నిదీపమును చేయును. మరియు ఊర్ధ్వ జత్రుగతవ్యాధులను, దుష్టమైన ఆమమును, కడుపు పెరుగుటను, స్థౌల్యమును, మదమును, శూలను, మూలవ్యాధిని, గుల్మమును, ప్లీహమును, అనేకవ్యాధులను, వాతగ్రంథులను. మహోదరమును, హరించును.

నో- తామ్రభస్మ, 1 పలము. లోహభస్మ, 1 పలము, తామ్రభస్మ 1 కర్షము, లోహభస్మ, 1 కర్షము, అనియు పాఠభేదములు, కలవు ఈభాగములను అనుసరించి టంకణము, మొదలగు వాటియొక్క భాగములు మార్చుకొనవలెను. తదర్ధపంచలవణైః, టంకణమునకు సగభాగము పంచలవణములు, అని యోగాంతర మందు కలదు విశ్వహింగు బిడైస్సార్ధం క్రవ్యాదో భక్షితోరసః గుల్మాన శేషాన్ ప్లీహానం విద్రధీన పినాశయేత్॥ శుంఠి, ఇంగువ, బిడాల లవణము, వీటితో క్రవ్యాదరసమును సేవించిన సమస్తగుల్మములను, ప్లీహవ్యాధులను, విద్రధులను, నశింపజేయును, అనియు కూడ పుస్తకాంతరమందు కలదు.

# లఘుక్రవ్యాదరసం.

శ్లో॥ పారదాద్ద్విగుణం గంధం గంధాంశం మృతలోహకం। పిప్పలీ పిప్పలీమూల మగ్ని శుంఠీ లవంగకం। లోహసామ్యం పృథక్కుర్యాద్రస సామ్యంసు వర్చలం। టంకణం మరిచం చాపి గంధతుల్యం ప్రదాపయేత్। ఏతద్విచూర్ణ్య యత్నేన భావయేత్సప్త ధామ్లకైః। ఏతద్రసాయనం శ్రేష్ఠం మాషమాత్రం ప్రదాపయేత్। తక్రేణ కేవలం వాపిదద్యాద్భోజన పాచనే। క్షిప్రంతజ్జీర్యతే భుక్తం దీపనం భవతి ధ్రువం। సర్వాజీర్ణ ప్రశమనం లఘుక్రవ్యాద సంజ్ఞితం॥

వ్యా॥ శు. పాదరసము, 1 భా. శు గంధకము, 2 భా. లోహభస్మ, 2 భా. పిప్పళ్లు, 2 భా. మోడి 2 భా. చిత్రమూలము, 2 భా. శుంఠి, 2 భా లవంగములు, 2 భా. సౌవర్చలవణము, 1 భా. ఫా, టంకణము, 2 భా. మిరియాలు, 2 భా. వీటిని

నూరి అమ్లవర్గముచే ఏడుసార్లు భావన చేయవలెను. ఇది శ్రేష్ఠమైన రసాయనము, మజ్జిగతోగాని విడిగా గాని మాషప్రమాణము యిచ్చిన భోజనమును పచింపజేయును. భుజించిన పదార్థము వెంటనే జీర్ణమగును. అగ్నిదీప్తి కలుగును. సమస్తమైన అజీర్ణములను శమింప జేయును.

# సువర్ణ క్రవ్యాదరసమ్

శ్లో॥ సువర్ణ తారాహికాంత తీక్ష్ణం వైక్రాంత హేమమాక్షికే కర్షమాత్రం । పలంరసస్య ద్విపలంబలేస్స్యాత్ శుల్బాయ సేచార్థ పల ప్రమాణం । సంక్షేప్య సర్వంద్రుత మగ్నియోగా దేరండపత్రే షుని వేశనీయం । కృత్వాతతః కజ్జలికాం నిధాయ లోహసుపాత్రే రస పూరి తస్మిన్ । జీర్ణేరసే భావిత మేతదేవ సపంచ కోలోద్భవ వారి పూరైః । సవేత సామ్లం శతార్థంచ భావ్యం సమం రజో టంకణజం సుభృష్టం । బిడంత దర్ధం మరిచం సమాంశం తత్సర్వమార్ద్ర చణకామ్ల వారి । భావ్యేతి సిద్ధాక్రవ్యాది నామ్నా రసం సమందానక భైర వోక్తా । వల్లద్వయం సైంధవ తక్రసహితం సేవయేత్తలు భోజనాంతే । గురూణి మాంసాని పయాంసి పిష్టం కృత్యాని ఖాద్యాన్య ఖిలానివేగాత్ మాత్రాతిరి క్తాన్య పితానిచైవ యామద్వయే జారయతి ప్రసిద్ధః । నిహంత్య జీర్ణానపి మత్స్యవృద్ధాన్య గ్నింక రోతిక్రమ సేవనేన । కుర్యాద్దీ పనముద్ధృతంచ పవనం దుష్టామయో న్మూలనం తుందస్థూల్య నిబర్హణం మదహారం మూలార్తిశూలాపహం॥

వ్యా॥ సువర్ణభస్మ, వెండిభస్మ, సీసభస్మ, కాంతభస్మ, ఖడ్గలోహభస్మ, వైక్రాంతభస్మ, ఇవి ప్రత్యేకముగా ఒక్కొకకర్షము, శు, రసముపలము, శుగంధకము 2 పలములు, తామ్రభస్మ $\frac{1}{2}$ పలము, ఇనపలోహ భస్మ $\frac{1}{2}$ పలము. ఇవినూరి అగ్నియందు కరగించి ఆముదపు ఆకులయందు పోసిపిదప నూరి కజ్జలి చేసుకొని లోహపాత్రయందుంచి యందు నిమ్మకాయ రసముపోసి ఆరసము ఇగురునట్లుగా పక్వము చేసుకొని పిదప పంచకోలములు, అమ్లవేతసము, వీటిచే ఏబదిసారులు భావనచేసి పూర్వపుమందుకు సమానము పొంగించిన వెలిగార చూర్ణమును, వెలిగారములో సగముభాగ ముబిడాల లవణమును, మొత్తముమందుకు సమానము మిరియాల చూర్ణమును కలిపి అల్లపురసము చేతను సెనగపులుసు చేతను భావన చేయవలెను. ఈప్రకారమైన క్రవ్యాదిరసము మందానభైరవునిచే చెప్పబడెను. గురుకరములైన మాంసములను, పాలను, పిండివంటలను, భోజనముచేసి వెంటనే ఈమందును

సైంధవలవణము. మజ్జిగ, వీటితో రెండువల్లముల ప్రమాణము సేవించిన అతిమాత్ర గా సేవించినను వాటిని రెండు ఝాములలో జీర్ణింపజేయును. ప్రవృద్ధములైన ఆరు అజీర్ణములను నశింపజేయును. ప్రకోపించిన వాతమును, దుష్టవ్యాధులను, కడుపుపొ రుగుటను. స్థౌల్యమును, మదమును, మూలవ్యాధిని, శూలను, హరింపజేయును.

# సువర్ణక్రవ్యాదరసం

(ప్రకారాంతరమ్)

శ్లో॥ మృతం స్వర్ణం మృతం కాంతం మృతం శుల్బంచ తీక్ష్ణకం। మృతం రౌప్యంచ శంఖంచ తోలమానం పృథక్పృథక్ । మాతులుంగర సైర్మర్ద్యం లోహపాత్రే వినిక్షిపేత్ । గంధకం ద్విపలం శుద్ధం పార దం పలమానకం। సర్వం సమ్మేలయేత్పశ్చా జ్జ్వాలయేన్మృదు వహ్నినా। అమ్లవేతస సంభావ్యం అమ్లవర్గేణ సంయుతం। పంచకోల కషాయేణ శతార్ధం భావయేత్క్రమాత్ । భృష్టటంకణ చూర్ణేణతుల్యేన సహ మేలయేత్ । తదర్ధం పంచలవణం సర్వసామ్యం మరీచకం । త్రిసప్త భావయేత్పశ్చాచ్చణ కక్షారవారిణా। తతస్సంశోష్య సంపేష్య కాచ కుప్యాం వినిక్షిపేత్ । అత్యంత గురుమాంసాని గురుభోజ్యాన్యనేకశః । భక్షిత్వాకంఠ పర్యంతం చతుర్వల్లమిదం రసం । పట్వామ్లతక్ర సహితం పిచేత్తదనుపాయతః । క్షిప్రం తజ్జీర్యతే భుక్తం దీపనం జాయతే పునః । రసః క్రవ్యాద నామాయం ప్రోక్తమానం దభైరవైః॥

వ్యా॥ సువర్ణభస్మ 1 తు, కాంతభస్మ 1 తు, తామ్రభస్మ 1 తు, ఖడ్గలోహభస్మ 1 తు, వెండిభస్మ 1 తు, శంఖభస్మ 1 తు, ఇవి మాదీఫలరసముచే మర్దించి లోహ పాత్రయందుంచి, శు. గంధకము 2 పలములు, శు. రసము 1 పలము, వీటిని అందు కలిపి చిన్నమంట వేసుకుని పచించుకుని పిదప, అమ్లవేతసముచేతను, అమ్లవర్గ ద్రవ్యము లచేతను, పంచకోలములచేతను, ఏబదిసారులు క్రమముగా భావనచేసుకుని పొంగించిన వెలిగారము అమందుతో సమానమును, వెలిగారములో సగము పంచలవణములను, మొత్తము మందుతో సమానము మిరియాల చూర్ణమును, కలుపుకుని, సెనగపులుసుచే ఇరువదియొక పర్యాయము భావనచేసుకుని, సీసాయందుంచుకునవలెను. మిక్కిలి గురు కరములైన మాంసములను గురుకరములైన అనేక విధములైన భక్ష్యములను, కంఠ పర్యంతము భుజించి, సైంధవలవణము, మజ్జిగ, వీటితో నాలుగువల్లముల ప్రమాణము

మందును, సేవించిన, ఆపదార్థములు వెంటనే జీర్ణమగును. తిరిగి వెంటనే ఆకలి పుట్టును. ఈ క్రవ్యాదరసము, ఆనందభైరవులచే చెప్పబడియెను.

## మహాసువర్ణ క్రవ్యాదరసం

శ్లో॥ సువర్ణం రజతం తామ్రం కాంతం వైక్రాంత తీక్ష్ణకం । ప్రత్యేకం తులమానేన ఖల్వమధ్యే వినిక్షిపేత్ । పారదంపల మానంచ ద్విపలం గంధకం తథా । సర్వంచైకత్రసం మిశ్రం ఖల్వమధ్యే వినిక్షిపేత్ । పంచకోల కషాయేణ భావయేద్దిన పంచకం । తతో విచూర్ణ్య యత్నేన నిక్షిప్యాయస పాత్రకే । చుల్ల్యాం నివేశ్య యత్నేన జ్వాలయేన్మృదు వహ్నినా । తత్పాత్రస్థంచ జంబీర రసం సమ్యక్ప్రపచ్యతాం । జంబీర ఫలసారేణ పంచకోల కషాయకైః । భావనాః ఖలుదాతవ్యాంచ ణకక్షార వారిణా । ఆర్ద్రి కస్వరసేనైవ శిగ్రుమూలరసేనచ । పంచాంశ పరిమిత్యాతు భావనాచైకవిశంతిః । సద్యః క్షారం యవక్షారం క్షారంచ అపామార్గజం । భృష్టటంకణ చూర్ణేన తుల్యేన సహామేలయేత్ । సౌవర్చలంత దర్ధంచ సర్వతుల్యం మరీచకం । సప్తధా భావయేత్పశ్చాచ్చణ కక్షార వారిణా । తతస్సం శోష్యసంపేష్య కూపికా జఠరే క్షిపేత్ । పట్వామ్లతక్ర సహితం పిబేత్తదను పానతః । అత్యంత గురుమాంసాని గురుభోజ్యాన్యనేకశః। భుక్త్వాచకంఠపర్యంతం చతుర్వల్లమిదం రసం । క్షిప్రంతజ్జీర్యతే భుక్తం జాయతే దీపనం పునః । చతుర్విధ మజీర్ణంచ దీపనం పాచనం పరం । కుర్యాద్దీపనము ధృతంచ పవనం దుష్టామయ ధ్వంసనం । తుందస్థౌల్య నిబర్హణం గరహారం శూలామమూలాపహం । గుల్మప్లీహ వినాశనం గ్రహణి కామేతేసన్యంసనం । వాతవ్యాధిమహోదరాపహరణం క్రవ్యాదనామారసః॥

వ్యా॥ సువర్ణభస్మ, 1 తు. రజతభస్మ, 1 తు. తామ్రభస్మ, 1 తు. కాంతభస్మ 1 తు. వైక్రాంతభస్మ 1 తు. ఖడ్గలోహభస్మ 1 తు. శు, రసము, 1 పలము. శు గంధకము. 2 పలములు ఇవన్నియు ఖల్వమందుంచి పంచకోల కషాయముచే అయిదు రోజులు మర్దించి పిదప చూర్ణము చేసుకుని లోహపాత్ర యందుంచుకుని నిమ్మకాయల రసము పోసి మందాగ్నిచే ఆరసము ఇగురువరకు పచనము చేసుకుని ఖల్వమందుంచుకుని నిమ్మకాయల రసము. పంచకోల కషాయము సెనగపులుసు అల్లపు రసము. మునగ

వేళ్ల రసము, వీటిచే అయిదవవంతు చొప్పున ఇరువది యొక పర్యాయము భావన చేసు కుని, సద్యః క్షారము, యవక్షారము, ఉత్తరేణిక్షారము. ఇవి యేకైక తులము చొప్పు నను. సర్వసమానము పొంగించిన వెలిగారము. వెలిగారములో సగము భాగము సౌవర్చల వణము. సర్వముతో సమానము మిరియాల చూర్ణము. వీటిని కలుపుకుని, సెనగ పులుసుచే ఏడుసార్లు భావనచేసుకుని పిదప ఎండించి నూరుకుని సీసాయందుంచు కునవలెను. అత్యంత గురుమాంసములను అనేక విధములైన గురు భక్ష్యములను కంఠ పర్యంతము తిని త్రికటుకములు పుల్లటి మజ్జిగ వీటితో ఈమందును నాలుగు వల్లము లప్రమాణము సేవించిన భుజించిన పదార్థములు వెంటనే జీర్ణమవును. తిరిగి ఆకలి పుట్టును. దీపనమును పాచనమును చేయును. నాలుగు విధములైన అజీర్ణము ప్రకో పించిన వాతము దుష్టవ్యాధులు కడుపు పెరుగుట స్థౌల్యము కృత్రిమ విషము శూల ఆమము మూలవ్యాధి గుల్మము ప్లీహ గ్రహణి వాతవ్యాధులు మహో దరము వీటిని ఈ క్రవ్యాద రసము హరించును.

## శీతాంకుశరసం.

శ్లో॥ తుత్థంటంకణ సూతఖర్పరవిషంస్యాద్గంధ కంతాలకం సర్వం ఖల్వతలే విమర్ద్య ఘటికాంతత్కార వల్లీ రసైః । గుంజైకాగుటికా సుశర్కర యుతాసజ్జీర కేణాథవా । ఏకద్విత్రి చతుర్థశీతహరణః శీతాం కుశో నామతః॥

వ్యా॥ శు. మైలతుత్థము, పొ. వెలిగారము, శు. రసము, శు. కఘరి, శు. నాభి, శు. గంధకము, శు. తాలకము, ఇవన్నియు సమభాగములు ఖల్వమందు కాకరరస ముచే యొకఘుడియమర్దించి గుంజాప్రమాణపు మాత్రను పంచదారతోగాని జీలకర్ర రసముతోగాని పుచ్చుకునిన ఏకాహిక ద్వ్యాహిక, త్ర్యాహిక, చాతుర్థిక, జ్వరము లను హరించును. ఇది శీతాంకుశమని చెప్పబడును.

## రక్తపిత్తకులకుఠారరసం

శ్లో॥ శుద్ధపారదబలి ప్రవాలకం హేమమాక్షిక భుజంగవంగకం। మారితం సకలమేత దుత్తమం భావయేత్ పృథక్పృథక్త్రి వైస్త్రిశః । చందనస్య కమలస్య మాలతీకోర కస్యవృషపల్ల వస్యచ । ధాన్యవీరణ శతావరీశాల్మలీ వటజటామృతస్యచ । రక్తపిత్త కులఖండనాభి ధోజాయ తేరసవరోస్ర పిత్తినాం । ప్రాణదోమధు వృషద్ర వైరయం సేవితస్తు వసుకృష్ణ లైర్మితః । నాస్త్యనేన సమమత్ర భూతలే భేషజంకి మపిరక్త పిత్తినాం॥

వ్యా॥ శు. రసము, శు. గంధకము, పగడభస్మ, హేమమాక్షికభస్మ, సీసభస్మ, వంగభస్మ, ఇవన్నియు సమభాగములు, మంచిగంధము కమలములు మాలతీ పుష్పములు అడ్డసరపుచిగుళ్ళు ధనియాలు వట్టివేళ్ళు పిప్పళ్ళు పిల్లిపీచర బూరుగ ప్ఱరిఊడలు తిప్పతీగ వీటిరసములచే ప్రత్యేకముగా మూడేసిసారులు భావనచేయవలయును. రక్తపిత్తకులఖండన మనెడిపేరు గల ఇది ఎనిమిదిమిరియపుగింజల ప్రమాణము తేనె అడ్డసరపు రసములతో సేవించిన రక్తపిత్తవ్యాధి గలవారలకు ప్రాణము యిచ్చునది అవును. రక్తపిత్తవ్యాధి గలవారలకు ఈమందుతో సమానమైన మందు భూతలమందు లేదు.

# క్రిమికుఠార రసం

శ్లో॥ విశ్వాంరామత సైంధవాగ్ని మరిచం పథ్యావచా గుగ్గులు ర్బోలం రాత్రివిడంగ కుష్ఠలశునం గంధఃకు చేరాక్షకః । ఇంద్రోదత్యాభత పలాశబీజ ఖదిరాజా జీకణా దీప్యకం సౌవర్చం మధునాగుటీక్రిమికు ఠారాహ్వౌరు జాజంతునుత్॥

వ్యా॥ శుంఠి, శుఇంగువ సైంధవ లవణము చిత్రమూలము మిరియాలు వస శుమహిసాక్షి గుగ్గులు బాలింతబోలు పసపు వాయువిడంగములు చెంగల్వకోష్టు వెల్లుల్లి కచ్చూరములు కలిగొట్టు మోదుగవిత్తులు చండ్ర వాము పిప్పళ్ళు జీలకఱ్ఱ సౌవర్చలవణము ఇవి సమభాగములు తేనెతో మాత్రలు చేసుకుని సేవించిన ఈక్రిమి కుఠారరసము క్రిమివ్యాధులను బోగొట్టును.

# స్వర్ణవంగం (హేమసుందర రసమ్)

శ్లో॥ పారదం గంధకం వంగం నవసారంచ తుల్యకం । కుమారీరస సంమర్ద్యం వాలుకాయంత్రయోగతః । పాచితం దినమేకంతు, సాంగశీతలముద్ధృతం । అనుపాన విశేషేణ సర్వమేహాన్ వినాశయేత్ । మూత్రకృచ్ఛ్రం శుక్రనష్టం శ్వేతరక్త ప్రదరం తథా, హస్తచరణయోర్దాహం పైత్యవ్యాధీంశ్చ నాశయేత్ । ఆస్యపాకం అంగదాహం నేత్రదాహంతథైవచ । హేమసుందర రసోనామ విష్ణునానిర్మితంపురా॥

వ్యా॥ శు. రసము, శు. గంధకము, శు. వంగము, నవాసారము, ఇవి సమభాగములు కలుబందరసముచే నూరి వాలుకాయంత్రమందు ఒకరోజు వండి సాంగశీతలమునతీసి అనుపాన విశేషములచే యిచ్చిన, సర్వమేహములు, మూత్రకృచ్ఛ్రము శుక్రనష్టము, శ్వేతప్రదరము- రక్తప్రదరము- కాళ్ళుచేతులు మంటలు- పైత్యవ్యాధులు- నోటిపూత- శరీరముమంట- కళ్లుమంట- వీటినీ హరించును. ఈ హేమసుందరరసము పూర్వము విష్ణువుచే నిర్మించబడినది.

# స్వర్ణవంగమ్ (హేమసుందర రసము)

(ప్రకారాంతరం)

శ్లో॥ పారదాద్ద్విగుణంగంధం గంధసామ్యంతు వంగకం । రససామ్యంనవాసారం ఖల్వమధ్యే వినిక్షిపేత్ । కుమారీరసతోమర్ద్యం వాలుకాయంత్రపాచితం । గుంజాత్రయం ప్రదాతవ్యం గుడూచీ సత్వకేనచ । త్రిఫలాచూర్ణకేనాపి సర్వమేహాన్వినాశయేత్। మూత్రకృచ్ఛ్రం శుష్కకాసం సోమరోగంచ దారుణం। ఆస్యపాకం అంగదాహం నేత్రదాహం తథైవచ। వీర్యనష్టంచ శ్వాసంచ శ్వేతరక్తప్రదరం తథా। హేమసుందరనామాయం విష్ణునానిర్మితంపురా॥

వ్యా॥ శు, పాదరసము, 1 భా, శు. గంధకము 2 భా, శు. వంగము 2 భా, నవాసారము 1 భా వీటిని ఖల్వమందుంచి కలుబందరసముచే మర్దించి వాలుకా యంత్రమందువండి రెండు గురివిందగింజల ప్రమాణము తిప్పసత్తు, త్రిఫలాచూర్ణము వీటితో యిచ్చిన, సర్వమేహములు, మూత్రకృచ్ఛ్రము, పొడిదగ్గు, సోమరోగము, నోటిపూత, శరీరతాపము, నేత్రములుమంట, వీర్యనష్టము, శ్వాస, శ్వేతప్రదరము, రక్తప్రదరము, వీటిని హరించును. ఈ హేమసుందర రసము పూర్వకాలమున విష్ణువుచే నిర్మింపబడియె,

# వంగరాజీయము

శ్లో॥ రసమేకం ద్వయం వంగం వంగసామ్యంతు గంధకం కుమార్యా స్వరసే మర్ద్యం దినమేకం విచక్షణః । పాచితం వాలుకా యంత్రే దినమేకం క్రమాగ్నినా । తత ఉద్ధృత్య శీతంచ సేవ్యం తదనుపానతః । వింశతించ ప్రమేహాణాం నాశయే న్నాత్ర సంశయః। మూత్రాతిసారం కృచ్ఛ్రంచ గ్రహణీం పాద దాహకం । మూత్రాఘాతాశ్మరీం హంతి నాత్రకార్యా విచక్షణా॥

వ్యా॥ శు. రసము, 1 భా, శు. వంగము, 2 భా. శు. గంధకము 2 భా. వీటిని కలుబందరసముచే ఏకరోజు మర్దించి వాలుకాయంత్రమందు ఏకరోజు వండి చల్లారిన పిదప తీసి అనుపానభేదముచే యిచ్చిన ఇరవై మేహములు, మూత్రాతిసారము, మూత్రకృచ్ఛ్రము, గ్రహణి, కాళ్లమంటలు, మూత్రాఘాతము, అశ్మరీ, వీటిని తప్పక హరించును.

# మేహవంగ రాజీయము.

శ్లో॥ రసమేకం త్రయోవంగం వంగసామ్యంతు గంధకం । మర్ద యే ద్దినమేకంతు కుమార్యాః స్వరసే బుధః । సంస్థాప్య గోలకం భాండే రోధయే త్సుదృఢం ముఖం। పాచయే ద్వాలుకాయంత్రే దినమేకం దృఢాగ్నినా । సాంగశీతల మాదాయ సంపూజ్యద్విజదేవతాః । పిప్పలీ మధునాయుక్తం సర్వమేహేషు యోజయేత్ । క్షీరాన్నం యోజయే త్పథ్య మమ్ల లవణవర్జితం । మేహవంగే ర్వరో నామ సర్వమేహ నికృంతనః॥

వ్యా॥ శు. రసము, 1 భా, శు. వంగము, 3 భా, శు, గంధకము 3 భా. ఇవి కలుబందరసముచే ఒకరోజు మర్దించి కాచకుప్పెయందు పోసి కుండయందుంచి ముఖమును బాగుగ మూసి వాలుకాయంత్రమందు దృఢాగ్నిచే ఒకరోజు వండి సాంగ శీతలమున తీసి బ్రాహ్మణులను, దేవతలను. పూజించి, పిప్పలి చూర్ణము, తేనె, వీటితో సేవించిన సర్వమేహములను నిర్మూలింపజేయును. క్షీరాన్నమును, పులుసు ఉప్పు, లేని భోజనమును, యివ్వవలెను.

# రజతమేహ వంగరాజీయము

శ్లో॥ రసమేకం ద్వయంవంగం వంగసామ్యంతు గంధకం । రజతం ఏక భాగంచ కుమారీ రసమర్దితం । వాలుకాయంత్రకే పాచ్యం దినమేకం విచక్షణః । సాంగశీతల ముద్ధృత్య నారికేళాంబు మర్దితం । వటకాన్ కారయిత్వాచ ద్విగుంజం భక్షయే త్సదా । సర్వమేహాన్ హర త్యేవ శుక్రవృద్ధించ కారయేత్ । శుక్రదోషం హర త్యేవ బుద్ధీంద్రియ బలప్ర దం । నానారోగ ప్రశమనం సర్వమేహ నికృంతనం॥

వ్యా॥ శు. రసము, 1 భా. శు. వంగము, 2 భా. శు. గంధకము, 2 భా. రజతము, 1 భా. వీటిని కలుబందరసముచే మర్దించి వాలుకాయంత్రమందు ఒకరోజు వండి సాంగశీతలమున తీసి నారికేళోదకముచే మర్దించుమని కుప్పెలు కట్టు కొని రెండు గురివిందగింజల ప్రమాణము సేవించిన, సర్వమేహములను, హరించును. శుక్రవృద్ధి చేయును, శుక్రదోషములను, పోగొట్టును. బుద్ధికి, ఇంద్రియములకు బల మును కలిగించును. అన్నిరోగములను శమింపజేయును.

# సువర్ణమేహవంగరాజీయం.

శ్లో॥ స్వర్ణమేకం ద్వయంవంగం స్వర్ణసామ్యాంతు పారదం। గంధకంచ ద్విభాగంచ కుమారీ రసమర్దితం । పాచితం వాలుకా యంత్రే దినంచార్థంభిషగ్వరైః । సాంగశీతలమాదాయ గుంజాద్వయ ప్రమాణకం । సేవనీయం తధా హంతి అంగదాహంచ కృఛ్రకం । క్షయం క్షయ కృతాన్ వ్యాధీన్ దౌర్బల్యం శ్వాస మేవచ । ప్రమేహాన్వివిధాన్ చైవ బహుమూత్రం తథైవచ । వృష్యం రసాయనం చైవ బుద్ధీంద్రియ బలప్రదం॥

వ్యా॥ సువర్ణము 1 భా, శు. వంగము 2 భా, శు పాదరసము 1 భా, శు గంధకము. 2 భా, వీటిని కలుబంద రసముచే మర్దించి వాలుకాయంత్ర మందు పకటిన్నర రోజువండుకుని సాంగశీతలమున తీసి రెండుగురిగింజల ప్రమాణము సేవించిన శరీరతాపము, మూత్రకృఛ్రము, క్షయ, క్షయవలన పుట్టినవ్యాధులు, దౌర్బల్యము, శ్వాస, సమస్తమైన ప్రమేహములు, బహుమూత్రము, హరించును. [illegible]ద్రిని చేయును. రసాయనంబు, బుద్ధికి, ఇంద్రియములకు, బలము చేయును

# అమృత కలానిధిరసము

అమృత వరాటక మరిచైర్ద్విపంచ నవమాంశైః । ముద్గ ప్రమాణ వటకో జ్వర పిత్త కఫాగ్ని మాంద్యహారీ॥

వ్యా॥ శు నాభి, 2 భా. గవ్వభస్మ, 5 భా. మిరియాలు 9 భా. ఇటుల వీనిని పెసరగింజలంత మాత్రలు చేసుకుని సేవించిన, జ్వరము, పైత్యము, కఫము, అగ్ని మాంద్యము, వీటిని హరించును.

# రసరాట్

సీ॥ దరదము గంధ రాపోడియు ధాతుర కర్పూర పారదంబులన్ ధర వసువేద చంద్రసుధాంశు హిమాంశులగూర్చి ఖల్వంబునన్ । వరుస కుమారిసారమున నప్పుగనూరి శరావమం దిడి అగ్నిలేపగన్ । అందుల గంధకంబు దాహం బగున్ । తిరిగి కుమారిసారమున మర్దింపగ రసర్సాటనం దగున్ । వర కఫజాతులందు నిల వాయువున్ । దెగటార్చు వేగమే॥

టీ॥ శు ఇంగిలీకము, 1 భా, శు గంధకము, 8 భా. లోహరాపాడి 4 భా. రససిందూరము, 1 భా, రసకర్పూరము, 1 భా, శు పాదరసము, 1 భా, వీటిని కలుబందరసముచే మర్దించి మూశళ్ళ యందుంచి అగ్నివేయగా అందలి గంధకము కాలిపోవునపిదప తీసిమరల కలుబంద రసముచే మర్దింపగరసరాటగును, ఇది కఫజాతి వ్యాధులను, వాతవ్యాధులను, వెంటనే నశింపచేయును.

నో॥ పైవస్తువులు సమభాగములు కలసి పైవలెనెప్రక్రియా విధానము, గుణములు కల రసరాట్, మరియొకటి కలదు.

## అగ్నిముఖ రసము

శ్లో॥ సూతంగంధం విషం తుల్యం మర్దయే దార్ద్రిక ద్రవైః। అశ్వత్థ చించాపామార్గ క్షారాః క్షారౌచ టంకణం। జాతీఫలం లవంగంచ త్రికటు త్రిఫలాసమం। శంఖక్షారం పంచపలం హింగు జీరం ద్విభాగకం। మర్దయే దమ్లయోగేన గుంజామాత్రా వటీశుభా। పాచనీ దీపనా సద్యో ఉజీర్ణ శూల విషూచికాః। హిక్కాం గుల్మం చోదరంచ నాశయే న్నాత్ర సంశయః। రసేంద్ర సంహితాయాంచ నామ్నా వహ్ని ముఖోరసః॥

వ్యా॥ శు. రసము, శు. గంధకము, శు. నాభి, ఇవి సమభాగములు, అల్లపు రసముచే మర్దించి, రావిక్షారము, చింతక్షారము, ఉత్తరేణి క్షారము, యవక్షారము, సద్యోక్షారము, పొ, వెలిగారము, జాజికాయ, లవంగములు, త్రికటుకములు, త్రిఫలములు, ఇవి సమభాగములు, శంఖభస్మ, 5 పలములు, శు ఇంగువ, జీలకఱ్ఱ, ఇవి రెండేసిభాగములు, ఇటులవీనిని ఆమ్లవర్గ రసములచే మర్దించి రెండు గురిగింజల ప్రమాణము మాత్రనుసేవించిన, పచనశక్తిని, అగ్నిదీప్తిని, కలుగజేయును. అజీర్ణము, శూల, విషూచి, ఎక్కిళ్లు, గుల్మము, ఉదరము, వీటినితప్పక వెంటనే హరించును. ఇది రసేంద్ర సంహితయందు, వహ్నిముఖ రసమని చెప్పబడియున్నది.

## హేమాభ్రకరససిందూరం (క్షయే)

శ్లో॥ అభ్రకం రససిందూర మిశ్రితం హేమభస్మనా। సమభాగం ప్రయుక్తీత రసే నార్ద్రిక యోజితం। క్షయంచ క్షయపాండుంచ క్షయకాసంచ కుష్ఠకం। జయేన్మండలపర్యంతం పూర్వాకర్మ విపాకృత్॥

వ్యా॥ అభ్రకభస్మ, రససిందూరము, సువర్ణభస్మ, ఇవి సమభాగములు మిశ్రము చేసి అల్లపురసముతో ఒక మండలము సేవించిన, క్షయ, క్షయవలన పుట్టిన

పాండువు, క్షయకాస, కుష్ఠము, వీటిని హరించును. పూర్వకర్మ విపాకమును కూడ చేయును.

## శంఖోదర రసం

శ్లో॥ కంబూభస్మ చతుష్కర్షం కర్షైక మహిఫేనకం। జాతీఫలం టంకణంచ పృథక్కర్షం వినిక్షిపేత్। అతిసూక్ష్మం విమర్ద్యాథ నవనీతేన గుంజకం। రసః శంఖోదరో నామ సర్వాతీసార నాశనః॥

వ్యా॥ శంఖభస్మ, 4 కర్షములు, శు. నల్లమందు, 1 క. జాజికాయలు, 1 క. పావెలిగారము, 1 క. వీటిని మిక్కిలి మెత్తగనూరి వెన్నతో గుంజాప్రమాణము సేవించిన ఈ శంఖోదర రసము, సమస్త అతిసారములను నశింపజేయును.

## వంగేశ్వరరసం (లఘు)

శ్లో॥ వంగం కాంతంచ గగనం హేమపుష్పం సమం సమం। కుమారీరసతో భావ్యం సప్తవారం భిషగ్వరైః। ఏషవంగేశ్వరోనామ ప్రమేహాన్వింశతిం జయేత్। మూత్రకృచ్ఛ్రం సోమరోగం పాండురోగం మహాశ్మరీం। రసాయనమిదం శ్రేష్టం నాగార్జున వినిర్మితం॥

వ్యా॥ వంగభస్మ, కాంతభస్మ, అభ్రకభస్మ, నేలతంగేడు పువ్వుల చూర్ణము ఇవి సమభాగములు కలబంద రసముచే ఏడుసారులు భావనచేసుకొని సేవించిన వింశతి ప్రమేహములు, మూత్రకృచ్ఛ్రము, సోమరోగము, పాండురోగము, అశ్మరి, వీటిని జయించును. ఇది శ్రేష్టమైన రసాయనము, ఈవంగేశ్వర రసము నాగార్జునిచే నిర్మి బడినది.

## వంగేశ్వర రసం

శ్లో॥ రసంవంగ సమంకృత్వా చతుర్భాగంచ గంధకం। కుమారీరస సంయుక్తం దిన మేకం విమర్దయేత్। మందమధ్యమ తీవ్రాగ్నౌ వాలుకాయంత్రగం పచేత్। అశ్వగంధా మృతాసార మోచా రస శతావరీః। గోక్షురధాత్రీ కూష్మాండం వారాహీపత్రమాగధీ। త్రిఫలా మర్కటీ ముస్తా యష్టీమధు సమన్వితం। సర్వసామ్యం సితాయుక్తం చూర్ణం కర్షార్ధ సంయుతం। గుంజాచతుష్టయాం మాత్రాం గోక్షీర మనుపానతః। ప్రాతరుత్థాయ సేవేత లవణామ్లంచ వర్జయేత్।

బహుమూత్రం మూత్రకృచ్ఛ్రం రక్తమూల ప్రమేహకం । మధుమేహం నష్టశుక్రం నష్టలింగంచ నాశయేత్ । సర్వమేహ ప్రశమనో వంగేశ్వర ఇతి స్మృతిః ॥

వ్యా॥ శు. రసము, 1 భా. వంగము, 1 భా. శు. గంధకము, 4 భా. వీటిని కలుబందరసముచే పకగోజు నూరి వాలుకాయంత్రమందు, మంద, మధ్యమ, తీవ్రాగ్నులచే వండి, పెన్నేరు, తిప్పసత్తు, బూరుగబంక, పిల్లిపీచర, పల్లేరు, నేలఉశిరిక, బూడిదగుమ్మడికాయ, నేలతాడి, ఆకుపత్రి, పిప్పళ్లు, త్రిఫలములు, మాలగొండి విత్తులు, తుంగగడ్డలు, అతిమధురము, వీటి చూర్ణములు అర్ధకర్ష ప్రమాణము, సర్వముతో సమానము పంచదార, కలిపి నాలుగు గుంజలు ప్రమాణము, ఉదయమున లేచి ఆవుపాల అనుపానముతో సేవించి, ఉప్పును, పులుసును, విడచినయెడల, బహుమూత్రము, మూత్రకృచ్ఛ్రము, రక్తార్శస్సు, మధుమేహము, క్షీణశుక్రము, క్షీణలింగము సర్వమేహములు, వీటిని నశింపజేయును వంగేశ్వరము అని ప్రసిద్ధమైనది.

## బృహద్వంగేశ్వర రసం

శ్లో॥ రసం గంధం మృతంలోహం మృతరౌప్యంచ ఖర్పరం । మృతాభ్రకం మృతం తామ్రం సర్వతుల్యంచ వంగకం । పుటే ద్గజపుటే నైవ సాంగశీతల ముద్ధరేత్ । రతిద్వయ ప్రమాణేన మధునా సేవయే న్నరః । నిశాచూర్ణం క్షౌద్రయుతం పిబేద్ధాత్రీ రసం • హ్యాను । బృహద్వంగేశ్వరంఖ్యాతం మహాదేవ ప్రకాశితం । ప్రమేహాన్ వింశతిం హంతి ఆమదోషం విషూచికాం । విషమజ్వర గుల్మార్శో మూత్రాతీసార త్రజిత్ । వీర్యః వృద్ధికరం హ్యేశు సోమరోగ నిబర్హణం॥•

వ్యా॥ శు: రసము, శుగంధకము. లోహభస్మ వెండిభస్మ, శు, కపరి, అభ్రకభస్మ, తామ్రభస్మ, ఇవి సమభాగములు, వీటితో సమానము వంగభస్మ, ఇవి నూరుపని గజపుటము, వేసుకుని సాంగశీతలమున తీసిరతిద్వయప్రమాణము తేనెతో, పుచ్చుకుని పిదప తేనెతోకలిపిన పసుపుచూర్ణము ఉసిరిక పండ్లరసమును, తీసుకొనిన, వింశతి ప్రమేహములు, ఆమదోషము, విషూచి, విషమజ్వరము, గుల్మము, అర్శస్సు, మూత్రాతిసారము, పైత్యము, వీటిని జయించును. ఈ బృహద్వంగేశ్వరము మహాదేవునిచే చెప్పబడినది.

# మహా వంగేశ్వర రసం

వంగభస్మ రసం గంధం రౌప్యం కర్పూర మభ్రకం।కర్షం కర్షం మానమేషాంసూతాంఘ్రీ హేమవకా_క్తికే। కేశరాజ ర సైర్భావ్యంగుంజ ద్వయ ప్రమాణతః । ప్రమేహా న్వింశతించైవ సాధ్యాసాధ్యమథాపివా। మూత్రకృచ్ఛ్రం తథాపాండుం ధాతుస్థంచ జ్వరం జయేత్ । హలీమకం రక్తపిత్తం వాతపిత్త కఫోద్భవాన్ । గ్రహణీమామదోషంచ మందాగ్నిత్వ మరోచకం । బహుమూత్రం బహువిధం శ్వేతరక్త ప్రదరం తథా। ఏతాన్సర్వా న్నిహంత్యాశు వృక్షమింద్రా శనిర్యథా। ఓజ స్తేజస్కరో నిత్యం స్త్రీషు సమ్యక్ వృషాయతే। బలవర్ణకరోవృష్యః శుక్లస్తంభ నసఃపరః। ఛాగంవాయది వాగవ్యం పయోవా దధినిర్మలం। అనుపానం ప్రయోక్తవ్యం బుధ్వాదోషగతీన్భిషక్ । దద్యాచ్చ బాలేప్రౌఢేచ సేవనార్థం రసాయనం। మహావంగేశ్వరో నామసోమరోగం నిహంతిచ॥

వ్యా॥ వంగభస్మ, శు. రసము, శు. గంధకము, వెండిభస్మ, పచ్చకర్పూరము, అభ్రకము, ఇవి ప్రత్యేకముగా కర్షప్రమాణము, బంగారభస్మ ¼ కర్షము, ముత్య భస్మ ¼ కర్షము, ఇవి గుంటగలగర రసముచే భావనచేసి రెండు గుంజలు ప్రమాణము సేవించిన, వింశతి ప్రమేహములు, మూత్రకృచ్ఛ్రము, పాండువు, ధాతుగత జ్వరము, హలీమకము, రక్తపిత్తము, వాతము, పిత్తము, కఫము, వీటివలన బుట్టిన వ్యాధులు, గ్రహణి, ఆమదోషము, అగ్నిమాంద్యము, అరోచకము, బహుమూత్రము శ్వేతరక్తప్రదరములు, వీటిని పిడుగు వృక్షమును నశింపజేయు రీతి నశింపచేయును. ఓజస్సు, తేజస్సు, వీటిని చేయును. ఎల్లప్పుడు స్త్రీలను వృషభమువలె రమించును. బలము, వర్ణము, వీర్యవృద్ధి వీటిని చేయును. శుక్ర స్తంభనము చేయును. మందుసేవించిన వెంటనే, మేకపాలుగాని ఆవుపాలుగాని స్వచ్ఛమైన మేకపెరుగుగాని, ఆవు పెరుగు గాని దోషగతులను తెలుసుకుని అనుపానముగా యివ్వవలెను. ఈ రసాయనమును, బాలురకును యౌవనవంతులకును యివ్వవచ్చును, ఈ మహావంగేశ్వరము, సోమరోగమును కూడ నశింపచేయును.

# విష్ణుచక్ర రసం

శ్లో॥ కాంతభస్మ చతుర్భాగం తీక్ష్ణలోహం త్రిభాగకం। తత్సమం గిరిజంచైవ సౌభాగ్యంచ ద్విభాగకం। తాలం మనశ్శిలాచైవ ప్రత్యేకం వేదభాగకం। శిలా వైక్రాంత మభ్రంచ హేమం రజతి మా

క్షికం । ప్రత్యేకంచ ద్విభాగంచ నాగవంగం వరాటకం । శుక్తి ప్రవాలం శంఖంచ పృధక్ పంచమభాగకం । తామ్రభస్మ చతుర్భాగం సర్వతుల్యంచ పారదం। తత్సమం గంధకంచైవ ఖల్వమధ్యే వినిక్షిపేత్ । మాసమేకం తధాకుర్యా త్కార్పాస రసమర్దనం । వాలుకాయంత్రకే క్షిప్తం పాచయే త్సప్తరాత్రకం । సాంగశీతల ముద్ధృత్య దేయం గుంజాప్రమాణతః । క్షయాదికాన్ సర్వాన్ వ్యాధీన్ వాతవ్యాధీంశ్చ నాశయేత్ । కఫవ్యాధీ నశేషాంశ్చ సన్నిపాతాన్ త్రయోదశ । జ్వరాంశ్చవివిధాన్ హంతి నాత్రకార్యా విచక్షణా । విష్ణుచక్రరసో నామ బ్రహ్మణా నిర్మితం పురా ॥

వ్యా॥ కాంతభస్మ, 4 భా. తీక్ష్ణలో: 3 భా. శిలాజతు 3 భా, శు టంకణము, 2 భా, శు, తాళకము, 4 భా. శు. మనశ్శిల 4 భా. శు. పాషాణము 2 భా. వైక్రాంతభస్మ 2 భా. అభ్రకభస్మ, 2 భా. సువర్ణభస్మ, 2 భా. వెండిభస్మ. 2 భా. మాక్షికభస్మ, 2 భా. సీసభస్మ, 5 భా. వంగభస్మ, 5 భా. గవ్వలభస్మ, 5 భా. ముత్యపుచిప్పలభస్మ, 5 భా. పగడభస్మ, 5 భా. శంఖభస్మ, 5 భా. తామ్రభస్మ, 4 భా. వీటి అన్నిటితో సమానము శు. పాదరసము, పాదరసముతో సమానము శు. గంధకము, వీటిని ఖల్వమందుంచి ప్రత్తివేళ్ళరసముచే వకమాసము మర్దించి వాలుకాయంత్రమందుంచి ఏడురోజులు వండి సాంగశీతలమున తీసి వక గురివిందగింజ ప్రమాణము, యిచ్చినయెడల, క్షయ మొదలగు సమస్తవ్యాధులను, వాతవ్యాధులను, సమస్త శ్లేష్మవ్యాధులను, పదమూడు సన్నిపాతములను, సమస్తజ్వరములను, తప్పక నశింపజేయును. ఈ విష్ణుచక్రరసము పూర్వకాలమందు బ్రహ్మచే నిర్మింపబడినది.

## మహావిష్ణుచక్రరసం

శ్లో॥ పారదం గంధకం చైవ తుత్థంచైవ మనశ్శిలా । తాలక ద్వితయంచైవ స్వర్ణభస్మ సమం సమం । ఏతై స్సర్వై స్సమంచైవ నాగభస్మ వినిక్షిపేత్ । ఏతై స్సర్వై స్సమంచైవ వత్సనాభం వినిక్షిపేత్ । ఏతై స్సర్వై స్సమంచైవ గరళంచ వినిక్షిపేత్ । ఏతై స్సర్వై స్సమంచైవ ఉల్లిపాషాణకం క్షిపేత్ । సర్వం ఖల్వే వినిక్షిప్య వహ్నిమూలరసేనచ । కటుత్రయకషాయేణ మార్కవార్ద్రిమర్కటీరసైః । ఏకైకేన త్రిదివసం దృఢమర్దనంచ కారయేత్ । గులికాన్ ఛాయయా

శుష్కాన్ వంశనాళే వినిక్షిపేత్ శాలిబీజప్రమాణేన అనుపానవిశేషతః। ఘోరాణి సన్నిపాతాని త్రయోదశ హరంతిచ, । కఫజాన్ వివిధాన్ వ్యాధీన్ వాతవ్యాధీంస్తథైవచ । అవసానకాలేయో క్తవ్యం సంజీవనీ ఇవజీవయేత్। నాతః పరతరం కించిదస్తి శీతలనాశనం విష్ణుచక్రమితి ఖ్యాతం లక్ష్మీనాథప్రకల్పితం॥

వ్యా॥ శు. పాదరసము 1 భా, శు. గంధకము 1 భా, శు, మైలతుత్థం 1 భా, శు మణిశిల 1 భా, శు తాళకము 1 భా, శు పిండతాళము 1 భా, సువర్ణభస్మ 1 భా, సీసభస్మ 7 భా, శు.నాభి 14 భా, గరళము 28 భా, శు, ఉల్లి పాషాణము 56 భా, వీటిని, చిత్రమూలము, త్రికటుకములు, చాగ, అల్లము, మాలవొండి, వీటిచే ప్రత్యేకముగా మూడేసి రోజులు దృఢముగా మర్దించి షప్పెలు కట్టుకుని నీడను ఎండించుకుని వెదురుగొట్టము యందు ఉంచుకుని వడ్లగింజ ప్రమాణము అనుపాన విశేషములతో యిచ్చిన ఘోరమైన పదమూడు సన్నిపాతములను శేష్మవ్యాధులను వాతవ్యాధులను, నశింప జేయును. ప్రాణావసాన కాలమందు యిచ్చిన సంజీవనివలె జీవింపజేయును. శీతలమును తగ్గించి వెంటనే వేడి చేయుటయందు దీనికంటె శ్రేష్టమైనది వేరొకటి లేదు. విష్ణుచక్రరసమని ప్రసిద్ధమైన ఈమందు లక్ష్మీనాథునిచే చెప్పబడినది.

## అగ్నికుమార రసం

శ్లో॥ టంకణం రసగంధౌచ సమభాగం త్రయం విషాత్ । కపర్దశంఖౌ త్రినవౌ వసుభాగం మరీచకం। దినం జంబ్వాంభసాపిష్టం భవేదగ్ని కుమారకః। విషూచీ శూల వాతాదివహ్నిమాంద్యేద్విగుంజకం। అజీర్ణ సంగ్రహణ్యాంచ ప్రయోజ్యోయం నిజౌషధైః॥

వ్యా॥ శు. టంకణము, 1 భా. శు రసము. 1 భా. శు. గంధకము, 1 భా. శు. నాభి, 3 భా. గవ్వలభస్మ, 3 భా. శంఖభస్మ, 9 భా. మిరియముల చూర్ణము 8 భా. వీటిని నిమ్మకాయలరసముచే ఒక దినము మర్దించిన ఇయ్యది అగ్నికుమారక మనబడును. విషూచి, శూల, వాతవ్యాధులు, అగ్నిమాంద్యము, అజీర్ణము, సంగ్రహణి, వీటియందు వీటికి తగిన అనుపానములతో రెండు గురిగింజల ప్రమాణము యివ్వవలెను.

## అగ్నికుమారరసం

శ్లో॥ రసేన గంధం సహ టంకణేన సమం విషం యోజ్యమత స్త్రిభాగం । కపర్దశంఖావపి నేత్రభాగా మరీచకం చాష్టగుణం

విమర్ద్య । సుపక్వజంబీరరసేన ఖల్వే సిద్ధో భవత్యగ్నికుమారకోయం ।
అజీర్ణ వాతం గుదగుల్మవాతం విషూచికాద్యం వినిహంతి సద్యః

వ్యా॥ శు. రసము, 1 భా. శు. గంధకము, 1 భా. శు. టంకణము, 1 భా. శు. నాభి, 3 భా. గవ్వలభస్మ, 3 భా. శంఖభస్మ, 3 భా. మిరియాల చూర్ణము 8 భా. వీటిని ఖల్వమందుంచి నిమ్మపండ్లరసముచే మర్దించిన అగ్నికుమారకమగును. ఇది, అజీర్ణము, వాతము, గుదవాతము, గుల్మవాతము, విషూచి మొదలగు వ్యాధులను, వెంటనే నశింపజేయును.

## అగ్నికుమార రసం

శ్లో॥ మరిచోగ్రా కుష్ఠ ముస్తై స్సర్వైరేవ సమం విషం । పిష్ట్వా చార్ద్రకరసేనైవ వటికా రక్తికా మితా । ఆమజ్వరే ప్రథమతః శుంఠ్యాచ మధుపిష్టయా । ఆర్ద్రకస్య రసేనాపి నిర్గుండ్యాశ్చ కఫజ్వరే । పీనసేచ ప్రతిశ్యాయే మరిచస్యచ వారిణా । అగ్నిమాంద్యే లవంగేన శోఫే సదశమూలకః । గ్రహణ్యాం సహ శుంఠ్యాచ అతిసారే దశమూలకైః । సామేచ ధాన్యశుంఠీభ్యాం పక్వేచకుటజం మధు । సన్నిపాతజ్వరారంభే పిప్పల్యార్ద్రకవారిణా । కంటకార్యారసైః కాసే శ్వాసే వాసారసాన్వితం । పీత్వా వటీ ద్వయం రోగే స్వాస్థ్యం సముపగచ్ఛతి । సర్వేషామేవ రోగాణా మామదోషప్రశాంతయే । అగ్నివృద్ధికరో నామ్నా విఖ్యాతోగ్నికుమారకః ॥

వ్యా॥ మిరియాలు 1 భా, వస 1 భా, చెంగల్వకోష్టు 1 భా, తుంగగడ్డలు 1 భా, శు నాభి 4 భా, వీటిని అల్లపు రసముచేనూరి రక్తిప్రమాణము మాత్రలు చేసుకొని 2 మాత్రలు చొప్పున ఆమ జ్వరమందు మొదటతేనెతో అరగతీయబడిన శొంఠితోగాని, అల్లపు రసముతోగాని, కఫజ్వరమందు వావిలి రసముచేతను, పీనసమందును. జలుబుయందును, మిరియాల రసముచేతను అగ్నిమాంద్యయందులవంగ కషాయముతోను, నంజుయందు దశమూల కషాయముతోడను, గ్రహణియందు శొంఠి రసముతోడను, అతిసారమందు దశమూల కషాయముతోడను, ఆమాతిసారమందు, ధనియాలు, శొంఠి, వీటి రసములతోడను, పక్వాతి సారమందు, తేనెకోడిశపాల చూర్ణములతోడను, సన్నిపాత జ్వరారంభమందు, పిప్పళ్లు అల్లపు రసముల తోడను, దగ్గుయందు వాకుడురసము తోడను, శ్వాసయందు, అడ్డసరము రసము తోడను, యిచ్చిన స్వాస్థ్యమును పొందును. సర్వవ్యాధులయందును. ఆమదోషశాంతి చేసి అగ్నివృద్ధిని జేయును. అగ్నికుమారమని ప్రసిద్ధమైనది.

# లఘుసూర్యావర్తి

శ్లో॥ మృతాభ్రం మాక్షికంచైవ హేమ కార్పాస బీజకం। కాక బింబస్య బీజాని గుడూచీ సత్వమేవచ । టంకణం మౌక్తికంచైవ గీర్వాణకుసుమం తథా । హింగులం సర్వతుల్యంస్యా జ్జంబీర రసమర్దితం। ద్రాక్షార్ద్రకరసై శ్చాపి భావయే త్సప్తవారకం। గుంజామాత్ర ప్రమాణంచ అనుపానవిశేషతః । సర్వపైత్యగదధ్వంసీ వాతపైత్యగదాపహం। ఛర్దిహిక్కావినాశంచ గ్రహణీదోషనాశనం । మందాగ్ని మమ్లపిత్తంచ కాస శ్వాస మరోచకం । సూర్యావర్తిరసో నామ అశ్వి

వ్యా॥ అభ్రకభస్మ, 1 భా. హేమమాక్షికభస్మ, 1 భా. పమిడిపత్తి గింజల లోని పప్పు 1 భా. కాకిదొండ విత్తులలోని పప్పు 1 భా. తిప్పసత్తు 1 భా. పొ. టంకణం, 1 భా. ముత్యభస్మ, 1 భా. లవంగము, 1 భా. శు. ఇంగిలీకము, 8 భా. వీటిని నిమ్మపండ్ల రసముచేతను, ద్రాక్షపండ్ల రసముచేతను, అల్లపు రసముచేతను, మర్దించి ఏడుసారులు భావనచేసి గుంజప్రమాణము అనుపాన విశేషములతో యిచ్చిన సర్వపైత్య వ్యాధులను, వాతపైత్య వ్యాధులను, వాంతులు, ఎక్కిళ్లు, గ్రహణీరోగము, అగ్నిమాంద్యము, అమ్లపిత్తము, దగ్గు, ఎగర్పు, అరోచకము, వీటిని హరించును. ఇయ్యది అశ్వినీ దేవతలచే నిర్మించబడిన సూర్యావర్తి రసమనబడును.

# లఘుసూర్యావర్తి (ప్రకారాంతరం).

శ్లో॥ మౌక్తికం మాక్షికం చైవ టంకణం చోగ్రగంధకం । హేమకార్పాసబీజంచ కాకబింబీ ద్రుమాస్థిజం। పృథక్పృథక్చతుర్భాగం ద్వాదశం తిప్పసత్తుకం । తత్సమం శుద్ధదరదం జంబీరార్ద్రిక మర్దితం । మందాగ్నిం ఛర్దిరోగంచ శ్వాస కాస మరోచకం । హిక్కాంచ మూత్రకృఛ్రంచ గ్రహణీ మమ్లపిత్తకం । సర్వపైత్య గదధ్వంసీ వాతపైత్యగదాపహం । సూర్యావర్తిరసోనామ ఈశ్వరేణ సుభాషితం

వ్యా॥ ముత్యభస్మ, 4 భా. హేమమాక్షికభస్మ, 4 భా. పొ, టంకణము, 4 భా, వస, 4 భా. పమిడిపత్తిగింజలపప్పు 4 భా. కాకిదొండ విత్తులపప్పు, 4 భా. తిప్పసత్తు, 12 భా, శు. ఇంగిలీకము, 12 భా. వీటిని నిమ్మకాయల రసముచేతను, అల్లపురసముచేతను, మర్దించి సేవించిన అగ్నిమాంద్యము, వాంతులు, శ్వాస,

కాస, అరోచకము, ఎక్కిళ్లు, మూత్రకృచ్ఛ్రము, గ్రహణి. అమ్లపిత్తము, సమస్త పైత్యవ్యాధులను, వాతపైత్యవ్యాధులను, నశింపజేయును. ఈ సూర్యావర్తిరసము ఈశ్వరునిచే చెప్పబడియె.

# సువర్ణసూర్యావర్తి

(సువర్ణ గురుసూర్యావర్తి)

శ్లో॥ భాగమేకం జాతరూపం తదర్థం మృగనాభిః । త్రిభాగం టంకణం చైవ త్రిభాగం నాగకేసరం। లవంగంతు చతుర్భాగం శుంఠీ పంచమభాగకం । ఏలాతు షష్టభాగంచ అమృతాసత్వమేవచ । సప్తభాగం తథా శుద్ధం హింగులం సప్తమభాగకం । లవంగార్ద్రరసేనాపి మర్దితం అష్టవారకం । మాషమాత్ర ప్రయోగేణ అనుపాన విశేషతః పంచహిక్కాం తథా ఛర్దిం శ్వాసం కాస మరోచకం।సమస్తపైత్యకాన్ రోగాన్ జీర్ణజ్వరమజీర్ణకం । ఆస్యపాకం కంఠదాహం హృద్రోగం పాండుకామలాం । ఉన్మాదం మూర్ఛరోగంచ అపస్మారం జ్వరం తథా। మూత్రకృచ్ఛ్రం ప్రమేహాంశ్చ వీర్యనష్టం తథాశ్మరీం । కరపాదదాహం శూలం తృష్ణాంచ గ్రహణీం తథా । నాశయేన్నాత్ర సందేహో వృష్యం చైవ రసాయనం । పుష్ట్యాయుః కాంతిజననం అశ్వినీదేవనిర్మితం।సూర్యావర్తిరసో నామ మహాకనకపూర్వకం । నాతః పరతరంశ్రేష్టం విద్యతే పైత్యనాశనం ॥

వ్యా॥ బంగారుభస్మ, 1 భా. కస్తూరి ½ భా. శు. టంకణము, 3 భా. నాగకేసరములు, 3 భా. లవంగములు, 4 భా. శుంఠి, 5 భా. ఏలకులు, 6 భా. తిప్పసత్తు 7 భా. శు. ఇంగిలీకము 7 భా. వీటిని లవంగములు, అల్లము వీటి రసములచే ప్రత్యేకముగా 8 దినములు మర్దించి అనుపాన భేదముచే మాషప్రమాణము యిచ్చిన అయిదు విధములైన ఎక్కిళ్లు వాంతులు, ఆయాసము, దగ్గు, అరోచకము, అన్ని విధములైన పైత్యవ్యాధులు, జీర్ణజ్వరము, అజీర్ణము, నోటిపూత, కంఠమందు మంట, హృదయవ్యాధులు, పాండువు, కామిర్లు, ఉన్మాదము, మూర్ఛరోగము, అపస్మారము, జ్వరము, మూత్రకృచ్ఛ్రము, ప్రమేహములు, వీర్యనష్టము, అశ్మరి, కాళ్లుచేతులు మంటలు, శూల, దప్పిక, గ్రహణి, వీటిని తప్పక నశింపజేయును. వీర్యవృద్ధిని చేయును. ముసలితనమును వ్యాధులను పోగొట్టును. శరీరపుష్టిని, ఆయుర్దాయాభివృద్ధిని, శరీరకాంతిని కలిగించును, పైత్యమును నశింపజేయుటయందు ఇంతకంటెను శ్రేష్ఠమైనది వేరొకటిలేదు. ఈమహా సువర్ణ సూర్యావర్తి అశ్వినీ దేవతలచే నిర్మించబడెను.

# మహాసువర్ణ సూర్యావరి

## (వంటయోగం)

సీ॥ హేమభస్మమొందు హేమమాక్షికములు కాంతమభ్రకము వైక్రాంతవిద్రుమంబుల భస్మముల్ ! మౌక్తికభస్మంబు కరము వంగంబు టంకణపు భస్మ పరిశుద్ధ గంధకంబు । హరిశృంగ భస్మంబు రససిందురంబును రౌప్యభస్మపాళులు రెండేసి। పచ్చగవ్వల బూడిదె నాగసిందూరంబు నాల్గు నాల్గు దరదంబెంచ పదినారుగా గూరిచి । నిమ్మ దాడిమఫలనీరములను నారంగఫలము వారిని పులిచింతవారిని । యామలకఫలరసముల మాతులుంగరసాన మహితమౌ దబ్బకాయల నీట నూరి । సరియనగ రాగిపాత్రను యామంబు మాత్రలుజేసి వాలుకాయంత్రాన ఝామములు నాల్గు వచియించి తీసి । శుభ్రపుతిప్ప సత్తును కాకబింబీబీజములు పైడిపత్తివిత్తనములు మెత్తగ।సమపాళ్లు దంచి మందుకు సరిదనర జేసి తొల్లిటి రసములతో । నేడుదినములు నూరి యందునను కస్తూరి పచ్చకర్పూరకుంకుమల్ గల్పి కుప్పె లమర్చి రేపు । మాపును గుంజరీతి గ్రోల పైత్యకామిలములు పైత్యహృద్రోగములు । పరిణామశూలల బారద్రోలు షండతల్ మూర్ఛలు కందువుల్ రుధిరముల్। పైత్యదద్దురములు బాయజేయు మేహముల్ దుస్తరదాహముల్ కరపాదదాహముల్ వహ్నులు దరిమివైచు। పైత్యకాకలు మహాపైత్య పైత్య మపస్మారగదములను కృమి శూలగదలడంచు । పైత్యవాయులను పైత్యమేహంబుల పైత్యహిక్కల నెల్ల భస్మ జేయు । మందాగ్నులను ఘోరమారుత మరిశలు పిచ్చులున్మాదముల్ బెరకివైచు । మూత్రకృచ్ఛ్రలు బహుమూత్రముల్ కుష్ఠులు శోఫలు పాండువుల్ శూలలార్చు! జ్వరములు సన్నులు శ్వాసముల్ కాసలు శ్లేష్మముల్ గ్రహణులు గెంటివైచు । వీర్యవృద్ధి యొనర్చు నవార్యమైన వంధ్యతలు మాన్పు నశ్మరుల్ త్రోచివైచు। నరుచులును గూల్చు శోఫల నార్చివైచు మహాకనకసూర్యావర్తిరసము నగుచు ॥

టీ॥ బంగారభస్మ, 1 భా. హేమమాక్షికభస్మ 2 భా. కాంతభస్మ, 2 భా. అభ్రకభస్మ, 2 వైక్రాంతభస్మ, 2 భా. పగడభస్మ, 2 భా. ముత్యభస్మ, 2 భా. వంగభస్మ, 2 భా. టంకణభస్మ, 2 భా. శు. గంధకము, 2 భా. ముప్పికొమ్ముభస్మ, 2 భా. రససింధూరము, 2 భా. వెండిభస్మ, 2 భా. పచ్చగవ్వలభస్మ, 4 భా. నాగ సింధూరము, 4 భా. శు. ఇంగిలీకము, 16 భా. వీటిని నిమ్మకాయలు, దానిమ్మ కాయలు, నారింజపండ్లు, పులిచింత, ఉసిరిపండ్లు, మాదీఫలములు, దబ్బకాయలు, వీటి రసములచే నూరి రాగిపాత్రయందు మాత్రలుచేసి వాలుకాయంత్రమందు నాలుగుఝాములు వండి తీసి, తిప్పసత్తు, కాకిదొండవిత్తనములపప్పు, పమిడిపత్తి విత్తనములపప్పు ఇవి సమభాగములు గ్రహించి మెత్తగదంచి పూర్వపుమందుతో సమానముగ తూచుకుని దానితో కలుపుకుని మొదటి రసములతో అనగా? నిమ్మ కాయలు, దానిమ్మకాయలు మొదలగు వాటిరసములచె ఏడురోజులు నూరుకుని అందు కస్తూరి పచ్చకర్పూరము, కుంకుమపువ్వు కలిపి కుప్పెలు, చేసుకుని రెండువేళలయందు గుంజాప్రమాణము సేవించిన పైత్యకామిర్లు, పైత్యప్రమేహరోగములు, పరిణామశూలలు, నపుంసకత్వము, మూర్ఛలు, వ్యాధులు, పైత్యదద్దుర్లు, మేహములు, మంటలు, కాళ్ళు చేతులు మంటలు, పైత్యకాకలు, మహాపైత్యములు, పైత్యములు, అపస్మారములు, కృమిశూలలు, పైత్యవాతములు, పైత్యమేహములు, పైత్యహిక్కలు అగ్నిమాంద్యము, వాతవ్యాధులు అర్శస్సు, పిచ్చులు, ఉన్మాదములు, మూత్రకృచ్ఛ్రము, బహుమూత్రము, కుష్టములు. సంజులు, పాండువులు, శూలలు, జ్వరములు, సన్నిపాతములు, ఆయాసములు, దగ్గులు, శ్లేష్మవ్యాధులు, గ్రహణులు, వీటిని నశింపజేయును. వీర్యవృద్ధిని చేయును. వంధ్యతలను, అశ్మరులను అరుచులను, శోఫలను హరించును. ఇది మహాసువర్ణ సూర్యావర్తి రసమనందగును.

## హుతాశనరసం

శ్లో॥ ఏకం ద్విద్వాదశభాగమానం యోజ్యం విషం టంకణ మూషణంచ । హుతాశనో నామ హుతాశనస్య కరోతి వృద్ధిం కఫవాతహంతా॥

వ్యా॥ శు. నాభి 1 భా. శు. టంకణము 8 భా, మిరియాల చూర్ణము, 12 భా, వీటిని జలముచే నూరుకునవలెను. ఇయ్యది హుతాశన మనంబడు. ఇది అగ్ని వృద్ధిని జేయును. కఫవ్యాధులను, వాతవ్యాధులను హరించును.

## హుతాశనరసం

శ్లో॥ గంధేశ టంకాశ్చైకైకా విషమత్ర త్రిభాగకం। అష్టభా గంతు మరిచం జంబ్వాంభోమర్దితం దినం। తద్వటీంముద్గమానేనకృత్వా

దేణ్రిణ ప్రయోజయేత్ । శూలారోచక గుల్మేషు విషూచ్యాం వహ్ని మాంద్యకే । అజీర్ణసన్నిపాతాదౌ శైత్యరోగే శిరోగదే॥

వ్యా॥ శు. గంధకము, 1 భా. శు. రసము, 1 భా. శు. టంకణము, 1 భా, శు. నాభి, 3 భా. మిరియాలు 8 భా. వీటిని నిమ్మకాయల రసముచే నొక రోజు మర్దించి పెసరగింజంత మాత్రచేసి అల్లపు రసముచే శూల, అరోచకము, గుల్మము, విషూచి, అగ్నిమాంద్యము, అజీర్ణము, సన్నిపాతము మొదలగు వ్యాధులు, శైత్య రోగములు, శిరోరోగము, వీటియందు యివ్వవలెను.

# హుతాశన రసం

శ్లో॥ ఏకాంశకాః పారదగంధ టంకాః కపర్దశంఖామృత గేహ ధూమాః।త్ర్యంశా ఇమేథోమరిచంత్విభాంశంసంమర్దితఃజంభరసేనగాఢం। గుల్మారోచకవహ్నిసదనాజీర్ణం విషూచీంకఫంజాడ్యంశీర్షసముద్భవంచకసనం ముద్గప్రమాణావటీ । లీఢార్ద్రకస్య రసేన హంతి కధితానేతాన్ గదాన్ బ్రహ్మణా పూర్వం నిర్మిత ఏషయత్నశతైర్నామ్నాహుతాశో రసః ॥

వ్యా॥ శు. పాదరసము, 1 భా. శు. గంధకము, 1 భా. శు. టంకణము. 1 భా. గవ్వలభస్మ, 3 భా. శంఖభస్మ 3 భా. శు. నాభి, 3 భా. కరిధూపము 3 భా. మిరియాలు, 8 భా. వీటిని నిమ్మకాయ రసముచే దృఢముగా మర్దించి పెసర గింజంత మాత్రను, అల్లపు రసముచే సేవించిన, గుల్మము, అరోచకము, అగ్నిమాంద్యము, అజీర్ణము, విషూచీ, కఫము, శిరోరోగము, యీవ్యాధులను హరించును. ఈహుతాశన రసము బ్రహ్మచే పూర్వకాలమందు అనేక ప్రయత్నములచె నిర్మించ బడినది.

# వాతాగ్నికుమార రసం

శ్లో॥ పారదం గంధకం తుల్యం తాలకం తుర్యభాగకం । తాంబూలీ రసతోమర్ద్యం మాసమేకం ప్రయత్నతః । తతః సూర్యపుటం కృత్వా పునరేవచమర్దితం । కాచకుప్యాం వినిక్షిప్య సికతాయంత్రపాచితం । సాంగశీతల ముద్ధృత్యఅనుపానవిశేషతః । సమస్తవాతరోగేషు జ్వరే జీర్ణే తథైవచ । కాసే శ్వాసే క్షయేచైవ కఫరోగేషు యోజయేత్ । శ్లేష్మజ్వరేషు సర్వేషు శీతజ్వరే తథైవచ। వాతాగ్నికుమారో నామ్నా ఖ్యాతం భువనమండలే ॥

వ్యా॥ శు. పాదరసము 8 భా. శు. గంధకము, 8 భా, శుతాళకము ¼ భా వీటిని ఖల్వమందుంచి తమలపాకులరసముచే ఏకమాసము మర్దించి సూర్యపుటము వేసి మరల మర్దించి కాచకుప్పెయందుంచి వాలుకాయంత్రమందు వండి స్వాంగశీతలమున తీసి అనుపాన విశేషములచే, సమస్తమైన వాతవ్యాధులు, జీర్ణజ్వరము, దగ్గు, ఎగరుప్పు, క్షయ సమస్తమైన శ్లేష్మవ్యాధులు, శ్లేష్మజ్వరములు, శీతజ్వరము, వీటియందు యివ్వవలెను. భూమండలమందు వాతాగ్నికుమారమని ప్రసిద్ధమైనది.

## శీతాంశు రస

శ్లో॥ కునటీశుద్ధతాలంచ తద్వ్యగ్మం వ్యోషకం భవేత్ । మర్దయే న్నింబనీరేణ గుంజాయుగ్మంతు సేవయేత్ । అనుపానం మధు పథ్యా హ్యుష్ణవారి తథార్ద్రకం । శీతజ్వరం సన్నిపాతం కామలాం పంచ గుల్మకం । సర్వం శ్వాసంచ కాసంచహ్యుదరే పూర్వరూపజిత్ । సన్నిపాతం తథా ఛర్ది మశీతివాతపైత్యకం । శూలం శూకా జీర్ణం శూలం నాభౌ కుక్షౌచ విద్రధిం । ఆధ్మానా నాహవిష్టంభం తాపం సర్వాంగదాహకం । జంగమస్థావరవిషం హిక్కాం దీప్తేశ్చ కారణం । శోఫంచ భ్రమమూర్ఛాంచ తిమిరం చాను విధ్యతి । మర్దితం నింబతోయేన లేపితం గజచర్మకం । విసర్పమండలే చైవతుపాచర్మ వ్యపోహతి । సేవితం లేపితం కుర్యాద్వేధితం గ్రంధి మర్బుదం । లేపితం దంతరోగాంశ్చ జిహ్వానేత్రరుజ స్తథా। అర్కపత్రరసైః కర్ణేకర్ణరోగస్య నాశనం । నిర్గుండీ మిశ్రితం నస్య మపస్మారం శిరోరుజం । అంజనం సర్షపమాత్రం నేత్రరోగవినాశనం । మాషంచ సన్నిపాతానాం కామలా జ్వరశీతకే । ధనుర్వాతం తథా భూతం శేషరోగేషు కా కథా । భాషితం రేవణేనైవ రసం శీతాంశునామకం ॥

వ్యా॥ శు. మణిశిల 1 భా, శు తాళకము 1 భా, త్రికటుచూర్ణము 2 భా, వీటిని ఖల్వమందుంచి వేపచెక్కరసముచే మర్దించి, తేనె కరక్కాయ వేడినీళ్లు అల్లము, వీటితో రెండుగురిగింజల ప్రమాణము సేవించిన, శీతజ్వరము, సన్నిపాతజ్వరము, కామిర్లు, అయిదుగుల్మములు, శ్వాస, కాస. ఉదరరోగ పూర్వరూపములు, సన్నిపాతము, వాంతి, ఎనుబదివాతములు, పైత్యములు, శూల, శూకరోగము, అజీర్ణము, బొడ్డుయందు, కడుపుయందు శూల, విద్రధి, కడుపు ఉబ్బరము, ఆనాహవాతము, విష్టంభవాతము, తాపము, సమస్తశరీరము మంట, జంగమవిషము, స్థావరవిషము, ఎక్కిళ్లు, అగ్నిమాంద్యము, వంజు, భ్రమ, మూర్ఛ, తిమిరవాతము,

వీటిని హరించును. వేపఆకు రసముచే నూరి లేపనచేసిన, గజచర్మము, విసర్పము, మండలకుష్టము, శరీరమున పొట్టువలె ఊడిపోవుట, వీటిని హరించును. కత్తివాట్లు వేసి లేపనముచేసి లోపలకు పుచ్చుకనిన గ్రంధి, అర్బుదము, నశించును. లేపనముచేసిన దంతరోగములు, జిహ్వారోగములు, నేత్రరోగములు, వీటిని హరించును, జిల్లేడాకు రసముచే చెవిలోపోసిన కర్ణరోగములు, వావిలాకు రసముతో నూరి నస్యముచేసిన, అపస్మారము, శిరోరోగములు, హరించును. సర్షపప్రమాణము కన్నులయందు కలికము వేసిన నేత్రరోగములు నశించును. మాషప్రమాణము ఇచ్చిన, సన్నిపాతములు కామిర్లు, శీతజ్వరములు, ధనుర్వాతము, భూతచేష్టలు, హరించును. ఇట్లు ప్రబలరోగములనే హరించుచుండ ఇతరరోగముల సంగతి ఏమి చెప్పవలయును. (అనగా? అన్ని రోగములను, హరించునని అర్థము.) ఇదిశేవణునిచే చెప్పబడిన శీతాంశు రసము.

# సువర్ణపుష్పరసాయనం

శ్లో॥ ద్విభాగం పారదం శుద్ధం గంధకంచ తథావిధం । రజతంచ తథావంగం భాగమేకం తదర్ధకం । సువర్ణంచ పటీకారం టంకణంచ తథావిధం । భాగద్వయం నవాసారం చూర్ణయిత్వా భిషగ్వరైః । కాచకుప్యాం వినిక్షిప్య వాలుకాయంత్రకే పచేత్ । సాంగశీతల ముద్ధృత్య భక్షయేచ్ఛ నిరంతరం । మండలం మండలార్ధంవా గుంజాద్వ యప్రమాణతః । అశ్మరీం మూత్రకృఛ్రంచ సర్వమేహానికృంతనం । దేహపుష్టికరం నృణాం పుత్రప్రసవకారణం। వీర్యవృద్ధిం బలవృద్ధిం కురుతే నాత్ర సంశయః । మహారాజోపచారేణ పథ్యం దద్యాద్యథా విధి । పూజ్యపాదేన కధితం సువర్ణపుష్పరసాయనం॥

వ్యా॥ శు. రసము, 2 భా. శు. గంధకము, 2 భా. వెండిభస్మ, 1 భా. వంగ భస్మ, 1 భా. సువర్ణభస్మ, ½ భా. పటిక, ½ భా, టంకణము, ½ భా. నవాసారము 2 భా. వీటిని చూర్ణించి కాచకుప్పెయందుంచి వాలుకాయంత్రమందు పచించి చల్లారి నపిదప తీసి రెండుగుంజల ప్రమాణము మండలముగాని అర్ధమండలముగాని విడవకుం డసేవించిన అశ్మరి, మూత్రకృఛ్రము, సర్వమేహములు, వీటిని నశింపజేయును. శరీర పుష్టి వీర్యవృద్ధి, బలవృద్ధి, వీటిని తప్పకచేయును, పుత్రసంతానమును కలుగజేయును. మహా రాజోపచారముగా యథావిధిగా పథ్యము యివ్వవలెను. ఈ సువర్ణపుష్పరసా యనము పూజ్యపాదునిచే చెప్పబడినది.

# జ్వరాంకుశ రసం.

శ్లో॥ సూతం గంధం విషతుల్యం ధూర్తబీజం త్రిభి స్సమం।చతు

ర్ణాం ద్విగుణం వ్యోషం చూర్ణయే ద్దినమాత్రకం । జంబీరస్య రసై ర్శర్వ్ మార్ద్రికస్యద్రవేణచ । గుంజాద్వయం ప్రదాతవ్యం వాతజ్వర హరం పరం । ఇదం జ్వరాంకుశం నామ్నా సర్వజ్వరవినాశనం । ఐకాహికం ద్వ్యాహికంచ త్ర్యాహికం వా చతుర్థకం । విషమంవా త్రిదోషంవా హంతి సత్యం న సంశయః ॥

వ్యా॥ శు. రసము, 1 భా. శు. గంధకము, 1 భా. శు. నాభి, 1 భా. శు. ఉమ్మెత్త విత్తులు 3 భా. త్రికటుకములు, 12 భా. ఇవి చూర్ణించి, నిమ్మకాయల రసముచేతను, అల్లపు రసముచేతను, ఒక రోజు మర్దించి, రెండు గురిగింజల ప్రమాణము యిచ్చిన, వాతజ్వరము, సర్వజ్వరములు, ఐకాహికము, ద్వ్యాహికము, త్ర్యాహికము, చతుర్థకము, విషమజ్వరము, త్రిదోషజ్వరము, వీటిని ఈ జ్వరాంకుశము హరించును. సంశయములేదు.

## మహాజ్వరాంకుశ రసమ్

శ్లో॥ పారదం గంధకం తామ్రం హింగులం తాలమేవచ । లోహం వంగం మాక్షికంచ ఖర్పరంచ మనశ్శిలా । మృతాభ్రకం గైరికంచ టంకణం దంతిబీజకం । సర్వాణ్యేతాని తుల్యాని చూర్ణయిత్వా విభావయేత్ । జంబీర తులసీ చిత్ర విజయా తింత్రిణీరసైః । ఏభి ర్దిన త్రయం శార్ద్రే నిర్జనే ఖల్వగహ్వరే । చణమాత్రాం వటీం కృత్వా ఛాయాశుష్కాంచ కారయేత్ । మహాగ్ని జననీ చైషా సర్వజ్వరవినాశనీ । ఏకజం ద్వంద్వజంచైవ చిరకాల సముద్భవం । ఐకాహికం ద్వ్యాహికంచ తథా త్రిదివసజ్వరం । చాతుర్థకం తథాత్యుగ్రం జలదోషసముద్భవం । సర్వాన్ జ్వరా న్నిహంత్యాశు భాస్కర స్తిమిరం యథా । నాతః పరం కించిదస్తి జ్వరనాశనభేషజం । మహాజ్వరాంకుశో నామ రసోయం మునిభాషితః ॥

వ్యా॥ శు. పాదరసము, శు. గంధకము, తామ్రభస్మ, శు, ఇంగిలీకము, శు, తాళకము, లోహభస్మ, వంగభస్మ, మాక్షికభస్మ, శు. కపరి, శు. మణిశిల, అభ్రకభస్మ, కావిరాయి, శు. వెలిగారము, శు. నేపాళములు, ఇవన్నియు సమ వీటిరసములచే భయంకరమైనటువంటిన్ని నిర్జనమైనటువంటిన్ని, ప్రదేశమందు, మర్దించి, సెనగగింజలంతమాత్రలు చేసి నీడను ఎండించుకొని సేవించిన, మిక్కిలి అగ్ని

ప్తినిచేయును. సర్వజ్వరములు, ఏకదోషజనితజ్వరములు, ద్వంద్వజ్వరములు, చిరకాలమైజనించిన జ్వరములు, ఐకాహికజ్వరము, ద్వ్యాహికజ్వరము, త్ర్యాహికజ్వరః చాతుర్థికజ్వరము, అత్యుగ్రమైనజ్వరము, జలదోషజనితజ్వరము, మొదలగు సమజ్వరములను, సూర్యుడు చీకటిని హరించురీతి హరించును. ఇంతకంటెను శ్రేష్టమైన జ్వరమును హరించుమందు వేరొకటిలేదు. ఈ మహాజ్వరాంకుశరసము మునీశ్వరులచే చెప్పబడినది

## లోకనాథ రసమ్

శ్లో॥ వరాట తుల్యా మాండూరం తదర్ధం తీక్ష్ణలోహకం । తత్పాదాంశం మృతం సూతం సూతాద్ద్విగుణ గంధకం । ఖల్వోదరే వినిక్షిప్య మర్దయే ద్దివసత్రయం। వర్షాభూ మూలసారేణవజ్రవల్లీరసేనచ। వాసాసాతలకేనాపి చిత్రమూలేన మర్దయేత్ ।గోలకం చాతపే శోష్యం దినాంతం తు వినిక్షిపేత్ । శరావేణ చ మద్వాగ్నౌ కుక్కుటీ పుటవద్భవేత్ । సూక్ష్మచూర్ణం తతః కృత్వా తత్సమం మారిచం రజః । భావనానంతరం ద్రవ్యం నాగవల్లీరసార్ద్రకం । భృంగరాజంచ నిర్గుండీ ముండీ శిగ్రు రసంతథా । త్రిఫలారసభావేన ఛాయాశుష్కంతు కారయేత్ । నిష్కార్ధం మధునా లేహ్యాం యామే యామేచ భక్షయేత్ । క్షయం క్షయకృశం వ్యాధీన్ వాతపిత్త కఫోద్భవాన్ । కాస శ్వాస ప్రతిశ్యాయ శోఫ పాండు గదాదికాన్ । హలీమకం చాస్థిగతం వినిహంతిచ సత్వరం । దీపనం వీర్యవృద్ధించ కారయే న్నాత్ర సంశయః । లోకనాథ రసో నామ శంభునా పరికీర్తితః ॥

వ్యా॥ గవ్వలభస్మ, 1 భా. మాండూరభస్మ, 1 భా. తీక్ష్ణలోహభస్మ, $\frac{1}{2}$ భా. సూతభస్మ, $\frac{1}{8}$ భా. శు. గంధకము, $\frac{1}{4}$ భా. వీటిని ఖల్వమందునిచి గలిజేరు, నల్లేరు, అడ్డసరము, సాంబరేణి, చిత్రమూలము వీటిరసములచే మూడురోజులు మర్దించి మాత్రలుచేసి ఒకరోజుఎండించిశరావములయందుంచిమందాగ్నిచేత కుక్కుటపుటమువేసి పిదప మెత్తగనూరి ఆమందునకు సమానముగ మిరియాలచూర్ణము కలిపి, పాకులు, అల్లము, గుంటగలగర, వావిలి, బోడతరము, మునగచెక్క, త్రిఫలములు రసములచే భావనచేసి నీడనుఎండించి అర్ధనిష్కప్రమాణము, తేనెతో ప్రతిదినము సేవింపుచుండినక్షయ, క్షయచేగలిగిన శరీరకృశత్వము, వాత, పిత్త, కఫములవలన పుట్టినవ్యాధులు, దగ్గు, వగర్పు, జలుబు, నంజు, పాండువు మొదలగు వ్యాధులు, హలీమకము, అస్థిగతజ్వరము, వీటిని వెంటనేహరించును. అగ్నిదీప్తిని, వీర్యవృద్ధి యును. ఈలోకనాథరసము శివుచే చెప్పబడినది

## మహాలోకనాథరసం

శ్లో॥ శుద్ధో బుభుక్షిత స్సూతో భాగద్వయమితో భవేత్ । తథా గంధస్య భాగౌ ద్వౌకుర్యాత్కజ్జలికాం ద్వయోః । సూతా చ్చతుర్గుణే ష్వేష కపర్దేషు వినిక్షిపేత్ । భాగైకం టంకణం దత్వా గోక్షీరేణ విమర్దయేత్ । తథా శంఖస్య ఖండానాం భాగా నష్టౌ ప్రకల్పయేత్ । క్షిపేత్సర్వం పుటస్యాంతః చూర్ణలిప్తశరావయోః । గర్తేహస్తోన్మితే ధృత్వా పచే ద్గజపుటేనచ । సాంగశీతం సముద్ధృత్య పిష్ట్వా తత్సర్వమేకతః । మధ్యుంజాసమ్మితం చూర్ణ మనుపానవిశేషతః । క్షయం చాతిసారంచ శ్వాసం కాస మరోచకం। అజీర్ణం గ్రహణీదోష మామం శూల మథాపివా । శ్లేష్మజా న్వివిధాన్ రోగాన్నాశయే న్నాత్ర సంశయః । మహాలోకనాథరసో నామ్నా సర్వారోగా న్వినాశ యేత్ ॥

వ్యా॥ శుద్ధిచేయబడి బుభుక్షితంబైన పాదరసము 2 భా, శుగంధకము 2 భా, ఈరెండిటిని కజ్జలిచేసి 8 భాగముల గవ్వలలోంచించి, 1 భాగము టంకణము, ఆవు పాలతో నూరి గవ్వలముఖములకుపూసి, వీటిని, శంఖపుముక్కలు 8 భా, వీటినన్నిటిని మూషల్ళయందుంచి శీలయిచ్చి మూరప్రమాణముగలగోతినిత్రవ్వి గజపుటమువేసి సాంగశీతలమునతీసి వీటిఅన్నిటిని కలిపినూరి, అరుగింజలప్రమాణము అనుపానవిశేష ములచే సేవించిన, క్షయ, అతిసారము, ఆయాసము, దగ్గు, అరుచి, అజీర్ణము, గ్రహ ణీదోషము, ఆమదోషము, శూల, శ్లేష్మసంబంధమైన అన్నివ్యాధులను తప్పకనశింప జేయును. ఈమహాలోకనాథరసము సర్వరోగములను నశింపజేయును.

నో— ఈయోగమందు వ్యాధిభేదముచే అనుపానములును, పథ్యమును, చెప్ప బడినను గ్రంథవిస్తరభీతిచే వ్రాయ లేదు.

## సువర్ణ లోకనాథరసం

సీ॥ కాంచనభస్మంబు కరమొక్కపాలును. పారదంబును రెండు శుద్ధగంధకము మూడు । విషము నాలుగు తీక్ష్ణలోహంబు కాంతంబు లోహమైదు నారును మాండూరు మారును దరం బేడును సిందతార మేడు నభ్రకం బైదు శుద్ధటంకణమారు । గ్రహించి త్రిఫలసారమున తెగడనీట వారాహి రసమున వావిలిరసమున । చింతాకురసమున

శిగ్రుకందరసాన నుమ్మెత్తరసాన జిల్లేడుపత్రరసంబున। బ్రాహ్మినీట తెలిపునర్నవనీట కలగరాకురసాన వెర్రిపుచ్చకాయల చెలయు నీట । సాంబ్రాణిపత్రరసమున అపామార్గరసమున నల్లేరురసముతోడ । గొబ్బివేళ్లరసాన కూతురుబుడమాకురసమున వరగోగురసముతోడ । నొక్కొక్కదానిచే నొక్కొక్కదివసంబు మర్దించి కుప్పెనమర్చి । వాలుకాయంత్రమునను । జక్కగ నాల్గుజాములు బలిజీర్ణమగునట్లు పాకపరచి । కుక్కుటమాహిష కోతియు మాయూర చాప చేదులనందు చేర్చి । పిదప తొల్లిటిరసములతో పదునెన్మిది వాసరములు నూరి వల్లమాత్రము । త్రిఫలకషాయమున దినిన శోఫలు రాజయక్ష్మలు పాండురాజ నణచు। మారుతంబులు నగ్నిమాంద్యముల్ షండతల్ శ్వాస కాసలు । మూర్ఛ సంహరించు కామిలాదులనెల్లను గండడంచు । సూతికావాతములు శూల లోరయజేయు । సన్నిపాతజ్వరంబు సమయజేయు । ధరను సువర్ణలోకనాథ రసమునగుచు॥

టీక॥ బంగారుభస్మ 1 భా. శు. పాదరసము 2 భా. శు. గంధకం 3 భా. శు. నాభి, 4 భా. ఖడ్గలోహము 5 భా. కాంతలోహము 6 భా, మాండూరము 6 భా. శు. ఇంగిలీకము 7 భా. రససిందూరము 7 భా. అభ్రకభస్మ 5 భా. శు. టంకణము 6 భా. వీటిని, త్రిఫలములు, తెగడ, నేలతాడి, వావిలి, చింతాకు, మునగ వేళ్లు, ఉమ్మెత్త, జిల్లెడు, సరస్వతి, తెల్లగలిజేరు, గుంటగలగర, వెర్రిపుచ్చకాయలు సాంబ్రాణిఆకు, ఉత్తరేణి, నల్లేరు, గొబ్బివేళ్ళు, కూతురుబుడుమ, వరగోగు, వీటి రసములచే ప్రత్యేకముగా నొక్కొకదినముమర్దించి కాచకుప్పెయందుంచుకొని వాలుకాయంత్రమందు నాలుగుఝాములు గంధకము జీర్ణమగునట్లుగా వండుకొని తీసి, కోడి, దున్నపోతు, కోతి, నెమలి, చేప, వీటిచేదులను, చేర్చి మొదటిరసములచే 18 రోజులు నూరి వల్లిప్రమాణము త్రిఫలకషాయముతో సేవించిన, నంజు, రాజయక్ష్మ, పాండువు, వాతవ్యాధులు, అగ్నిమాంద్యము, నపుంసకత్వము, శ్వాస, దగ్గు, మూర్ఛ, కామిల్లు, సూతికావాతము, శూల, సన్నిపాతజ్వరము, వీటిని నశింపజేయును. సువర్ణ లోకనాథమని ప్రసిద్ధమైనది.

## అభ్రకయోగం.

శ్లో॥ నిశ్చంద్ర మభ్రకం భస్మ సవరా రజనీరజః । మధునా లీఢమచిరాత్ ప్రమేహా న్వినివర్తయేత్ ॥

వ్యా॥ చంద్రిక లేని అభ్రకభస్మము, త్రిఫలచూర్ణము, పసుపుచూర్ణములతో తేనె, కలిపి సేవించిన ప్రమేహములను వెంటనే నివర్తింపజేయును.

## లోహరసాయనం

శ్లో॥ రసంచ తీక్ష్ణలోహంచ భాగమేకం ప్రకల్పయేత్ । గంధకంచ ద్విభాగంచ ఖల్వమధ్యే వినిక్షిపేత్ । వజ్రవల్లీ సహదేవీ కన్యార్క త్రిఫలా రసైః । గోమూత్రేణచ సంమర్ద్య కాచకుప్యాం వినిక్షిపేత్ వాలుకాయంత్రకే పాచ్య మగ్నిత్రయవిభాగతః । గతోష్ణక ముద్ధృత్య పూర్వైరేవ రసైః పునః । మర్దిత మర్ధమాసంచ గుంజాత్రయ నిషేవణాత్ । శోఫం పాండుం క్షయం శూల మజీర్ణం కామలాం తథా । జీర్ణజ్వరం తథాధ్మానం కఫవాతగదాం స్తథా । నాశయత్యేవ క్షిప్రంచ నామ్నా లోహరసాయనం॥

వ్యా॥ శు. రసము, 1 భా. ఖడ్గలోహము, 1 భా, శు, గంధకము, 2 భా. ఇవిఖల్వమందుంచి, నల్లేరు, సహదేవి, కలుబంద, జిల్లేడు, త్రిఫలములు, వీటి రసముల చేతను, గోమూత్రముచేతను, మర్దించి కాచకుప్పెయందుంచి వాలుకాయంత్రమందు మందమధ్యమతీక్ష్ణాగ్నులచే వండి చల్లారినపిదప తీసి పూర్వపురసములచే అర్ధమాసము మరలమర్దించి మూడుగురిగింజల ప్రమాణము సేవించిన వంజు, పాండువు, క్షయ, శూల, అజీర్ణము, కామిర్ల, జీర్ణజ్వరము, కడుపుబ్బరము, కఫవ్యాధులు, వాతవ్యాధులు, వీటిని వెంటనే నశింపజేయును. లోహరసాయనంబనెడి పేరం బరగు,

## ఆనందభైరవరసం.

శ్లో॥ హింగులంచ చతుర్భాగం టంకణం వసు సమ్మితం। కణాచ వత్సనాభంచ ప్రత్యేక మినసంఖ్యయా । ఆర్ద్రికస్య రసేనైవ మాసాని త్రీణి మర్దయేత్ । ఆర్ద్రికస్య రసేనైవ గుంజామాత్రం ప్రదాపయేత్ । సర్వేషు సన్నిపాతేషు రస మానందభైరవం॥

వ్యా॥ శు. ఇంగిలీకము 4భా. శు. టంకణము 8భా. పిప్పళ్లు 12భా. శు. నాభి 12 భా, వీటిని అల్లపురసముచే మూడుమాసములు మర్దించి అల్లపురసముతో వకగురిగింజ ప్రమాణముయిచ్చిన సమస్తసన్నిపాతములను హరింపచేయును. ఆనందభైరవ రసమని ప్రసిద్ధమైనది.

## ఆనందభైరవరసము.

శ్లో॥ హింగులంచ విషం వ్యోషం మరిచం టంకణం కణాం। మాతులుంగ రసైః ర్మర్ద్యంచతుర్మాసం ప్రయత్నతః । కాసే శ్వాసే క్షయేగుల్మే ప్రమేహే విషమజ్వరే । తృష్ణాయాం గ్రహణీ రోగే వ్యజీర్ణే సన్నిపాతకే। గుంజైకంతు ప్రదాతవ్యం రసమానందభైరవం॥

వ్యా॥ శు. ఇంగిలీకము, శు. నాభి, త్రికటుకములు, మిరియాలు, శు. టంకణము, పిప్పళ్లు ఇవిసమభాగములు, మాదీఫలరసముచే నాలుగుమాసములు బాగుగ మర్దించి, కాస, శ్వాస, క్షయ, గుల్మము, ప్రమేహములు, విషమజ్వరము, దప్పిక, గ్రహణీరోగము, అజీర్ణము, సన్నిపాతము, వీటియందు ఈఆనందభైరవమును వకగురిగింజప్రమాణము యివ్వవలెను.

## ఆనందభైరవరసం.

శ్లో॥ దరదం వత్సనాభంచ మరిచం టంకణంకణాం। చూర్ణయే త్సమభాగేన జంబీరరసమర్దితం। షణ్మాసంచదృఢంచైవ రసోహ్యానందభైరవః। గుంజైకంవా ద్విగుంజాంవా బలం జ్ఞాత్వా ప్రయోజయేత్। మధునా లేహయేనుచ్చానుకుటజస్య ఫలంత్వచం! చూర్ణితంకర్ష మాత్రం తు త్రిదోషోత్థాతిసారజిత్। దధ్యన్నం దాపయే త్పథ్యం గవ్యాజ్యం తక్రమేవచ। పిపాసాయాం జలంశీతం విజయాంచ హితా నిశి॥

వ్యా॥ శు. ఇంగిలీకము, శు. నాభి, మిరియాలు, శు. టంకణము, పిప్పళ్లు, ఇవి సమభాగములు చూర్ణించి ఖల్వమందుంచి నిమ్మకాయలరసముచే ఆరునెలలు దృఢముగా మర్దించిన ఆనందభైరవరసమనబడును. రోగియొక్క బలమును తెలుసుకొని వకగురిగింజప్రమాణముగాని రెండు గురుగింజల ప్రమాణముగాని తేనెతోయిచ్చిపిదప, కొడిశపాలవిత్తులచూర్ణము, పట్టచూర్ణము, వీటిని వకకర్షప్రమాణము యిచ్చిన త్రిదోషములవలనకలిగిన అతిసారమునునశింపజేయును. పెరుగుఅన్నము, ఆవునెయ్యి, ఆవుమజ్జిగ పథ్యముగాయివ్వవలెను. దప్పికఅయినపుడు చల్లటినీళ్లు యివ్వవలెను. రాత్రులయందు గంజాయిఆకు యిచ్చుటమంచిది.

## వంగభస్మప్రయోగం.

శ్లో॥ వంగం శిలాజతు యుతంతు మతం ప్రమేహేధాతుక్షయే దుర్బల నష్టశుక్రయోః । అభ్రేణయుక్తంతు సుత్యపదంస్యా జ్జాతీఫలా

ర్క కరహాట లవంగయుక్తం । శాల్మలీత్వగ్రసోపేతం సక్షౌద్రరజనీరజః । వంగభస్మహరేన్మేహాన్ పంచాననఇవద్విపాన్ । గుడూచీసార మధు నా వంగభస్మ ప్రమేహజిత్ । నాగభస్మతద్వైవాపి సర్వమేహవినాశనం॥

వ్యా॥ వంగభస్మ, శిలాజితుతోయిచ్చిన ప్రమేహము, ధాతుక్షయ, దౌర్బ ల్యము, శుక్రనష్టము, వీటిని నశింపజేయును. అభ్రకభస్మతో కలిపిసేవించిన పుత్రుని కలిగించును. జాజికాయలు, జిల్లేడు, కరహాటకము, లవంగములు, బూరుగబంక, దాంచి నచెక్క వీటితోను, తేనె, పసుపుచూర్ణముతోను, తిప్పసత్తు, తేనెతోడను సేవించిన సింహము ఏనుగులనుహరించు రీతి ప్రమేహములను హరించును. ఆప్రకారముగానే సీసభస్మముకూడ సమస్తప్రమేహములను నశింపజేయును.

## నవగ్రహి

శ్లో॥ గౌరీశిలా హింగుల గంధకేచ రసంచ గోదంత మయూర తుత్థం। తాలం శిలా ఖర్పరి సంయుతంచ సామ్యేన కృత్వా నవఖల్వమ ధ్యే । సుకారవల్లీ రస నింబతోయై ర్విమర్దయే త్సార్ధదినంచ గాఢం । తతో మూషికామధ్య మానీతంచ వాలుకాయంత్రకే పాచితంతథా । అనుపానవిశేషై ర్దాతవ్యో యం సర్వరోగేషు యథా బలంధీమాన్॥

వ్యా॥ శుద్ధులుచేయబడిన, గౌరిపాషాణము, ఉల్లిపాషాణము, ఇంగిలీకము, గంధకము, పాదరసము, తాళకము, శైలతుత్థం, పిండతాళకము, మనశ్శిల, కపురి, ఇవిసమభాగములుగ్రహించి మంచి ఖల్వమందుంచి, కాకరాకురసము, వేపఆకురసము, వీటితో వకటిన్నరరోజు గాఢముగామర్దించి కాచకుప్పెయందుంచి వాలుకాయంత్ర మందు వండునటుని అనుపానవిశేషములచే సర్వరోగములయందునురోగియొక్క బలమును అనుసరించియివ్వవలెను. శ్లేష్మవ్యాధులు, దోషజ్వరములు, సన్నిపాతజ్వరములు, విషమజ్వరములు, సవాయివ్యాధులు, కుష్టువులు, సూతికావాతములు, మొదలగువ్యాధు లను ఖండించును.

## లక్ష్మీవిలాసం.

(సూతికలకు, సర్వవాతములకు)

వ॥ శు. ఇంగిలీకము చిత్రమూలరసముచే నూరి ఎండించి కోడి గ్రుడ్ల పెంకుల యందుంచి వకకుండలో ఇసుక పోసి ఈ ఇసుకలో ఆ కోడిగ్రుడ్ల పెంకులు కంఠమువరకు మునుగునట్లు పెట్టి వకర్షామము వండ వలెను. ఔషధము పక్వమై గట్టి పడును.

ప్రకారాంతరము.

వ॥ శు. ఇంగిలీకము కోడిగ్రుడ్ల తెల్లసొనతో మర్దన చేసి కుప్పెలు కట్టి బాగుగ ఆరనిచ్చి కోడిగ్రుడ్లలో తెల్లసొన మాత్రము వుంచి అందున ఈకుప్పెవుంచి వరిపిండితో మూతిమూసి సన్నపునీళ్ళలో డోలాయంత్రమున వక ఝాము వండుకునేది. ఇది అరచిన్నం తామల పాకులతో రెండుపూటల యందును యిచ్చేది.

సూతికావాతములు, సమస్తవాతవ్యాధులు, జ్వరములు, చంటిపిల్లలకు కలుగు శ్లేష్మవ్యాధులు, మొదలగునవి పోవును.

## కస్తూరి మాత్రలు.

(4. వ. రకము)

వ॥ కస్తూరి 1 భా, మిరియముల చూర్ణము 1 భా, గోరోచనం 1 భా, రససిందూరము 1 భా, పిప్పళ్ళచూర్ణము 1 భా, అక్కలకర్రచూర్ణము 1 భా, ఇంగిలీకము 1 భా, వీటిని తమలపాకులరసముతో మర్దించుకుని మాత్రలు కట్టుకునేది.

## కస్తూరి మాత్రలు.

(3 వ రకము)

వ॥ పాదరసము 1 భా, శుగంధకము 1 భా, వీటిని మొదట మెత్తగ నూరి కజ్జలి చేసుకుని పిదప, రసకర్పూరము 1భా, గోరోచనము 1భా, శు. ఇంగిలీకము 1 భా, నాభిచూర్ణము 1భా; శు, మిరియాలచూర్ణము 1 భా, రససిందూరము 1 భా, శొంఠిచూర్ణం 1 భా, కస్తూరి 1 భా, వీటిని, తమలపాకులరసముతోడను మిరియాలరసముతోడను నూరుకుని మాత్రలుకట్టుకునేది.

## కస్తూరి మాత్రలు.

(2 వ రకము)

వ॥ పావుదారు 1 భా, జున్ను 1 భా, రసకర్పూరము 1 భా,

ఇంగిలీకము 1 భా, గోరోచనము 1 భా, రససిందతారము 1 భా, లవంగములచూర్ణము 1 భా, మిరియములచూర్ణము 1 భా, రొయ్యపీత 1 భా, శు.నాభిచూర్ణము 1 భా. కస్తూరి 1 భా, వీటిని మిరియాలకషాయముతోగాని చిత్రమూలకషాయముతోగాని మర్దించుకుని మాత్రలు కట్టుకునేది.

## కస్తూరి మాత్రలు.

(1 వ రకము)

వ॥ రసకర్పూరము 1 భా, రససిందతారము 1 భా, సన్నిపాత భైరవి 1 భా, జున్ను 1 భా, శు.ఇంగిలీకము 1 భా, శు.నాభిచూర్ణము 1 భా, వాతరాక్షసము 1 భా, పావుదారు 1 భా. గోరోచనము 1 భా. కస్తూరి 1 భా, వీటిని మునగచక్కరసముతోగాని చిత్రమూల రసముతోగాని నూరుకుని మాత్రలుకట్టుకొనవలెను.

ఈనాలుగు రకములు ఆవగింజలుకంటె కొద్దిగ పెద్దమాత్రలు చేసుకొనవలెను.

నాలుగువిధములయిన మాత్రలయొక్కయు గుణములు— అజీర్ణము, వాతప్రకోపము, శ్లేష్మప్రకోపము, అతిసారము, కాళ్ళుచేతులు చల్లబడుట, చెమటలుకారుట, నూతికావాతము, పక్షవాతము, జ్వరము, మొదలగువ్యాధులను పోగొట్టి వాతమును నశింపజేసి వేడినికలుగజేయును. మరియు చంటిపిల్లలకు కలుగు, ఎగరొప్పు, డొక్కలు యెగరవేయుట, దగ్గు అజీర్ణవిరేచనములు, జ్వరము శ్లేష్మప్రకోపము, జలుబు, మాంద్యము, వాతవ్యాధులు, కడుపుబ్బరము, వాంతులు, మొదలగువ్యాధులను తగ్గించి చక్కని వేడినిచేయును.

నోటు:—ఈ నాలుగురకములమాత్రలు క్రమముగా వకదానికంటె మరొకటి గుణాధిక్యము కలవి.

## విజయసిందూరం

వ॥ నాగము, 3 భా. వంగము, 3 భా. రజతము, 3 భా. పాదరసము, 3 భా. గంధకము, 18 భా. వీటిని కలుబందరసము, గంజాయి ఆకురసము, వీటిచే నూరుకుని కాచకుప్పెయందుంచుకుని వాలుకాయం

త్రమందు వండుకుని సాంగశీతలము చేసి పై రసములచే మర్దించుకొనవలయును.

గుణములు॥ ఇది అనుపానవిశేషములచే యిచ్చిన, ఉదుతువ్యాధులు, శుక్లనష్టము, బలహీనము, తెల్లబట్ట, ఎఱ్ఱబట్ట, సెగవ్యాధులు, మూత్రకృచ్ఛ్రము, అతిమూత్రము, మొదలగు వ్యాధులను నిర్మూలింపజేయును. వీర్యవృద్ధిని వీర్యస్తంభనమును చేయును. మరియు రసాయనంబగును.

## కుమునేశ్వర రసం

శ్లో॥ పారదం శోధితం గంధ మభ్రకంచ సమం సమం । తదర్థం దరదందద్యా త్తదర్థాంచ మనశ్శిలాం । సర్వార్థం మృతలోహంచఖల్వ మధ్యే వినిక్షిపేత్ । ద్వి సప్త భావనా దేయాః శతావర్యా రసేనచ । తత స్సిద్ధో భవత్యేషః కుముదేశ్వరసంజ్ఞికః । సితయా మరిచేనాథ గుంజా ద్వి త్రి ప్రమాణతః । భక్షయే త్ప్రాత రుత్థాయ పూజయి త్వేష్టదేవతాం । యక్ష్మాణ ముగ్రం హంత్యేవ వాతపిత్తకఫామయాన్ జ్వరాదీ నఖిలాన్ రోగా న్యథా దైత్యాన్ జనార్దనః । సతతాభ్యాస యోగేన వలీ పలిత నాశనః॥

వ్యా॥ శు. పాదరసము, శు. గంధకము, అభ్రకభస్మ, ఇవి సమభాగము, శు. ఇంగిలీకము $\frac{1}{2}$ భా. శు. మనశ్శిల $\frac{1}{4}$ భా. లోహభస్మ అన్నిటికి సగము, వీటిని, పిల్లిపీచరరసముచే 14 సారులుభావనచేసిన నయ్యది, కుముదేశ్వరరస మగును. ఇది ఉదయమున లేచి ఇష్టదేవతనుపూజించి 2 లేక 3 గురిగింజలప్రమాణము పంచదార, మిరియముల చూర్ణముతో సేవించిన, కఠినమైనయక్ష్మను, వాత, పైత్య, కఫ, వ్యాధులను, జ్వరము మొదలగు సమస్తవ్యాధులను, విష్ణువు రాక్షసులనుహరించినరీతి హరించును. ఎల్లప్పుడు సేవించిన శరీరముముడతలుపడుట, వెండ్రుకలునెరయుట, వీటిని నశింపజేయును.

## మహాకుముదేశ్వరరసం

శ్లో॥ హేమభస్మ రసభస్మ గంధకం మౌక్తికంతు రసటంకణం తథా । తారం గరుడకం సర్వం తుల్యకం కాంజికేన పరిమర్ద్య గోలకం। మృత్స్నయా పరివేష్ట్య శోషితం భాండకే లవణగేధ పాచయేత్ । ఏకరాత్రం మృదుసంపుటేన వాసిద్ధమేతి కుముదేశ్వరో రసః । వల్ల మస్య మరిచైః ఘృతాప్లుతై రాజయక్ష్మ పరిశాంతయే పిబేత్ ॥

వ్యా॥ బంగారుభస్మ, రసభస్మ, శు. గంధకము, ముత్యభస్మ, శు. రసము, పొంగించిన టంకణము, వెండిభస్మ, పచ్చలభస్మ, ఇవి సమభాగములు ఫలికడుగుతో నూరి ముద్ద చేసి మట్టిపూసినగుడ్డలో చుట్టి ఎండించి ఉప్పుపోసినకుండయందుంచి ఒకరాత్రివండుకోవలెను. లేక చిన్న పుటము వేసుకోవలెను. ఇట్లుసిద్ధమైనది మూడుదేవ్వరరసమనబడును ఇది వల్లప్రమాణము నేతితో కలుపబడినమిరియములచూర్ణముతో సేవించిన రాజయక్ష్మను శాంతింపజేయును.

## షడ్గుణం

వ॥ శు. రసము, 1 భా. శు. గంధకము, 6 భాగములు, వీటిని కలుబందరసముతో మాసము రోజులు నూరుకుని కాచకుప్పెయందుంచి వాలుకాయంత్రమందు వండుకొనవలెను.

ఒకేసారి 6 రెట్లు గంధకము వేయక మొదట 3 రెట్లు గంధకమువేసి మర్దించుకుని వండుకుని మరల 3 రెట్లు గంధకము వేసుకుని మామూలుగా నూరుకుని మరల వండుకునేది. లేక 2 రెట్లు గంధకము చేర్చుకుని మామూలుగా నూరుకుని వండుకుని మరల 2 రెట్లు గంధకము చేర్చి నూరుకుని వండుకునేది. ఇట్లు మూడుసార్లు వండుకునేది లేక రసముతో సమానము గంధకము చేర్చి వండుకుని మరల సమానము గంధకము చేర్చి వండుకునేది ఇట్లు ఆరుసార్లు వండుకునేది. ఇట్లు ప్రక్రియాభేదములు కలవు.

ఒకేసారి ఆరురెట్లు గంధకము వేసుకుని వండుకొనుటకంటె ఆరుసారులలోను ఎన్నిసారులు వండుకుంటే అంతమంచిదని పెద్దలు చెప్పుదురు.

గుణములు— అనుపానభేదములచే సేవించిన ప్రమేహములు, పాడిదగ్గు, ఇంద్రియనష్టము, బలహీనము, ఎల్లప్పుడుశరీరముచెచ్చగావుండుట, జీర్ణజ్వరము, శుష్కించుట పాండువు, నోటిపూత, మొదలగు ఉడుకు వ్యాధులనెల్లను అమోఘముగా వదర్చును.

## సర్వమేహారిపురసం

శ్లో॥ సువర్ణం రజతం కాంతం నాగంవంగం తథాభ్రకం। రసేంద్రం దేవతాపుష్పం సమభాగాని యోజయేత్ । మాతులుంగరసేనైవ లవంగ శ్వేతచందనైః । త్రిదినం మర్దితంకృత్వా వల్లమాత్రం ప్రదాపయేత్ । శ్రీచందనానుపానేన దాపయే ద్భిషగుత్తమః । బద్ధమూత్రం ఖండమూత్రం మధుమూత్రం హాలీమకం । అశ్మరీం మూత్రకృఛ్రంచ సర్వమేహ నికృంతనం । దేహపుష్టికరంన్యాణాం పుత్రప్రసవకారణం । వీర్యవృద్ధిం బలవృద్ధిం కురుతే నాత్రసంశయః । మహారాజోపచారేణ పథ్యందద్యా ద్యథావిధి । సర్వమేహారిపుర్నామా కాలజ్ఞానేన భాషితః॥

వ్యా॥ సువర్ణభస్మ, వెండిభస్మ, కాంతభస్మ, సీసభస్మ, వంగభస్మ, అభ్రక భస్మ, రససింధూరము, లవంగములు, ఇవి సమభాగములు గ్రహించి మాదీఫలము, లవంగములు, త్వక్చందనము ... మర్దించి చందనముఅను పానముతో వల్లప్రమాణము యిచ్చిన, మూత్రబద్ధము, అగిఅగివచ్చుమూత్రము, మధు మేహము, హాలీమకము, అశ్మరి, మూత్రకృచ్ఛ్రము, సర్వమేహములనుహరించును. శరీర పుష్టిని కలుగజేయును. సంతానమును కలిగించును. వీర్యవృద్ధినిబలవృద్ధిని తప్పక చేయును. మహారాజోపచారము చేయుచు యథావిధిగ పథ్యము ఆచరించవలెను. సర్వమేహారిపు రసమని ప్రసిద్ధమైన, యిది ... లజ్ఞానునిచే చెప్పబడినది.

# సువర్ణకల్పామృతం

వ॥ మేలిమిబంగారము 1 భా; ఛాదీవెండి 2 భా; సీసం 3 భా; తగరం $1\frac{1}{2}$ భా; సత్తు $2\frac{1}{2}$ భా; శుద్ధులొనర్చిన యివి ఏకముగా కరిగించి అందు బోడసరపుఆకు పసరుపేస్తే గుల్లగా పొంగును. ఆపొంగిన గుల్ల ఖల్వములో వేసుకొని మెత్తగా నూరి బోడసరపురసమున కాటుకవలె మెత్తగానూరి బిళ్లచేసుకుని ఆరనిచ్చి కుక్కుటపుటంవేస్తే భస్మమగును.

ఈ భస్మను, పంచదార, నెయ్యి, వీటితో పుచ్చుకొనిన, వీర్యవృద్ధి, మేహ శాంతి, చేయును. బలహీనములు, శుక్లనష్టములు, అతి మూత్రములు, మొదలగుసమస్త ప్రమేహములను నశింపచేయును.

# సన్నిపాతములకు సువర్ణాది లేపం

శ్లో॥ సువర్ణముక్తా రజతప్రవాలం కస్తూరికా కుంకుమరోచనంచ। వరాట రుద్రాక్ష మధూకబిల్వం కుష్ఠంచ ఖర్జూర పునర్నవాచ। ద్రా క్షాకణా సాగరపుత్రజీవీ సారంగశృంగం కతకస్యబీజం। ఏరండమూలం కరశీరకంచ మయూరికా శ్వేతపునర్నవాచ। స్తన్యేన పిష్ట్వా కురుసన్ని పాతే లేప స్సదా సర్వగదా న్నిహంతి॥

వ్యా॥ సువర్ణము, ముత్యములు, వెండి, పగడములు, కస్తూరి, కుంకుమపువ్వు, గోరోజనం, గవ్వలు, రుద్రాక్షు, ఇప్ప, మారేడు, చెంగల్వకోష్టు, ఖర్జూరము, గలి జేరు, ద్రాక్ష, పిప్పళ్ళు శొంఠి, పుత్రజీవి, లేడికొమ్ము, చిల్లగింజలు, ఆముదపువేరు కెల్లగడ్డ, నెమలిపించము, తెల్లగలిజేరు, ఇవి చనుబాలతో నూరి లేపనముచేసిన, సన్నిపాతములు, సకలరోగములను నశింపజేయును.

# శ్లేష్మవిధ్వంసినీరసం

సీ॥ తామ్ర కాంతాభ్రక తార విద్రుమ లోహభస్మముల్ గంధక పారదమును। పర్పాటకము గంటుభారంకి పిప్పళ్లు చిత్రమూలము మణిశిలయు నాభి। తాళకం బగరును తగ గజపిప్పళ్లు పొగచెట్టుకట్టెల బూడిదరయ। పరిశుద్ధులొనరించి సరిపాళ్లుగాగూర్చి వెల్లుల్లిజిల్లేడు వేళ్ళ రసము। మునగ రక్కిస చిత్రమూలంబు వావిలిరసములు వేరువేరుకస ము తీసి నొక్కొక్కదినమును నొప్పగామర్దించి యనుపానములచేత నడ్డిగెత్తు। మాత్రమివ్వగ యగ్నిమాంద్యంబు లణచును మారుతరుజముల మడియజేయు। రోగత్రయంబు నిశ్శేషంబుగాజేయు కృమిరోగముల నెల్ల కూలజేయు। క్షయ కాస శుష్కకాస రక్తకాసయు శీత కాసయు। గళశ్లేష్మకాస పైత్యకాస క్షతబంగాళుల బలువైన శ్వాసముల కులము లణచు। భువిని విద్వేషుడగు పంక్తిముఖుని ద్రుంచినట్టి రఘురాము దివ్య బాణాగ్ని మాడ్కి। నఖిలరోగంబులను పట్టి హతమొనర్చు। శ్లేష్మ విధ్వంసి ఇదియంద్రు శేషశయన॥

టీ॥ తామ్రభస్మ, కాంతభస్మ అభ్రకభస్మ, వెండిభస్మ, పగడభస్మ, లోహభస్మ, శు. గంధకము, శు. పాదరసము, పర్పాటకము, గంటుభారంగి, పిప్పళ్లు, చిత్రమూలము, శు. మణిశిల, శు. నాభి. శు. తాళకము, అగరు, గజపిప్పళ్లు, పొగాకుచెట్టుకాడలబూడిద, ఇవన్నియు సమభాగములు గ్రహించి వెల్లుల్లి, జిల్లేడువేళ్లు, మునగచెక్క, రక్కిస, చిత్రమూలము, వావిలి, ఇవి వేరువేరుగారసములుతీసి, ప్రత్యేకముగా నొక్కొక్కరసముచే నొక్కొకదినము మర్దించి అనుపానవిశేషముచే అడ్డిగ ఎత్తుయిచ్చిన, అగ్నిమాంద్యము, వాతవ్యాధులు, రోగత్రయము, క్రిమిరోగములు, క్షయకాస, శుష్కకాస, రక్తకాస, శీతకాస, కంఠజింహ్వకకాస, శ్లేష్మకాస, పైత్యకాస, క్షతకా , బంగాళాకాస, కఠినమైనశ్వాసాదులు, పీటిని శ్రీరాముని దివ్యమైనబాణములు రావణాసురునిముఖములను త్రుంచినట్లు సకలరోగములను హత మొనర్చును. దీనిని శ్లేష్మవిధ్వంసియని వాడుదురు

# కఫవిధ్వంసినీరసం

శ్లో॥ సూతంగంధంస్వర్ణ తారం తామ్రం రీతిప్రవాలకం। మాంమూరం నాగవంగాభ్రం నాభీరోపీత కస్తూరీ। హారీతకీ త్రికటుకం సమం

ఖల్వే వినిక్షిపేత్ । నిర్గుండీ క్షుద్రజార్ద్రైశ్చ త్రిదినంమర్దితందృఢం । గుంజామాత్రానుపానేన నాశయేత్ శ్లేష్మజాన్ గదాన్। వాతజాన్ వివిధాంశ్చైవ కాసశ్వాస మజీర్ణకం । కఫ విధ్వంసినీ నామ్నా సీతానాథ ప్రకల్పితా॥

వ్యా॥ శు. రసము, శు. గంధకము, సువర్ణభస్మ, వెండిభస్మ, తామ్రభస్మ, ఇత్తడిభస్మ, పగడభస్మ, మాండూరభస్మ, సీసభస్మ, వంగభస్మ, అభ్రకభస్మ, శు. నాభి, రొయ్యిపీత, కస్తూరి, కరక్కాయ, త్రికటుకములు, ఇవి సమభాగములు, ఖల్వమందుంచి వావిలి, వాకుడు, అల్లము, వీటిరసములచే మూడురోజులు దృఢముగా మర్దించి గురిగింజంత మాత్రను అనుపానవిశేషముచే యిచ్చిన, శ్లేష్మవ్యాధులు, వాతవ్యాధులు, దగ్గు, ఉబ్బసము, అజీర్ణము, వీటిని హరించును. ఇయ్యది సీతానాథునిచే చెప్పబడిన కఫవిధ్వంసిని రసము.

గద్య. ఇతి శ్రీగోదావరీ మండల మండనాయమానకోన సీమాంతర్వర్తి
మోడేకుర్రు గ్రామవాసి భూసురాగ్రగణ్య శ్రీ పాదోపనామక
కౌశికసగోత్ర పవిత్ర వేంకటేశ్వరపౌత్ర సోమయాజిపుత్ర సుబ్బ
మాంబాగర్భ శుక్తిముక్తాయమాన సద్గురుసేవా సమాదిత
సాహితీ శబ్దశాస్త్రాయుర్వేదాది విద్యా నిధాన భిషగ్వ
రాయుర్వేదభూషణాదిబిరుదావళీ విభ్రాజమాన విద్వ
త్ప్రభుసభాస్థాన సన్మానసమ్రాజమాన సకల
సజ్జనవిధేయ కృష్ణమూర్తి శాస్త్రి నామధేయ
ప్రణీతాయుర్వేదౌషధ రత్నాకరే
ప్రథమ గుచ్ఛస్సమాప్తః.



# అథ
# ఆయుర్వేదౌషధరత్నాకరే

## ద్వితీయగుచ్ఛప్రారంభః

## పూర్ణచంద్రోదయం

శ్లో॥ పలంమృదుస్వర్ణదలం రసేంద్రం పలాష్టకం షోడశగంధకస్య। శోణైస్సుకార్పాసభవైః ప్రసూనైస్సర్వం విమర్ద్యాథ కుమారికాద్భిః తత్కాచకుంభే నిహితం ప్రగాఢే మృత్కర్పటీభిర్దివసత్రయంచ। పచేత్క్రమాగ్నౌ సికతాఖ్యయంత్రే తతో రసః పల్లవరాగరమ్యః। నిగృహ్య చైతచ్చపలం పలంచ చత్వారి కర్పూర రజస్తథైవ। జాతీఫలం చోషణమింద్రపుష్పం కస్తూరికాయా ఇహశాణమేకం। చంద్రోదయోయం కథితోస్య మాషో భుక్తోహి వల్లీదలమధ్యవర్తీ। మదోత్కటానాం ప్రమదాశతానాం గర్వాధికత్వం శ్లథయత్యకాండే। ఘృతంఘనీభూతమతీవదుగ్ధం మృదూని మాంసాని సమండకాని। మాషాన్నపిష్టానిభవంతి పథ్యాన్యానందదాయీన్యపరాణి చాత్ర। వలీపలిత నాశనస్తనుభృతాం వయస్తంభనస్సమస్తగదఖండనః ప్రచురరోగపంచాననఃగృహేపి గృహభూపతిర్భూపతిర్యస్య చంద్రోదయస్సపంచశరదర్పితో మృగదృశాం భవేద్వల్లభః। రతికాలే రతాంతేవా సేవితవ్యో రసోత్తమః మానహానిం కరోత్యేషః ప్రమదానాం సునిశ్చితం। కృత్రిమం స్థావరం చైవ జంగమంచాపి యద్విషం। నవికారాయ భవతి సాధకేంద్రస్య వత్సరాత్। మృత్యుంజయో యథాభ్యాసాన్మృత్యుం జయతి దేహినాం తథాయం సాధకేంద్రశ్చ జరామరణనాశనః। తంత్రాంతరేప్రసిద్ధోయం మకరధ్వజనామతః॥

వ్యా॥ మృదువైన సువర్ణదళము 1 పలము, శు. పాదరసము 8 పలములు, గంధకము 16 పలములు, వీటినన్నిటిని ఎర్రప్రత్తిపువ్వుల రసముచే మర్దించి పిదప కలుబందరసముచే మర్దించి మట్టిపూసిన గుడ్డలచే బాగుగా చుట్టబడిన కాచ కుప్పయందుంచి వాలుకాయంత్రమందు క్రమాగ్నులచే మూడురోజులు వండుమని చిగురుటాకువలె ఎర్రగ రమ్యంబయి యుండురసమును గ్రహించి పచ్చకర్పూరము 1 పలము, జాజికాయలు 1 పలము, పిప్పళ్ళు 1 పలము, లవంగములు 1 పలము, కస్తూరి 1 శాణము, వీటిని కలుపుకొనవలెను. ఇది చంద్రోదయ మనబడును. ఇదిమాష ప్రమాణము తమ్మలపాకులలోనుంచి భక్షించిన మిక్కిలి మదించిన నూరుగురు స్త్రీలయొక్క గర్వాధిక్యమును వెంటనే నశింపజేయును. ఇది సేవించునపుడు, పేరిన నెయ్యి, అధికముగాపాలు, మృదువయినమాంసములు, మీగడ, మినుము, హితకరమైన అన్నము, పిండివంటలు, మనస్సంతోషకరములయిన ఇతరములు, పథ్యకరములు. శరీరము ముడతలుపడుట, వెంట్రుకలు నెరయుట, వీటిని నశింపచేయును. వయస్సును అవును. అన్నివ్యాధులను ఖండించును. ప్రసిద్ధమైన రోగములకు సింహమువంటిది. ఎవని గృహమందు ఈ చంద్రోదయముండునో ఆగృహ యజమానిమన్మథోద్రేకము కలవాడయి అనేకమంది స్త్రీలకు ఇష్టముకలవాడగును. ఈ దివ్యౌషధమురతికాలమందుగాని, రతాంతమందుగాని సేవించవలయును. దీని సేవనచే స్త్రీలకు తప్పకమానహాని చేయును. దీనిని సంవత్సరము సేవించిన కృత్రిమ, స్థావరం జంగమ, విషములు, ఉపద్రవమును కలుగజేయ నేరవు. మృత్యుంజయ రసము అభ్యాసమువలన ఏ ప్రకారముగా ప్రాణులయొక్కమృత్యువును జయించునో ఆప్రకారము ఇయ్యదికూడ నిత్యాభ్యాసముచే ముసలితనమును, మృత్యువును, నశింపజేయును. ఈ పూర్ణచంద్రోదయము మరియొక గ్రంథమందు మకరధ్వజమని చెప్పబడియె.

నోఎండగావచ్చిన సిందూరము, పచ్చకర్పూరమువగయిరాలు మిశ్రమముచేయు విషయమై పరిమాణములలో అనేక మతభేదములు కలవు. విషయ విస్తర భీతిచే అవన్నియు, వ్రాయ లేదు.

## మకరధ్వజం (కజ్జలి)

శ్లో॥ రౌప్యస్య భాగో వంగంచ మాక్షికం కాంతమేవచ। జాతీకోశఫలే నాగం కాంస్యకం రససిందురం। ప్రవాలం కస్తూరీ చంద్ర మభ్రకం చైక భాగికం। స్వర్ణసిందతారతో భాగా శ్చత్వారః కల్పయే ద్బుధః। నాతః పరతరః శ్రేష్ఠః సర్వరోగనిషూదనః। తత్రాంతరే ప్రసిద్ధోయం మకరధ్వజనామతః। సర్వలోకహితార్థాయ శివేన పరికీర్తితః॥

వ్యా॥ రజతభస్మ, 2 భా. వంగభస్మ, 1 భా. ముత్యభస్మ, 1 భా. కాంతభస్మ, 1 భా. జాపత్రి, 1 భా. జాజికాయలు, 1 భా. సీసభస్మ, 1 భా. కంచుభస్మ, 1 భా. రససిందూరము 1 భా. పగడభస్మ, 1 భా. కస్తూరి, 1 భా. పచ్చకర్పూరము, 1 భా. అభ్రకభస్మ, 1 భా. సువర్ణసిందూరము, 4 భా. ఇవన్నియు మిశ్రమము చేయవలెను. సర్వరోగములను నశింపజేయుమందు ఇంతకంటెను శ్రేష్ఠమైనది మరియొకటి లేదు. మకరధ్వజ మనెడి పేరుతో తంత్రాంతరముల యందు ప్రసిద్ధమైనది, సర్వలోకమునకు హితము నిమిత్తము ఈశ్వరునిచే చెప్పబడినది.

## మకరధ్వజం

శ్లో॥ స్వర్ణా దష్టగుణంసూతం మర్దయే త్రిగుణగంధకం । రక్తకార్పాసకుసుమైః కుమార్యద్భిర్విమర్దయేత్ । శుష్కంకాచఘటే క్షిప్త్వా వాలుకాయంత్రగం పచేత్ । భస్మగృహ్య ద్రసేంద్రస్య నవార్కకిరణోపమం భాగోస్య భాగాశ్చత్వారః కర్పూరస్య సుశోభనాః । లవంగం మరిచంజాతీఫలంకర్పూరమాత్రయా । మేళయేన్మృగనాభించ తత్పాదకమితంతతః । శ్లక్ష్ణపిష్టోరసోనామ జాయతేమకరధ్వజః । వల్లంవల్లద్వయం ఖాదే త్తాంబూలీదలసంయుతం । భక్షయే న్మధురం స్నిగ్ధం మృదుమాంస మవాతలం । శృతశీతం సితాయుక్తం దుగ్ధంగోభవ మాజ్యకం । మధ్వాద్య మిష్టమపరం మద్యాని వివిధానిచ । కరో త్యగ్నిబలంపుంసాం వలీపలితనాశనం । మేధాయుః కాంతి జననం కామోద్దీపనకృన్మహాన్ । అభ్యాసా త్సాధకం స్త్రీణాం శతంజయతినిత్యశః । రతికాలేర తాంతేవా సేవితోయం రసోత్తమః । మానహానిం కరోత్యేషః ప్రమదానాం సునిశ్చితం । కృత్రిమంస్థావరంచైవ జంగమంచాపి యద్విషం । నవికారాయ భవతి సాధకేంద్రస్య వత్సరాత్ । మృత్యుంజయో యథాభ్యాసాత్ మృత్యుం జయతి దేహినాం। తథాయంసాధకేంద్రశ్చ జరామరణనాశనః॥

వ్యా॥ సువర్ణము 1 భా. శు. రసము 8 భా. శు. గంధకము 24 భా. వీటిని ఖల్వమందుంచి ఎఱ్ఱప్రత్తిపువ్వురసముచేతను కలుబందరసముచేతను మర్దించి ఎండిన పిదప కాచకుప్పెయందుంచి వాలుకాయంత్రమందువండుకొనియూరసమునూరినవో బాలసూర్యకిరణములవలె ఎఱ్ఱగానుండిన పక్వమైనదని గ్రహించి తీసుకొని, పచ్చకర్పూరము 4భా. లవంగములు 4భా. మిరియాలు 4భా. జాజికాయలు 4భా, కస్తూరి ½భా. వీటిని కలిపి, మెత్తగనూరవలెను. ఇయ్యది మకరధ్వజమని, చెప్పబడును. వల్లము, లేక రెండు వల్లముల ప్రమాణము తమలపాకులతో సేవిస్తూ, తియ్యనివస్తువులను, స్నిగ్ధగుణముగల

వస్తువులను, పాత్రప్రకోపము చేయనటువంటి మృదువైనమాంసములు, కాచిచల్లార్చిన నీళ్లు, పంచదార వేసిన ఆవుపాలు, నెయ్యి, తేనె మొదలగు ఇష్టమైన ఇతరపదార్థములు, అనేక విధములైన మద్యములు వీటిని పుచ్చుకొనుచుండిన, అగ్ని బలమును చేయును. శరీరము ముడుతలుపడుట, వెంట్రుకలు నెరయుట, వీటిని నశింపజేయును. సూక్ష్మబుద్ధి, ఆయుస్సు, శరీరకాంతి, మిక్కిలికామోద్దీపనము, వీటిని చేయును, దీనిని నిత్యము సేవించుచుండిన అనేకమంది స్త్రీలను నిత్యమురమించును. రతికాలమందుగాని రతాంతమందుగాని ఈదివ్యౌషధమును సేవించిన స్త్రీలకు మానవహానికలుగునట్లు చేయును. ఇది సంవత్సరము సేవించిన, కృత్రిమ, స్థావర, జంగమ, విషములు, ఉపద్రవమును కలుగజేయ నేరవు. మృత్యుంజయరసము అభ్యాసమువలన మృత్యువునుజయించురీతి ఇదికూడ ముసలితనమును, మరణమును, నశింపజేయును.

శో—భాగోస్యభాగాశ్చత్వారః—అనుదగ్గర అర్థాంతరములకు తావుకలదు.

# షడ్గుణ బలిజారిత మకరధ్వజము

వ॥ స్వర్ణపత్రము 8 తు. శు, పాదరసము, 64 తు, శు, గంధకము 128 తు, వీటిని కలుబందరసముచే మర్దించుకుని ఎండినపిదప కాచకుప్పెయందుంచుకుని వాలుకాయంత్రమందు వండుకుని చల్లారినపిదప తీసుకుని శుగంధకము 128 తు, కలుపుకుని కలుబందరసముచే బాగుగ మర్దించుకుని కాచకుప్పెయందుంచుకుని వాలుకాయంత్రమందు వండుకుని చల్లారినపిదప తీసుకుని మరల శు. గంధకము 128 తు, కలుపుకుని కలుబందరసముచే నూరుకుని కాచకుప్పెయందుంచి వాలుకాయంత్రమందు వండుకునేది. ఇట్లు సిద్ధమైనదీనిని, షడ్గుణ బలిజారిత మకరధ్వజ, మని వాడెదరు.

నో॥ చంద్రోదయము నందువలె దీనికికూడ అనుపానచూర్ణములు (పచ్చకర్పూరమువగైరా) మిశ్రమము చేసుకొనినచో గుణాధిక్యము కలదిగనుండును.

ఇది పూర్ణచంద్రోదయముయొక్క గుణములను కలిగియుండుటయే గాక ఆరు రెట్లుగంధకము జారణచేయబడుటచే అమోఘమైన అనేకగుణములు కలదిగనుండును.

# సిద్ధ మకరధ్వజము

వ॥ శు.పాదరసము 8 తు, శు.గంధకము 16 తు, స్వర్ణపత్రము 4 తు, వీటిని, ఎర్రపత్తిపువ్వులు, తెల్లయూడిగపండ్లు, కలుబంద, వీటి

రసములచే ప్రత్యేకముగా 8 ఝాములు ప్రకారము నూరి పిదప వాలు కాయంత్రమున, ఎండిన సాల, సరళ, ఖదిర, బిల్వ, కాష్టములచే నిరంతరము 8 ఝాములు వండవలెను. రెండేసిఝాములు చొప్పున క్రమముగా మృదు, మధ్యమ, తీవ్ర, మృదు, అగ్నులచే 8 ఝాములు వండవలెను. పిదప ఆమందుతీసి శు.గంధకము 32 తు, చేర్చి పై రసముల చేత నూరి వాలుకాయంత్రమందు 8 ఝాములు పూర్వప్రకారము పాకము చేయవలెను. దీనినే, సిద్ధ మకరధ్వజ, మని శాస్త్రజ్ఞులు చెప్పుదురు.

నో॥ పూర్ణచంద్రోదయమునంనువలెనే దీనియందుకూడ పచ్చకర్పూరము మొదలగునవి కలుపుచునవచ్చును.

పూర్ణచంద్రోదయమందలి గుణములను కలిగియుండుటయేగాక సువర్ణమధికముగాచేరియుండి రెండుసార్లువంటలగుటచే అమోఘమైన అనేకగుణములను గలిగియున్నది.

## పంచశరరసం

శ్లో॥ రసాభ్ర హేమ తారాణి వంగ మాక్షిక భస్మనీ। నాగ శుల్బే కాంతభస్మ సమభాగాని కారయేత్। కోకిలాక్షస్య బీజాని వ్యోమచూర్ణం సమాంశకం। మర్కటీ మూలజద్రావైః గోక్షీరేణచ మర్దయేత్। శాల్మలీ వృక్షనిర్యాస తాలమూలీభవైర్ద్రవైః। కణా కుంకుమ తక్కోల చందనానాం కషాయతః। ఏకైకం త్రిదినం మర్ద్యం రసకాషాయకా త్పృధక్। వల్లయుగ్మం ప్రదాతవ్యం సితాజ్యక్షీరసంయుతం। అష్టాదశప్రమేహాణి సర్వరోగా న్నిహంత్యయం। కామం వర్ధయతే నౄణాం స్త్రీణాం మత్యంతవల్లభః। కథితో హరగౌరీభ్యా మయం పంచశరోరసః॥

వ్యా॥రసభస్మ అభ్రకభస్మ,బంగారుభస్మ,వెండిభస్మ,వంగభస్మ,మాక్షికభస్మ, సీసభస్మ, తామ్రభస్మ, కాంతభస్మ,గొబ్బవిత్తులచూర్ణము,త్రికటుకములు ఇవిసమభాగములు గ్రహించిమాలగొండివేళ్ళకషాయము,ఆవుపాలు,బూరుగచెట్టుజిగురు,తాటివేళ్ళరసము,పిప్పళ్లు,కుంకుమపువ్వు,తక్కోలములు,మంచిగంధమువీటిరసముకషాయముచేతను ప్రత్యేకముగా వక్కొక్కదానిచే మూడేసిరోజులుచొప్పున మర్దించి, పంచదార, నెయ్యి, పాలు, వీటితోవల్లప్రమాణముయిచ్చిన 18 ప్రమేహములు, సర్వరోగములను హరించును. కామమును వృద్ధిపొందించును. స్త్రీలకు మిక్కిలిఇష్టుడుఅవును. ఈ పంచశరరసము ఈశ్వరుని చేతను పార్వతీదేవిచేతను చెప్పబడినది.

# సూతికామాత్రలు.

(3 రకము)

వ॥ సూతికాభరణము ½ భా, సన్నిపాతము 1 భా, వాతవిధ్వంసి 1 భా, రసకర్పూరము ½ భా, ఇంగిలీకము ½ భా, పాదరసము ½ భా, జున్ను ½ భా, గోరోచనం ½ భా కస్తూరి ¼ భా, వీటిని మిరియాల రసముతోడను, చిత్రమూలము రసముతోడను నూరుకుని మాత్రలు కట్టుకునేది

# సూతికామాత్రలు.

(2 వ రకము)

వ॥ సూతికాభరణము 1 భా, రసకర్పూరము 1 భా, శంఖనాభి చూర్ణము 1 భా. పాదరసము 1 భా, జున్ను 1 భా, గోరోచనము 1 భా, సన్నిపాతము 1 భా, వాతరాక్షసము 1 భా, వాతవిధ్వంసి 1 భా ఇంగిలీకము 1 భా, కస్తూరి ½ భా, వీటిని, ఉప్పిచెక్క చిత్రమూలము వరగోగుచెక్క రసములచే మర్దించి మాత్రలు కట్టుకునేది.

# సూ కౌమాత్రలు.

(1 వ రకము)

వ॥ సూతికాభరణము 1 భా, త్రైలోక్య చింతామణి 1 భా, వాతరాక్షసము 1 భా, రసకర్పూరము 1 భా, సువర్ణవాతరాక్షసము 1 భా, వాతవిధ్వంసి 1 భా, సన్నిపాతభైరవి 1 భా, కాలకూటము 1 భా, పాదరసము 1 భా, జున్ను 1 భా, గోరోచనము 1 భా, కస్తూరి ½ భా, వీటిని మునగచెక్క, వరగోగు, నల్లఉప్పి, తెల్లఉప్పి, వీటి రసములచే మర్దించి మాత్రలు కట్టుకునవలెను.

ఈ మూడురకములుకూడ పెసరగింజలంత మాత్రలు చేసునునేది.

ఈమూడింటియొక్క గుణములు—సూతికాజ్వరములు, వాతదోషములు, దోషజ్వరములు, సన్నిపాతజ్వరములు, కాళ్లు చేతులుచల్లబడుట, శ్లేష్మప్రకోపములు. మొదలగుఘోరవ్యాధులను, ఖండించివెంటనే ఉష్ణమునుకలిగించును.

నోటు — ఈ మూడువిధములైనమాత్రలు క్రమముగా నొకదానికంటె మరియొకటి అధికగుణముకలవి.

# రాజరసాయనం

శ్లో॥ కస్తూరీ హిమరశ్మి కుంకుమ సితా జాతిఫలం హాటకం। చాంపేయం వృష హేమబీజవిజయా యష్టీ జయంతీ విషం। ప్రత్యేకం వల్లమానం ఘృత మధుసహితం లిహ్యమానం దినాంతే। కించిన్మూర్ఛాం భజంతే హరతిచ సమయే భక్షయే దిక్షుఖండాన్। స్త్రీణాం గర్భాధికారం శమయతి సకలం వీర్యపాతం నయాతి। లింగాంతో యాతి వృద్ధిం స్థిరతరవపుషాం స్తంభకృ ద్యోనిభగ్నం। సేవనాదస్య కందర్ప రూపో భవతి మానవః। సహస్రం యాతి నారీణా ముత్సాహో జాయ తేధికః। నిత్యం స్త్రీసేవనా ద్యస్తు క్షీణశుక్లో భవేన్నరః। మహాశుక్లో భవత్యోపి సేవనా దస్య నాన్యథా। మహాబలో మహాబుద్ధి ర్జాయతే నాత్రసంశయః। స్థూలానాం కర్షకః శ్రేష్ఠః కృశానాం పుష్టికారకః। సర్వాంగం సంధివాతం బహువిధవ్రణతా గ్రంధి లూతా స్ఫుటంతి। ప్రాయం దుర్గంధలూతాస్రవతిచ బహులం తీవ్రదుఃఖేనయుక్తం। దాహం మోహంచ తృష్ణాం క్షయ కృమి కృశతాం పీనసం పాండురోగం। గుల్మాధ్మానంచ శూలం గ్రహణి గుదరుజం కుష్ఠరోగం నిహంతి॥

వ్యా॥ కస్తూరి, పచ్చకర్పూరము, కుంకుమపువ్వు, పంచదార, జాజికాయ, స్వర్ణ, ఉమ్మెత్త విత్తులు, గంజాయిఆకు, అతిమధురము, తక్కలివిత్తులు, శు. నాభి, ఇవిసమభాగములు గ్రహించి తేనె, నెయ్యి, వీటితో వల్లప్రమాణము, సాయంకాలము సేవించిన కొంచెము మూర్ఛనుపొందును. అప్పుడు చెరుకుతునకలనుభక్షించిన ఆమూర్ఛను హరించును. దీనినిసేవించువాడు వీర్యస్ఖలనమునుపొందక స్త్రీలయొక్క గర్భాధిక్యమునుహరించును. దృఢమైనశరీరమును వీర్యస్తంభనమును లింగవృద్ధికలవాడై వెయ్యిమంది స్త్రీలనురమించును. ఎల్లప్పుడు స్త్రీసేవనచే క్షీణించిన శుక్లముకలవాడుకూడ దీనిసేవనచేతనే మహాశుక్లముకలవాడగును స్థూలులను కృశింపజేయును. కృశించినవారలను పుష్టిచేయును. సర్వాంగవాతము సంధివాతము, చీముకారుచున్న బహువిధవ్రణములు, గ్రంధులు, లూతవ్రణములు, చీముకారుచున్నటువంటిన్ని దుర్గంధమైనలూతవ్రణము, తాపము, మోహము, దప్పిక క్షయ, కృమివ్యాధులు, కృశించుట, పీనసము, పాండురోగము, గుల్మము, శూలల హణి, గుదస్థానమందుబాధ, కుష్ఠువు, కడుపుఉబ్బరము వీటిని హరింపజేయును

# మహాకామసంజీవనీరసం

శ్లో॥ మారితం స్వర్ణభాగైకం ద్విభాగం శుద్ధమాక్షికం । త్రిభాగంరజతంచైవ వైక్రాంతం వేదభాగకం । పంచభాగం కాంతభస్మ షడ్భాగం తామ్రభస్మకం । నాగం వంగం సప్తభాగ మభ్రకం వసుభాగకం । మౌక్తికం బ్రహ్మభాగం చవిద్రుమమం దశభాగకం। సిందూరంరుద్రభాగంచ తీక్ష్ణ మేకాదశం తథా । ఖల్వమధ్యే వినిక్షిప్య మర్దయేల్లుంగవారిణా । శాల్మలీ కోకిలాక్షంచ గాంధారీ రసమర్దితం । కణాలవంగ తక్కోల గోక్షీరేణచ మర్దయేత్ । వాశా విదారీ వారాహీ గోక్షురే క్షురకేతథా । ఏతైశ్చ భావనాయుక్తం త్రిణిభావ్యం పృథక్పృథక్ । కాచకుప్యాం వినిక్షిప్యదినమేకం క్రమాగ్నినా । సాంగశీతలముద్ధృత్య ఖల్వమధ్యే వినిక్షిపేత్ । పాదాంశమస్యాఫేనంచ లవంగం జాతిపత్రకం । కస్తూరీ చంద్రకంచైవ దాపయేచ్చ యథావిధి । దుత్తూరబీజతైలేన గాంధారీ రసమర్దితం । కదలీఫలసారేణ జాతీక్వాథైః పునఃపునః । ద్రాక్షా దాడిమ ఖర్జూరైః పన్నీరేణచ మర్దయేత్ । శతపత్రరసేనైవ కుంకుమస్య కషాయకైః । ఏతైశ్చ భావనాయుక్తం యామంయామంపృథక్పృథక్ । వల్లద్వయమితంఖాదేత్కదలీఫలమధ్యతః । జాతీఫలం జాతిపత్రం శ్రీగంధంచ వరాలకం । ఏలా కణాసమాయుక్తం సితాక్షౌద్రేణ సంయుతం । మన్మథోద్రేకయత్నేన మహామదగజేంద్రవత్ । అశ్వస్యదండవదుత్థాత్వా స్వదండ మనివారితం । నిరంతరంమహాగాఢం రతిక్రియాసమర్థతః । యామత్రయే శతం స్త్రీణాం రత్యుద్యోగే జనోజయేత్ । ముహుర్ముహుః పిబేత్ క్షీరం శర్కరేణచ సంయుతం । నారికేలజలం పీత్వా తతః శీతోపచారితః । కర్పూరాన్వితతాంబూలం కుర్యాన్నిత్య మనర్గలం । వృద్ధస్య స్తంభనంచైవ నష్టలింగం నపుంస్త్వకం । లింగరోగం పృష్ఠరోగం నానావ్రణనివారణం । జంబీరఫలసారేణ మహాపంచఫలేనచ । స్థాపితం క్షణమాత్రేణ తదుద్రేకం వినాశయేత్ । సర్వేషామపి రోగాణాం మనుష్యాణాం విశేషతః । ఏతదౌషధప్రయోగం నప్రమత్తః ప్రయోజయేత్ । క్షయమేకాదశంచైవ

మేహావింశతినాశనం । మందాగ్నిం గ్రహణీం చైవ అజీర్ణత్రయమేవచ । కామసంజీవనీ నామా సర్వవ్యాధి వినాశనః॥

వ్యా॥ సువర్ణభస్మ 1 భా ॥ మాక్షికం 2 భా, రజతభస్మ, 3 భా, వైక్రాంతభస్మ, 4 భా, కాంతభస్మ 5 భా, తామ్రభస్మ, 6 భా, సీసభస్మ, 7 భా, వంగభస్మ 7 భా, అభ్రకభస్మ, 8 భా, ముత్యభస్మ, 9 భా, పగడభస్మ, 10 భా, రససింధూరము 11 భా, ఖడ్గలోహభస్మ, 11 భా, వీటిని ఖల్వమందుంచి, మాదీఫలరసము, బూరుగబంక, గొబ్బివిత్తులు, గంజాయి, పిప్పళ్ళు, లవంగములు, తక్కోలములు, వీటి రసములచేతను ఆవుపాలచేతను మర్దించి, అడ్డసరము, నేలగుమ్మడి, నేలతాడి, పల్లేరు, గొబ్బివిత్తులు, వీటిరసముచే ప్రత్యేకముగా మూడేసిరోజులు భావనచేసి కాచపుప్పెయందుంచి వాలుకాయంత్రమందు క్రమమైనఅగ్నిచే నకరోజు వండుకొని సాంగశీతలమున తీసి ఖల్వమందుంచుకొని ఈ మందుపు 4 వ, వంతు శు.నల్లమందు, కలిపి, లవంగములు,జాపత్రి, కస్తూరి, పచ్చకర్పూరము, ఇవియథావిధిగ కలుపుకుని, ఉమ్మెత్తవిత్తుల తైలము, గంజాయి ఆకురసము, అరటిపండ్లరసము, జాజికాయకషాయము ద్రాక్షపండ్లరసము, దానిమ్మపండ్లరసము, ఖర్జూరపు కాయలరసము, వీటిచే మర్దించుకొని, పద్మములరసము, కుంకుమపువ్వు, వీటికషాయముచే వక్కొక్కఝాము భావనచేసుకుని, రెండునల్లముల ప్రమాణము, జాజికాయలు, జాపత్రి, చందనము, వరాలకము, ఏలకులు, పిప్పళ్ళు, పంచదార, తేనె, వీటి అనుపానముతో, అరటిపండు మధ్యయందుంచి పుచ్చుకునిన, తనయొక్క దండము, గుఱ్ఱపు దండమువలె అనివారమై ఎల్లప్పుడుమహా గాఢమైన మన్మథోద్రేకముచే మదించిన గొప్ప ఏనుగువలె రతికరణ సామర్థ్యముకలవాడై మూడుఝాములలో నూరుగురు స్త్రీలను రమించి జయించును. పంచదార వేసినపాలను మాటిమాటికి త్రాగవలెను. గొబ్బరికాయలో నీళ్ళుత్రాగి పిదప శీతోపచారము చేసుకొనవలెను పచ్చకర్పూరముతో కూడిన తాంబూలమును ఎల్లప్పుడు సేవించవలెను. వృద్ధునికికూడ వీర్యస్తంభనము చేయును. నష్టలింగము, నపుంసకత్వము, లింగదోషము, నడుము నొప్పి, అనేకవిధములైన వ్రణములు, వీటిని, నశింపజేయును. నిమ్మకాయరసము నోటియందుంచుకొనిన క్షణకాలములో ఆమందుయొక్క ఉద్రేకమును నశింపజేయును. సమస్తమైన వ్యాధులకు ఈఔషధమును విశేషముజాకరూకుడై ప్రయోగించవలెను. ఏకాదశక్షయలు, వింశతిమేహములు, అగ్నిమాంద్యము, గ్రహణి, అజీర్ణత్రయము, వీటిని హరించును, కామసంజీవనియనెడి యియ్యది సర్వవ్యాధులను నశింపజేయును.

## సువర్ణ పర్పటీరసము

శ్లో॥ శుద్ధసూతం పలమితం తుర్యాంశ స్వర్ణసంయుతం । మర్దయే న్నింబునీరేణ యావదేకత్వ మాప్నుయాత్ । ప్రక్షాల్యోష్ణాంబునా

పశ్చాత్పలమాత్రేతు గంధకే । ద్రుతే లోహమయే పాత్రే బదరానల యోగతః । ప్రక్షిప్యచాలయే ల్లోహ్యాం మందంలోక శలాకయా। తతః పాకం విదిత్వాతు రంభాపత్రే శనైఃక్షిపేత్। గోమయస్థే తదుపరి రంభా పత్రేణ యంత్రయేత్ । శీతం తచ్చూర్ణితం గుంజాక్రమ వృద్ధం నిషేవ యేత్ । మాషమాత్రం భవేద్యావత్తతో మాత్రాం నవర్ధయేత్। సక్షా ద్రేణోపణేనైవ లేహయే ద్భిషగుత్తమః । గ్రహణీం హంతి శోషంచ సువర్ణ రస పర్పటీ । సద్యోబలకరీ శుక్రవర్ధనీ వహ్నిదీపనీ । క్షయ కాస శ్వాస మేహ శూలాతీసార పాండునుత్॥

వ్యా॥ శు. రసము 1 పలము, శు సువర్ణము 1/4 పలము, ఈ రెండిటిని నిమ్మ కాయ రసముచే బాగుగ కలసేవరకు నూరి వేడినీళ్ళతో కడిగి పిదప శు. గంధకము 1 పలము, కలుపుకుని ఇనపపాత్రయందు రేగికట్టెల మంటచే కరగించుకొని లోహ పాత్రయందుంచుకుని ఇనపగరిటెచే మెల్లిగ కలియద్రిప్పుకొని పాకమువచ్చిన పిదప ఆవుపేడ ముందువలెచేసుకుని అందుపై అరటిఆకు, వుంచి ఈ ఆకుయందు ఈ మందును ఉంచుకొని మరలపైన అరటిఆకు కప్పుకుని చల్లారినపిదప నూరుకుని వక్కొక గురి గింజచొప్పున మాషప్రమాణము అయ్యేవరకు మోతాదుయెక్కువచేసుకునుచుతేనె, పిప్పళ్లి చూర్ణముతో పుచ్చుకునవలయును. మాషముకంటె మోతాదు ఎక్కువచేయ కూడదు. ఇట్లు సేవించిన, ఈసువర్ణ పర్పటీరసము, గ్రహణి, శోష, క్షయ, కాస, శ్వాస, మేహములు, శూల, అతిసారము, పాండువు, వీటిని హరించును. వెంటనే బలముచేయును. వీర్యవృద్ధి అగ్నిదీప్తి వీటినిచేయును.

## సువర్ణ పర్పటీరసము (ప్రకారాంతరమ్)

శ్లో॥ శుద్ధంసువర్ణ దలమష్ట గుణేనశుద్ధ సూతేనపిండితమధో వసుభాగభాజి। గంధేద్రుతే బదరవహ్నిషు లోహపాత్రే దత్వావలోడ్య లఘులోహ శలాకయా తత్ । మందం నిరస్య సురభీమల మండలస్థే రంభాదలే తదుపరి ప్రణిధాయచాన్యత్ । రంభాదలం లఘు నియంత్ర్య తదా దదీతశీతం సువర్ణరస పర్పటికాభిధానం ! పిత్తోల్బణే పసితయా తుగయాథవాత శ్లేష్మోల్బణేకిల తుగామధు పిప్పలీభిః । క్షీణే విరేకిణిచ శోషిణి మందవహ్నౌ పాండౌ ప్రమేహిణి చిరజ్వరిణి గ్రహణ్యాం। వృద్ధే శిశౌ సుఖినిరాజ్ఞి తథైవనార్యాం భైషజ్యమేతదుదితం హిత మామయఘ్నం॥

వ్యా॥ శు. వందనపుఠేకులు, 1 భా. శు. రసము, 8 భా. వీటిని కలియనూరు చుని, శు. గంధకము, 8 భా. కలుపుమని ఇనప పాత్రయందుంచుమని, శేగికట్టెల మంటచే కరగించుమని, లోహపాత్రయందుంచి చిన్న ఇనప గరిటెచే కలియత్రిప్పుమని, ఆవుపేడ పదురయందు అరటి ఆకువేసుకని అందు ఈమందు మెల్లిగ పోసుమని పైన చిన్న అరటి ఆకు కప్పుమని చల్లారిన పిదప తీసుకొనవలయును. ఇది సువర్ణ పర్పటీ రస మని చెప్పబడును. ఇది పైత్యప్రధాన వ్యాధులయందు, పంచదార, తవాక్షీరి, తోడను, వాత, శ్లేష్మ, ప్రధాన వ్యాధులయందు, తవాక్షీరి, తేనె, పిప్పళ్లు వీటి తోడను, విరేచనములచే క్షీణించుట, శోష, అగ్నిమాంద్యము, పాండు, ప్రమేహము జీర్ణజ్వరము, గ్రహణి, వీటియందును యివ్వవలయును. వృద్ధుడు, శిశువు, సుకుమారుడు, రాజు, స్త్రీవీరియొక్క వ్యాధులను కూడ యివ్వదగినది.

# శూలనికృంతనం

శ్లో॥ శుద్ధసూతం తథా తామ్రం శిలా మాక్షిక తాలకం। రజతం గంధవంగంచ లోహ మభ్రం సనాగకం। చూర్ణయే త్పంచలవణాం దేయం సర్వైశ్చ తుల్యకం। సువర్ణం మిశ్రయే త్పశ్చా ద్రసై రేషాం విభావయేత్। శుంఠీ జయంతీ విజయా మహారాష్ట్రిక ధూర్తజైః। ఖాదే ద్దేరండ శుంఠీభ్యాం మాషమాత్రం దినేదినే। కఫవాతామయం హంతి అనుపానం వదామ్యహం। వ్యోషం సౌవర్చలం హింగు కరం జీబీజ సంయుతం। పిబే దుష్ణాంబునా నామ్నా సర్వశూల నికృంతనం। అజీర్ణం గ్రహణీదోషం ఆమం శూలం తథైవచ। ఆధ్మాన ముదరం గుల్మ మతీసారాగ్ని మాంద్యనుత్॥

వ్యా॥ శు. రసము, తామ్రభస్మ, శు.మణిశిల, మాక్షికభస్మ, శు. తాళకము, రజతభస్మ, శు. గంధకము,వంగభస్మ, లోహభస్మ, అభ్రకభస్మ, సీసభస్మ, ఇవిసమ భాగములు, నూరుమని వీటిఅన్నిటికిసమము, పంచలవణములు, సువర్ణభస్మ, 1 భా. కలుపుమని పిదప, శుంఠి, టెక్కలి, గంజాయిఆకు, మరాటీమొగ్గలు, ఉమ్మెత్త, వీటిరసములచే భావనచేసుకని, ఆముదము, శుంఠి, వీటిచే మాషప్రమాణము ప్రతి దినమందుసేవించిన, కఫ, వాత, వ్యాధులను హరించును. త్రికటుకములు, సౌవర్చ లవణము, ఇంగువ, గానుగవిత్తులు, వేడినీళ్ళు, ఇవిఅనుపానములుగా యివ్వవలయును. ఈశూలనికృంతనము,అజీర్ణము, గ్రహణి, ఆమదోషము, శూల, కడుపుఉబ్బరము, ఉదరవ్యాధి, గుల్మము, అతిసారము, అగ్నిమాంద్యము వీటిని నివారింపజేయును.

# చంద్రశీతరసం

శ్లో॥ రసగంధక వైక్రాంతం తారం హేమచ తత్సమం। త్రిభాగం లోహకాంతాభ్రం త్రిఫలా వారిమర్దితం । శతావరీ రసోపేతం మత్స్యాక్షీ మేఘనాదయోః । మేహారి పుష్పతోయేన నారికేలాంబునా తథా । మర్దితం త్రిదినంచైవ ఉశీరం దాడిమంఫలం । ముస్తం తథా చందనంచ రసైశ్చ సప్తభావనాః । గుంజామేకామిదం సేవ్యం ద్రాక్షా ఖర్జూర మాక్షికైః స్త్రీణాం ప్రదరదోషంచ వినాశనం । యోనిదోషం లింగదోషం తృష్ణాతాపం చనాశయేత్ గర్భవృద్ధికరం పుష్టిం శీత వీర్యంచ వర్ధయేత్ । అనుపానవిశేషేణ వాతపైత్య హారంపరం । పుష్టిస్తేజో బలకరం క్షయిణా మమృతం సమం। చంద్రశీతరసం నామ శ్రేష్ఠం చంద్ర వినిర్మితం॥

వ్యా॥ శు. రసము, 1 భా. శు. గంధకము, 1 భా, వైక్రాంతభస్మ, 1 భా. రజతభస్మ, 1 భా. సువర్ణభస్మ, 1 భా. లోహభస్మ, 3 భా. కాంతభస్మ, 3 భా. అభ్రకభస్మ, 3 భా. వీటిని త్రిఫలములు, పిల్లిపీచర, పొన్నగంటికూర, చిర్రికూర, తంగేడుపువ్వులు, కొబ్బరికాయనీళ్లు, వీటిరసములచే మూడేసిరోజులు మర్దించి, వట్టివేళ్లు, దానిమ్మపండ్లు, తుంగగడ్డలు, మంచిగంధము, వీటిరసములచే ఏడేసిభావనలు చేసి, ఒకగురిగింజప్రమాణము, ద్రాక్షపండ్లరసము, ఖర్జూరకాయలరసము, తేనె, వీటితో సేవించిన, స్త్రీలయొక్క ప్రదరవ్యాధులు సమస్తమేహములు, యోనిదోషములు, లింగదోషములు, దప్పిక, శరీరతాపము, వీటినినశింపజేయును. గర్భవృద్ధిని, గర్భపుష్టిని, చలవను, వీర్యవృద్ధినిచేయును. అనుపానవిశేషములచే వాతపైత్య, వ్యాధులను హరించును. శరీరపుష్టి తేజస్సు, బలము, వీటినిచేయును, క్షయరోగులకు అమృతముతో సమానమగును. ఈ శ్రేష్టమైన చంద్రశీతరసము చంద్రునిచే చెప్పబడెను.

# ఆమకులాంతకము

శ్లో॥ పారదం గంధకంచాభ్రం లోహం వాపి వరాటకం।తామ్రం చాతివిషం కర్షం సమభాగం ప్రకల్పయేత్ । ధాన్య శుంఠీ కృతక్వాథైర్భావయేచ్చ పృథక్పృథక్ । గుంజాప్రమాణవటికాం కారయే త్తుకుశలోభిషక్ । భక్షయే త్ప్రాతరుత్థాయ గురుదేవ ద్విజార్చకః । దగ్ధబిల్వాం గుడం చైవ కుర్యా త్తదనుపానకం । అజాదుగ్ధేనవాపేయం జంబూ

సాధి తేనవా। అతిసారే జ్వరేఘోరే గ్రహణ్యా మరుచౌ తథా । ఆమేచ శూలే రక్తేచ పిచ్ఛాస్రావే భ్రమేతథా। శోఫే రక్తాతిసారేచ సంగ్రహాగ్రహణీషుచ॥

వ్యా॥ శు. రసము, శు, గంధకము, అభ్రకభస్మ, లోహభస్మ, గవ్వలభస్మ, రజతభస్మ, అతివస, ఇవి వక్కొక్కకర్షప్రమాణము గ్రహించి, ధనియాలు, శుంఠి, కషాయములచే ప్రత్యేకముగా భావనచేసి గురిగింజంత మాత్రచేసుకుని ఉదయమున లేచి, గురువు, దేవతలు, బ్రాహ్మణులు, వీరినిపూజించి అందొకమాత్రను, మారేడు మసి, బెల్లముతోగాని, మేకపాలతోగాని, నేరేడుచెక్క కషాయముతోగాని, అతిసారము, తీవ్రమైనజ్వరము, గ్రహణి, అరుచి, ఆమదోషము, శూల, రక్తస్రావము, జిగురుపడుట, భ్రమ, నంజు, రక్తాతిసారము, సంగ్రహగ్రహణి, వీటియందు యివ్వ వలయును.

# కామవిలాసరసం

శ్లో॥ రసాభ్రం హేమతారంచ వంగ మాక్షిక భస్మకం । నాగం శుల్బం మృతం కాంతం సమభాగాని కారయేత్ । మర్కటీక్షుర బీజాని శుద్ధం చైవాహిఫేనకం । ఏతచ్చూర్ణం సమాంశేన గోక్షీరేణచ మర్దయేత్ । శాల్మలీరస భావేన తాలమూలీ రసేనచ । కణా కుంకుమ కంకోల చందనేనచ భావయేత్ । వల్లయుగ్మంచ దాతవ్యం క్షీరాజ్య మధుసంయుతం । వింశతించ ప్రమేహాణి సర్వరోగాన్నివాంతిచ । వీర్యస్తంభం కరోత్యేవ కామోద్దీపన కృన్మహాన్ । హర్షేణ మనసా నిత్యం శతం రమతి యోషితాం । అయం కామ విలాసాఖ్యో రసో దేవవినిర్మితః॥

వ్యా॥ రసము, అభ్రకము, సువర్ణము, రజతము, వంగము, మాక్షికము, సీసము, తామ్రము, కాంతము, వీటి భస్మములు, దూలగొండివిత్తులు, శు. నల్లమందు, ఇవి సమభాగములు,ఆవుపాలు,బూరుగబంక, తాటివేళ్లు, వీటిరసములజేమర్దించి పిప్పళ్లు కుంకుమపువ్వు, కంకోలములు, చందనము, వీటిరసములచే భావనచేసి, రెండువల్లముల ప్రమాణము, పాలు, నెయ్యి, తేనె, వీటితోయిచ్చిన ఇరవైప్రమేహములు, సర్వ రోగములను నశింపజేయుటయేగాక వీర్యస్తంభనమునుచేసి మిక్కిలికామోద్రేకమును కలుగజేయును. సంతోషముతోకూడిన మనస్సుతో అనేకమందిస్త్రీలను రమించును. ఈ కామవిలాసరసము, అశ్వినిదేవతలచే నిర్మింపబడెను.

# సూర్యప్రభారసము

సీ॥ కాంత విద్రుమ శంఖ గంధ హేమాక్షిక టంకణ రోచన కుంకుమములు । కటుకరోహిణి చిత్రము జున్ను రొయిపీత పావుదారు లును పిప్పలి మరీచి ।కపుర కస్తురులును మకర కూర్మపిత్తము లొక్కొక్క పాలుగా నొనరసిట్లు । రసభస్మ గరళ తామ్రములు నభ్రకము లోహమును రెండేసిభాగములు నల్ల। మందును నాభియు సిందూర మును నాలుగేసి భాగంబులువేసి పిదప । త్రికటు కటుక వహ్ని త్రిఫల కషాయంబు ఝషబర్హిగైధిక ఛాగ పిత్తముల । లికుచ దుత్తూరముల హంసపాది స్వరసముల మూడహోరాత్రములను । మర్దించి సరషపమాన మాత్రలుచేసి సేవింప ననుపాన చిత్రమెరిగి । సర్వరోగప్రపంచంబు సమయజేయు । సూర్యప్రభారసంబున గ్రాలుదీని । సూర్యనారాయణ జగత్పతి సుకృతబుద్ధి నవని నిర్మించె ప్రఖ్యాతి నమృతముగను॥

వ్యా॥ కాంతభస్మ, పగడభస్మ, శంఖభస్మ, శు. గంధకము, హేమాక్షికభస్మ, పా, టంకణము, గోరోచనము, కుంకుమపువ్వు, కటుకరోహిణి, చిత్రమూలము, జున్ను, రొయ్యిపీత, పావుదారు, పిప్పళ్లు, మిరియాలు, పచ్చకర్పూరము, కస్తూరి, మొసలిచేదు, తాబేలుచేదు, ఇవివక్కొక్కభాగము, రసభస్మ, గరళము, తామ్రభస్మ అభ్రకభస్మ, లోహభస్మ, ఇవి రెండేసిభాగములు, శు. నల్లమందు, శు. నాభి, రస సిందూరము, ఇవినాలుగేసి భాగములు, ఇట్లు వీటినికలిపి త్రికటుములు, కటుకరోహిణి, చిత్రమూలము, త్రిఫలములు, వీటికషాయములు, చేప, నెమలి, ఉడుము, మేక, వీటిపిత్తములు, నిమ్మకాయలు, ఉమ్మెత్త, హంసపాది, వీటిరసములు, వీటి అన్నిటిచేతను, మూడుఅహోరాత్రములు, మర్దించి ఆవాలంతమాత్రలు, చేసుకుని అనుపానభేదములచేసేవించిన, సమస్తరోగసముదాయములను నశింపజేయును. ఈ 'సూర్యప్రభారసము'ను సూర్యనారాయణజగత్పతి భూమియందు అమృతమగునట్లుగా నిర్మించెను.

# నీలకంఠరసం

శ్లో॥ వజ్రసూతాభ్రహేమార్క తీక్ష్ణముండం క్రమోత్తరం। మారితం మర్దయేదమ్ల వర్గేణ దివసత్రయం । త్రిక్షారం పంచలవణం మర్దితస్యసమం సమం । దత్వానిర్గుండికా ద్రావైర్మర్దయేద్ది వసత్రయం। శుష్కమేతద్ధి చూర్ణాథవిషం స్యాదష్టమాంశతః । టంకణం విషతు

ల్యాంశం దత్వాజంబీరజద్రవైః। భావయే ద్దిన మేకంతు రసోయం నీల కంఠకః । దాతవ్యస్సర్వరోగేషు సన్నిపాతే విశేషతః । ద్విగుంజ మార్ద్రిక ద్రావై ర్ఘృతై ర్వావాతరోగిణాం। నిరుండీ మూలచూర్ణంతు మాహిషాఖ్యంచ గుగ్గులుం । సమాంశం మర్దయే ద్దాజ్యైత్యద్వటీకర్షసమ్మితా । అను యోజ్యాఘృతై ర్నిత్యం స్నిగ్ధముష్ణంచభోజనం । మండలాన్నాశయేత్సర్వాః వాత రోగాన్నసంశయః । సన్నిపాతే పిబేచ్ఛాను రవిమూలకషాయం । ధాన్య శుంఠీకషాయేణ అజీర్ణ కులనాశనం॥

వ్యా॥ వజ్రభస్మ, 1 భా. రసభస్మ, 2 భా. అభ్రకభస్మ, 3 భా. సువర్ణభస్మ, 4 భా. తామ్రభస్మ, 5 భా. తీక్ష్ణలోహభస్మ, 6 భా. ముండలోహభస్మ, 7 భా. ఇవి ఆమ్లవర్గ ద్రవ్యములచే మూడురోజులు మర్దించుకుని ఈ మొత్తమునకు సమానము మూడుక్షారములు, పంచలవణములు, కలుపుకుని వావిలిరసముచే మూడురోజులు మర్దించుకుని ఎండించుకుని నూరుకుని ఈమందుకు 8,వ, భాగము శు. నాభి, నాభితో సమానము, శు. టంకణము కలుపుకుని నిమ్మకాయల రసముచే వకరోజు మర్దించుకునిన నీలకంఠ, రస, మనబడును. దీనిని రెండుగురిగింజల ప్రమాణము, అల్లపు రసముతో సమస్తవ్యాధులయందును విశేషముగా సన్నిపాతమందును యివ్వవలయును. నెయ్యితో వాత వ్యాధులయందు యివ్వవలెను. వావిలి వేళ్లచూర్ణము శు. మహిసాక్షి గుగ్గులు, సమభాగములుగ నేతితో మర్దించి కర్ష ప్రమాణము మాత్రలు చేసుకుని ఈమాత్రను నేతితో మందు సేవించిన వెంటనే యిస్తూ స్నిగ్ధగుణము, ఉష్ణవీర్యముగల భోజనము చేయుచుండిన వక మండల దినములకు సమస్త వాత వ్యాధులను నిస్సందేహముగా నశింపజేయును. సన్నిపాత జ్వరమందు జిల్లేడు వేళ్లకషాయమును యివ్వవలయును. ధనియాలు, శుంఠి, కషాయముతో యిచ్చిన సమస్త అజీర్ణములను నశింపజేయును.

## లఘుబాలసూర్యోదయం

శ్లో॥ హారవీర్యంత్రిభాగంచ నిశరాజంచగంధకం । ద్వాదశామృతం శుద్ధంచ తీక్ష్ణంచ ద్విజరాజకం । ఏవంవరాటం చతుర్థం బాణబాగంతు అభ్రకం । మరిచం సూతతుల్యంతు గంధతుల్యంతు తామ్రకం । హారనేత్రాదర్ధకిట్టం శరభాగంతువిద్రుమం । మర్దయేదార్ద్రిక స్వైవజంబీరస్వరసేనచ । గులికాన్బదరీబీజాన్ వజ్రమూషేతు స్థాపితాన్ । యంత్రేణవాలుకేనైవ పాచితం రుద్రయామకం । స్వాంగశీతలముద్ధృత్య దాతవ్య మనుపానకైః । అంతర్జ్వరేశ్వాస కాసే ఛర్దౌ పాండౌ చశ్లేష్మ

కే। మూత్రకృచ్ఛ్రా తిసారేచ సర్వరోగేహితంతథా । బాలసూర్యో దయంనామ ప్రసిద్ధం దేహవృద్ధిదం॥

వ్యా॥ శు, రసము, 3 భా, శు. గంధకము, భాశు. సాభి, 12భా. ఖడ్గలోహ భస్మ, 1 భా. గవ్వలభస్మ, 4 భా. అభ్రకభస్మ, 5 భా. మిరియాలు, 3 భా. తామ్ర భస్మ, 1 భా. మాండూరభస్మ, 1½ భా. పగడభస్మ, 5 భా. ఇవి అల్లపురసముచే త నిమ్మకాయల రసముచేతమర్దించిరేగుగింజలవలెమాత్రలుచేసి వజ్రమూసయందుంచి వాలుకాయంత్ర మందు 11 ఝాములువండుకొని సాంగశీతలమునతీసి అనుపానవిశేష ములచేఅంతర్గతజ్వరము, శ్వాస, కాస, వాంతి, పాండువు, శ్లేష్మవ్యాధులు, మూత్రకృచ్ఛ్రము, మూత్రాతిసారము, వీటియందును సర్వరోగముల యందును, యివ్వ వలెను. ప్రసిద్ధమైన ఈబాలసూర్యోదయము దేహవృద్ధినికూడ చేయును.

# వంటబాలసూర్యోదయమ్

శ్లో॥ సూతంస్యాద్దశభాగంహాటకమిదంపకంమృతంవారిజం । భాగంద్వాదశగంధకస్య సహితంద్రవ్యంకృతంనిర్మలం । మర్ద్యంహంసపదీకుమారికరసైఃపిష్ట్వాకృతంగోలకం । క్షిప్త్వాకాచఘటోదరేపటమృత్తేమృద్దాఘటేవాలుకే । సుపాచ్యత్రిదినంక్రమాగ్నిసహితంసాంగంసశీతోద్భవం । భిత్త్వాసూర్యసమానవర్ణముదయద్రాగైస్సణోద్భవైః । తత్పాదాంశకమభ్రభస్మసహితం కాంతంతదర్ధాన్వితం । రౌప్యంతత్సమయోజయేత్కృతమృతం నాగంతదర్ధంక్షిపేత్ । కస్తూరీఘనసారకుంకుమరజం జాతీయఫలంత్ర్యూషణం ! ప్రత్యేకమురగాంశపాదసహితం క్షిపంతు ఖల్వోదరే । మర్ద్యంపూర్వరసేనయోజితమిదంవల్లం సదాఖాదయేత్। పాండుంశోఫహలీమకోదరగదాన్య క్ష్మాణిమేహంజయేత్ । కాసశ్వాసగలామయాశ్మరిరుజం మూత్రేక్షుమేహాదికాన్ । హిక్కారోచకమస్రగరక్తప్రదరం । ప్లీహానమున్మాదకం । నానారోగహితానుపానసహితం నానామయధ్వంసనం । సర్వంసౌఖ్యకరం రసాయనమిదం శ్రీనిత్యనాథోదితం । వివిధౌషధానాంశిరోమణి రయంశ్రీబాలసూర్యోదయం ॥

వ్యా॥ శు. రసము 10 భా. సువర్ణము 1 భా. తామ్రభస్మ 1 భా. శు. గంధకము. 12 భా. ఇవి హంసపాది, కలుబందరసములచే, మర్దించి మాత్రలుచేసి, మట్టిపూసినగుడ్డలచే చుట్టబడినకాచకుప్పెయందుంచి వాలుకాయంత్రమందు మూడురోజులు క్రమాగ్నులచే వండుకొని సాంగశీతలమునతీసి ఉదయించుచున్న సూర్యునివలె

ఎత్తగానుండుఆమందునుపగలగొట్టుకొని ఆమందునునాలగవవంతుఅభ్రభస్మఅభ్రకములో సగము కాంతభస్మ, కాంతభస్మతోసమానమువెండిభస్మ. వెండిభస్మలోసగముసీసభస్మ, కస్తూరి, పచ్చకర్పూరము, కుంకుమపువ్వు, త్రికటుకములు, ఇవిప్రత్యేకముగాసీసభస్మలో నాలగవవంతువేసి ఖల్వమందుంచి, హంసపాది, కలుబందరసములచే, నూరి వల్లప్రమాణము సేవించిన, పాండు, నంజు, హలీమకము, ఉదరరోగము, రాజయక్ష్మ, మేహము, కాస శ్వాస, కంఠవ్యాధులు, అశ్మరి, మూత్రకృచ్ఛ్రము, ఇక్షుమేహము, మొదలగువ్యాధులు, ఎక్కిళ్ళు, అరోచకము, కఠినమైన రక్తప్రదరము, ప్లీహవ్యాధి, ఉన్మాదము, వీటిసినశింపజేయును. తగినఅనుపానములచే సమస్తవ్యాధులను నశింపజేయును. సౌఖ్యమునుకలుగజేయను. రసాయనము సమస్తఔషధములకు శిరోమణియై ఈబాలసూర్యోదయము నిత్యనాధునిచే చెప్పబడినది.

## బాలసూర్యోదయం

శ్లో॥ సూతం త్రైగుణ్యాగంధం పరిమితమమృతం భానుతీక్ష్ణంచ నేత్రం । ఆరూఢం తచ్చతుర్థం గగనశరయుతంమారిచంసర్వతుల్యం। ఏతద్ధద్యాన్నిహంతి జ్వరవనదహనం శ్వాసకాసంచ ఛర్దిం । పాండుప్లీహప్రమేహం క్షయగుదరుజం లింగదోషంచ పుంసాం । నారీణాం యోనిదోషం బహువిధప్రదరాణ్ మూత్రకృచ్ఛ్రంచ సర్వం । నామ్నాయం బాలసూర్యోదయ మఖిలగదహరో భాషితోయం మునీంద్రైః॥

వ్యా॥ శు. రసము 1 భా. శు, గంధకము, 3 భా. శు. నాభి 3 భా. తామ్రభస్మ, 2 భా. ఖడ్గలోహభస్మ, 2 భా. ఇంగువ 1/2 భా. అభ్రకభస్మ, 5 భా. మిరియాలు 16 1/2 భా. వీటిని సేవించిన, జ్వరము, శ్వాస, కాస, వాంతి, పాండువు, ప్లీహము, ప్రమేహము, క్షయ, అర్శస్సు, పురుషులయొక్క లింగదోషము, స్త్రీలయొక్క యోనిదోషము, అనేకవిధములైన ప్రదరములు, మూత్రకృచ్ఛ్రము, వీటిని హరించును. మునీంద్రులచే చెప్పబడిన ఈ బాలసూర్యోదయము సమస్త వ్యాధులను హరించును.

## మహాబాలసూర్యోదయం

శ్లో॥ సూతం త్రైగుణ్యాగంధం పరిమితమమృతం భానుతీక్ష్ణంచనేత్రం । ఆరూఢం తచ్చతుర్థం గగనశరయుతం కాంతతారంచ తుల్యం । మారీచం చైకయుక్తం త్రిచతురసహితంనాగవంగంక్రమేణ । తేరమ్యం సూక్ష్మమర్ద్యం మునిరసమథితం వాశేక్షురకేనచ । ఏతద్ధద్యాన్నిహంతి

జ్వరకులవిపినం శ్వాసకాసంచ ఛర్దిం । పాండుం శూలప్రమేహాన్ జయతిగుదరుజార్ ప్లీహగుల్మాన శేషార్ । వాతవ్యాధేః కుఠారః క్షయజ కఫ రుజో రాజయక్ష్మాదిరోగాన్ । నామ్నాయం బాలసూర్యోదయ ఇతి కథితః భువనేయం ప్రసిద్ధః॥

వ్యా॥ శు. రసము, 1 భా. శు. గంధకము, 3 భా. శు. నాభి, 3 భా. తామ్ర భస్మ, 2 భా. తీక్ష్ణలోహభస్మ, 2 భా, ఇంగువ, ½ భా. అభ్రకభస్మ, 5 భా. కాంత భస్మ, 5 భా. వెండిభస్మ, 5 భా. మిరియాలు, 1 భా. సీసభస్మ, 3 భా. వంగభస్మ, 4 భా. ఇవిమెత్తగనూరి అవిసిఆకురసము, అడ్డసరపురసము, గొబ్బిరసము, వీటిచేమర్దించి సేవించిన, జ్వరములు, శ్వాస, కాస, వాంతి, పాండువు, శూల, ప్రమేహములు, మూలవ్యాధి, ప్లీహవ్యాధి, గుల్మము, వాతవ్యాధులు, క్షయవలనపుట్టిన శ్లేష్మవ్యాధులు, రాజయక్ష్మ మొదలగు వ్యాధులు, వీటినినశింపజేయును. ఇదిలోకమందు బాల సూర్యోదయమని ప్రసిద్ధమైనది.

## వంటుహాబాలసూర్యోదయం

శ్లో॥ దశభాగం శుద్ధ సూతం ద్వాదశం శుద్ధ గంధకం । ద్వాభాగాచశిలాతాలే తాలార్ధం శుద్ధ స్వర్ణకం । తారంతామ్రం నాగ వంగం స్వర్ణపాదాంశ ముచ్యతే । కుమారీ దాడిమద్రావైశ్చిత్రమూల ద్రవేణచ । త్రిదినం మర్దయేత్సమ్యక్కాచ కుప్యంత రేక్షిపేత్ । సమ్యగావేష్టయేత్పశ్చాద్వస్త్ర ఖండైస్సమృత్తికైః । గోలకంతం క్షిపేద్భాండే వాలుకా సహి తేభిషక్। త్రిదినం పాచయేచ్చుల్ల్యాం మందమధ్యమోత్తమైః క్రమాత్ । సాంగశీతల ముద్ధృత్య సిందూరం రక్తవర్ణకం । సిద్ధం భవతి సిందూరం సర్వరోగేషు యోజయేత్ । సన్నిపాతం జ్వరం ఘోరం క్షయ మేకాదశం హరేత్। ఉదరాణిచ సర్వాణి వాత రోగాన్విశేషతః । సంతతోచ్ఛ్వాస కాసేచ వలీపలితనాశనం । గుంజా ద్వయం ప్రదాతవ్యం తత్తద్రోగానుపానతః । నాశయేదితి తత్సర్వం శివేన పరిభాషితం ! బాలసూర్యోదయం నామభిషగాశ్చర్యకారణం॥

వ్యా॥ శు, రసము, 10 భా. శు. గంధకము, 12 భా. శు. మణిశిల, 2 భా. శు. తాళకము, 2 భా. శు. బంగారము, 1 భా. వెండి 1/4 భా. తామ్రము 1/4 భా. సీసం, 1/4 భా. వంగము, 1/4 భా. వీటిని కలబంద, దానిమ్మ, చిత్రమూలము, వీటిరసిములచే మూడురోజులుమర్దించి కాచకుప్పెయందుంచి మట్టిపూసిన గుడ్డలచే బాగుగ

చుట్టిదానిని ఇసుకపోసిన కుండయందుంచి పొయ్యిమీదపెట్టి మంద, మధ్యమ, తీవ్రా గ్నులచే మూడురోజులువండి స్వాంగశీతలమునతీసి ఎర్రనైనసిందూరమును గ్రహించి సర్వరోగములయందును ఇవ్వవలెను. ఘోరమైన సన్నిపాతము, ఏకాదశక్షయలు, సమస్తఉదరరోగములు, సమస్తవాతవ్యాధులు, ఎల్లప్పుడు శ్వాస, దగ్గు, వీటిని నశింపజేయును, శరీరము ముడతలుపడుట, వెంట్రుకలు నెరయుట, వీటిని నశింపజే యును. ఆయారోగానుపానములచే రెండు గురిగింజల ప్రమాణము యిచ్చిన సమస్త రోగములను నశింపజేయునని ఈశ్వరునిచే చెప్పబడెను. ఈబాలసూర్యోదయము వైద్యు లకు ఐశ్వర్యమును కలుగజేయును.

## సువర్ణబాలసూర్యోదయం

శ్లో॥ సువర్ణంరజతంకాంస్యం తామ్రభస్మతథైవచ । మృతసూతం తథాగంధం నాగంవంగంచ లోహకం । పునర్నవకుమార్యాచద్వదినంచ విమర్దయేత్ । గులికాన్కారయేచ్చైవఆతపేచైవ శోషితాన్ । కాచ కుప్యాం నివేశ్యాథవాలుకా యంత్రయోగతః । త్రివిధాగ్ని క్రమేణైవ పాచయేత్ప పంచయామకం ।స్వాంగశీతలముద్ధృత్యదినమేకంవిమర్దయేత్ । త్రిఫలాక్వాథకేనైవ చండాలీ ఆర్ద్రికరసైః । మత్స్యాక్ష్యైశ్చరసే నైవ నాగవల్లీ రసేనచ । అనుపానవిశేషేణ నానారోగనివారణం । బాలసూర్యోదయం నామసీతానాథప్రకల్పితం॥

వ్యా॥ బంగారుభస్మ, వెండిభస్మ, కంచుభస్మ, తామ్రభస్మ, రసభస్మ, శు. గంధకము, నాగభస్మ, వంగభస్మ, లోహభస్మ, ఇవి గలిజేరు, కలుబంద రసములచే రెండురోజులు మర్దించి గులికలుచేసి ఎండయందు ఎండించి కాచకుప్పెయందుంచి వాలుకాయంత్రమందు అగ్నిత్రయముచేతను క్రమముగాఅయిదుఝాముల వండునని స్వాంగశీతలమునతీసి, త్రిఫలాకషాయము,నీలి ఆకురసము, అల్లపురసము,పొన్నగంటిఆకు, రసము, తమలపాకురసము వీటిచే ఒక్కొక్కదానిచే ఒక్కొకదినము మర్దించి అనుపాన విశేషములచే యిచ్చిన సమస్తవ్యాధులను నశింపజేయును. ఇదిసీతానాధునిచే కల్పింపబడిన బాల సూర్యోదయము.

## సువర్ణ మహాబాలసూర్యోదయం

శ్లో॥ శుద్ధసూతం గృహీత్వాదౌ పలద్వితయసమ్మితం । శుద్ధ గంధంచ తత్సామ్యం హేమరౌప్యంచకర్షకం । కాంతాభ్రం తామ్ర తీక్ష్ణంచ నాగవంగంచ మాక్షికం । వైక్రాంతంచసమంసర్వంకషాయం చనిదాపయేత్ । హంసపాదీకుమారీభ్యా మీశ్వరీమూలచిత్రకైః

మర్ద్యంచ కజ్జలీంకృత్వా కాచకుప్యాం నివేశయేత్ । వాలుకాయంత్ర భాండస్థం యథాచుల్ల్యాంప్రయత్నతః । త్రిదినంచ అహోరాత్రం క్రమవహ్నించదీపయేత్ । స్వాంగశీతలతాంయాతి సమాకృష్య రసోత్తమం । ఇంద్రగోపసమం తేజోరసేంద్రం యోజయేద్బుధః । ఏతత్సర్వం నిధాయాథపునః ఖల్వేశుభేహని । ద్వినిష్కం మృగనాభించ దేవపుష్పంచ తత్సమం । నిష్కమాత్రంచ కర్పూరం సమ్యక్ మేలయ యత్నతః । దృఢం మర్ద్యంజలేనైవ గులికాన్కారయేత్సుధీః । యోజ్యం సర్వేషు రోగేషు గుంజాద్వయమిదం రసం । అశీతివాతజాన్ రోగాన్ హంతి శూలత్రయం తథా । వింశతి శ్లేష్మరోగాంశ్చ చతుర్వింశతి పైత్యకాన్ । తత్తద్రోగానుపానేన నిహంతి సకలామయాన్ । క్షయమేకాదశం చైవ గ్రహణీపాండు కామలాం । కుంభకామలకాన్ రోగాన్ ఉదావర్తం మహోదరం । దీపనంపరమం ప్రోక్తం సర్వాఙ్నాశకరంపరం । బాలానాం పరమం పథ్యం వృష్యమాయుష్య వర్ధనం । బహునాత్రకిముక్తేన సర్వరోగహరంపరం । బాలసూర్యోదయతేజో బాలసూర్యోదయంరసం॥

వ్యా॥ శు. రసము, 2 పలములు శు. గంధకము, 2 పలములు సువర్ణభస్మ, 1 క. వెండిభస్మ, 1 క. కాంతభస్మ, అభ్రకభస్మ, తామ్రభస్మ, తీక్ష్ణభస్మ, సీసభస్మ, వంగభస్మ, మాక్షికభస్మ, వైక్రాంతభస్మ, ఇవి ప్రత్యేకముగానొక్కొకఅర్ధ కర్షము ఇవి, హంసపాది, కలుబంద, ఈశ్వరివేళ్లు, చిత్రమూలము, వీటిరసములచే మర్దించుకుని కజ్జలి చేసుకుని కాచకుప్పెయందుంచుకుని వాలుకాయంత్రమందు మూడు రోజులు అహోరాత్రములు క్రమాగ్నులచే వండుకుని స్వాంగశీతలమైన పిదప ఆరుద్రపురుగుతో సమానకాంతిగల యామందును తీసుకుని ఖల్వమందుంచుకుని కస్తూరి 2 నిష్కములు, లవంగములు 2 నిష్కములు, పచ్చకర్పూరము 1 నిష్కము, వీటిని కలుపుకుని ఉదకముచే దృఢముగా మర్దించుకుని మాత్రలు చేసుకుని రెండు గురిగింజల ప్రమాణము అన్నిరోగముల యందును యివ్వవలెను. ఎనభైవాత వ్యాధులను, మూడుశూలలను, ఇరవై శ్లేష్మ వ్యాధులను, ఇరవైనాలుగు పైత్యవ్యాధులను, ఆయారోగాను పానములచే సర్వవ్యాధులను, హరించును. ఏకాదశక్షయలు, గ్రహణి, పాండు, కామిర్ల, కుంభకామల, ఉదావర్తము, మహోదరము, సర్వవ్యాధులను నశింపజేయును. అగ్నిదీప్తిచేయును. బాలురకు మిక్కిలి హితమైనది. శుక్రమును, ఆయుర్దాయమును, వృద్ధిపొందించును, విశేషము చెప్పవలసిన అవసరములేదు తప్పక సర్వరోగములను హరించును. బాలసూర్యునితో సమానమైన కాంతి కలిగిన యిది, బాలసూర్యోదయమని చెప్పబడును.

# కనకబాలసూర్యోదయం

శ్లో॥ సూతాత్త్రిగుణ్య గంధం విషకనకయుతం భానుతీక్ష్ణంచనేత్రం । ఆరూఢంతచ్చతుర్థం గగనశరయుతం కాంతభస్మంచ తుల్యం। మారీచం సూతభాగంత్రయమపిరజతం విద్రుమం శుక్తిజాతం । సిందూరం నాగవంగం త్రితయమపిచమర్ద్యం ఖల్వమధ్యేతు సర్వం । గోక్షీరం గోక్షురంచ శతావరీ సాంబావాశేక్షురకేణచ । భూకూష్మాండస్యకందం ముసలికదలికాశాల్మలీ మూలసారైః । ఏనందద్యాన్నిహంతి జ్వరవనదహనం శ్వాసకాసంచఛర్దిం । పాండుంశూలప్రమేహాన్ హరతి గుదరుజం లింగదోషంచపుంసాం । యోషితాం యోనిదోషం బహువిధప్రదరాన్ రాజయక్ష్మాతిసారకాన్ । నామ్నాయం బాలసూర్యోదయో ఖిలగదహారో భాషితోయం మునీంద్రైః ॥

వ్యా॥ శు. పాదరసము 1 భా. శు. గంధకము 3 భా. శు. నాభి 2 భా, బంగారభస్మ 2 భా. తామ్రభస్మ 2 భా. లోహభస్మ 2 భా. గవ్వలభస్మ 1/2 భా. అభ్రకభస్మ 5 భా. కాంతభస్మ 5 భా. మిరియాలు 1 భా. వెండిభస్మ 1 భా పగడభస్మ 1 భా. ముత్యభస్మ 1 భా. రససిందూరము 1 భా. సీసభస్మ 1 భా. వంగభస్మ 1 భా. ఇవన్నియు ఖల్వమందుంచి, ఆవుపాలు, పల్లేరు, పిల్లిపీచర, పాలసుగంధి అడ్డసరము, గొబ్బి, నేలగుమ్మడుదుంప, నేలతాడి, అరటిదుంప, బూరుగవేళ్లు, వీటి రసములచే మర్దించి సేవించినజ్వరము, శ్వాస, కాస, వాంతి, పాండువు, శూల, ప్రమేహములు, అర్శస్సు, పురుషునియొక్క లింగదోషము, స్త్రీలయొక్క యోని దోషము, సమస్తప్రదరములు, రాజయక్ష్మ అతిసారము, వీటిని హరించును. బాలసూర్యోదయ మనెడి యియ్యది సమస్తవ్యాధులను హరించును. ఇది మునీశ్వరులచే చెప్పబడినది.

# కామేశ్వరరసం

శ్లో॥ మృతసూతాభ్రకం స్వర్ణం కాంతం తీక్ష్ణం మృతంతథా । ప్రవాలం మౌక్తికం వంగం శోధితంచ శిలాజితు । రంభా గోక్షుర శాల్మలీ ఇక్షు వాశాశతావరీ । ఇక్షురకస్య బీజాని మర్కటీజీరకంబలా । అశ్వగంధా విదారీచ భూశర్కర రసానిచ । మృణాలం వాలకంయష్టం ఏలా చందన ముత్పలం । జాతీపత్రం జాతిఫలం కూష్మాండ కదలీఫలం । ద్రాక్షా ఖర్జూర విజయా ఆర్ద్రిసారం తథైవచ । కుంకుమంచలవంగంచ

సర్వసారేణ మర్దయేత్ । ప్రత్యేకం యామమాత్రంతు గోక్షీరేణచభా వయేత్ । ఘనసార మిదంచైవ ఔషధేన దశాంశకం । ఏతద్రసాయ నం సర్వాం పన్నీరేణ చభావయేత్ । గులికాన్ ఛాయయా శుష్కాన్ వంశనాలే వినిక్షిపేత్ ! చతుర్గుంజా ప్రమాణేన శర్కరాక్షీరసంయుతం। పూర్వయామే తథాగ్రాహ్యం అపరాహ్ణే తదర్ధకం । రాత్రౌ గోక్షీర సితయా అభ్యాసేన గుణౌషధం । వలీపలిత నాశంచ వృద్ధోపి తరుణా యతే । వంధ్యోపి జాయతే పుత్రం వీర్యవృద్ధికరం నృణాం । స్తంభనం మోహనంచైవ కాంతిదం పుష్టివర్ధనం । లాలా మేహం వసామేహం హారిద్రా శుక్లమేహకం । ఇక్షుమేహం మధుమేహం బహుమూత్రంచ తంతుకం । రక్తమేహం మూత్రకృచ్ఛ్రం అశ్మరీ పిష్టమేహకం । కదలీ కాకి వంధ్యాత్వం స్త్రీణాంరోగనివారణం। రక్తపిత్తం చామ్లపిత్తంనారీణాం ప్రదరంతథా । ఛర్ది హిక్కామపస్మారం ఉన్మాదం మూర్ఛరోగకం।అం గదాహం లింగదాహం నష్టం వీర్యం ప్రపూర్ణకం। గుల్మోదరప్రశమనం అష్టశూల నివారణం । తత్తద్రోగానుపానేన తత్తద్రోగ నివారణం । శ్రేష్ఠం రసాయనం చైవ మదనోద్రేకకారణం । కామేశ్వరరసం నామ అశ్వినీదేవ నిర్మితం॥

వ్యా॥ రసభస్మ, అభ్రకభస్మ, సువర్ణభస్మ కాంతభస్మ, తీక్ష్ణలోహభస్మ, పగడ భస్మ, ముత్యభస్మ, వంగభస్మ, శు, శిలాజితు, ఇవి సమభాగములు గ్రహించి, అరటి దుంప, పల్లేరు, బూరుగ, చెరుకు, అడ్డసరము, పిల్లిపీచర, గొబ్బివిత్తులు, దూలగొండి విత్తులు, జీలకర్ర, ముత్తవపులగము, పెన్నేరు, నేలగుమ్మడి, భూశర్కర, తామర తూండ్లు, కురువేరు, చెంగల్వకోష్టు, ఏలకులు, మంచిగంధము, నల్లకలువ, జాపత్రి, జాజికాయ, బూడిదగుమ్మడికాయ, అరటిపండ్లు, ద్రాక్షపండ్లు, ఖర్జూరకాయలు, గంజాయి, అల్లము, కుంకుమపువ్వు, లవంగములు, వీటి యొక్క రసములచే వక్కా క్క ఝాము మర్దించి ఆవుపాలచే భావన చేసుకుని ఈఔషధమునకు పదవ భాగము పచ్చకర్పూరము కలుపుకుని, ఈఔషధమునంతయు పన్నీరుచే భావన చేసుకుని మాత్రలు కట్టుకుని వెదురుగొట్టము యందుంచుకొనవలయును. దీనిని ఉదయమందు నాలుగు గురిగింజలప్రమాణమును, మధ్యాహ్నమందు రెండు గురిగింజలప్రమాణమును రాత్రి యందు నాలుగుగురిగింజల ప్రమాణమును, పంచదార, పాలతో తీసుకొనుచుండిన యడల శరీరము ముడతలు పడుట, వెంట్రుకలు నెరయుట, వీటిని నశింపజేయును. ముసలివాడు కూడ యౌవనవంతుడగును. సంతానము లేని వాడు కూడ సంతానవంతు డగును. వీర్యవృద్ధి, వీర్యస్తంభనము, మోహము, శరీరకాంతి, శరీరపుష్టి, వీటిని కలిగిం

చును. లాలామేహము, వసామేహము, హారిద్రామేహము, శుక్లమేహము, ఇక్షుమేహము మధుమేహము, బహుమూత్రము, తంతుమేహము, రక్తమేహము, మూత్రకృచ్ఛ్రము, అశ్మరి, పిష్టమేహము, కదళీవంధ్యాత్వము, కాకవంధ్యాత్వము, స్త్రీల యొక్క రోగములు, రక్తపిత్తము, అమ్లపిత్తము, స్త్రీలయొక్క ప్రదరము, వాంతి, ఎక్కిళ్లు, అపస్మారము, ఉన్మాదము, మూర్ఛ, శరీరతాపము, లింగమందలిమంట, పూర్ణమైన ఇంద్రియనష్టము, గుల్మము, ఉదరము, ఎనిమిది శూలలు, వీటిని నివారింపజేయును. ఆయారోగానుపానములచే సమస్తరోగములను హరించును. శ్రేష్ఠమైన రసాయనము. మన్మథోద్రేకమును కలిగించును. కామేశ్వరరసం బన దగు నిది అశ్విని దేవతలచే చెప్పబడెను.

# కృశామృత రసం

శ్లో॥ రసభస్మచ ద్వే భాగా భాగైకం హేమభస్మకం । గుడూచీసత్వ తుల్యాంశం శర్కరా మధుసర్పిభిః । దినైకం మర్దితం ఖల్వే మాషైకం భక్షితం సదా । అశ్వగంధా పలార్థంచ గవాంక్షీరైః పిబేదను । కృశానాం కురుతే పుష్టిం నామ్నా కృశామృతరసః । కృశానాం బృహణం దేయం సర్వం పానాన్నభేషజం । నిద్రాంచైవ దివా రాత్రౌ ఛాగమాంసాశనం సదా॥

వ్యా॥ రసభస్మ 2 భా, సువర్ణభస్మ 1 భా, వీటితో సమానము తిప్పసత్తు కలుపుకుని ఖల్వమందుంచుని వకరోజునూరుకుని మాషప్రమాణము, పంచదార, తేనె, నెయ్యి, వీటితో సేవించి పెన్నేరుచూర్ణము అర్థపలము ఆవుపాలతో పుచ్చుకొనుచుండిన, ఈకృశామృతరసము, కృశించినవారలకు పుష్టినిచేయును. కృశించినవారలకు పుష్టికరమైన పానము, అన్నము, ఔషధము యివ్వవలయును. రాత్రిపగళ్లు నిద్రించవలయును. మేకమాంసము తినిపించవలయును.

# సువర్ణలోహ రసాయనం

శ్లో॥ సువర్ణం పారదం గంధం క్రమోత్తరగుణం భవేత్ । రసతుల్యం తీక్ష్ణలోహం సర్వమేకత్ర మర్దయేత్ । జంబీర తులసీ వాశా నిర్గుండీ చిత్రమూలకైః । క్షిప్త్వా కాచఘటే పక్త్వా సికతాయంత్రయోగతః । శీతాగ్నికంచ సంగృహ్య పూర్వైశ్చైవ చ మర్దయేత్ । కృత్వాచ గులికాన్ సమ్యక్ త్రిగుంజాం భక్షయేత్తతః । కాసశ్వాసం తథా జీర్ణంకామలాం క్షయశోఫకం । వాతవ్యాధీన్ తథా శీఘ్రం కఫవ్యాధీ నశేషతః । సర్వరోగం హరత్యేవ స్వర్ణలోహ రసాయనం॥

వ్యా॥ సువర్ణభస్మ 1 భా, శు. రసము 2 భా, శు. గంధకము 3 భా, ఖడ్గలోహభస్మ 2 భా, వీటినన్నిటిని నిమ్మకాయలు, తులసి, అల్లపురసము, వావిలి, చిత్రమూలము, వీటిరసములచే మర్దించుకుని, కాచపుప్పెయందుంచుకుని వాలుకాయంత్రమందు వండుకుని, చల్లారినపిదప, తీసి మరల పూర్వరసములచే మర్దించి పుప్పెలుకట్టుకుని మూడుగురిగింజలప్రమాణము, సేవింపుచుండిన, దగ్గు, పగర్పు, అజీర్ణము, కామిల్ల, క్షయ, నంజు, వాతవ్యాధులు, సమస్తకఫవ్యాధులు వీటినివెంటనే హరించును. ఈసువర్ణలోహరసాయనము సమస్తరోగములను హరించును.

# సూతికారి రసమ్

శ్లో॥ తాలకం గంధకపారదం త్రికటుకం జాతీఫలం సైంధవం। నాగం వంగంచ లోహం అభ్రకమిదం తామ్రం శిలాతుత్థకం। నేపాలం విషటంకణం హయమతా క్షారంచ గరలం తథా। తారం తాలకహింగులం చ సహితం ఏకైకభాగాన్వితం। జంబీరార్ద్రికమేఘనాద సహితం చిత్రంచ తులసీదలం। మర్ద్యం సేవిత మేక మేక దివసం మాషంచ మాత్రాం వటీం। సూతిరోగం నిహంతి సర్వమఖిలం తాపంచ ఛర్దీహారం। జీర్ణజ్వరం తథాశోఫం గ్రహణీ ప్లీహ కాసజిత్। గుల్మం మహోదరం హంతి కఫవాతాధిహారం తథా। సూతికారిరసో నామా శ్రీ సోమనాథోదితం॥

వ్యా॥ శు. తాళకము, శు. గంధకము, శు. రసము, త్రికటుకములు, జాజికాయ సైంధవలవణము, సీసభస్మ, వంగభస్మ, లోహభస్మ, అభ్రకభస్మ, తామ్రభస్మ, శు. మణిశిల, శు. మైలతుత్థము; శు. నేపాళములు, శు. నాభి, శు. వెలిగారము, యవక్షారము గరళము, రజతభస్మ, శు. పిండతాళకము, శు. ఇంగిలీకము, ఇవి వక్కొక్కభాగమును గ్రహించి, నిమ్మకాయలు, అల్లము, చిర్రికూర, చిత్రమూలము, తులసిఆకు, వీటి రసములచే వక్కొక్కరోజు మర్దించి మాషప్రమాణము మాత్రను సేవించినసమస్తమైన సూతికారోగములు, తాపము, వాంతి, జీర్ణజ్వరము, నంజు, గ్రహణి, ప్లీహవ్యాధి, దగ్గు, గుల్మము, మహోదరము, కఫవ్యాధులు, వాతవ్యాధులు, వీటిని హరించును. ఈ సూతికారసము, సోమనాథునిచే చెప్పబడెను.

# సువర్ణ తిలక రసమ్

శ్లో॥ హేమ్నోభస్మకతోలకం హిమం ద్విగుణితం లోహాత్త్రియః పారదా చ్చత్వారో నియతంతు వంగయుగలం చైకీకృతం మర్దయేత్। ముక్తా విద్రుమయో రసేన సమతా గోక్షీర వాసేక్షుణాం।

మర్దయ్యం వన్యకరీషకై స్సుదృఢం తప్తం పుటే శీతలం। కస్తూరీ ఘనసార మత్రత రసః పశ్చాత్తుసిద్ధో భవేత్। కాస శ్వాస సపిత్త వాత కఫజిత్ పాండు క్షయాదీన్ హరేత్। శూలార్తి గ్రహణీం విషాదిహరణం మేహాశ్మరిః వింశతిం। హృద్రోగాదిహరం జ్వరాది శమనం వృష్యం వయోవర్ధనం। శ్రేష్ఠం పుష్టికరం సువర్ణతిలకో మృత్యుంజయే నోదితం॥

వ్యా॥ సువర్ణభస్మ 1 తులము, రజతభస్మ 2 తు, లోహభస్మ 3 తు, రస భస్మ 4 తు, వంగభస్మ 2 తు, సీసభస్మ 2 తు, ముత్యభస్మ 4 తు, పగడభస్మ 4, ఇవి అడ్డసరము, పల్లేరు, చెరుకు, వీటిరసములచే మర్దించి పిడకలచే గొప్పపుటము వేసి చల్లారినపిదపతీసి, కస్తూరి, పచ్చకర్పూరము, ఇవికలుపుకుని మర్దించుకునిన సిద్ధమ గును. ఇది కాస, శ్వాస, పైత్యవ్యాధులు, వాతవ్యాధులు, కఫవ్యాధులు, పాండు వు, క్షయ, శూల, గ్రహణి, విషము, ఇరవైమేహములు, అశ్మరి, హృద్రోగము, జ్వరము, ఈ మొదలగువ్యాధులను శాంతింపజేయును. శుక్రవృద్ధి, ఆయుర్వృద్ధి, పుష్టి, వీటినిచేయును. ఈసువర్ణతిలకము మృత్యుంజయునిచే చెప్పబడెను.

## తామ్రలోహ రసాయనం

శ్లో॥ పారదం గంధకం శుద్ధం ద్వౌ భాగౌ పరికల్పయేత్। తామ్రభస్మ అయోభస్మ ఏకభాగం పృథక్ పృథక్। వాశా నిర్గుండి బృహతీ రవిదుగ్ధక చిత్రకైః। మరీచీ శృంగవేరాభ్యాం మర్దయేచ్చ పృథక్పృథక్। కాచకుప్యంతరే క్షిప్త్వా వాలుకాయంత్రపాచితం। తత ఉద్ధృత్య తత్సర్వం మర్దయే న్నింబుచద్రవైః। గులికాన్ ఛాయయా శుష్కాన్ అనుపానవిశేషతః। కఫరోగే ప్రయోక్తవ్యం ద్విగుంజాపరిమాణతః। తిమిరం వాతశూలఘ్నం కాసశ్వాసహరం పరం। క్షయం కుష్టం తథా జీర్ణం శోపపాండ్వామయాన్ జయేత్। ప్రసిద్ధం భువనే నిత్యం తామ్రలోహరసాయనం॥

వ్యా॥ శు. రసము, 2 భా. శు. గంధకము, 2 భా. తామ్రభస్మ, 1 భా. లోహభస్మ 1 భా, ఇవి, అడ్డసరము, వావిలి, నేలములగ, జిల్లేడుపాలు, చిత్రమూలము, మిరియాలు, అల్లము, వీటిరసములచే ప్రత్యేకముగా మర్దించి కాచకుప్పెయం దుంచి వాలుకాయంత్రమందు వండుకుని తీసుకుని ఆమందునంతయు, నిమ్మకాయరసముచే నూరుకుని కప్పెలుకట్టుకుని నీడను ఎండించుకుని అనుపానవిశేషములచే రెండు గురిగింజలప్రమాణము, కఫవ్యాధులయందు యివ్వవలెను. తిమ్మిర్లు, వాతశూల, దగ్గు,

వగర్పు, క్షయ, మష్టము, అజీర్ణము, నంజు, పాండు, వీటినిజయించును. ఇది లోక మందు తామ్రలోహరసాయనమని ప్రసిద్ధమైనది.

## కాస శ్వాసాంకుశ రసమ్

శ్లో॥ విషం చతుర్గుణం దద్యా త్తదర్థం తీక్ష్ణకంతథా। విద్రుమం మౌక్తికం శంఖం కాంతం వ్యోమరసం తథా। కమఠీ ఛాగ మాయూర మకరీ పిత్తకానిచ। హారీతకీ గంధ మేతా న్యేకైకం మరీచం తథా। సర్వ మేతత్సమం కృత్య ఖల్యమధ్యే వినిక్షిపేత్। నిర్గుండీ చిత్రకరసై ర్మర్దితం దివసత్రయం। గుంజామాత్రప్రమాణేన దాపయే ద్భిషగుత్తమః। పాండు శూల ప్రమేహాంశ్చ కాసశ్వాసాగ్నిమాంద్యకాన్। వాతాధీన్ సన్నిపాతాని జ్వరం శ్లైష్మిక మాహరేత్। కాసశ్వాసాంకుశం ఖ్యాత మశ్వినీదేవనిర్మితం॥

వ్యా॥ శునాభి 4 భా, తీక్ష్ణలోహభస్మ 2 భా, పగడభస్మ, ముత్యభస్మ, శంఖభస్మ కాంతభస్మ, అభ్రకభస్మ, రసభస్మ, తాబేలుచేదు, మేకచేదు, నెమలిచేదు, మొసలిచేదు, కరక్కాయ, శుగంధకము, మిరియాలు ఇవిఏక్కొక భాగము, ఇటుల నన్నిటినికలుపుకొని ఖల్వమందుంచుకొని వావిలి, చిత్రమూలరసములచే మూడురోజులవు మర్దించుకొని గుంజాప్రమాణముయిచ్చిన, పాండు, శూల, ప్రమేహము, కాస శ్వాస, అగ్నిమాంద్యము, వాతవ్యాధులు, సన్నిపాతములు, శ్లేష్మజ్వరము, వీటిని హరించును. 'కాసశ్వాసాంకుశ' మనెడి యిది అశ్వినీదేవతలచేచెప్పబడెను.

## ఆనంద రసమ్

శ్లో॥ వంగభస్మ మృతం స్వర్ణం రసభస్మ విమర్దయేత్। ద్విగుంజం భక్షయేన్నిత్యం హంతి మేహం చిరోద్భవం। గుడూచీ సత్వకం క్షౌద్రై రనుపానం ప్రశస్యతే॥

వ్యా॥ వంగభస్మ, సువర్ణభస్మ, రసభస్మ, ఇవిసమభాగములు నూరుకొని రెండు గురిగింజల ప్రమాణము తిప్పసత్తు, తేనె, అనుపానముతో సేవించిన చిరకాలమై జనించిన ప్రమేహముకూడ నశించును.

## సన్నిపాతసూర్య రసం

శ్లో॥ రసేన గంధం ద్విగుణం ప్రగృహ్య తత్పాదభాగం రవి తారహేమ। భస్మీకృతం యోజయమర్దయిత్వా దినత్రయం వహ్నిరసే్న

ఘుర్మే। విషంచ దత్వాత్ర కలార్ధమానం మత్స్యాజపిత్తైః పరిభావయేచ్చ। వల్లద్వయం చాస్య దదీత వహ్నికటుత్రయార్ద్రిస్వరసప్రయుక్తం। తైలేన చాభ్యంజనమేవ కుర్యాత్ స్నానం జలేనాపిచశీతలేన। సన్నిపాతే మహాఘోరే సర్వేష్వపి జర్వేషుచ। విషమేషు సమస్తేషు జ్వరే జీర్ణే తథైవచ । అజీర్ణేగ్నిమాంద్యేచ వాతశ్లేష్మగదేషుచ । సూతికాజ్వరవాతేషు ప్రయోక్తవ్యం రసోత్తమం । విష్ణునాచ నిర్మితోయం సన్నిపాతసూర్యోరసః॥

వ్యా॥ శురసము 1 భా, శుగంధకము 2 భా, తామ్రభస్మ ¼ భా, రజతభస్మ ¼ భా, సువర్ణభస్మ ¼ భా, ఇవి చిత్రమూలరసముచే మూడురోజులు మర్దించి ఎండయందు ఎండించుకుని శునాభి 8 భా, కలుపుకుని, చాప, మేక, చేదులచే భావనచేసుకుని రెండువల్లముల ప్రమాణము, చిత్రమూలము, త్రికటుకములు, అల్లము, వీటిరసలచే యివ్వవలయును. తైలాభ్యంజనము చేయించి చన్నీళ్లస్నానము చేయించవలయును. ఇది, మహాఘోరమైన సన్నిపాతము, సమస్తజ్వరములు, విషమజ్వరములు, జీర్ణజ్వరము, అజీర్ణము, అగ్నిమాంద్యము, వాతవ్యాధులు, శ్లేష్మవ్యాధులు, సూతికాజ్వరము, సూతికావాతము, వీటియందు ఈశ్రేష్ఠమైన మందును యివ్వవలయును. ఈ సన్నిపాత సూర్యరసము, విష్ణువుచే నిర్మించబడెను.

## వృష్యహేతురసం

శ్లో॥ రసభస్మ త్రిభాగం స్యాదష్టభాగంతు గంధకం చతుర్థం మౌక్తికం హాటం ద్విభాగం తాలకం శిలా । తార మభ్రకలోహానాం వంగమాక్షికనాగయోః । అయస్కాంతప్రవాలానాం తుల్యభాగం ప్రకల్పయేత్ । భావనా త్రీణి దుగ్ధేన ఉశీరం కేతకీ జయా । బలాశ్వగంధమాషాణాం దశవారం పృథక్పృథక్ । లవంగే క్షుర జాతీనాం త్వగేలాగోక్షురాన్వితం। శతావరీ మోచరసం మర్కటీచందనోత్పలం । ఏతైశ్చ భావనాదేయం పాదాంశం శుద్ధఫేనకం। మేలయిత్వాప్రయత్నేన అనుపానవిశేషకైః । మాషమాత్రం ప్రయోక్తవ్యం మధునా శర్కరాన్వితం । మైథునేన దృఢం లింగం అంగనానాం శతత్రయం। గచ్ఛే దవికృతో నిత్యం భోక్తవ్యంచ యథేప్సితం । ప్రాతరుద్ధిత స్సేవ్యంచ తత్త్రద్రోగోపశాంతయే । నష్టవీర్యం । ప్రమేహంచ మూత్రకృచ్ఛ్రవినాశనం । కాసశ్వాస క్షయం ఛర్దిం సర్వాంశ్చ గ్రహణీగదాన్ । సర్వాతీసార

శోఫఘ్నం అగ్నిమాంద్య మజీర్ణకం।వృష్య హేతురసోనామ లోకానాం హితకామ్యయా । ఆరోగ్యరక్షణార్థంహి పూజ్యపాదేన నిర్మితం ॥

వ్యా॥రసభస్మ 3 భా, శుగంధకము 8 భా, ముత్యభస్మ 4 భా, సువర్ణభస్మ 2 భా, శు, తాళకము, శుమణిశిల, రజతభస్మ, అభ్రకభస్మ, లోహభస్మ, వంగభస్మ, మాక్షికభస్మ, సీసభస్మ, అయస్కాంతభస్మ,పగడభస్మ,ఇవివక్కొక్క భాగము,వీటిని ఆవుపాలచే మూడుభావనలుచేసి, వట్టివేళ్లు, మొగలిపువ్వులు, తెక్కలి, ముత్తవపులగము, పెన్నేరు, మినుములు, వీటిరసములచే ప్రత్యేకముగా పదేసిసారులు, భావనచేసి, లవంగములు, గొబ్బి జాజికాయలు దాసినచెక్క యాలకులు పల్లేరు,పిల్లిపీచర, బూరుగబంక, మాలగొండి, మంచిగంధము, నల్లకలువ, వీటిరసములచే వక్కొక్క భావనచేసి ఈమందునకు నాలగవభాగము, శుద్ధమైన నల్లమందు కలుపునది,అనుపానవిశేషములచే, మాషప్రమాణము యివ్వవలయును. తేనె, పంచదార,వీటితోయిస్తూ, యథేష్టముగా భుజింపుచుండినయడల దృఢమైనలింగముకలవాడై మూడునూరుల స్త్రీలను అలసటలేనివాడై రమించును. ఉదయమున లేచి, సేవించిన, సమస్తవ్యాధులు, ఇంద్రియనష్టము, ప్రమేహము, మూత్రకృఛ్రము, కాస, శ్వాస, క్షయ, వాం, సమస్తగ్రహణులు, సమస్తఅతిసారములు సంజు, అగ్నిమాంద్యము, అజీర్ణము, వీటిని శాంతింపజేయును, ఈవృష్యహేతురసము, లోకముయొక్క హితమునుకోరి లోకముయొక్క ఆరోగ్యమునిమిత్తముపూజ్యపాదునిచే చెప్పబడెను.

# నేత్రామృత వర్తి

శ్లో॥ తారం తామ్రం రసం తుత్థం ఖర్పరం కటురోహిణీ । రసాంజనం కాంస్యశంఖం హంసపాద్యా ద్రవై ర్దినం ।వర్తిం కృత్వాంజనాద్ధంతి సమస్తాన్ నేత్రజామయాన్॥

వ్యా॥ రజతభస్మ, తామ్రభస్మ, రసభస్మ, శు. మైలతుత్థము, శు. కఘరి, కటుకరోహిణి, రసాంజనము, కంచుభస్మ, శంఖభస్మ, ఇవి సమభాగములు, హంసపాదిరసముచే వకరోజు మర్దించి కణికలుచేసుకుని కంటియందు అంజనమువేసుకునిన సమస్తనేత్రవ్యాధులను హరింపజేయును.

# మహానేత్రామృతవర్తి

శ్లో॥ తారం తామ్రం రసంసీసం కర్పూరం ఖర్పరం శిలా।రసాంజనం కాంస్య శంఖం ద్రోణపుష్పీద్రవై ర్దినం । వర్తింకృత్వాంజనాద్ధంతి సమస్తాన్నేత్రజామయాన్॥

వ్యా॥ రజతభస్మ, తామ్రభస్మ, రసభస్మ, సీసభస్మ, పచ్చకర్పూరము, శు. కఫరి, శు. మైలతుత్థము, రసాంజనము, కంచుభస్మ, శంఖభస్మ, ఇవి సమభాగములు తుమ్మిపువ్వులరసముచే వకరోజు మర్దించి కణికలు చేసుకొని కంటియందు అంజనము వేసుకొనిన సమస్తనేత్రవ్యాధులు హరించును.

# శృంగారాభ్రక రసం

శ్లో॥ శుద్ధసూతం ద్విభాగంచ భాగైకం శుద్ధగంధకం ।త్రిభాగం తామ్రభస్మంచ త్రిభాగం నాగవంగకం । భాగైకం లోహమండూరం భాగైకం స్వర్ణభస్మకం । మాక్షికం కోశకం లాక్షామాంసీతాలీస పత్రకం । కర్పూరం జాతికోశంచ మృగనాభంచ హింగులం । మంజిష్టా దేవదారుంచ లవంగంచ మనశ్శిలా ।ఏతాని సమభాగాని సర్వస్యార్థంచ అభ్రకం । అభ్రకార్థం యవానీచ ఉత్పలస్యార్థమేవచ । ఏకీకృత్యా ఖిలం మర్ద్యం నాగవల్లీరసై త్ర్యహం । శృంగారాభ్రరసో నామా మహాదేవేన నిర్మితః । చణమాత్రాం వటీంఖాదేల్లవంగాస్యానుపానతః । పయశ్శాల్యోదనం పథ్యంఘృతం మాంసాదిభోజనం । శర్కరామధుకం పిష్టం ఇష్టాన్నం వివిధం తథా । సర్వవ్యాధివినాశంచ అగ్నిమాంద్యమజీర్ణకం । వాతవ్యాధ్యతిసారంచ గ్రహణీం మూత్రకృచ్ఛ్రకం । పైత్తికం శ్లైష్మికం వ్యాధిం వివిధంచ ప్రమేహకం । హృదీంద్రియబలకరం శతస్త్రీరమణోభవేత్ ॥

వ్యా॥ శు. రసము **2** భా. శు. గంధకము **1** భా. తామ్రభస్మ 3 భా. సీసభస్మ 3 భా. వంగభస్మ 3 భా. లోహభస్మ 1 భా. మండూరభస్మ 1 భా. సువర్ణభస్మ 1 భా. మాక్షికభస్మ, మరాటీమొగ్గలు, లక్క, జటామాంసి, తాలీసపత్రి, పచ్చకర్పూరము, జాపత్రి, కస్తూరి, శు. ఇంగిలీకము, మంజిష్టి, దేవదారు, లవంగములు, శు. మణిశిల, ఇవి వకొ్కక భాగములు, వీటిఅన్నిటికి సగము అభ్రకభస్మ, అభ్రకభస్మలోసగము, వాము, నల్లకలువదుంపలు,ఇటుల వీటినన్నిటిని తమలపాకులరసముతో మూడురోజులు మర్దించిన, శృంగారాభ్రరస, మనబడును. ఇది సెనగగింజంత ప్రమాణము లవంగరసానుపానముతో యివ్వవలయును. పాలు, శాల్యన్నము, నెయ్యి, మాంసము మొదలగువాటి భోజనము, పంచదార, తేనె, పిండివంటలు, ఇష్టములైన ఇతరపదార్థములు భుజించవలయును. ఇట్లు చేసిన సమస్తవ్యాధులు, అతిసారము, గహణి, మూత్రకృచ్ఛ్రము, శ్లేష్మవ్యాధులు' సమస్తప్రమేహములు, వీటిని నశింప

జేయును. హృదయమునకు, ఇంద్రియములకు బలమును చేయును. దీనిని సేవించువాడు నూరుగురు స్త్రీలకు ఇష్టుడగును.

# కాసకుఠారరసం

శ్లో॥ రసం గంధం సమం తారం శిలాతాలం చతుర్గుణం। వాసా గోక్షురసారాభ్యాం మర్దయేచ్చ దినద్వయం । ద్వియామం వాలుకా యంత్రే పాచ్యమాదాయ చూర్ణయేత్ । గుంజాద్వయం నిహంత్యాశు కాసశ్వాసం క్షయం తథా । రసః కాసకుఠారోయం అనుపానంచ కథ్యతే । దాడిమం త్రిఫలా వ్యోషం త్రయాణాంచ సమం గుడం । చూర్ణితం భక్షితం కర్షం క్షయకాసాపనుత్తయే॥

వ్యా॥ శు. రసము, 1 భా. శు. గంధకము, 1 భా. రజతభస్మ, 1 భా శు. మణిశిల, 4 భా. శు. తాళకము, 4 భా. ఇవి అడ్డసరము, పల్లేరు, వీటిరసములచే రెండురోజులు మర్దించి వాలుకాయంత్రమున రెండుఝాములు వండుకుని తీసి చూర్ణముచేసుకుని రెండుగురిగింజల ప్రమాణము యిచ్చిన, దగ్గు, వగర్పు, క్షయ, ఇవి వెంటనే పోవును. ఇది కాసకుఠారమనబడును. దానిమ్మ, త్రిఫలములు, త్రికటుకములు, ఇవి సమభాగములు వీటికిసమము బెల్లము, వీటిని చూర్ణించి కర్ష ప్రమాణము అనుపానముగా పుచ్చుకునిన క్షయ, దగ్గు ఇవిపోవును.

# రోగశోషణ రసం

శ్లో॥ చతుర్వింశతిభాగా స్స్యు ర్గంధాద్వంగం తదర్ధకం । వంగ భాగా ద్భవేదర్ధః పారదః కృష్ణమభ్రకం । చతుర్దశ విభాగం స్యా న్మృతం తద్దీయతే పునః । మృతలోహం అష్టభాగం మృతతామ్రం నవాష్టతత్ । మృతహేమద్వయం తేషాం మృతరౌప్యంచ సప్తకం । అతిశుద్ధ మతిస్థూలం మృతం హీరం త్రయోదశ । భాగా గ్రాహ్యం మాక్షికస్య విశుద్ధస్యాత్ర షోడశ । అష్టాదశమితం గ్రాహ్యం నవకాసీసకం పునః । తుత్థకంచ షడేవాత్ర శుద్ధం సంగ్రాహ్యమేవచ । తాలకంచ చతుర్భాగం శిలాయోజ్యా త్రయో బుధైః । శైలేయం పంచ దాతవ్యం సర్వమేకత్ర నూతనం । మృత మౌక్తిక భాగైకం సౌభాగ్యం ద్వయమేవచ । కుట్టయిత్వా విచూర్ణ్యాథ జంబీరస్వరసేనవై । భావయే త్సప్తధా గాఢం గులికాన్ తస్య కారయేత్ । శరావద్వితయే కృత్వా ముద్రయే త్శరావద్వయం । ఘటమధ్యే నివేశ్యాథ దత్వా

పూర్వంచ వాలుకాం । ఊర్ధ్వంచ తాం పునర్దత్వా వాలుకాం ముద్ర యేన్ను । అహోరాత్రం దహే దగ్నౌ స్వాంగశీతం సముద్ధరేత్ । వకులస్యచ బీజేన కంటకారీద్వయేనచ । గుడూచీ త్రిఫలా వారాం భావ యేత్సప్తసప్తతః । వృద్ధదారురసేనాపి తథా దేయాస్తు భావనాః । గిరికర్ణ్యారసేనాపి రోహితమత్స్యపిత్తతః । ఏవం సిద్ధో భవే త్సమ్యక్ రసోసౌ రోగశోషణః । దేవాన్ గురూన్సమభ్యర్చ్య యతినో విప్ర కాన్ తథా । రక్తికాద్వితయం దేయం సన్నిపాతే సముద్ధయే । మరీ చేన సమం దేయం తేన జాగర్తి మానవః । శ్లేష్మకేచ గదే దేయం గ్రహణ్యా మగ్నిమాంద్యకే । ప్లీహాపాండౌ ప్రయోక్తవ్యం త్రికటు త్రిఫలాంభసా । శూలరోగే ప్రయోక్తవ్యం వాతరోగేవిశేషతః । కుష్ఠే. సుదుష్టే దేయోయం కాకోదుంబరికాంభసా । క్షయహ్రాసకర శ్రీదో బలవర్ణాగ్నివర్ధనః । ధన్వంతరికృత స్సద్యో రసః పరమదుర్లభః । సర్వ రోగే ప్రయోక్తవ్యో నిస్సందేహం భిషగ్వరైః॥

వ్యా॥ శు. గంధకము, 24 భా. వంగభస్మ, 12 భా. శు. రసము, 6 భా, అభ్రకభస్మ, 14 భా, లోహభస్మ, 8 భా. తామ్రభస్మ, 8 భా. సువర్ణభస్మ, 2 భా. రజతభస్మ, 7 భా. బాగుగశుద్ధయైన మిక్కిలిలావుఅయిన వజ్రముయొక్కభస్మ, 13 భా. శు.మాక్షికము,16భా. కాసీసం, 18 భా. శు. పైలతుత్తము, 6 భా.శు.తాళకము, 4 భా. శు. మణిశిల, 3 భా. శిలాజతు, 5 భా. ముత్యభస్మ, 1 భా. శు.వెలిగారము, 2 భా. ఇటులవీనిని నూరుకుని చూర్ణముచేసుకుని నిమ్మపండ్లరసముచే ఏడు సార్లు దృఢముగా భావనచేసుకుని మాత్రలుచేసుకుని రెండుమూకుళ్ళయందుంచుకుని వాటిపై మూకుళ్లుకప్పి సంధిబంధనముచేసి వకకుండయందు ముందుగ ఇసుకపోసుకుని మీద ఈ సంపుటము ఉంచుకుని మరలపైన ఇసుకపోసి కుండముఖముమూసి వకరాత్రింబగళ్లువండుకుని స్వాంగశీతలమున తీసి, పొగడగింజలు, చినములగ, పెదములగ, తిప్పతీగ త్రిఫలములు, పెద్దమ్రాను, కొండగురివింద, వీటిరసములచే ప్రత్యేకముగా ఏడేసిసారులు భావనచేసి పిదప, రోహితకము, చేప, వీటిపిత్తము లచే భావనచేయవలయును. ఈ ప్రకారముగా బాగుగా తయారయిన ఈమందు, రోగశోషణ, మనబడును. దేవతలను, గురువులను, యతీశ్వరులను, బ్రాహ్మణులను, పూజచేసి 2 రక్తికలప్రమాణము, మిరియాలరసముచే ఉద్ధృతమైన సన్నిపాత మందుయిచ్చిన స్వాస్థ్యమునుపొందును. శ్లేష్మవ్యాధులు, గ్రహణి, అగ్నిమాంద్యము, ప్లీహవ్యాధి, పాండు, శూల, వాతవ్యాధులు, వీటియందు త్రికటుకములు, త్రిఫలములు వీటి కషాయముచే యివ్వవలెను. దుష్టమైన కుష్టముయందు మేడిరసముచే యివ్వవలయును. క్షయనుతగ్గించును. ల , బలము, కాంతి, జాఠరాగ్ని, వివృద్ధిపొందిం

చను. ధన్వంతరిచే చెప్పబడిన, మిక్కిలిదుర్లభమైన ఈమందు సమస్తవ్యాధుల యం దును వెంటనే నిస్సందేహముగా వైద్యశ్రేష్ఠులచే ప్రయోగించదగినది.

# పాశుపతాస్త్రి రసం

శ్లో॥ రసభస్మ తామ్రభస్మ గంధకంచ మనశ్శిలా । పాషాణ ద్వితయం చాథ భృంగినీరేణ మర్దయేత్ । ద్విదినం వాలుకాయంత్రే చండాగ్నౌచ ద్వియామకం । ద్విగుంజం భక్షయే న్నిత్య మార్ద్రికం చానుపానకం । పాశుపతాస్త్రనామాయం సర్వాహికజ్వరం హరేత్॥

వ్యా॥ రసభస్మ, తామ్రభస్మ, శు. గంధకము, శు. మణిశిల, శు. ఉల్లిపాషాణము, శు. గౌరీపాషాణము, ఇవి వక్కొక భాగముగ్రహించి గుంటగలగరరసముచే, రెండుదినములు మర్దించి కాచకుప్పెయందుంచి వాలుకాయంత్రమందు గాఢాగ్నిచే రెండుఝాములువండుమని అల్లపురసము అనుపానముతో రెండుగురిగింజలపరిమాణము యిచ్చిన ఈపాశుపతాస్త్రరసము, సమస్తఆహికజ్వరములను హరింపజేయును.

# మహా పాశుపతాస్త్ర రసం

శ్లో॥ ద్విభాగం శ్వేతపాషాణం రసం నేపాలమ్లేచ్ఛకం । ప్రత్యేక మేకభాగంతు ఖల్వమధ్యే వినిక్షిపేత్ । కృష్ణధుత్తూరతోయేన మర్దితం యామమాత్రకం । ముద్గప్రమాణమాత్రేణ త్వార్ద్రికం చానుపానకం । ఐకాహికం ద్వ్యాహికంచ త్ర్యాహికం నాశయే జ్జ్వరం॥

వ్యా॥ శు. ఉల్లిపాషాణము, 2 భా, రసభస్మ, శు. నేపాళములు, ఇంగిలీకము, ఇవి వక్కొక భాగముచొప్పున ఖల్వమందుంచి నల్లఉమ్మెత్తరసముచే వకఝాముమర్దించి పెసరగింజంత అల్లపురసముతోయిచ్చిన ఐకాహిక, ద్వ్యాహిక, త్ర్యాహిక, జ్వరములను నశింపజేయును.

# సన్నిపాత పాశుపతాస్త్రరసం

శ్లో॥ ద్విపాషాణం ద్వితుత్థంచ నేపాలం తాలకం విషం । సర్వ తుల్యం భస్మసూతం అర్కక్షీరేణ మర్దయేత్ । డోలాయంత్రే పచే ద్యామం సముద్ధృత్య విచూర్ణయేత్ । భావితం ఫణిపిత్తేన గుంజామాత్రం భిషగ్వరః । లశునస్యచ తైలేన బ్రహ్మద్వారే విలేపయేత్ । తత్ క్షణేన నిహంత్యాశు సన్నిపాతాం త్రయోదశ । రసః పాశుపతాస్త్రో యం శంకరేణ ప్రకల్పితః॥

వ్యా॥ శు. ఉల్లిపాషాణము, శు. గౌరిపాషాణము, శు. మైలతుత్థము. శు. పాలతుత్థము, శు. నేపాళములు, శు. తాళకము, శు. నాభి, ఇవి సమభాగములు వీటిఅన్నిటికి సమము రసభస్మ కలుపునని జిల్లేడుపాలతో మర్దనచేసి డోలాయంత్ర మందు పకర్షామువండునని తీసి చూర్ణముచేసునని, త్రాచుపాముచేదుచే భావనచేసు పని రెండుగురిగింజలప్రమాణము వెల్లుల్లిరసముచే బ్రహ్మరంధ్రమందు కత్తిచేచీల్చి లేపనముచేసిన పదనూడు సన్నిపాతములను వెంటనే హరింపజేయును. ఈపాశుపతాస్త్రరసము ఈశ్వరునిచే చెప్పబడెను.

# మాణిక్య రసాయనమ్

శ్లో॥ సుజాతిగుణమాణిక్యం సమకర్షమితం శుభం। కనకాభ్రకతామ్రాణాం కాంతస్య పనితం పృథక్। త్రిగుణత్వేన సంబంధం మర్దయేత్సమగంధకైః। ఘృతే వనగరిండైశ్చ పంచవారాణి యత్నతః। ఏనం శిలాలకాభ్యాంచ పుటే స్నీలాంజనేనచ। తుల్యగంధాశ్మసూతాభ్యాం విహితాం కజ్జలీం శుభాం। లోహపాత్రోపరి ద్రావ్యం బాదరేణాల్పవహ్నినా। మాణిక్యాదీని భస్మాని క్షిప్త్వా తత్ర విమిశ్రయేత్। అధార్ద్రకరసైస్తాంతు సమ్యఙ్మర్ద్యాభ్య కజ్జలీం। సముత్క్షిప్యవిచూర్ణ్యాథ క్షిపేద్గ్రివ్యకరండకే। వ్యోషాజ్య సహితం హ్యేతన్మాణిక్యాద్యం రసాయనం వ్యోషాజ్యేన హితం లీఢం షాణ్మాసం పథ్యభోజినా। నిహంతిసకలాన్ రోగాన్ జరాపలితసంయుతాన్। జీవేద్వర్షశతంచైవ త్రివారాకృతభోజనః। క్షయాది కాసజాన్ సర్వాన్ తత్తద్రోగానుపానతః॥

# మౌక్తిక రసాయనం

శ్లో॥ జయంతి రసనిష్పిష్టం శుకపించేన మారితం। మౌక్తికం పలమాత్రంహి ద్విగుణం స్వర్ణభస్మకం। త్రిగుణం కాంతజం భస్మ వ్యోమభస్మచతుర్గుణం।తత్పాదగంధసౌభాగ్యం భృంగసారేణ భావితం। పుటేద్వింశతివారాణి విధాయ పటగాలితం।సర్వతుల్యేన బలినా రసేన కృతకజ్జలిం। విద్రావ్య పూర్వవద్భస్మ ముక్తాదీనాం వినిక్షిపేత్। విమిశ్ర్య నిక్షిపేత్తత్ర క్షీరం ఛాగీ సముద్భవం। విశోషితం విచూర్ణ్యాథ కాచకుప్యాం వినిక్షిపేత్। పిప్పలీమధునా సార్ధం సేవితం వల్లమాత్రయా।

రసాయనవిధానేన కురుతే వత్సరేణవా। వలీపలితనిర్ముక్తో వార్ధక్యేన వివర్జితః। నవయౌవనసంపన్నః శతాయుష్యం సుచక్షుషం। మదహస్తి బలోద్రేకః స్త్రీవాతనయనాన్వితం। లేఖం మధ్వాజ్యత్రైలైశ్చకణోపేతా శ్వగంధికా। క్షయం రోగం నిహంత్యాశు మండలార్ధేన నిశ్చితం। తత్తద్రోగానుపానైశ్చ నిహంతి సకలామయాన్। పర్ణం పత్రపదం హ్యేత్త త్స్నాతికామయనాశనం। బాలానాం పరమం పథ్యం వృష్య మాయుష్య వర్ధనం। నాగోదరోపవిష్టశ్చ హంతి స్త్రీణాంచ వేగతః। హయ్యంగ వీనసంయుక్తం స్తవరాజసమన్వితం। గర్భిణీసర్వరోగేషు ప్రశస్తం ప్రకీర్తితః॥

# ప్రవాలరసాయనం

శ్లో॥ చతుష్పలం ప్రవాలస్య భస్మనో మృతపారదం। తత్సమం ద్విగుణం తామ్రం ప్రవాలాదర్ధభాగికం। త్రింశద్విభాగికం వజ్రం షోడశాంశంచ నీలకం। వ్యోమ సత్వం సమం సర్వైస్తాలకం సర్వతః పరే। విమర్ద్య లుంగతోయేన యావద్దినచతుష్టయం। సర్వార్ధ శుద్ధసూతేన తస్మాద్ద్విగుణగంధకైః। విహితాంకజ్జలీంసమ్యక్ ద్రావయిత్వా తథాపరః। ప్రవాలాదీని భస్మాని వినిక్షిప్యవిమిశ్ర్యచ। నిర్వాప్య గోఘృతై స్సమ్యక్ ద్వాదశాబ్దపురాతనైః। శరావసంపుటె రుధ్వా ఘృతాంశం స్వేదయేచ్ఛనైః। విచూర్ణ్య భావయే ల్లుంగ రసై ర్వారాణి సప్తచ। వ్యోషాజ్యసహితం హంతి సర్వరోగం దినై స్త్రిభిః। క్షయం తుమండలార్ధేన గ్రహణీం పాండుకామలాం। కుంభకామలకారోగం ఉదావర్తం మహోదరం। ప్రమేహం మేదసో వృద్ధిం వాతవ్యాధిం కఫామయం। గుదరోగంచ మందాగ్నిం మూత్రరోగ మశేషతః। స్మరమందిరరోగాంశ్చ వంధ్యారోగాన్ త్వగామయాన్। వ్యోషార్ద్రి చిత్రతోయైశ్చ సన్నిపాతానశేషతః। భూయో భూయో విషూచ్యార్తి ర్దేహినో యస్యజాయతే। రసోయం తస్య దాతవ్యం మండలానాం త్రయం ఖలు। ఆమరోగేచ దాతవ్యో భిషగ్భిర్వత్సరావధి॥

## తార్క్ష్య రసాయనం

శ్లో॥ తార్క్ష్యంభస్మైకం శాణోయం వజ్రభస్మ తదర్థకం। మృత స్వర్ణార్క కాంతానాం నిష్కద్వయమితం పృథక్। లోహ మేకీకృతం సర్వ మేకత్ర పరిమర్దయేత్। పుటే ద్వింశతివారాణి పుటైః కుక్కుట సంజ్ఞకైః। అమృతాంబుసమాయుక్తైః శిలాగంధకతాలకైః। సప్తవారం ద్రవైః సార్థం దశభిః పిష్టకైః పుటైః। ఏవం సిద్ధప్రచారాహి తార్క్ష్య నామ రసాయనం। చిత్రార్ద్రకరసోపేతం రాజికానాంచ సేవితం। త్రిదోషజాన్ సదారోగాన్ కఫవాతోద్భవానపి। అసాధ్యం సర్వవైద్యా నాం భేషజానాం చ కోటిభిః। కరోతి క్షుధ మత్యర్థం జితైర్వానలకా నృణాం॥

## పుష్యరాగరసాయనం

శ్లో॥ పుష్యరాగోద్భవంభస్మ పలార్థప్రమితంశుభం।తదర్థం మీతకా చంచతదర్థంతామ్రభస్మకం। తామ్రస్యార్ధంచరజతం జాతరూపంతదర్థకం। వజ్రభస్మ తదర్థంచ సర్వైస్తుల్యం మృతాభ్రకం। తత్సమం సూర్య కాంతంచ మారితం బలినా సహ। తుల్యేన బలినా సార్థం దశవారం పుటేత్ ఖలు। నీలాంజనం లతాఖ్యానాం పృథక్త్వావ త్పుటానిచ। ఇతి సిద్ధమితి ప్రోక్తం సూర్యకాంతంచ మారితం। ఏతత్సిద్ధౌషధం నామ పుష్యరాగరసాయనం। క్షయాదిసర్వరోగఘ్నం కుష్టశోధిహరం పరం। గుదగుల్మార్తిశమనం సుపూతం వృష్య ముత్తమం। క్షిప్రం గుల్మహారం ప్రోక్తం రక్తగుల్మహారం స్త్రియః। దీపనంపరమంప్రోక్తం కామలా పాండునాశనం। బహునాత్ర కిముక్తేన సర్వరోగహారం పరం॥

## వజ్రరసాయనం

శ్లో॥ ఏకకర్షం మృతం వజ్రం తావదత్భానాగసత్వకం। తతశ్చ ద్విగుణం స్వర్ణం స్వర్ణతుల్యాభ్రసత్వకం। తావన్మానంచ కాంతాయస్సత్వం మారితరంకృతం। రసే నాష్టాంశభాగేన సర్వేషాం పరికీర్తితం। శుకపింఛ సమం సర్వేమర్దయేచ్ఛణకామ్లకైః। విధాయః గోలకం కృత్వా ఛాయా

శుష్కం సమాచరేత్ । తతో భూనాగధాతుంహి తుల్యగంధకసంయుతం । పుటితం శతవారాణి శతవారాణి తాప్యకైః । తేనపిష్టైశ్చమద్ధైర్వా వారాణాం వింశతిం తతః । గుంజాటంకణ సిద్ధైశ్చభూనాగోస్య రజోమృతం ! వర్తయిత్వా కృతం గోలం కల్కేనానేన లేపయేత్ । అర్ధాంగులదలేనాపి పరిశోష్య ఖరాతపే । నిక్షిప్య వాలుకాయంత్రే ప్రపచేద్దినపంచకం। తత స్త్రికోణగండీరమద్ధై ర్గంధకసంజ్ఞకైః । మర్దయిత్వా కృతం గోలం పుటే ద్వారాణి వింశతిః । పటచూర్ణం తతః కృత్వాక్షిపే ద్దంతకరండకే। గుంజామితం భజే దేనం రమ్యం వజ్రరసాయనం । జ్ఞాత్వా జ్ఞాతేషు సర్వేషు గదేషు వివిధేషుచ । తత్తద్రోగానుపానేన దాతవ్యం భిషజా ఖలు। నసోస్తి రోగో లోకేస్మిన్ యోనేన నశామ్యతి । రసాయనప్రయోగేణ సేవితోమండలత్రయం । దేహసిద్ధిం కరత్యేవ విశ్వావిస్మయకారిణీం । బిల్వమేకం వినా సార్థం పథ్య మత్ర ప్రకీర్తితం॥

## నీల రసాయనం.

శ్లో॥ నీలరత్నం పలం భస్మ పలమాత్రం మనోహరం । స్వర్ణం రౌప్యంచ కాంతంచతాప్యంచ నృపకీర్తితం । సమాంశంసర్వమేతత్స్యాత్సర్వతుల్యంచ శుల్బకం । సర్వమేతత్ మృతం గ్రాహ్యం సమగంధకసంయుతం । మర్దయే త్కంగుణీతైలై ర్యావత్స్యాస్యదినాష్టకం । ఊర్ధ్వాధోగంధకం దత్వా పుటే ద్వారాణి వింశతిః। శ్వేతముండీరసైః పశ్చాద్భావయేత్సప్తవారకం । ఇతి సిద్ధప్రతాపాఖ్యం సిద్ధం నీలరసాయనం । నిహంతి సకలాన్ రోగా న్గుంజామాత్రనిషేవితం । జ్వరపాండుక్షయం శోఫంశూలం మూలంచ గుల్మకం । ఉదుంబరం కుష్టరోగం శ్వాసం పంచవిధం తథా । తత్తద్భైషజ్య యోగేన తత్తద్రోగనివారణం॥

## వైడూర్యరసాయనం

శ్లో॥ కాంతిప్రకేణ వైడూర్యం సహ గంధకమారితం । తద్భస్మ చాష్టగంధేన తదర్ధం మృతహేమచ । తయోస్సమంచ తీక్ష్ణంచ వ్యోమాయః రౌప్యతత్సమం। మృతంచ విమలం సర్వైస్సమం సర్వంవిమర్దయేత్।

హిమలోచకసారేణ గోళీకృత్య విశోషితః । వాలుకాయంత్ర మధ్యస్థం పక్వస్థం శనకైః పచేత్ । స్వాంగశీతం సమాహృత్య కుమారీమూలసారతః । మర్దయిత్వా విశోష్యాథ పీలుమూలజలైస్తథా । తథైవ చిత్రమూలార్ద్రకందాదిమూలసారతః।చిరిబిల్వత్వచ స్తోయైర్విశోష్యచవిచూర్ణయేత్ । మృతసంజీవనం హ్యేతద్వైడూర్యక రసాయనం । ఆర్ద్రకద్రవ సంయుక్తం గుంజామాత్రం రసాయనం । దాతవ్యంచిత్రతోయైర్వా సన్నిపాతేవిసంజ్ఞికే । దంతబాధేతు సంజాతే వల్లమాత్రమముం రసం। పాదయోహస్తయోర్న్యాతం తత శ్చేష్టామవాప్నుయాత్। తజ్జాతా చేష్ట సలిలం మూర్ధ్ని శీతం వినిక్షిపేత్ । శతకుంభ మితంస్వాదు తీవ్రాక్షీ జాయతే తతః । యత్కించిద్యాచ తేచాస్మై తత్తద్దేయమశంకితః । ఆయుష్యే విద్యమానేతు సుఖం జీవతిమానవః । త్రిదోషజాతరోగేషు దాతవ్యం తండులోదతా । పలార్ధ సితయా యుక్తః సోన్యథా హంతిరోగిణాం । ఏకదోషోద్భవే రోగే సంసర్గ జనితే తథా । తద్దాతవ్యం హి భిషజా వైడూర్యకరసాయనం॥

## గోమేధిక రసాయనం

శ్లో॥ గోమేధం గంధయోగేన లికుచద్రావయోగినా । పుటిత్వా దశవారేణ జాతం భస్మ పలాన్వితం । సువర్ణం రజతం కాంతం సర్వమౌషధమాంతం । క్రమేణ పాదపాదేన గ్రాసితం చూలికాంబునా । పుటితం తాప్య గంధర్వ తైలేన దశవారకం । నిరుద్ధం జాయతే భస్మ సర్వే తేషాం గుణాదయః । తదర్థం సూతగంధాభ్యాం కృతకం చూలికాద్రవైః । పూర్వభస్మచయం క్షిప్త్వా విమిశ్రంచ సమాహరేత్ । విచూర్ణ్యమ్లముండికాద్రావైర్భావయే త్సప్తవారకం । పటచూర్ణం విధాయాథ క్షిపే ద్దశనకే శుభే । ఇదంహి పరమం శ్రేష్ఠం గోమేధికరసాయనం । యోజ్యోయం సర్వరోగేషు తత్తద్రోగానుపానతః । కరోతి దీపనం తీవ్రం సర్వవ్యాధిభయంకరం । దదాతి పరమాం పుష్టిం బలం వీర్యబలావహాం । పరమం వృష్యమాయుష్యం నేత్రోర్థ్వముఖగదాపహం॥

# నవరత్న మహిమ

శ్లో॥ ధృతాని దత్తాని సమర్చితాని దృష్టాని భుక్తాని పరిస్తుతాని। నిహంతి రత్నాన్యఖిలం దురిష్టం కుర్వంత్యభీష్టం సతతం సదేష్టం । హరత్య లక్ష్మీం సతతం సమస్తాన్ దుష్కర్మభి స్త్విర్మితసర్వరోగాన్ । ఆయుష్యవృద్ధిం ప్రదదాతి సర్వాం రత్నం ప్రసూతాని రసాయనాని॥

# భేది జ్వరాంకుశం.

శ్లో॥ పారదం హింగులంనాభం ప్రత్యేకం నిష్కసమ్మితం। ద్వినిష్కం గంధకంచైవ టంకణంచ ద్వినిష్కకం। మరీచం పంచనిష్కంస్యా షణ్నిష్కం దంతిబీజకం। సింహీఫల రసైర్మర్ద్యం ద్వియామంశ్లక్ష్ణతాం నయేత్ । మాషమాత్రాం వటీంకృత్వా ఛాయాశుష్కాంచ కారయేత్। ఆర్ద్రిక ద్రవయుక్తాంచ జ్వరే జీర్ణే ప్రయోజయేత్ । సర్వజ్వర హరశ్చైవ నామ్నా భేది జ్వరాంకుశః॥

వ్యా॥ శు. రసము, 1 నిష్కము, శు. ఇంగిలీకము 1 నిష్కము, శు. నాభి 1 నిష్కము, శు. గంధకము 2 నిష్కములు, శు. టంకణము 2 నిష్కములు, మిరియాలు 5 నిష్కములు, శు. నేపాలపువిత్తులు 6 నిష్కములు, వీటిని ఖల్వమందుంచి నేలములక రసముచే రెండుఝాములు మెత్తగ నూరుమనిమినపగింజలంత మాత్రలుచేసినీడను ఎండించుమని అల్లపురసముతో యిచ్చిన జీర్ణజ్వరము, సర్వజ్వరములను హరించును. ఇది భేదిజ్వరాంకుశమని చెప్పబడును.

# కాంచనకాంతి రసం

శ్లో॥ కాంచనం రససిందతారం మౌక్తికం లోహమభ్రకం । విద్రుమం కాంత తారంచ కస్తూరీచ మనశ్శిలా। ప్రత్యేక మేకభాగం స్యాత్సర్వం సంమర్ద్య యత్నతః వారిణా వటికాకార్యా ద్విగుంజా ఫలమానతః । అనుపానం ప్రయోక్తవ్యం యథా దోషానుసారతః। నానారోగ ప్రశమనం సర్వోపద్రవసంయుతం । క్షయంహంతి తథాకాసం శ్లేష్మ పిత్త హరంతథా। ప్రమేహం వివిధంచైవ సన్నిపాతం జ్వరం తథా। కఫజా న్వాతజాన్ రోగాన్ నాశయే త్సద్యఏవహి । బలవృద్ధిం వీర్యవృద్ధిం లింగదార్ఢ్యం కరోతిచ । కాంచనస్య సమం కాంతిం మద

నస్య సమం వపుః। శ్రీకరః పుష్టిజననః నానారోగ నిషూదనః । గ్రహా నానంద నాథోక్తం రసం కాంచన కాంతికం॥

వ్యా॥ సువర్ణభస్మ, రససిందూరము, ముత్యభస్మ, లోహభస్మ, అభ్రకభస్మ, వంగభస్మ, కాంతభస్మ, రజతభస్మ, కస్తూరి, శు. మణిశిల, ఇవి ఏకొక్క భాగము చొప్పున అన్నియు ఉసికనుచే నూరుకొని మాత్రలు చేసుకొని రెండు గురిగింజల ప్రమాణము దోషానుసారమైన అనుపానముతో యిచ్చిన సమస్త ఉపద్రవములతో కూడిన సర్వవ్యాధులను, క్షయ, దగ్గు, శ్లేష్మము, పిత్తము, సమస్త ప్రమేహములు, సన్నిపాతము, జ్వరము, కఫవ్యాధులు, శ్లేష్మవ్యాధులు, వీటిని వెంటనే నశింపజేయును. బలవృద్ధి, వీర్యవృద్ధి, శరీరదార్ఢ్యము, బంగారపు కాంతి, మన్మథునితో సమానమైన శరీరము, లక్ష్మి, పుష్టి, వీటిని చేయును. సమస్తవ్యాధులను, గ్రహములను, నశింపచేయును. ఈ కాంచన కాంతిరసము, ఆనందనాథునిచే చెప్పబడెను.

## విస్ఫోటక నాశనరసం

శ్లో॥ మృతస్వర్ణాభ్రకం శుంఠీ భస్మసూతం త్రిభిస్సమం ! ఆమ్లై ర్మర్దయంతు తద్గోలం పిష్ట్వాతుల్యాంచ గంధకం । కటుతైలయుతం పాచ్యం లోహేచ మృదునాగ్నినా । ద్రవే జీర్ణే విచూర్ణ్యాథ వహ్ని మూల కటుత్రికైః । త్వగ్విడంగ విషైస్తుల్యైః త్రిగుణా త్రిఫలా విషాత్ । అజామూత్రే దినం పిష్ట్వా గుంజైకాం భక్షయే ద్వటీం । నిష్కైకంవా కుచీతైలం పిబేత్ విస్ఫోట కుష్ఠజిత్ । విస్ఫోటక నాశ నోయం మసూరికాదికం జయేత్॥

వ్యా॥ సువర్ణభస్మ, 1 భా. అభ్రకభస్మ, 1 భా. శుంఠి, 1 భా. రసభ 3 భా. ఇవి ఆమ్లవర్గముచె మర్దించుకొని శు. గంధకము 6 భా. కలుపుకొని నూరుకొని ఆవనూనె కలుపుకొని ఇనపపాత్రయందు మందాగ్నిచే తడిపోయేవరకువండుకొనిచూర్ణం చేసుకొని, దాసినచక్క, 1 భా. వాయువిడంగములు, 1 భా. శు. నాభి, 1 భా. త్రిఫలములు, 3 భా. ఇవికలుపుకొని మేకమూత్రముచె ఒకరోజునూరుకొని గుంజాప్రమాణపు మాత్రసేవించి నిష్కప్రమాణము చావంచి తైలమును త్రాగిన స్ఫోటకము కుష్ఠము వీటినిజయించును. ఈ విస్ఫోటకనాశనరసము, మశూచికము మొదలగువ్యాధులను నశింపజేయును.

## కందర్ప రసం.

శ్లో॥ రసభస్మ సువర్ణంచ కాంత వైక్రాంతభస్మకం । మధురత్ర సంయుక్తం మాషమాత్రం దినేదినే । లీఢ్వానుపానం పాతవ్యం మంద

తప్తం గవాంపయః । త్రిసప్త దివసైః క్షీణో భవేదక్షీణ ధాతుకః । ఊర్ధ్వలింగ స్సదాతిష్ఠే ద్ద్వావయే ద్వనితాశతం । జ్వరాదిరోగ నిర్ముక్తో దృఢదీపన పావకః । కామదేవ ఇవశ్రీమాన్ సంసార సుఖ మశ్నుతే॥

వ్యా॥ రసభస్మ, సువర్ణభస్మ, కాంతభస్మ, వైక్రాంతభస్మ, ఇవిసమభాగములు నెయ్యి, తేనె, పంచదార, వీటితో మాషప్రమాణము ప్రతిదినము సేవిస్తూ కొద్దిగ కాచిన ఆవుపాలను త్రాగుచుండిన మూడువారములకు కృశించినవాడు వృద్ధిపొందిన ధాతువులుకలవాడగును. ఎల్లప్పుడు లింగోద్దీపనముకలవాడై నూరుమంది స్త్రీలను రమించును. జ్వరాది రోగములనుండి తప్పి అగ్నిదీప్తికలవాడగును. కామదేవునివలె సంసారసుఖమును పొందును.

## క్షారతామ్రరసం.

శ్లో॥ పలమిత మ్మృత శుల్బం తన్మితం గంధ చూర్ణం వసుమిత పరిమాణం తింత్రిణీక్షారచూర్ణం । త్రయమిద మభిదిష్టం క్షారతామ్రాఖ్య మేతత్ హరతి సకలశూలం పీత ముష్ణోద కేన॥

వ్యా॥ తామ్రభస్మ 1 పలము, శుగంధకము 1 పలము, చింతక్షారము. 8 పలములు, వీటిని ఏకముగాచేర్చిన క్షారతామ్రం, మనబడును, దీనిని ఉష్ణోదకముతో పుచ్చుకొనిన సమస్తశూలను హరింపజేయును.

## వీరవిక్రమరసం

శ్లో॥ పారదస్యతు భాగాష్టౌ ద్వౌభాగౌ మృదుకాంచనం । శిలా తాళక గంధానాం చతుష్షట్చ ద్వాదశ । సర్వమేకత్ర సంచూర్ణ్య దాడిమీ చిత్ర కద్రవైః । త్రిదినం మర్దయే త్తత్తు కాచకుప్యాం వినిక్షిపేత్ । వాలుకాయంత్రమధ్యస్థం పాచయే ద్దివసత్రయం । స్వాంగశీతల మాదాయ క్షిపేత్సర్వాం కరండకే । ఆర్ద్రకస్య ద్రవేగుంజాం సన్నిపాతే మహాజ్వరే । తత్ క్షణేన వినశ్యంతి సర్వరోగ గణానపి । వీరవిక్రమ రసోనామా క్షయకాస నికృంతన

వ్యా॥ శు. గంధకము, 8 భా, శుంఠనము, 2 భా. శు. మణిశిల, 4 భా. శు. తాళకము, 6 భా. శు. గంధకము, 12 భా. వీటినన్నిటిని మూలము, వీటిరసములచే మూడేసిరోజులు మర్దించి కాచకుప్పెయందుంచి వాలుకాయంత్రమందువండుకుని స్వాంగశీతలమునతీసి డబ్బిలోవేసుకుని అల్లపురసముతో గు

గంజప్రమాణము, మహాజ్వరమైన సన్నిపాతమును యిన్నవలయును. సమస్తవ్యాధులను వెంటనే నశింపజేయును. ఈ వీరవిక్రమరసము, క్షయ, కాస, వీటిని నివారింపజేయును.

## శూలకుఠారరసం

శ్లో॥ టంకణం పారదం గంధం త్రిఫలా వ్యోషతాలకం। విషం తామ్రంచ నేపాలం భృంగ స్వరస మర్దితం । ద్విగుంజామాత్ర వటికాం మరీచే నార్ద్రకేనవా। సర్వశూల కుఠారోయం విష్ణుచక్రమివాసురాన్॥

వ్యా॥ శు. వెలిగారము, శు. రసము, శు. గంధకము, త్రిఫలములు, త్రికటుకములు, శు. తాళకము, శు. నాభి, తామ్రభస్మ, శు. నేపాళములు, ఇవి సమభాగములు గుంటగలగర రసముచే మర్దించి రెండు గురిగింజలంత మాత్రలు చేసుకుని అందొక దానిని మిరియాల రసముచేగాని అల్లపు రసముచేగాని సేవించిన సర్వశూలలను విష్ణుచక్రము రాక్షసులను హరించురీతి ఈ శూలకుఠారము, హరించును.

## సహస్రకిరణార్క రసం

శ్లో॥ త్రిక్షారం పంచలవణం టంకణం చైక భాగికం।నాగవిద్రుమ కాంతాభ్ర రజతానాంచ భస్మకం । పాషాణపంచకంనాభీ హేమమాక్షిక మనశ్శిలా । ద్విభాగై రష్టభాగాఢ్య రసగంధక సంయుతైః। చతుర్భాగం లోహతామ్ర తాలవైక్రాంత భస్మకం। ఏతత్సర్వం రసైరేతైః శిగ్రు చిత్రకపీలుజైః । త్రిఫలా కుండలీశ్యామా పునర్నవ గుడూచిజైః । నిదిగ్ధికా చక్రపర్ణీ వజ్రవల్లీ వరుణోద్భవైః । సంమర్ద్య ఖల్వే ప్రత్యేకం యామంయామం ప్రయత్నతః । తత్కాచ కుప్యాం నిక్షిప్య మృద్ఘటే సికతాంతరే । యామద్వయం పచేదగ్ని క్రమవిద్భిష గుత్తమః । స్వాంగ శీతం సముద్ధృత్య మత్స్యమాయూర కుక్కుటైః । ఔష్ట్రి వారాహశశక కమఠీ ఏణ గెధికైః । మర్కటైర్భల్లుకైరాజైః స్థలరామఠ పిత్తకైః।ఏతై ర్ప్రమత్తమ్మృద్గాఢం సంభావ్య ప్రకటీకృతం । సహస్రకిరణాఖ్యోయం రస మారోగ్యవర్ధనం । సన్నిపాతం మహాఘోరం వివిధాన్ దోషజ్వరా నపి। అశీతివాతనాశంచ వింశతి శ్లేష్మరోగకాః సూతికారోగ నాశంచమహా త్తాపజననీమతా॥

వ్యా॥ మూడుక్షారములు, పంచలవణములు, శుటంకణము, ఇవి వకొక్కభాగము, సీసము, పగడము, కాంతము, అభ్రకము, రజతము వీటిభస్మములు, శుద్ధిచేసిన

అయిదుపాషాణములు, నాభి, హేమమాక్షికము, మణిశిల, ఇవిరెండేసి భాగములు, శు. రసము 8 భా, శుగంధకము 8 భా, లోహభస్మ, తామ్రభస్మ, శు. తాళకము, వైక్రాంతభస్మ ఇవి నాలుగేసిభాగములు ఇటులవీనినెల్లను, మునగ. చిత్రమూలము, వరగోగు, త్రిఫలములు, ఉప్పి, తెగడ, గలిజేరు, తిప్పతీగ, వావిడు, తులసి, నల్లేరు, ఉత్తిమిరి, వీటియొక్క రసములచే ప్రత్యేకముగా ఒక్కొకర్ఘామము మర్దించుకొని కాచకుప్పె యందుంచుకొని వాలుకాయంత్రమందు రెండుర్ఘాములు క్రమాగ్నులచే వండుమని, చల్లారిన పిదపతీసి, చేప, నెమలి, కోడి, ఒంటె, అడవిపంది చవలపిల్లి, తాబేలు, లేడి, ఉడుము, కోతి, వెలుగుబంటి, మేక, పెట్టతాబేలు వీటియొక్క పిత్తములచే అతిజాగరూకతకలవాడై బాగుగ భావనచేసుమనిన సహస్రకిరణాఖ్యరసమనబడును. ఇది ఆరోగ్యమును వృద్ధిపొందించును. మహాఘోరమైన సన్నిపాతము, దోషజ్వరములు, ఎనుబదివాతములు, ఇరవైశ్లేష్మవ్యాధులు, సూతికారోగములు, వీటిని నివారింపజేయును. మిక్కిలి వేడిని గలుగజేయును.

# శ్వాసకుఠార రసం

శ్లో॥ రసంగంధం విషంచైవ టంకణంచ మనశ్శిలా । ఏతాని టంకమాత్రాని మరీచంచాష్ట టంకకం । ఏకైకం మరిచందత్వా ఖల్వే సూక్ష్మం విమర్దయేత్ । త్రికటుం టంకషట్కంచ దత్వా పశ్చాద్విచూర్ణయేత్ । సర్వమేకత్ర సంయోజ్య కాంచకుప్యాం వినిక్షిపేత్ । శ్వాసే కాసేచ మందాగ్నౌ వాతశ్లేష్మామయేషుచ । గుంజామాత్రం ప్రదాతవ్యం పర్ణఖండేన ధీమతా । సన్నిపాతేచ మూర్ఛాయా మపస్మారే తథాపునః । అతిమోహాత్వ మాపన్నే నస్యం దద్యాద్విచక్షణః । రసః శ్వాసకుఠారోయం సర్వశ్వాసగద ప్రణుత్ ॥

వ్యా॥ శుద్ధిచేసిన రసము, గంధకము, నాభి, వెలిగారము, మణిశిల, ఇవి ఒక్కొక్క భాగము, మిరియాలు 8 భా. వీటిని ఈ మిరియాలు ఒక్కొక్కటి చొప్పున వేసుకొనుచు ఖల్వమందు మెత్తగ నూరుమని త్రికటుకములు 6 భా. కలుపుమని అన్నిటిని నూరుమని సీసాయందుంచుమని రెండు గురిగింజల ప్రమాణము తమలపాకులతో శ్వాస, కాస, అగ్నిమాంద్యము, వాతవ్యాధులు, శ్లేష్మవ్యాధులు, సన్నిపాతము, మూర్ఛ, అపస్మారము, వీటియందు యివ్వవలెను. స్మృహ తప్పినప్పుడు ఈ మందును నస్యముచేయవలయును. ఈ శ్వాసకుఠార రసము సమస్త శ్వాసవ్యాధులను నశింపజేయును.

# మహాశ్వాసకుఠార రసం

సీ॥ పారదంబొక్కటి బలిరెండు విసమైదు రసభస్మ మొక్కటి

తామ్రంబు రెండు నభ్రకంబొక్కటి । హరిదళంబును రెండు తాళక మణిశిలల్ తాళతామ్ర భాగములు టంకణపు బూడిద మూడు కాం తంబారు । చొక్కపు లోహంబు నొక్కపాలు తుద్ధ మొక్కటి పర శుద్ధ దరదమారు స్థిరతర హేమమాక్షికము నైదు । జెముడు కాడ లును ఆకుజముడాకు రసముల చంద్రచెక్కలనీట వుండ్రనీట వాసా రసంబున వావిలి రసమున । దుష్టపు అపామార్గ ధూర్తపత్ర రసముల భువి వేమురసముల వాకుడు రసమున కసివిందరసమున । దుంపరాస్న రసమున రహిముల్కరసమున నిరికిచెక్క . రసానకరకవానొక్కొక్క దానిచే నొక్కదినసంబు మర్దించి । మాత్రలమర్చి యార్చి వాలుకా యంత్రాన మేలుకుప్పెను గంధకము జీర్ణమగుసట్లుగాను వండిసర్వంబు నకు సమాంశములు । పిప్పలిచూర కుక్కడాండములచెక్కల బూడిద గలిపి పూర్వరసంబుల పదిరోజులు మర్దించి కుప్పెలమర్చి । పూటపూ టకు చిన్నంబుపాటిగా గ్రోలిన శ్వాసలు శ్లేష్మముల్ కాసలార్పు దగ్గులె గరొప్పు లెల్లను దగ్ధపరచు । పాండువులు రాజయక్ష్మల భస్మజేయు సూతికావాతంబుల నెల్ల సొలయజేయు ధరను శ్వాస కుఠారాఖ్యద నరుచుండు॥

వ్యా॥ శు. పాదరసము, 1 భా. శు. గంధకము, 2 భా. శు. నాభి, 5 భా, రసభస్మము, 1 భా. తామ్రభస్మ 2 భా. అభ్రకభస్మ, 1 భా. శు, హరిదళము, 2 భా. శు. పత్రతాలకము, 2 భా, శు. మణిశిల, 2 భా. పా, వెలిగారము. 3 భా. కాంత భస్మ, 6 భా. లోహభస్మ, 1 భా. శు. సైలతుత్థము, 1 భా. శు. ఇంగిలీకము, 6 భా. హేమమాక్షికభస్మ, 5 భా. వీటిని జెముడుకాడలు, ఆకుజెముడాకులు, చంద్రచక్క. ఉండ్ర, అడ్డసరము, వావిలి, దుష్టపు, ఉత్తరేణి, ఉమ్మెత్త ఆకు, నేలవేము, వాకుడు, కసివింద, దుంపరాష్ట్రిము, నేలములగ, ఇరికిచెక్క, కరకా యలు, వీటిరసములచె ప్రత్యేకముగా ఒక్కొకరోజు మర్దించి మాత్రలుచేసుకుని ఆర నిచ్చి కాచకుప్పెయందుంచుకుని వాలుకాయంత్రమందు గంధకము జీర్ణమగువరకు వండుకుని ఈ మందుకు సమానము పిప్పళ్ళచూర్ణము, కోడిగ్రుడ్ల పెంకుల బూడిద, కలుపుకుని పూర్వరసములచె పదిరోజులుమర్దించుకుని కుప్పెలుకట్టుకుని పూటకు చిన్న ముచొప్పున పుచ్చుకునిన శ్వాసలు, శ్లేష్మవ్యాధులు, దగ్గులు, దగ్గుఎగరొప్పు, పాం డువు, రాజయక్ష్మ, సూతికావాతములు, వీటిని నశింపజేయును. ఇది శ్వాసకుఠార మనెడి పేరు కలిగియుండెను.

## హేమగర్భ పోటలీరసం

శ్లో॥ శుద్ధసూతంత్రి భాగంచ తత్సమం శుల్బభస్మ చ । భాగైకం గంధకం దత్వా త్తదర్ధం స్వర్ణమేవచ । కజ్జలీంకారయేత్తాంతు ఖల్వాకే సప్తవాసరం । అథ నిర్గుండికా ద్రావై ర్మర్దయే ద్దినసప్తకం । అథవా కనకద్రావై ర్గుటికాంకారయేత్తతః । కించిద్బలి సమాయుక్తే వస్త్రేగోలం విధాయచ । బధ్నీయా త్పోటలీంగాఢా మేవంచ త్రిఫటంచ కేత్ । పృథ మృణ్మయపాత్రేతు గంధం దత్వాధరోత్తరం । తన్మధ్యే పోటలీంన్యస్య నిర్వాత భవనాంతరే । వితస్తి ప్రమితంగర్తం తస్మిన్ సంస్థాప్య ముద్రయేత్ । అంగులీ మృత్తికాభిశ్చ జ్వాలయే దింధనానిచ యామేన సిద్ధలీం యాతిహేమగర్భాఖ్య పోటలా। కాసే శ్వాసే క్షయే వాతే కఫే గ్రహణికాగదే । అనుపానానుసారేణ సర్వారోగేషు యోజయేత్॥

వ్యా॥ శు. రసము 3 భా. తామ్రభస్మ 3 భా. శు. గంధకము 1 భా. సువర్ణభస్మ $\frac{1}{2}$ భా. వీటిని ఖల్వమందుంచి ఏడురోజులు కజ్జలిచేసుకొని వావిలి రసముచే గాని ఉమ్మెత్తరసముచే గాని ఏడురోజులు మర్దించుకొని మాత్రలు చేసుకొని వక బట్టయందు కొంచము గంధకము చల్లుకొని అందు ఈ మాత్రలు ఉంచుకొని గట్టిగ మూడుమడతలువచ్చునట్లుగా మూడుసార్లు మూటకట్టుకొని గట్టి కుండయందు క్రిందను మీదను గంధకము పోసుకొని దాని మధ్యయందుండునట్లు ఆమూట ఉంచుకొని గాలి తగలని ఇంటియందు జానెడు గొయ్యి త్రవ్వుకొని అందు ఈ కుండఉంచుకొని పైన మూకుడుమూసి సంధిబంధనముచేసి పైన అంగుళము ఎత్తున మన్ను కప్పుకొని పైన మంటవేసుకొనవలెను. ఇట్లు చేసిన ఒకఝాముననే ఈ హేమగర్భాఖ్య పోటలీ, యనెడుమందు తయారు అవును ఇది, దగ్గు, ఉబ్బసం, క్షయ, వాతవ్యాధులు, కఫవ్యాధులు, గ్రహణీరోగము వీటియందును ఆయా అనుపానములచే సమస్తవ్యాధులయందును యివ్వవలయును.

## చంద్రహాస రసం

శ్లో॥ ద్విభాగం పారదం దద్యాత్ షడ్భాగం శుద్ధగంధకం । దరదంతు ద్విభాగంచ చతుర్భాగంతు టంకణం । అమృతంతు ద్విభాగంచ శిలాయాశ్చ ద్విభాగకం । క్షురాకారం చతుర్భాగం వ్యోషం షోడశకలతథా । లవంగైలాద్వయంత్రీణి జాతీఫలం ద్విభాగకం । దంతి

బీజం సమంచైవ జంబీరరసమర్దితం। భృంగరాజేన నిర్గుండీ నాగవల్ల్యార్ద్రకేణచ। త్రిఫలాయా రసేనైవ మర్ద్యం ఘటిచతుష్టయం। మాషమాత్రాం వటీంకృత్వా హ్యనుపాన విశేషతః। జ్వర మష్టవిధం హంతి సన్నిపాతాం స్త్రయోదశ॥

వ్యా॥ శు. పాదరసము 2 భా, శు. గంధకము 6 భా, శు. ఇంగిలీకము 2 భా, శు. టంకణము 4 భా, శు. నాభి 2 భా, శు. మణిశిల, 2 భా, సూరేకారము 4 భా. త్రికటుకములు 16 భా, లవంగములు, 2 భా, శు. నేపాళపువిత్తులు 2 భా, ఇటుల వీనిని, నిమ్మకాయలు, గుంటగలగర, వావిలి తాములపాకులు, అల్లము, త్రిఫలములు, వీటియొక్క రసములచే నాలుగేసి ఘడియలు మర్దించి మినపగింజలంత మాత్రలుచేసి అందొకదానిని అనుపాన విశేషములచే సేవించిన, అష్టవిధములైన జ్వరములను, పదమూడు సన్నిపాతములను నివారింపజేయును.

## కఫకుంజర రసం

శ్లో॥ రసగంధౌ సమాంశౌచ స్నుహ్యర్క పయసః పలం।పలంచ పంచలవణ మేకీకృత్యావచూర్ణయేత్ ఆలోడ్యచార్క దుగ్ధేన పూరయే చ్ఛంఖమధ్యతః పిప్పలీ భకణావారె చూర్ణం కృత్వా ప్రలేపయేత్। ప్రజ్వాలయే ద్యామమాత్రం సూక్ష్మచూర్ణంతు కారయేత్। కర్పూర నాగ పత్రైశ్చ దేయోమాత్రార్థ గుంజయా। శ్వాసం కాసం చ హృద్రోగం కఫం పంచవిధంతథా। నాశయే త్సర్వరోగాంశ్చ రసోయం కఫకుంజరః।

వ్యా॥ శు. రసము 1 పలము, శు. గంధకము 1 పలము, జెముడుపాలు, జిల్లేడుపాలు ఇవి 1 పలము, పంచలవణములు 1 పలము, ఇవి కలుపుకుని నూరుకుని జిల్లేడుపాలచేకలుపుకుని శంఖుమధ్యయందుంచుకుని, పిప్పళ్లు, గజపిప్పళ్ళు, కురువేరు, ఇవి చూర్ణముచేసి ఉదకముచే నూరుకుని లేపనముచేసి, కుండయందుంచుకుని, సంధిబంధనముచేసి వకఝాము మంటవేసుకుని, తీసి మెత్తగచూర్ణముచేసి కర్పూర తాములపాకులతో, సగము గురిగింజ ప్రమాణము యిచ్చిన, అయిదు విధములైన శ్వాస, కాస, హృద్రోగము కఫవ్యాధులు, వీటిని సమస్తవ్యాధులను ఈ కఫకుంజరరసము, నశింపజేయును.

## హంస మండూరం

శ్లో॥ మండూరం చూర్ణితం శ్లక్ష్ణం గోమూత్రేష్టగుణే పచేత్ త్ర్యూషణం త్రిఫలాముస్తం విడంగం చవ్యచిత్రకం। దార్వీగ్రంథి ద్దేవ

దారు తుల్యం సర్వంవిచూర్ణయేత్ । చూర్ణం మాండూరతుల్యంచ పాకకాలేవి మిశ్రియేత్ । భక్షయే త్కర్షమాత్రంచ జీర్ణాంతే తక్రభోజనం । పాండు శోఫ హాలీమంచ హ్యూరు స్తంభంచ కామలాం । అర్శాంసి హంతి శీఘ్రంచ హంస మండూరకాహ్వయం॥

వ్యా॥ మాండూరమును సన్నగ చూర్ణముచేసి ఎనిమిదిరెట్లు గోమూత్రమును పోసి పచనము చేసుకొని, త్రికటుకములు, త్రిఫలములు, తుంగముస్తలు, వాయువిడంగములు, చవ్యము, చిత్రమూలము, ప్రామానుపసుపు, గ్రంథితగరము, దేవదారు, ఇవి సమభాగములు చూర్ణముచేసుకొని పై మాండూరమునకు సమానము పాకకాలమున కలుపుకొని కర్ష ప్రమాణము సేవించి అందు జీర్ణమైన పిదప మజ్జిగ అన్నము భుజించిన పాండు, శోఫ, హలీమకము, ఊరుస్తంభము, కామిర్లు, మూలరోంక, వీటిని ఈహంస మాండూరము, వెంటనే హరించును

## కస్తూరికా రసం

శ్లో॥ లవంగ జాతీఫల జాతిపత్రికా స్తద్వైత నాగోషణ గ్రంథికాని । కర్షప్రమాణాని తథైకశాణం కస్తూరికా కుంకుమయోః ప్రయుంజ్యాత్ । ఆర్ద్రాంబునాథ విహితా వటికా త్రిగుంజా చార్ద్రాంభసాపి వినిహంతి కఫక్షయాది కాన్ । కిం శ్వాస కాసం జఠరస్య శూలం నానానుపానైః సకలామయఘ్నం॥

వ్యా॥ లవంగములు, జాజికాయలు, జాపత్రి, శుంఠి, పిప్పళ్లు, గ్రంథితగరము, ఇవి ఒకొ్కకకర్ష ప్రమాణము, కస్తూరి, 1 శాణము. కుంకుమపువ్వు, 1 శాణము, వీటిని అల్లపురసముచే నూరి మూడుగురిగింజల ప్రమాణము మాత్రలుచేసుకొని అందొకదానిని అల్లపురసముచే పుచ్చుకొనిన కఫక్షయ మొదలగు వ్యాధులను నశింపజేయును. ఇట్లుండ శ్వాస, కాస, ఉదరశూల, వీటిని నశింపజేయునని చెప్పనవసరము లేదు. ఆయా రోగానుపానములచే సమస్తవ్యాధులను హరించును.

## కృచ్ఛ్రహర రసం

శ్లో॥ రసేంద్ర బలి వైక్రాంత స్వర్ణంచాపి పృథక్సమం । ఖల్వమధ్యే వినిక్షిప్య మర్దయే న్నింబుజద్రవైః । భూధరాఖ్యపుటే పక్త్వాతతఉద్ధృత్య చూర్ణయేత్ । మాషైకంసితయా లేహ్యాం మూత్రకృచ్ఛ ప్రశాంతయే । కృచ్ఛ్రహర రసోనామ్నా సర్వకృచ్ఛ్రేషు యోజయేత్ ॥

వ్యా॥ శు. రసము, శు. గంధకము, వైక్రాంతభస్మ, సువర్ణభస్మ, ఇవి సమభాగములు ఖల్వమందుంచి నిమ్మపండ్ల రసముచే మర్దించి భూధర పుటము వేసుకొని తీసి చూర్ణించుకొని మాషప్రమాణము పంచదారతో సేవించిన మూత్రకృచ్ఛ్రమును శాంతి పరచును. ఈ కృచ్ఛ్రహర రసము, సమస్త మూత్రకృచ్ఛ్రముల యందును యివ్వవలయును.

## లోకేశ్వర పోటలీ రసం

శ్లో॥ రసస్య భస్మనా హేమ పాదాంశేన ప్రకల్పయేత్ । ద్విగుణం గంధకం దత్వా మర్దయే చ్చిత్రకాంబునా । వరాటాంశ్చ సంపూర్యా టంకణేన నిరుధ్యచ । భాండే చూర్ణ ప్రలిప్తేథ శీఘ్రం రుంధ్యాత్తు మృణ్మయే । శోషయిత్వా గజపుటే పుటేద్గర్తే పరాహ్ణికే । స్వాంగ శీతల ముద్ధృత్య చూర్ణయిత్వా థవిన్యసేత్ । ఏష లోకేశ్వరోనామ్నా వీర్యపుష్టి వివర్ధనః । గుంజా చతుష్టయం ఖాదే త్పిప్పలీమధుసంయుతం। భక్షయే త్పరయాభక్త్యా లోకేశః సర్వదాశనః । అంగకార్శ్యాగ్నిమాంద్యేచ కాసే పిత్తే రసస్త్వయం । మరీచైర్ఘృత సంయుక్తైః ప్రదాతవ్యో దినత్రయం । లవణం వర్జయే త్తత్ర సాజ్యం దధిచ యోజయేత్ । ఏకవింశత్యహానీత్థం మరీచం సఘృతం పిబేత్ । పథ్యం మృగాంకవత్ జ్ఞేయం శయీతోత్తానపాదతః । యే శుష్కా విషమాశనైః క్షయరుజావ్యాప్తాశ్చయే కుష్టినో యే పాండుత్వహతాః కువైద్యవిధినా యే శోషిణో దుర్భగాః । యేతప్తా వివిధైర్జ్వరైః భ్రమమదోన్మాదైః ప్రమాదం గతాస్తే సర్వే విగతామయాహి పరయాస్యుః పోటలీ సేవయా॥

వ్యా॥ రసభస్మ 1 భా, సువర్ణభస్మ $\frac{1}{4}$ భా, శుగంధకము 2 భా, ఇవి చిత్రమూలరసముచే మర్దించి గవ్వలయందుంచి మేకపాలతో నూరిన వెలిగారముతో గవ్వలముఖములనుమూసి మట్టికుండయందుంచి పైనమూకుడు మూసిసంధి బంధనము చేసి ఎండించి గొయ్యియందు మధ్యాహ్నమందు గజపుటము వేసుకొని చల్లారిన పిదపతీసుకొని చూర్ణము చేసుకొని భద్రపరచుకొనవలెను. ఇదిలోకేశ్వర పోటలీరస, మనబడును. పిప్పళ్ళు, తేనె, వీటితోనాలుగు గురిగింజల ప్రమాణము పరమభక్తితో నిత్యము సేవించిన,వీర్యవృద్ధి శరీరపుష్టిచేయును. మిరియాల చూర్ణము, తేనె వీటితో, శరీరము కృశించుట, అగ్నిమాంద్యము, దగ్గు, పైత్యవ్యాధులు, వీటియందు మూడురోజులు యివ్వవలయును. ఉప్పునుమాని, నెయ్యి, పెరుగుఅన్నము పెట్టవలెను. ఈప్రకారము ఇరవైనక రోజు, మిరియాలచూర్ణము నెయ్యితో పుచ్చుకొనవలెను. మృగాంకరస

మునను వలె పథ్యము చేయించవలయును. వెల్లగిలగా పరుండవలయును. విషపానమునచే శుష్కించినవారును, క్షయవ్యాధిగలవారును, హస్తరోగముకలవారును, అపక్వత వైద్యులయొక్క క్రియచే పాండువ్యాధిని పొందినవారును, కఠినమైన శోషవ్యాధి గలవారును, వివిధజ్వరములచే బాధించబడినవారును, భ్రమ, మదము, ఉన్మాదము, కీటకచే ప్రమాదమును పొందినవారును, ఉత్కృష్టమైన ఈ పోటలీరససేవచే వీరందరును, క్షయావ్యాధి నివృత్తిగలగుదురు.

# యోగవాహిరసం

శ్లో॥ శుద్ధసూతం సమంగంధం మృత తామ్రాభ్ర హాటకం। ప్రత్యేకం సూతతుల్యం స్యా త్సూతార్ధం మృతలోహకం। లోహార్ధం మృతవైక్రాంతం మదయే ద్భృంగజద్రవైః। పర్పటీరసవత్పాచ్యం చూర్ణితం భావయే త్పృథక్। శిగ్రువాసకనిర్గుండీ వచాగ్ని భృంగ ముండికైః। ద్రాక్షామృతా జయంతీభి ర్మని బ్రాహ్మీ సుతిక్తకైః। కన్యాయాశ్చ లవై ర్భావ్యం ప్రతిద్రవ్యై స్త్రిధాత్రిధా। రుద్ధ్వాలఘు పుటే పాచ్యం వాలుకాయంత్ర మధ్యతః। యంత్రం నిరుహ్య యత్నేన సాంగశీతం సముద్ధరేత్। చూర్ణితం నవజ్వరే దేయం మాషమాత్రం రసస్యవై। కృష్ణా ధాన్య సమాయుక్తం ముహూర్తా న్నాశయే జ్జ్వరం। అయం యోగ వాహినీనామా రసోయోగస్య వాహకః॥

వ్యా॥ శు. రసము, శు. గంధము, తామ్రభస్మ, అభ్రకభస్మ, సువర్ణభస్మ, ఇవివకొక్కకభాగములు, లోహభస్మ, $\frac{1}{2}$ భా, వైక్రాంతభస్మ, $\frac{1}{4}$ భా. ఇవిగుంటగలగర రసముచె మర్దించి పర్పటీరసమువలె తయారుచేసుకొని నూరుకొని, మునగ, అడ్డసరము, వావిలి, వస, చిత్రమూలము, గుంటగలగర, బోడసరము, ద్రాక్ష, తిప్పతీగ, టెక్కలి, అవిసి, సరస్వతి, కటుకరోహిణి, కలుబంద, వీటిరసములచె ప్రత్యేకముగా మూడేసిసారులు భావనచేసి వాలుకాయంత్రమందుంచి మూసి సంధిబంధనము చేసి లఘుపుటము పెట్టుకొని సాంగశీతలమునతీసి నూరుకొని మాషప్రమాణము ప్పిళ్ళు, ధనియాలు, వీటితోయిచ్చిన తరుణజ్వరమును ముహూర్తకాలములోనే నశింపజేయును. ఈయోగవాహిరసము సమస్తవ్యాధులను పోగొట్టును. ఏ యౌషధముతో కలిపిన ఆ ఔషధముయొక్క గుణమును అభివృద్ధిపరచును

# ఉన్మత్త భైరవరసం

శ్లో॥ పారదం దరదం శుద్ధం గంధకం కజ్జలాకృతి। గజకణా వత్సనాభం శుంఠీచో న్మత్తబీజకం। జాతీఫలం జాతిపత్రంలవంగం మరి

చం తథా । అకల్కరం సమానంస్యా న్మర్దయేచ్చ దినత్రయం । ఆర్ద్ర కస్య రసేనైవ గుటికాం వల్లసన్నిభాం । చపలా మధునాచైవ శ్వాస కాస నిబర్హణః । కఫరోగ వినాశాయ రస ఉన్మత్తభైరవః । అనుపాన విశేషేణ ధాతుపుష్టికరః స్మృతః ॥

వ్యా॥ శు. రసము, శు. ఇంగిలీకము, శు. గంధకము, ఇవి కజ్జలి చేసుకుని గజ పిప్పళ్లు, శు. నాభి, శుంఠి, శు. ఉమ్మెత్తవిత్తులు, జాజికాయలు, జాపత్రి, లవంగములు, మిరియాలు, అక్కలకర్ర, ఇవి అన్నియు సమభాగములు అల్లపురసముచే మూడురోజులు మర్దించుకుని వల్లప్రమాణము మాత్రలు చేసుకుని పిప్పళ్లు. తేనెతో యిచ్చిన, శ్వాస, కాస, కఫవ్యాధులను నశింపజేయును. ఈ ఉన్మత్తభైరవ రసము, అనుపాన విశేషముచే ధాతుపుష్టిని చేయును.

## హిక్కారిపు రసం

శ్లో॥ హేమముక్తార్క కాంతానాం భస్మవల్ల మితం వరం । బీజపూర రసక్షౌద్ర సౌవర్చల సమన్వితం । హంతి హిక్కా శతం సత్య మేకమాత్రా ప్రయోగతః ॥

వ్యా॥ సువర్ణము, ముత్యములు, తామ్రము, కాంతము, వీటియొక్క భస్మ సమాంశము వల్లప్రమాణము మాదీఫలరసము, తేనె, సౌవర్చలవణము, వీటితో సేవించిన, నూరు ఎక్కిళ్లను వక మాత్ర యిచ్చుటచే తనే తప్పక హరించును.

## సర్వకాలహితరసమ్.

శ్లో॥ శుద్ధసూత సమం గ్రాహ్యం సువర్ణం గంధకం ద్వయః । కజ్జలీకృత్య యత్నేన శుల్బపాత్రే భిషగ్వరః । రాజికా స్వరసం దత్వా కృష్ణోన్మత్తస్య వైరసం । దత్వా దత్వా ప్రయత్నేన మర్దయేచ్చ త్రిభి ర్దినైః । త్రిభిశ్చ సర్షపతైలం దత్వా కల్కం విమర్దయేత్ । శోషయే ద్భానుభిర్భానో ర్జ్వాలం దద్యాత్ శనైశ్శనైః । వాలుకాయంత్రయో గేతు కూపికా మధ్యయోగతః । తావజ్జ్వాలం ప్రదాతవ్యం యావత్స్యా దుష్ణవాలుకా । స్వాంగశీతలతాం జ్ఞాత్వా కర్షయేత్తాం భిషగ్వరః । తతో గుంజా ప్రమాణేన మాసం మాసార్ధకం పునః । జ్ఞాత్వా రోగం శరీరంచ యోజనీయం బుధైస్సదా । ఘృతేన మధునాసార్ధం పాండ్వ జీర్ణ క్షయా పహం । సుస్నిగ్ధం నాతి మధురం భోజనం పక్షిమాంసకం ।

భక్ష్యం ఛాగాదికం మాంసం యద్వా యస్యతు సాత్మ్యకం । ఏతేనాపి విధానేన ప్రాతః ప్రాత ర్నిషేవయేత్ । సాధ్యాసాధ్యేషు రోగేషు వివిధేషు గదేషుచ । వలీపలిత హంతాయం వార్ధక్య మపినాశయేత్ । రమతే శతవర్షోపి ప్రత్యహం కామినీశతం । అస్య సేవాప్రసాదేన సహస్రం జీవితం భవేత్ । రచితం శంభునాహ్యేష సర్వకాల హితోరసః ॥

వ్యా॥ శు. రసము, సువర్ణభస్మ, శు. గంధకము, అయస్కాంతభస్మ, ఇవి సమభాగములు రాగిపాత్రయందుంచుకుని నూరుకుని తెల్లఆవాలరసము, నల్లఉమ్మెత్త రసము, ఆవనూనె ఇవి బాగుగాబోసుకొనుచు దృఢముగా మూడేసిరోజులు మర్దించి కుని ఎండవేడిమిచే ఎండించుకుని కాచకుప్పెయందుంచి వాలుకాయంత్రమందు ఇసుక వేడి ఎక్కువరకు పెల్లిగమంటవేసుకుని సాంగశీతలంబున తీసి గుంజాప్రమాణము 45 రోజులు, నెయ్యి, తేనె, వీటితో రోగమును, తత్వమును గ్రహించి యిచ్చినయడల పాండు, అజీర్ణము, వీటిని నశింపజేయును. స్నిగ్ధగుణభూయిష్టము విశేషమధురము కాని భోజనము, పక్షిమాంసము, మేక మొదలగువాటి మాంసములేక అభ్యాసమైన మాంసము, వీటిని భుజిస్తూ ప్రతిఉదయము ఈమందు సేవించిన సాధ్యఅసాధ్యమైన వ్యాధులు, సర్వవ్యాధులును నశించును. శరీరము ముడతలుపడుట, వెంట్రుకలునెరయుట, ముసలితనము వీటిని నశింపజేయును. నూరుసంవత్సరములు గలవాడుకూడ ప్రతిదినము నూరుగురుస్త్రీలను రమించవచ్చును. దీనిని సేవించుటవలన వెయ్యిసంవత్సరములు ఆయుర్దాయము కలుగును. ఈ సర్వకాలహితరసము, విష్ణువుచే చెప్పబడెను.

## లఘు చింతామణి రసం

శ్లో॥ భాగత్రయం స్వర్ణభస్మ ద్విభాగం తారమభ్రకం । లోహత్పంచ ప్రవాలంచ మౌక్తిక త్రయ సంయుతం । సూతభస్మం సప్తకంచ సర్వం మర్ద్యంతు కన్యయా । ఛాయా శుష్కావటీః కార్యా ఛాగీ దుగ్ధానుపానతః । క్షయం హంతి తథాకాసం గుల్మం చాపి ప్రమేహనుత్ । జీర్ణజ్వరహరంచైవ ఉన్మాదస్య నికృంతనం । సర్వదోషహరం చాపి వారిదోష నివారణం । లఘుచింతామణి ర్నామ శివేన పరిభాషితం॥

వ్యా॥ సువర్ణభస్మ 3 భా, వెండిభస్మ 2 భా, అభ్రకభస్మ 2 భా, లోహభస్మ 5 భా, పగడభస్మ, 3 భా, ముత్యభస్మ 3 భా, సూతభస్మ 7 భా, ఇవి కలుబందరసముచే మర్దించి మాత్రలుచేసుకుని నీడను ఎండించుకుని మేకపాలు అనుపానముతో యిచ్చిన, క్షయ, దగ్గు, గుల్మముప్రమేహములు, జీర్ణజ్వరము, ఉన్మాదము, సర్వదోషములను, ఉదకదోషజనితవ్యాధులను, నివారింపజేయును. ఈ లఘుచింతామణి, ఈశ్వరునిచే చెప్పబడెను.

# లఘు చింతామణి

(ప్రకారాంతరమ్.)

శ్లో॥ హాటకం రజతం తాలం ముక్తాగంధక పారదం । త్రికటుః కునటీచైవ కస్తూరీచ పృథక్సమం । జలేన వటికాకార్యా ద్విగుంజా ఫలమానతః । చింతామణి రసోనామ జ్వరాష్టానాం నికృంతనః । కఫ జాన్వాతజాన్చైవ కాస శ్వాసంతథైవచ । సన్నిపాతజ్వరంచైవ హరత్యే వతునిశ్చయం॥

వ్యా॥ సువర్ణభస్మ, వెండిభస్మ, శు. తాళకము, ముత్యభస్మ, శు. గంధకము. శు. రసము. త్రికటుకములు, శు. మణిశిల, కస్తూరి. ఇవి సమభాగములు గ్రహించి ఉదకముతో నూరుకుని రెండుగురిగింజల ప్రమాణము మాత్రలుచేసుకునేది. ఈచింతామణిరసము, అష్టజ్వరములు, కఫవ్యాధులు, వాతవ్యాధులు, దగ్గు, వగర్పు,సన్నిపాతజ్వరము వీటిని తప్పక హరించును.

# చింతామణి

శ్లో॥ రసేంద్ర వైక్రాంతక రౌప్య తామ్రం సలోహముక్తాఫల గంధహేమ । త్రిర్భావితం చార్ద్రిక భృంగవహ్ని రసైరజాగోపయసాత థైవ । అర్శః క్షయం కాసమరోచకంచ జీర్ణజ్వరం పాండుమపి ప్రమేహాన్ । గుంజాప్రమాణం మధుమాగధీభ్యాం లీఢం నిహన్యా ద్వాపమంచవాతం । చింతామణిరితిఖ్యాతః పార్వత్యా నిర్మితః స్వయం॥

వ్యా॥ శు. రసము, వైక్రాంతభస్మ, వెండిభస్మ, తామ్రభస్మ, లోహభస్మ, ముత్యభస్మ, శు. గంధకము, బంగారుభస్మ, ఇవి సమభాగములు ఖల్వమందుంచుకుని, అల్లము, గుంటగలగర, చిత్రమూలము, వీటి రసములచేతను, మేకపాలు, ఆవుపాలచేతను ప్రత్యేకముగా మూడేసి రోజులు భావనచేసుకుని గుంజాప్రమాణము, తేనె, పిప్పళ్లచూర్ణముతో సేవించిన అర్శస్సు, క్షయ, దగ్గు, అరోచకము, జీర్ణజ్వరము పాండువు, ప్రమేహములు, విషమజ్వరము, వాతవ్యాధులు, వీటిని నశింపజేయును. చింతామణియని [illegible] న యిది పార్వతీ దేవిచే స్వయముగా చెప్పబడెను.

# త్రైలోక్య చింతామణి

శ్లో॥ రసంవజ్రం హేమతారం తామ్రం తీక్ష్ణాభ్రకంమృతం గంధకం మౌక్తికం శంఖం ప్రవాలం తాలకం శిలా । శోధితంచ సమం

సర్వాం సప్తాహం భావయేద్దృఢం । చిత్రమూల కషాయేణభానుదుగ్ధై ర్దినత్రయం। నిర్గుండీ సూరణద్రావైః వజ్రీదుగ్ధై ర్దినత్రయం । అనేన పూరయే త్సమ్యక్ పీతవర్ణా న్వరాటకాన్ । టంకణం రవి దుగ్ధేన పిష్ట్వా తేషాం ముఖం లిపేత్ । రుధ్వా భాండే పుటేత్పశ్చాత్ స్వాంగశీతం విచూర్ణయేత్ । చూర్ణతుల్యామృతం సూతం వైక్రాంతం సూతపాదకం । శిగ్రుమూల ద్రవై స్సర్వాం సప్తవారం విభావయేత్ । చిత్రమూల కషాయేణ భావనాశ్చైక వింశతిః।ఆర్ద్రికస్య రసేనైవ భావనాః సప్తఏవచ। జంబీరైర్మాతులుంగైర్వా సప్తవారం విభావయేత్। సూక్ష్మచూర్ణం తతః కృత్వా చూర్ణపాదాంశ టంకణం। టంకణాంశం వత్సనాభం తత్సమంమరిచంక్షిపేత్ ।లవంగంనాగరంపథ్యా కణాజాతీఫలం పృథక్ ప్రత్యేకంతత్సనాభస్య పాదాంశం చూర్ణితంక్షిపేత్ మాతులుంగాద్యా ఆర్ద్రికస్య రసేనైె తద్విలోడయేత్ । చతుర్గుంజామితం ఖాదే త్కణాక్షౌద్రంలిహేదను । క్షౌద్రైర్వా చార్ద్రకద్రావైః శుంఠ్యావాథగుడైర్యుతం। అనుపానైః సమాయోజ్యః సర్వరోగోపశాంతయే। వహ్నిం దీపయతే బలంచ కురుతే తేజోమహద్వర్ధతే వీర్యంవర్ధయతే విషంచహరతే దార్ఢ్యం విధత్తే తనోః । అభ్యాసేన నిహంతి మృత్యుపలితం పుష్టిం పరిదత్తే నృణాంకాసం సూదయతేక్షయం క్షపయతే శ్వాసంచ నిర్నాశయేత్ । వాతం విద్రధిపాండుశూలగ్రహణీ రక్తాతిసారం జయేన్మేహ ప్లీహ జలోదరాశ్మరి తృషాశోఫం హలీమోదరం। లూతాకృచ్ఛ్ర భగందరం జ్వరగణం చార్శాంసి కుష్ఠం జయే త్సాధ్యాసాధ్య రుజోనిహంతిచ రసస్త్రైలోక్యచింతామణిః॥

వ్యా॥ శు. రసము, వజ్రభస్మ, సువర్ణభస్మ రజతభస్మ, తామ్రభస్మ, లోహభస్మ, అభ్రకభస్మ, శు గంధకము, ముత్యభస్మ, శంఖభస్మ, పగడభస్మ, శు. తాళకము, శు. మణిశిల, ఇవి సమభాగములు ఖల్వమందుంచి చిత్రమూలకషాయముచే ఏడు రోజులు జిల్లేడుపాలచే మూడురోజులు వావిలి, అడవికంద, వీటిరసములచేతను, జెముడుపాలచేతను ప్రత్యేకముగా మూడురోజులు భావనచేసి పచ్చగవ్వలయందుంచి జిల్లేడుపాలచేటంకణమునునూరి గవ్వలముఖములకుపూసి కుండయందుంచి సంధిబంధనము చేసిగజపుటమువేసిచల్లారినపిదపతీసిచూర్ణముచేసుకని ఈచూర్ణముతోసమానము సూతభస్మ, సూతభస్మలో నాల్గవవంతు వైక్రాంతభస్మకలుపుకనమునగవేళ్లరసముచేఏడు సారులు చిత్రమూలకషాయముచే ఇరువది యొకపర్యాయము, అల్లపురసముచే ఏడుసారులు, నిమ్మ

కాయల రసముతోగాని మాదీఫలరసముతోగాని ఏడుసారులు భావనచేసుకుని మెత్తగచూర్ణముచేసుకుని ఆచూర్ణములో నాల్గవవంతు, శు. టంకణము, శు. నాభి, మిరియాలు, ఇవిప్రత్యేకముగా కలుపుకుని లవంగములు, శొంఠి, కరక్కాయ, పిప్పళ్ళు జాజికాయ, ఇవిప్రత్యేకముగా నాభిలో నాల్గవవంతు కలుపుకుని మాదీఫలమురసము అల్లపురసములచేతను కలుపుకుని మర్దించుకుని నాలుగుగురిగింజల ప్రమాణము తిని పిప్పళ్ళుచూర్ణము, తేనె, తోడనే పుచ్చుకొనవలెను. తేనె, అల్లపురసము, శుంఠి, బెల్లము, వీటితోగాని లేక ఇతరఅనుపానములతోగాని సమస్తవ్యాధులయందును యివ్వవలెను. అగ్నిదీప్తి, బలము, తేజస్సు, వీర్యము, వీటినివృద్ధిపొందించును. విషమును హరించును. శరీరదార్ఢ్యము చేయును. అభ్యాసముచే మృత్యువును, ముసలితనమును, పోగొట్టును. పుష్టినిచేయును, దగ్గు, క్షయ, శ్వాస, వాతవ్యాధులు, విద్రధి, పాండు, శూల, గ్రహణి, రక్తాతిసారము, మేహములు, ప్లీహవ్యాధులు, జలోదరము, అశ్మరి, దప్పిక, నంజు, హలీమకము, ఉదరము, లూతవ్రణము, మూత్రకృచ్ఛ్రము, భగందరము, జ్వరసముదాయము, అర్శస్సు, కుష్ఠము, వీటిని అసాధ్యమైనవ్యాధులను కూడ, ఈత్రైలోక్యచింతామణి హరింపజేయును.

# త్రైలోక్య చింతామణి

## (ప్రకారాంతరమ్)

శ్లో॥ సూతాభ్ర స్వర్ణ తారారుణ భిదుర శిలాతాప్య గంధప్రవాలాయో ముక్తా శంఖ తాలం సమమిద మనల క్వాథతస్సప్తభావ్యం। నిర్గుండీసూరణాంభః పవిరవిపయసాత్రిః పృథగ్భావయిత్వాచాపూరైశ్చైత్రైర్వారాటా నథమిహి రచయ ష్టంకణా లిప్తవక్త్రాన్ । కృత్వా భాండే చరుధ్వా గజపుటజఠరే యుక్తిత స్తత్తుపక్వోద్ధృత్యై తన్మర్దయిత్వా తదఖలతులితం సూతభస్మ ప్రదద్యాత్। వైక్రాంత సూతతుర్యాంశక మథ మిలితం సప్తశః శిగ్రుమూలత్వగ్భావ్యం తేన తుల్యం విషమ నలవరం టంకటం చోషణంచ। పథ్యా జాతీఫలం చామరకుసుమకణా నాగరం వత్సనాభా త్తుర్యాంశం మేలయిత్వా పృథగథదివసం మర్దమే ల్లుంగతోయైః । ఏష స్త్రైలోక్యచింతామణి రఖిలగదధ్వాంత విధ్వంసహంసస్తత్రద్రోగానుపానై రుమసికవలితః సార్ధవల్లప్రమాణః । వాతవ్యాధ్యామవాతజ్వరజఠరకృమిశ్వాసశూలాస్రవాతాసృక్పిత్తప్రమేహ్యకాసక్షయకఫజగదోర్శః క్షతాజీర్ణమేహః । కుష్ఠాతీసార పాండు గ్రహణీ క్షుతమ

కేధ వ్రణార్శః ప్రకృప్తేషు ఖాంజ్యే ఖంజాఢ్యవాత శ్రుతి భగజగదే సరఃదేవ ప్రశస్తః॥

వ్యా॥ శు. రసము అభ్రకభస్మ, సువర్ణభస్మ, వెండిభస్మ, తామ్రభస్మ, వజ్రభస్మ, శు. మణిశిల, హేమమాక్షికభస్మ, శు. గంధకము, పగడభస్మ, లోహభస్మ, ముత్యభస్మ, శంఖభస్మ, శు. తాళకము, ఇవి సమభాగములుగ్రహించి ఖల్వమందుంచి చిత్రమూలకషాయముచే ఏడుసారులు భావనచేసి పిదప వావిలి, అడవికంద, నల్లేరు, జిల్లేడుపాలు, వీటిచే ప్రత్యేకముగా మూడేసిసార్లు భావనచేసి పచ్చటిగవ్వలయందుంచి జిల్లేడుపాలచే నూరబడిన టంకణముచే గవ్వలముఖములను మూసి ఆగవ్వలు ఒకకుండయందుంచి కుండముఖముమూసి గజపుటమందు పక్వముజేసుకొని చల్లారినపిదప తీసి నూరుకొని ఈచూర్ణమునకు సమభాగము పాదరసభస్మము, పాదరసభస్మకు నాలుగవవంతు వైక్రాంతభస్మము, కలుపుకొని ములగవేళ్ళరసముచే ఏడుసార్లు భావనచేసుకొని శు. నాభి, చిత్రమూలము, శు. టంకణము, మిరియాలు, ఇవి వైక్రాంతభస్మతో సమానము, కరక్కాయలు,జాజికాయలు, లవంగములు, పిప్పళ్లు, శుంఠి, ఇవి ప్రత్యేకముగా నాభిలో నాలుగవవంతుచొప్పున కలుపుకొని ఒకరోజు మాదీఫలరసముచే మర్దించుకొనేది. ఇది త్రైలోక్యచింతామణి అని చెప్పబడును. ఇది ఒకటిన్నరవల్లప్రమాణము, ఆయారోగానుపానములచే ఉదయముసేవించిన సమస్తవ్యాధులను నశింపజేయును. మరియు వాతవ్యాధి, ఆమవాతము, జ్వరము, ఉదరరోగము, క్రిమిరోగములు, శ్వాసశూల, వాతరక్తము, రక్తపిత్తము, కృశించుట, దగ్గు, క్షయ, కఫరోగములు, ఉరఃక్షతము, అజీర్ణము, మేహము, కుష్టము, అతిసారము, పాండువు, గ్రహణి, తమకశ్వాస, వ్రణము, అర్శస్సు, పంగువాతము, ఆఢ్యవాతము, కర్ణరోగము, యోనిరోగములు, వీటియందు అనేకవిధముల ప్రశస్తమైనది.

# దివ్యచింతామణి

శ్లో॥ సువర్ణం కాంతలోహంచ నాగవంగంతథాభ్రకం। మౌక్తికంచ ప్రవాలంచ ఏతేషాం శుద్ధభస్మకం। గంధకం సూతదరదం శుద్ధాన్యేతాని యోజయేత్।సర్వైస్సమం శుద్ధనాభం ఖల్వమధ్యేవినిక్షిపేత్। అశ్వగంధా రసేనైవ దృఢమర్దంచకారయేత్। మాష మాత్రాం వటీం కుర్యాత్ ఖాదయేత్పంచపాండుజిత్। ప్రమేహ వాతరోగఘ్నం సర్వరోగ వినాశనం। దివ్యచింతామణి ర్నామ గౌరీనాథప్రకల్పితః॥

వ్యా॥ సువర్ణభస్మ, కాంతభస్మ, లోహభస్మ, సీసభస్మ, వంగభస్మ, అభ్రకభస్మ, ముత్యభస్మ, పగడభస్మ, శు. గంధకము, శు. రసము, శు. ఇంగిలీకము, ఇవి సమభాగములు గ్రహించి వీటి అన్నిటితో సమానము, శు. నాభి, గ్రహించి ఖల్వ

మందుంచి పెన్నేరు రసముచే దృఢముగా మర్దించుకుని మినపగింజలంత మాత్రలు చేసుకుని సేవించిన అయిదు విధములైన పాండువ్యాధులు, ప్రమేహములు, వాతరోగములు, సర్వరోగములను, నశింపజేయును గౌరీనాధునిచే కల్పించబడిన దివ్యచింతామణి యనబడును.

## శ్లేష్మచింతామణి

శ్లో॥ రసం గంధం విషంచైవ త్రికటు త్రిఫలా తధా । శిలాహ్వో రౌప్యకం స్వర్ణం మౌక్తికం తాలకం సమం । మృగకస్తూరికాయాశ్చ గ్రాహ్యం షణ్మాషకం భిషక్ । భృంగరాజ రసేనైవ తులస్యాస్వరసే నచ । ఆర్ద్రికస్య రసేనైవ వటీం కుర్యాత్ ద్విగుంజకాం । చింతామణి రసోహ్యేషః సర్వరోగ కులాంతకః । సన్నిపాత జ్వరంహంతికఫరోగం వినాశయేత్ । ఏకజం ద్వంద్వజంచైవ వివిధంవిషమజ్వరం । అగ్నిమాంద్యం శిరశ్శూలం విద్రధించ భగందరం । ఏతాన్యేవ నిహంత్యాశు భాస్కర స్తిమిరం యధా॥

వ్యా॥ శు. రసము, శు. గంధకము, శు. నాభి, త్రికటుకములు, త్రిఫలములు, శు. మణిశిల, వెండిభస్మ, సువర్ణభస్మ, ముత్యభస్మ, శు. తాళకము, ఇవి సమభాగములు కస్తూరి ఆరు మినపగింజల ప్రమాణము వీటిని, గుంటగలగర, తులసి, అల్లపు రసములచే మర్దించి రెండు గురిగింజల ప్రమాణము మాత్రలు చేసుకొనవలెను. ఈ చింతామణి రసము, సర్వరోగములను నశింపజేయును. మరియు సన్నిపాతజ్వరము, కఫరోగములు, ఏకదోషజనిత ద్వంద్వదోష జనితములైన అనేక విధములైన విషమజ్వరములు, అగ్నిమాంద్యము, శిరశ్శూల, విద్రధి, భగందరము, వీటిని సూర్యుడు చీకటిని హరించురీతి హరించును.

## రాజ చింతామణి

శ్లో॥ సువర్ణం రజతంతామ్రంకాంతం తీక్ష్ణాభ్రకం సమం । మనశ్శిలాచద్వౌభాగౌ తాలం భాగత్రికం పృథక్ । చతుర్భాగం శుద్ధసూతం తత్సమం శుద్ధగంధకం । కఫరీ టంకణంచైవ భాగార్ధంస్యా త్పృథక్పృథక్ । ద్విభాగం వజ్రభస్మంచ తత్సమం మృతమౌక్తికం । విద్రుమం గారుడం భస్మ మౌక్తికేన సమంభవేత్ । దరదం తాలతులితం ఖల్వమధ్యే వినిక్షిపేత్ । రక్తకల్హారకందోత్థ రసేనైవ విభావయేత్ । హంసపాదీ రసేనైవ నిర్గుండీ స్వరసేనచ । అశ్వగంధా రసేనైవ

ద్వాద్వాయామా విమర్దయేత్ । రక్త కార్పాస కుసుమై ర్మర్దితం తదనంతరం । తామ్రపాత్రోదరే న్యస్యవాలుకాయంత్రమధ్యతః । మృద్వగ్నినాపచేద్ధీమా నహో రాత్రం సమాహితః । సాంగశీతం సమాదాయ మధునావా ఘృతేనవా । వ్రీహిమానం ప్రదాతవ్యం సర్వదోష నివారణం । యోనిదోషం రజోదోషం సంతాపంచ వినాశయేత్ ॥ వాతపిత్త కఫోద్భూత జ్వరదోష వినాశనం । మనః ప్రసాదకరణం తేజో వీర్య వివర్ధనం । అనుపాన విశేషేణ సర్వరోగ నివారణం । చింతామణీనాం సర్వేషాం రాజా భవతినిశ్చయః॥

వ్యా॥ సువర్ణభస్మ 1 భా. రజితభస్మ, 1 భా తామ్రభస్మ, 1 భా. కాంతభస్మ, 1 భా. లోహ అభ్రకభస్మ, 1 భా. శు. ప 2 భా. శు. తాళకము, 3 భా. శు. రసము, 4 భా. శు. గంధకము, 4 భా. శు. కఫరి, ½ భా. పా. టంకణము, ½ భా. వజ్రభస్మ, 2 భా. ముత్యభస్మ, 2 భా. పగడభస్మ, 2 భా. పచ్చలభస్మ, 2 భా. శు. ఇంగిలీకము, 3 భా. ఇవిఖల్వమందుంచి ఎర్రకలువదుంప, హంసపాది, వావిలి, పెన్నేరు, వీటిచే ప్రత్యేకముగా రెండేసిఝాములుమర్దించి పిదపపైడిపత్తిపువ్వులచే మర్దించి తామ్రపాత్రయందుంచి వాలుకాయంత్రమందు వకరాత్రింపగల్లు మృద్వగ్నిచే వండుము సాంగశీతలమునతీసి వడ్లగింజంతప్రమాణము తేనెతోగాని నేతితోగానియిచ్చిన సమస్తదోషములను, యోనిదోషములను, రజోదోషములను, తాపమును, వాతపిత్తకఫములచే బుట్టిన జ్వరములను నశింపజేయును. మనో నిర్మలమును, తేజోవృద్ధిని, వీర్యవృద్ధిని, చేయును. అనుపానవిశేషములచే సర్వరోగములను నశింపజేయును. అన్నిచింతామణులలోను ప్రధానమైనది,

## రస చింతామణి

శ్లో॥ సూతం స్వర్ణం తార తామ్రం వైక్రాంతం లోహమభ్రకం । కాంతం తాప్యంచ సౌభాగ్యం గంధకం దరదం శిలా । శిఖిగ్రీవం క్షీర తుత్థం మౌక్తికంచ ప్రవాలకం । ఏకైకంచ సమాంశాని సప్తాహం మర్దయే ద్దృఢం । చిత్రమూల కషాయేణ భాను దుగ్ధై ర్దినత్రయం । కాచకూప్యం తతేక్షిప్త్వా వాలుకాయంత్రకే పచేత్ । త్రిదినం పాచయే త్తీవ్రం సాంగశీతల ముద్ధరేత్ । ఆదాయ తద్గతం భాగం మృతసూతం ద్విభాగకం । హంసపాదిరసైః కన్యా ఆర్ద్రిక స్వరసైస్తథా । మర్కటీ మూలస్వరసై ర్మర్దయేచ్చ పృథగ్దినం । ఆతపే శోషయిత్వాథ తత్తుల్యం వత్సనాభకం । తత్తుల్యం మరిచంచైవ ఆర్ద్రిక

స్వరసై స్తథా । పంచకోల కషాయేణ నాగవల్లీ రసై స్తథా । వయస్థా స్వరసైశ్చైవ ప్రత్యేకం మర్దయే ద్దినం । శోష్యం పేష్యం చ మర్ద్యంచ వటీం కుర్యా త్ప్రయత్నతః । ఆతపే శోషయిత్వాథ లవంగ కణయా సహ । చతుర్గుంజా మితంఖాదే దార్ద్రిక స్వరసేనవా । పంచకోల కషాయస్య మాక్షికస్యానుపానతః । సర్వవ్యాధి వినాశంచ అగ్నిదీప్తించ కారయేత్ । వీర్యం తేజో బుద్ధి బలం కృశానాం పుష్టికారకం । పురాణజ్వరనాశంచ సర్వజ్వర వినాశనం । సన్నిపాతజ్వరఘ్న మేకాదశక్షయ రోగజిత్ । పంచశ్వాస వినాశంచ పంచకాస వినాశనం । పంచహిక్కా పాండుశోఫ వాతరోగ ప్రమేహజిత్ । తథా గ్రహణ్యతీసార మూత్రకృచ్ఛ్రా శ్మరీహరః । రసచింతామణిర్నామ ధన్వంతరి వినిర్మితః॥

వ్యా॥ శు. రసము, సువర్ణభస్మ, వెండిభస్మ, తామ్రభస్మ, వైక్రాంతభస్మ, లోహభస్మ, అభ్రకభస్మ, కాంతభస్మ, హేమమాక్షిభస్మ, శు. టంకణము, శు. ఇంగిలీకము, శు. మణిశిల, శు. మైలతుత్థము, శు. పాలతుత్థము, ముత్యభస్మ, పగడభస్మ, ఇవన్నియు సమభాగములు ఖల్వమందుంచి చిత్రమూలకషాయముచేత ఏడురోజులు బాగుగమర్దించి జిల్లేడుపాలచే మూడురోజులు మర్దించి కాచకుప్పెయందుంచి వాలుకాయంత్రమందు మూడురోజులు తీవ్రముగా వండుకుని సాంగశీతలముననతీసి ఆమందుకు, 2 భాగములు, రసభస్మ కలుపుకుని హంసపాది, కలబంద, అల్లము, మూలగొండివేళ్లు, వీటిరసములచే ప్రత్యేకముగా వక్కొకరోజు మర్దించుకుని ఎండయందు ఎండించుకుని రసభస్మతో సమానము, శు. నాభి, నాభితోసమానము మిరియాలు, కలుపుకుని, అల్లము, పంచకోలములు, తామలపాకులు, తిప్పతీగ, వీటిరసములచే వక్కొకదినము మర్దించి ఎండించుకుని నూరి మరల మర్దించుకుని కుప్పెలుకట్టుకొని ఎండయందు ఎండించుకుని నాలుగురిగింజలప్రమాణము, లవంగములు, పిప్పళ్లరసముతోగాని పుచ్చుకుని, పంచకోలకషాయముగాని తేనెగాని వెంటనే పుచ్చుకొనిన సర్వవ్యాధులను నశింపజేయును. అగ్నిదీప్తి, వీర్యవృద్ధి, కాంతి, బుద్ధిబలము, కృశించినవారలకు పుష్టిని కలుగజేయును. పురాణజ్వరములు, సమస్తజ్వరములు, సన్నిపాతజ్వరములు, ఏకాదశక్షయలు, అయిదుశ్వాసలు, అయిదుకాసలు, అయిదుఎక్కిళ్లు, పాండు, నంజు, వాతరోగములు, ప్రమేహములు, గ్రహణి, అతిసారము, మూత్రకృచ్ఛ్రము, అశ్మరి, వీటినిహరించును. ఈరసచింతామణి, ధన్వంతరిచే చెప్పబడినది.

## పాషాణచింతామణి

శ్లో॥ రసంగంధం విషంతాల ముల్లిపాషాణ గౌరికం । తీక్ష్ణం వంగాహితామ్రంచ తాప్యం తుత్థంచ మాక్షికం । సువర్ణవజ్రము

క్తాశ్చ ప్రవాలం పుష్యరాగకం । నీలం వైక్రాంతసంయుక్తం సమం ఖల్వే వినిక్షిపేత్ । జంబీర మాతులుంగార్ద్రి ద్రవై ర్మర్ద్యం దినత్రయం । కృష్ణ సర్పస్య పిత్తేన దినమేకం విభావయేత్ । మయూర మత్స్యవారాహచ్ఛాగమాహిషపిత్తకైః । దినత్రయంచసమ్మర్ద్య చూర్ణయేద్భిషగుత్తమః । రసమేనం ప్రయుంజీత త్రివల్ల పరిమాత్రయా । సన్నిపాతం హరేత్సర్వం శీఘ్రం సర్వ జ్వరాపహం। ఆర్ద్రికైశ్చప్రయుంజీత తత్తద్రోగానుపానతః। సర్వరోగాపహం చాశు భాస్కర స్తిమిరం యధా । చింతామణి రితిఖ్యాతో పాషాణ పదపూర్వకః॥

వ్యా॥ శు. రసము, శు. గంధకము, శు. నాభి, శు. తాళకము, శు. ఉల్లి పాషాణము, శు. గౌరీపాషాణము, లోహభస్మ, వంగభస్మ, సీసభస్మ, తామ్రభస్మ, వెండిభస్మ, శు. మైలతుత్థము, మాక్షికభస్మ, సువర్ణభస్మ, వజ్రభస్మ, ముత్యభస్మ, పగడభస్మ, పుష్యరాగభస్మ, నీలభస్మ, వైక్రాంతభస్మ, ఇవి సమభాగములు ఖల్వ మందుంచి, నిమ్మకాయలు, మాదీఫలము, అల్లము, వీటి రసములచే మూడురోజులు మర్దించి, నల్లత్రాచుపాము పిత్తముచే ఒకరోజు భావనచేసి, నెమలి, చేప, అడవి పంది, మేక, దున్నపోతు, వీటి పిత్తములచే మూడురోజులుమర్దించి చూర్ణముచేసుకొని మూడు వల్లముల ప్రమాణము యిచ్చినసర్వసన్నిపాతములను, సర్వజ్వరములను వెంటనే హరింపజేయును. అల్లపురసముచేగాని ఆయారోగానుపానములచేగాని యిచ్చిన సర్వరోగములను వెంటనే సూర్యుడు చీకటిని నశింపజేయురీతి నశింపజేయును. ఇది పాషాణ చింతామణి, యని ప్రసిద్ధమైనది.

## లఘుపాషాణ చింతామణి

వ॥ శుద్ధులుచేసిన ఉల్లిపాషాణము, గౌరీపాషాణము, శంఖ పాషాణము, తాలకము, మణిశిల ఇవి సమభాగములు గ్రహించి చిట్లాముదచే మర్దించి బిళ్ళచేసి ఒకకుండలోనుంచి ఆబిళ్లపై ఒకరాగిగిన్నె బోర్లించి కుండకు రాగిగిన్నెకు శీలమన్నుయిచ్చి ఆరాగిగిన్నెపైన ఇసుక పోసి గాఢాగ్ని చేవంట చేసుకునేది గిన్నెకుపువ్వుమాదిరిగఎగిరిపట్టుకొనును. చల్లారినపిదప తీసి గిన్నెనున్న పువ్వుతీసికుని మాత్రలుచేసుకుని రోగి యొక్కయు, రోగముయొక్కయు బలమునననుసరించి సన్నిపాతజ్వరములు శ్లేష్మవ్యాధులు, సవాయివ్యాధులు, క్రూరమైన వాతవ్యాధులు, కఠినమైన వ్రణములు, మొదలగువాటియందు యిచ్చుకునేది.

# మహాత్రైలోక్యచింతామణి

శ్లో॥ హేమాష్టసప్తతారంచ త్రయోభాగాశ్చ మిశ్రజం । చతుష్కమర్కలోహంచ పూతిలోహం త్రయోదశ । ధాతుజానిచ లోహాని ఏకైకంచ చతుర్దశ । మౌక్తికంగారుడంవజ్రం ప్రత్యేకంచచతుర్గుణం । కురువిందాష్టభాగంచ విద్రుమంచ తథాష్టకం। గోమేదకం పుష్యరాగం నవభాగం పృథక్పృథక్ । వైడూర్యంశక్రనీలంచ దశభాగం పృథక్పృథక్ । హేమాక్షికం సప్తభాగం పంచపాషాణషోడశ । భాగైకం శుద్ధ సౌవీరంఅంజనాని త్రయోదశ । శతభాగంశుద్ధరసం ద్విశతం బలిమేవచ । నవసారం షష్టిభాగం సర్వచూర్ణానిపేషయేత్ । కాచకూప్యంతరే క్షిప్త్వాచతురగ్నిం నిదాపయేత్। చతుర్వింశతి వారాణి సికతాయంత్రకేప చేత్ । చతుస్సహస్ర విప్రాణాంభోజనం కారయేద్దినం । నవగ్రహజపంకుర్యా దష్టదిక్పాలకార్చనం షోడశైవచ దానాని భూసురాణాం ప్రదాపయేత్ । సతీపయశ్చ కాశ్మీరమనుపానం ప్రకథ్యతే । సర్వరోగ కులఘ్నోయం భూతప్రేతనివారణః ।సర్వప్రయోగ శమనః సర్వపాపనివారణః । ఆయుర్వృద్ధి కరోనౄణామశ్విభ్యాం నిర్మితఃపురా । మహాత్రైలోక్య విఖ్యాత శ్చింతా మణీరయం మతః॥

వ్యా॥ సువర్ణభస్మ, 8భా. వెండిభస్మ, 7 భా. ఇత్తడి, కంచు, 3 భా. తామ్రభస్మ, 4 భా. తగర, సీస, సత్తు, పీటిభస్మ, 13 భా. ఇనపభస్మ, 14 భా. ఉక్కుభస్మ, 14 భా. మాండూరభస్మ, 14 భా. కాంతభస్మ, 14 ముత్యభస్మ, 4 భా. పచ్చలభస్మ, 4 భా. వజ్రభస్మ, 4 భా. కెంపులభస్మ, 8 భా. పగడభస్మ, 8 భా. గోమేధికభస్మ, 9 భా. పుష్యరాగభస్మ, 9 భా. వైడూర్యభస్మ, 10 భా. ఇంద్రనీలభస్మ, 10 భా. హేమమాక్షికభస్మ, 7 భా. శుద్ధిచేసినఉల్లిపాషాణము, నెల్లిపాషాణము, శంఖుపాషాణము, దొడ్డిపాషాణము; గౌరీపాషాణము, ఇవి 16 భా. శు. సౌవీరపాషాణము, 1 భా. శుద్ధిచేసిన పుష్పాంజనం, స్రోతోంజనం, నీలాంజనం, రసాంజనము, సౌవీరాంజనం, ఇవి 13 భా. శు. రసము, 100 భా. శు. గంధకము, 200భా. నవాసారము, 60 భా. ఇవన్నియు ఖల్వములోవేసి నూరుకుని కాచకుప్పెయందుంచుకుని వాలుకాయంత్రమందు దీపాగ్ని, కమలాగ్ని, మందాగ్నిగాఢాగ్నులచే 24రోజులు వండుకుని సాంగశీతలమున తీసి నాలుగువేల బ్రాహ్మణులకు అన్నదానము, నవగ్రహజపము, అష్టదిక్పాలకార్చన, బ్రాహ్మణులకు షోడశదానము. చేసుకుని చనుపాలు, కుంకుమపువ్వు పీటిఅనుపానములతో యిస్తే సమస్తరోగసముదాయములు, భూతములు, ప్రేతములు, సర్వప్రయోగములు, సమస్తపాపములు, హరించును. ఆయుర్వ్ధ

యాభివృద్ధిచేయును. ఈమహాత్రైలోక్యచింతామణి, పూర్వకాలమందు అశ్వినిదేవతలచే చెప్పబడెను.

# ప్రతాపలంకేశ్వరం

శ్లో॥ ఏకేందు చంద్రానలవార్ధి దంతి కలైకభాగం క్రమశో విమిశ్రం । సూతాభ్రగంధోషణలోహశంఖ వన్యోత్పలా భస్మవిషంచ పిష్టం । ప్రసూతివాతేనిలదంతబాధే సార్ద్రాంభసా వల్లమ ముష్యదద్యాత్ । వాతామయే శ్లేష్మగదే ర్శసిస్యా త్పురామృతార్ద్ర త్రిఫలాయుతోయం । సశృంగవేర ద్రవ ఏషహంతి ససన్నిపాతం జ్వరముగ్రరూపం । నిజానుపానై ర్నిజపథ్యయుక్తః సర్వాతిసారాన్ గ్రహణీవికారాన్। ప్రతాపలంకేశ్వర నామధేయః సూతః ప్రయుక్తో గిరిరాజపుత్ర్యా॥

వ్యా॥ శు. రసము, 1 భా. అభ్రకభస్మ, 1 భా. శు. గంధకము, 1 భా. పిప్పళ్లు, 3 భా. లోహభస్మ, 4 భా. శంఖభస్మ, 8 భా. అడవి పిడకలుభస్మ, 16భా. శు. నాభి, 1 భా. నూరుకుని, సూతికావాతము, వాతముచేపుట్టిన దంతముల తీపు, వీటియందు ఈమందు అల్లపు రసముతో వల్ల ప్రమాణము యివ్వవలెను. వాతవ్యాధులయందును, శ్లేష్మవ్యాధులయందును, అర్శస్సుయందును, గుగ్గులు, తిప్పతీగ, అల్లము, త్రిఫలములు, వీటితోను, సన్నిపాతజ్వరము, కఠిన జ్వరములు, వీటియందు, శుంఠిరసముతోడను, ఆయా అనుపానములచే పథ్యముతో సమస్త అతిసారములు, గ్రహణీదోషములు వీటియందు యిచ్చిన ఆయావ్యాధులను హరించును. ఈ ప్రతాపలంకేశ్వరము, పార్వతీదేవిచే చెప్పబడినది.

# లఘుప్రతాపలంకేశ్వరం

వ॥ శునాభి, శిలాజతు భస్మ, శుతాళకము, శుపాదరసము, శుగంధకము, షా, వెలిగారము, తామ్రభస్మ, ఉక్కుభస్మ, పిప్పళ్ళు ఇవన్నియు సమభాగములు గ్రహించి, చిత్రమూలము, అల్లపురసములచే మర్దించుకుని కుప్పెలుకట్టుకుని రెండుగురిగింజల ప్రమాణముఅనుపానవిశేషములతో యిచ్చిన, సూతికావాతము, సూతికాజ్వరము, వాతవ్యాధులు, క్షయ, పాండు, సన్నిపాతములు, శ్లేష్మవ్యాధులు, మొదలగునవి నశించును.

# మహాప్రతాపలం కేశ్వరం

శ్లో॥ మృతసూతం మృతంతామ్రం మృతంవజ్రం సువర్ణకం। ప్రవాల ముక్తాదరదం మాక్షికంచ మనశ్శిలా। గంధకంతాలకం తారం కాంతం తీక్ష్ణంచ ముండకం। లోహాభ్రం నాగవంగంచ కాంస్యం రీతి స్సమం సమం। మర్దయే చ్చిత్రకద్రావై ర్ద్వ్యదినంచ నిరంతరం। హంసపాదిరసైః పశ్చా ద్దిన మేకంవిమర్దయేత్। ఉన్మత్తముండిజద్రావై ర్దినం తద్గోలకీకృతం। తద్గోలం సంపుటేరుధ్వా పచే ల్లఘుపుటే తథా। స్వాంగశీతం విచూర్ణ్యాథ తత్సమం వత్సనాభకంద త్వా చూర్ణీకృతం సర్వ మేభి ర్ద్రావైశ్చ భావయేత్। నిర్గుండీ భృంగరాజంచ మహావృక్షాగ్ని ముండికాః। దుత్తూరార్ద్రి ద్రవైశ్చైవ దిన మేకం పృథక్పృథక్। మర్దయే చ్చోషయేచ్చాథ తామ్రపాత్రాంత రే క్షిపేత్। యామార్థం వాలుకా యంత్రే పాచయే త్స్వాంగశీతలం। ఖల్వమధ్యే వినిక్షిప్య చూర్ణీకృ త్వాతు పూర్వవత్। హాలాహలం సమంయోజ్యం శృంగ వేర రసేనతు। పునస్సమ్మర్ద్యతద్భావ్యం పంచపిత్తైర్భిషగ్వరః। సూతస్య చసమం దేయం గరళంకృష్ణ సర్పజం। ఏకీకృత్వాతు తత్సర్వం శ్లక్ష్ణంఖల్వేవిమర్ధయేత్। గుంజైకమను పానేన శృంగ వేర రసేన తు। సన్నిపాతే మహాఘోరే సర్వత్రైవ ప్రదాపయేత్। దేశకాలవయోవస్థా చతురోభిష గుత్తమః। ద్రాక్షాదాడిమఖర్జూరఫలం దేయంచఖాదయేత్। రసస్యాస్య ప్రభావేణ అపమృత్యుహరంధ్రువం। రసః ప్రతాపలం కేశో ధన్వంతరి హృదాహృతా। దేవాసురమహాయుద్ధే సన్నిపాతేన పీడితాః తేషాం సంజీవనార్థాయ మునిభిస్తు పురోగతః। అచింత్య మహి మాహ్యేష ఉపచారేణమానవాః। తస్మాత్సర్వప్రయత్నేన కర్తవ్యోయం మహారసః॥

వ్యా॥ రసభస్మ, తామ్రభస్మ, వజ్రభస్మ, సువర్ణభస్మ, పగడభస్మ, ముత్యభస్మ, శు. ఇంగిలీకము, మాక్షికభస్మ, శు. మణిశిల, శు. గంధకము, శు. తాళకము, వెండి భస్మ, కాంతభస్మ, తీక్ష్ణలోహభస్మ, ముండలోహభస్మ, లోహభస్మ, అభ్రకభస్మ, సీసభస్మ, వంగభస్మ, కంచుభస్మ, ఇత్తడిభస్మ, ఇవి సమాంశములు, చిత్రమూలరస ముచే రెండురోజులు నిరంతరము మర్దించి, హంసపాదిరసము, ఉమ్మెత్త రసము,

ఉసరపురసము వీటిచే వక్కొక్కరోజు మర్దించి మాత్రలుచేసుకుని ఆమాత్రలు మూష కృయం దుంచుకుని సంధిబంధనముచేసుకుని లఘుపుటమువేసుకుని స్వాంగశీతలమునతీసి చూర్ణించుకుని దీనికి సమము శు, నాభి, కలుపుకుని నూరుకుని, వావిలి, గుంటగలగర, జెముడు, చిత్రమూలము, బోడతరము, ఉమ్మెత్త, అల్లము, వీటిచే వక్కొక్క దినము భావనచేసుకుని నూరుకుని తామ్రపాత్రయందుంచి వాలుకాయంత్రమందు అరఝాముమువండుకుని స్వాంగశీతలమునతీసి, ఖల్వమందుంచుకుని నూరుకుని దీనికిసమము, శు నాభి, కలుపుకుని శొంఠిరసముచేమర్దించుకుని పాము, నెమలి, తాబేలు, దున్నపోతు, మేక, వీటిచేదులచే భావనచేసుకుని, నల్లత్రాచుపాముగరలము 1 భా, కలుపుకుని మెత్తగనూరుకుని గుంజాప్రమాణము శొంఠిరసానుపానముతో దేశ, కాల, వయస్సు, అవస్థ, వీటినిగుర్తెరిగిన వైద్యుడు, మహాఘోరమైనసన్నిపాతమందును, సర్వవ్యాధులయందును, యివ్వవలయును. ద్రాక్ష, దానిమ్మ, ఖర్జూర, వీటిపండ్లు యివ్వవలెను. దీనిసేవనచె మృత్యువునుహరించును. ఈ ప్రతాపలంకేశ్వరము, ధన్వంతరిచే చెప్పబడెను. దేవరాక్షసయుద్ధమందు సన్నిపాతముచే బాధితులగువారలను జీవింపజేయుటకు మునీశ్వరులచే తీసుకురాబడెను. మిక్కిలిమహిమకలిగిన దీనిసేవనచే మనుష్యులు మిక్కిలిమహిమ కలవారగుదురు. అందుచె సర్వప్రయత్నములచేతను ఈమహారసము చేయదగినది.

## పాషాణ ప్రతాప లంకేశ్వరం

వ॥ రసభస్మ, సువర్ణభస్మ, సీసభస్మ, వంగభస్మ, సత్తుభస్మ, లోహభస్మ, తామ్రభస్మ, ఇత్తడిభస్మ, శుద్ధిచేసిన ఉల్లిపాషాణము, నెల్లిపాషాణము, గౌరీపాషాణము, దొడ్డిపాషాణము, శంఖపాషాణము, ఇవన్నియు సమభాగములు వీటిఅన్నిటికి రెండురెట్లు శు. గంధకము ఇవన్నియు, ఖల్వమందుంచి కలుబందరసముతో ఏడురోజులు మర్దించుకుని కాచకుప్పెయందుంచుకుని వాలుకాయంత్రమందు గాఢాగ్నిచే ఈమందు కరిగేవరకు వండుకుని స్వాంగశీతలమున తీసి, సాంబ్రాణిఆకు, వావిలిఆకు రసములచే మూడేసి, రోజులు, కాకరాకు, తామలపాకుల త్రొడిమెలు, వీటిరసములచే మూడేసిఝాములు, తులసిఆకు రసముచే వకఝాము మర్దించుకొని మాత్రలుచేసుకొని నీడను ఆరించుకొని అనుపానవిశేషములచే పాతికయెత్తుచొప్పున యిచ్చిన, సూతికావాతములు, రములు, శ్లేష్మవ్యాధులు, వాతవ్యాధులు, క్షయ, భగందరములు, అసాధ్యవ్రణములు. సన్నిపాతములు, దోషజ్వరములు, సవాయి

వ్యాధులు, మొదలగు అసాధ్యవ్యాధులు పోవును. ఈపాషాణ ప్రతాప లంకేశ్వరము, ఉపయోగించునప్పుడు కఠినపథ్యము చేయవలయును.

# నవరత్న చింతామణి

శ్లో॥ సువర్ణం రజతం తామ్రం కాంతలోహం సమాక్షికం । పారదం గంధకం నీలం రాజావర్తం తురుష్కరం । వైక్రాంతం వజ్ర వైడూర్యం నాగం వంగం వరాటకం । గోమేదకం పుష్యరాగం ప్రవాలం మౌక్తికం శిలా । మాణిక్యం గారుడం శంఖం హరితాలంచ టంకణం । సర్వైస్సమం సూతభస్మ మర్దయే ద్వింశతి ర్ద్వయం। చిత్రమూల కషాయేణ భావయే దాతపే పుటేత్ । కోలమాత్రాంవటీం చైవ ఛాయా శుష్కాంచ కారయేత్ । కాచకుప్యాం నివేశ్యాథ యంత్రే విద్యాధరే పచేత్ । దీపాగ్నౌ పాచయే ద్యామమష్ట సఖ్యంచ శీతలం । తద్రసః ఖల్వమధ్యేతు మర్దయే త్పూర్వవత్ క్రమాత్ । అభావతః సూత సిందూరం తత్సమం హాటకం తథా । తత్సమం టంకణం చూర్ణం సూక్ష్మచూర్ణం విమర్దయేత్ । బాహ్లీకం మృగనాభించ వరాటం జాతి కాఫలం । ప్రత్యేకంతుచతుర్వింశం మర్దయే ద్భావనావిధిః । చిత్రమూలకషాయేణ కేసరామ్లేన వింశతిః । మర్దయే ద్భావనాత్పూర్వం యథా లాభం నియోజయేత్ । తద్రసః గులికాః కృత్వా మేదినీ పుటమాచరేత్ । మాసద్వయగతంచైవ తతస్తం సేవయే త్క్రమాత్ । మధు పిప్పలి సంయుక్త మనుపానవిశేషతః । తత్తద్రోగానుపానైశ్చ జీవే ద్వర్షశతం సుఖీ । క్షయరోగాన్ హరత్యేష స్సప్తధాతుగతాన్ హరేత్ । నాశయేత్ శ్లేష్మరోగాంశ్చ మూత్రకృచ్ఛ్రాంశ్చ నాశయేత్ । ప్రమేహా న్వింశతిం చైవ పైత్యరోగాం శ్చనాశయేత్ । పాండు శోఫోదరనాహ గుల్మప్లీహాతిసారజిత్ । అమ్లపిత్త మతీసారమంగదాహంచ నాశయేత్ । మూత్రబద్ధం మూత్రసారం లింగ శూలాక్షి రోగజిత్ । శోధనం సర్వరోగాణాం శోషయే ద్భ్రిమ రోగిణాం । ఉన్మాదాంశ్చ హరత్యేషశ్శిరో భ్రమణ కంపనం । సూతికా జ్వరవాతఘ్నం జ్వరం నానావిధంహరేత్ । వ్రణానాం వింశతిం చైవ

వంధ్యారోగ నివారణం । కామలాత్రితయంచైవ సన్నిపాతంచ దారుణం। సుసంతానకరం వృష్యం తేజోబుద్ధి బలప్రదం । ఏతాని సర్వరోగాణాం నాశయే న్నాత్ర సంశయః । సర్వలోక హితార్థాయ ఆత్రేయ ముని భాషితః । నవరత్న చింతామణి స్సర్వరోగేషు యోజయేత్॥

వ్యా॥ సువర్ణభస్మ, రజతభస్మ, తామ్రభస్మ, కాంతభస్మ, లోహభస్మ, తుంపస్వాక భస్మ, వైక్రాంతభస్మ, వజ్రభస్మ, వైడూర్యభస్మ, సీసభస్మ, వంగభస్మ, గవ్వలభస్మ గోమేధికభస్మ, పుష్యరాగభస్మ, పగడభస్మ, ముత్యభస్మ, శు. మణిశిల, మాణిక్య భస్మ, గారుడభస్మ, శంఖభస్మ, శు. తాలకము, పొ. వెలిగారము, ఇవి సమభాగ ములు వీటి అన్నిటితో సమానము రసభస్మ, వీటిని చిత్రమూల కషాయముచే 40 రోజులు మర్దించుకుని భావనచేసుకుని సూర్యపుటము వేసుకుని రేగిపండ్లంత మాత్రలు చేసుకుని నీడను ఎండించుకుని కాచకుప్పె యందుంచుకుని విద్యాధర యంత్రమందు దీపాగ్నిచే 8 ఝాములు వండుకుని చల్లారిన పిదప తీసుకుని అమందును ఖల్వమందుం చుకుని చిత్రమూల కషాయముచే మర్దించుకుని భావనచేసుకుని రససిందూరము, 1 భా. సువర్ణభస్మ, 1 భా. పొ. టంకణము 1 భా. కలుపుకుని పెం[?]గసూరుకుని, వంగమ పువ్వు $\frac{1}{4}$ భా. కస్తూరి $\frac{1}{4}$ భా. లవంగములు $\frac{1}{4}$ భా. జాజికాయలు $\frac{1}{4}$ భా. కలుపు కుని చిత్రమూలకషాయము, మాదీఫల రసముచేతను ఇరవై రోజులు మర్దించుకుని భావనచేసుకుని మాత్రలు చేసుకుని భూమియందు పాతిపెట్టి రెండుమాసములైన పిదప తీసి తేనె పిప్పళ్ల చూర్ణముతోగాని అనుపాన విశేషములచేగాని అయారో గాను పానములతోగాని సేవించిన నూరుసంవత్సరములు సుఖవంతుడై జీవించును. క్షయ రోగములను సప్తధాతు గతవ్యాధులను శ్లేష్మరోగములను మూత్రకృచ్ఛ్రములను ఇరవై ప్రమేహములను, పైత్యరోగములను పాండు, నంజు, ఉదరవ్యాధి, కడుపుఉబ్బరము గుల్మము, ప్లీహ, అతిసారము, అమ్లపిత్తము, శరీరతాపము, మూత్రబంధము, మూత్రా తిసారము, మేఢ్రశూల, నేత్రరోగములు, వీటిని జయించును. సర్వరోగములను శోధింపజేసి నశింపజేయును. భ్రమరోగము, ఉన్మాదము, శిరోభ్రమ, శిరఃకంప ము, సూతికాజ్వరము, సూతికావాతము, సమస్తజ్వరములు, ఇరవైవ్రణములు, వంధ్యా రోగము, మూడుకామిర్లు, దారుణమైన సన్నిపాతము, వీటిని నశింపజేయును, సుసం తానము, వీర్యవృద్ధి, తేజస్సు, బుద్ధి, బలము, వీటినిచేయును, సర్వరోగములను తప్పక నశింపజేయును. సర్వలోకములకు మేలుకొరకు ఈనవరత్న చింతామణి ఆత్రేయమునిచే చెప్పబడినది. దీనిని సమస్తవ్యాధుల యందును యిచ్చుకొనవలెను.

## నవరత్న చింతామణి.

శ్లో॥ మాణిక్యం గారుడంవజ్రంనీలం వైడూర్యమౌక్తికం

గోమేదికం పుష్యరాగం ప్రవాలం తీక్ష్ణతామ్రకం । సువర్ణంరజతం వంగం కాంతం తారమనశ్శిలా । గంధకం దరదంశంఖం ప్రత్యేకం కబలగ్రహం । ఖల్వోదరే వినిక్షిప్యరసభస్మసమాంశకం । మర్దితం పంచరాత్రేణపంచకోలకషాయకైః । భృంగరాజరసైశ్చైవ వజ్రవల్లీరసైస్తథా । నిర్గుండ్యాశ్చరసేనైవ వనశిగ్రురసైస్తథా వాలుకోద్ధద్రవేణార్ద్రిసింబనీరైర్దినత్రయం । స్నుహీక్షీరేణ భావ్యంచఛాయాశుష్కంచకారయేత్ । అనంతరేకాచకుప్యాంయయం త్రేవిద్యాధరేక్షిపేత్। త్రిదినంపాచితం కుర్యాల్లఘుమధ్యోత్తమాగ్నిభిః। స్వాంగశీతలమాదాయఅఘోరేణచపూజయేత్ । మాతులుంగరసైశ్చ వఆర్ద్రైజైర్వేల్లజైరసైః ! త్రిదినంమర్దితం చైవగులికాన్నిష్కమాత్ర కాః । ధూపందీపంచనైవేద్యం తాంబూలాద్యర్చనావిధిః । దేవబ్రాహ్మణపూజాంచధన్వంతరి సమర్చనం । తులసీబిల్వపత్రంచకమలంకరవీరకం । ద్వికాలంసేవయేన్నిత్యంచతుర్గుంజంహితాశనః । మాక్షికం మాగధీచూర్ణం లవంగంజీరకంతథా । త్రికటుకంచార్ద్రికంచైవ అజమోదావిశేషతః । రాజయక్ష్మహారం చైవరక్తక్షయ హారంతథా । శ్లేష్మక్షయహారంచాశువాతమేహంచనాశయేత్ । అసాధ్యరోగే విఖ్యాతంకుక్షిరోగహారంతథా । వాతపిత్తకఫోద్భూతాన్ సర్వాన్ రోగాన్వినాశయేత్। నానారోగ వినిర్ముక్తోజీవేద్వర్షశతంనరః । నవరత్నచింతామణిః కాశ్యపోమునిరబ్రవీత్ ॥

వ్యా॥ మాణిక్యములు, పచ్చలు, వజ్రము నీలము, వైడూర్యము, ముత్యములు, గోమేదికము, పుష్యరాగములు, పగడములు, ఖడ్గలోహము, తామ్రము, సువర్ణము, రజతము, వంగము, కాంతము వీటి భస్మములు, శు. తాళకము, శు. మణిశిల, శు. గంధకము, శు. ఇంగిలీకము శంఖభస్మ, ఇది కర్ష ప్రమాణము, వీటికి అన్నిటికి సమభాగము రసభస్మ, వీటిని ఖల్వమందుంచి పంచకోలములు, గుంటగలగర, నల్లేరు వావిలి, అడవిమునగ, వీటి రసములచే అయిదురోజులు మర్దించి, కూతురుబుడమ, అల్లము, వేప, వీటి రసములచే మూడురోజులు మర్దించి జెముడుపాలుచే భావనచేసి నీడను ఎండించి కాచకుప్పెయందుంచి విద్యాధరయంత్రమందు, లఘు, మధ్యమ, ఉత్తమాగ్నులచే మూడురోజులు వండుకొని స్వాంగశీతలమునతీసి అఘోరమంత్రముచే పూజించి మాదీఫలము, అల్లము,వాయువిడంగములు, వీటి రసములచేమూడురోజులు మర్దించుకొని నిష్కప్రమాణము కుప్పెలు కట్టుకొని, ధూపము, దీపము, నైవేద్యము,

తాంబూలము, అర్చనము, దేవబ్రాహ్మణుల పూజ, ధన్వంతరి పూజ, తులసి,మారేడు కమలములు, గన్నేరు, వీటి పత్రములచే పూజ చేసుకొని, నాలుగు గురిగింజల ప్రమాణము, ఉదయము, సాయంకాలము, తేనె, పిప్పళ్ళు, లవంగములు, జీలకర్ర, త్రికటుకములు, అల్లము, వాము, వీటితో సేవించిన, రాజయక్ష్మ, రక్తక్షయ, శ్లేష్మక్షయ, వాతవ్యాధులు, మేహవ్యాధులు, అసాధ్యమైన రోగములు, ఉదరరోగములు, వాతపైత్యకఫమువలన పుట్టిన సమస్తవ్యాధులను హరింపజేయును. మరియు ఏవిధమైన రోగములు లేకుండ నూరుసంవత్సరములు జీవించును. ఈనవరత్న చింతామణిని కాశ్యపముని [illegible]ను.

# నవరత్న చింతామణి

## (ప్రకారాంతరం)

వ॥ మాణిక్యములు, ముత్యములు, పగడములు, తార్క్ష్యములు, పుష్యరాగములు, వజ్రము, నీలములు, గోమేధికములు, వైడూర్యములు, విమలములు, వైక్రాంతము, సువర్ణము, వెండి, తామ్రము, ఖడ్గలోహము,ఇనుము, కంచు, కాంతలోహము,వర్తలోహము, శు.కఫరి ఇత్తడి, సత్తు, శు. మైలతుత్థము, శు. పాలతుత్థము, సీసము, వంగము, వీటిభస్మములు, శు.మనశ్శిల, పంచాంజనములు.శు.పాదరసము, శు. గంధకము, పంచలవణములు, హేమమాక్షికభస్మ, తారమాక్షికభస్మ, శంఖభస్మ, గవ్వలభస్మ, ముత్యపుచిప్పలభస్మ, మాండూరభస్మ, అభ్రకభస్మ, పొ, వెలిగారము, త్రికటుకములు, శు.ఇంగిలీకము, ఇవిసమభాగములు గ్రహించి, నల్లేరు, అల్లము, వెల్లుల్లి, చిత్రమూలము, వావిలి,వీటి రసములచే మర్దించి కాచకుప్పెయందుంచికొని వాలుకాయంత్రమందు మూడురోజులు వండుకుని తీసుకుని లవంగములు, దాసెనచక్క, పిప్పళ్లు ఇవి ప్రత్యేకముగా నొక్కొక భాగము, కస్తూరి ½ భా, ఇటుల వీనిని, మాదీఫలము, చిత్రమూలము, మునగ, అల్లము, జిల్లేడుపాలు, వీటిచేమర్దించి, గురిగింజ ప్రమాణము మాత్రలుచేసి యిచ్చిన త్రయోదశ సన్నిపాతములు, సమస్తజ్వరములు, క్షయ, సూతికాజ్వరములు, సూతికావాతములు, వాతవ్యాధులు, అసాధ్యకాస, శ్వాస, శ్లేష్మవ్యాధులు,

వీటిని పోగొట్టి వీర్యవృద్ధి, బలము, శరీరకాంతి, బుద్ధిబలము, వీటిని చేయును. ముసలితనమును, వ్యాధులను నశింపజేయును. ఇది శివునిచే చెప్పబడిన నవరత్న చింతామణి యనబడును.

## పంచలోహ రసాయనం.

శ్లో॥ మృతాభ్రంకాంతలోహంచ । నాగవంగౌచ మారితౌ । యథోత్తరం భాగవృద్ధ్యా ఖల్వమధ్యే వినిక్షిపేత్ । తలపోటన వారాహ్యా శతావర్యా హిమాంబునా । భావనాత్ర ప్రకర్తవ్యా యామంయామం పృథక్పృథక్ । చణమాత్రాం వటీంకృత్వా నవనీతేన సేవయేత్ । ప్రాతరుత్థాయ విధినా సర్వమేహ కులాంతకం । శాల్యన్నంచ పటోలం చ తండులీయక వాస్తుకం । ఘృతాన్వైక్షీ ముద్గయూషం చాపక్వం కదలీఫలం । అర్శాంసి గ్రహణీదోష మూత్రకృచ్ఛ్రాశ్మరీ ప్రణుత్ । కామలాం పాండుశోఫం చలపస్మారం క్షతక్షయాన్ । రక్తకాసం నిహంపంచలోహరసాయనం ॥

వ్యా॥ అభ్రకభస్మ 1 భా. కాంతభస్మ 2 భా. లోహభస్మ 3 భా. సీసభస్మ, 4 భా. వంగభస్మ 5 భా. వీటిని ఖల్వమందుంచి తంగేడు, నేలతాడి, పిల్లిపీచర, రక్తచందనము, వీటి రసములచే వక్కొక్కజాము మర్దించి సెనగగింజలంత మాత్రలుచేసు కొని యందొకదానిని ప్రాతఃకాలమందు, వెన్నతో సేవించిన, సర్వమేహములను, హరించును. వరిఅన్నము, పొట్ల, చిర్రికూర, ముల్లంగి, పొన్నగంటికూర, పెసరకట్టు, అరటికాయ, వీటిని భుజించుట హితకరము. మరియు అర్శస్సు, గ్రహణీదోషము, మూత్రకృచ్ఛ్రము, అశ్మరి, కామిర్లు, పాండువు, నంజు, అపస్మారము, క్షతక్షయము, రక్తకాస, వీటినిహరించును.

## పంచలోహ రసాయనం.

(వంటయోగం)

శ్లో॥ స్వర్ణమభ్రం త్రపుః కాంతం సీసకం రజతంసమం । భస్మ కృత్వాచ సర్వేషాం షడ్భాగా రసగంధకౌ । వాలుకాయంత్ర కేపాచ్యం మందమధ్య మోత్తమాగ్నిభిః । తాపయే ద్యామషట్కేణ పంచలోహ

రసాయనం । పునర్నవా ముండిశ్రీగూ వాశాభిన్నాగ్నినాం రసైః । సు ర్దయే ద్దినమేకైకం భవేన్మేహహారం తథా । క్షయమేకా దశం పాండునా న్కామాలా స్సర్వశూలజిత్ । వింశతిశ్లేష్మకాః రోగా న్వాతాశీతి వినా శనం॥

వ్యా॥ సువర్ణము, అభ్రకము, వంగము, కాంతము, సీసము, వెండి, వీటిభస్మ ములు సమభాగములు. శు. రసము 6 భా. శు. గంధకము 6 భా. వీటిని వాలుకా యంత్రమందు మంద, మధ్యమ, ఉత్తమాగ్నులచే ఆరుఝాములు వండుపనిని పంచ లోహరసాయన మనబడును. దీనిని గలిజేరు, బోడసరము, మునగ, అడ్డసరము, తిప్ప తీగ, చిత్రమూలము, వీటిరసములచే నొక్కొకరోజు మర్దించునని సేవించిన, సర్వప్ర మేహములను, ఏకాదశక్షయలను, పాండువ్యాధులను, కామిర్లను, సమస్తశూలలను, ఇరవై శ్లేష్మవ్యాధులను, ఎనబది వాతవ్యాధులను, నశింపజేయును.

# నవలోహ చింతామణి.

శ్లో॥ సువర్ణం రజతం తామ్ర మయోనాగంచ వంగకం । తీక్ష కాంస్యంచ వర్తాని నవై తేషాంరజాంసివై । శుద్ధింవిధాయసర్వాణి సమ భాగాని యోజయేత్। తతో ద్విభాగం దరదం నవభాగంతు తాలకం । సంయోజ్య ఖల్వే నిక్షిప్య కుమారీ స్వరసేనచ । ఏవం సర్వాం మర్దయి త్వా తచ్చరావేషు నిక్షిపేత్ । మృద్వస్త్రలేపనంకృత్వా పుటే ద్వి శతో త్పలైః। సాంగశీతల। మాదాయ చిత్రకం చార్ద్రకం తథా । వాసా కుమారీ స్వరసై ర్మర్దయే ద్భిషగుత్తమః ।అనుపానవిశేషేణ ద్విగుంజా మాత్రభక్షణాత్ । క్షయ మేకాదశంచైవ సన్నిపాతాం స్త్రయోదశ । కాసం శ్వాసంచ శూలంచ కుష్ఠరోగం తథైవచ । శ్లేష్మజా న్వింశతి శ్చైవ ఆశీతి వాతనాశనం।సర్వరోగాన్ వినశ్యంతి నవలోహ చింతామణిః॥

వ్యా॥ సువర్ణము, రజతము, తామ్రము, ఖడ్గలోహము, సీసము, వంగము, ఇత్తడి, కంచు, వర్తలోహము, శుద్ధిచేసిన వీటిభస్మలు సమభాగములు. శు. ఇంగి లీకము, 2 భా. శు. తాళకము 9 భా, వీటినిఖల్వమందునుంచి కలుబందరసముచేమర్దించి మూకుళ్ళయందుంచి మట్టిపూసిన గుడ్డలచే సంధిబంధనముచేసి 2 వందల పిడకలచే పు టము వేసి సాంగశీతలమునతీసి, చిత్రమూలము, అల్లము, అడ్డసరము, కలుబందరస ములచే మర్దించి అనుపానవిశేషముచే రెండుగురిగింజల్ప్రమాణము సేవించిన, ఏకా దశక్షయలు, త్రయోదశసన్నిపాతములు, కాస, శ్వాస, శూల, కుష్ఠము, శ్లేష్మవ్యా

ధులు, అశీతివాతవ్యాధులు, వీటిని నశింపజేయును. ఈనవలోహ చింతామణి సర్వరోగములను హరింపజేయును.

గద్య. ఇతి శ్రీ గోదావరీమండలమండనాయమాన కోనసీమాంతర్వర్తి మోడేకుర్రుగ్రామవాసి భూసురాగ్రగణ్య శ్రీపాదోపనామక కౌశికస గోత్రపవిత్ర వేంకటేశ్వరపౌత్ర సోమయాజిపుత్ర సుబ్బమాం బాగర్భశుక్తిముక్తాయమాన సద్గురుసేవాసమాసాదిత సాహితీశబ్ద శాస్త్రాయుర్వేదాదివిద్యానిధానభిషగ్వరాయుర్వేదభూషణాదిబిరుదావళీవిరాజమాన విద్వత్ప్రభు సభాస్థానసన్మాన ... భ్రాజమాన సకలసజ్జనవిధేయ కృష్ణమూర్తిశాస్త్రి నామధేయప్రణీతాయుర్వేదౌషధరత్నాకరే ద్వితీయగుచ్ఛః సమాప్తః.

---

# అథ
# ఆయుర్వేదౌషధ రత్నాకరే
# తృతీయగుచ్ఛ ప్రారంభః

## చూడామణి రసమ్

శ్లో॥ మృతం సూతం ప్రవాలంచ స్వర్ణం తారంచ వంగకం। శుల్బం ముక్తాతీక్ష్ణ మభ్రం సర్వమేకత్ర యోజయేత్ । అమృతార్ద్రిక [illegible] ముస్తచిత్రక నింబకైః। పత్రైశ్చ పిష్ట్వా వటికా కార్యావల్ల ప్రమాణతః । ధాతుస్థం సన్నిపాతోత్థం జ్వరం విషమసంభవం। కామశోక సముద్భూతం [illegible]ం తథా । కాసం శ్వాసంచ వివిధం శూలం। సర్వాంగ సంభవం। శిరోరోగం కర్ణశూలం దంతశూలం గలగ్రహం। వాతపిత్త సముద్భూతాం గ్రహణీం సర్వసంభవాం । ఆమవాతం కటీశూలం అగ్నిమాంద్య విషూచికాం । అర్శాంసి కామలాం మేహం మూత్రకృచ్ఛ్రాదికం జయేత్ । తత్సర్వం నాశయత్యాశు విష్ణుచక్ర మివాసురాన్ । చూడామణి రసోహ్యేషః శివేన పరికీర్తితః ॥

వ్యా॥ రసభస్మ, పగడభస్మ, సువర్ణభస్మ, రజతభస్మ, వంగభస్మ, తామ్రభస్మ, ముత్యభస్మ, తీక్ష్ణలోహభస్మ, అభ్రకభస్మ, ఇవిఅన్నియు సమభాగములు, తిప్పతీగ, అల్లము, నేలవేము, తుంగగడ్డలు, చిత్రమూలము వేపచెక్క వీటిరసములచే నూరుమని రెండువల్లముల ప్రమాణము మాత్రలుచేసుకొని సేవించిన, ధాతుగతజ్వరము, సన్నిపాతజ్వరము, విషజ్వరము కామజనితజ్వరము, శోకజనిత జ్వరము, దోషజనితజ్వరము, దగ్గు, ఆయాసము, సర్వశరీరమందు పుట్టిన శూల, శిరోరోగము, కర్ణశూల, దంతశూల, కంఠముపట్టుకపోవుట, వాతమువలన పుట్టిన గ్రహణి, త్రిదోషజనితగ్రహణి, ఆమవాతము, కటిశూల, అగ్నిమాంద్యము, విషూచి, మూలవ్యాధి, కామిర్లు, మేహము, మూత్రకృచ్ఛ్రము మొదలగు వ్యాధులను విష్ణుచక్రము రాక్షసులను వలె ఖండించును. ఈ చూడామణిరసము ఈశ్వరునిచే చెప్పబడెను.

## గ్రహణీమతంగ కంఠీరవమ్.

శ్లో॥ గంధం పాదర మభ్రకంచదరదం లోహంచ జాతీఫలం బిల్వం హాచరసం విషం ప్రతివిషాంవ్యోషం తథా ధాతకీం। భంగామప్య భయాంకపిత్థజలదౌ దీప్యానలౌ దాడిమం టంకాద్భస్మకలింగాకాన్ కనకజంబీజంచ పక్షేక్షణం। ఏతత్సూర్య మఫేనమే తదఖిలం సంమర్ద్య సంభావ్యాయేత్ ధత్తూరచ్ఛదజై రసైశ్చ మతిమాన్ కుర్వాన్ మరీచా కృతిం। దత్తానాగ్రహణీగదం సరుధిరం సామం సశూలం చిరాతీసారం వినిహంతిజూర్తిసహితం తీవ్రాంవిషూచీ మపి। దుస్సాధ్యామపిబింబసీం పరిహారే దుక్తానుపానై రయం నామ్నాతుగ్రహణీ మతంగజమద ధ్వంసీ భ కంఠీరవః॥

వ్యా॥ శుగంధకము, శుపాదరసము, అభ్రకభస్మ, శు. ఇంగిలీకము, లోహభస్మ, జాజికాయ, మారేడు, బూరుగబంక, శునాభి. అతివస, త్రికటుకములు, ఆరెపువ్వు, గంజాయి, కరక్కాయ, వెలగ, తుంగగడ్డలు, జీలకర్ర, చిత్రమూలము, దానిమ్మపెరడు, వెలిగారభస్మ, కొడిశపాలవిత్తులు, శుఉమ్మెత్తవిత్తులు, ఈ ఇరవైరెండును సమభాగములు, వీటిఅన్నిటికి నాల్గవవంతు, శు నల్లమందు కలుపుకుని. ఉమ్మెత్త ఆకుల రసముచే మర్దించుకుని మిరియాలువలె మాత్రలుచేసుకుని యిచ్చిన, రక్తము మును, కడుపునొప్పి, వీటితోకూడుకునిన గ్రహణీరోగమును, బాధతోకూడిన చిరలగితమయిన అతిసారమును, కఠినమైన విషూచీ, దుస్సాధ్యమైన విలంబిక, వీటిని, అనుపానములచే హరించును. ఇది గ్రహణీమతంగ కంఠీరవ, మనబడును.

## జీవదరసమ్.

స్మ తామ్రమతారం ముండం తీక్ష్ణాలమాక్షికం। వహ్ని టంకణకం వ్యోషం సమం సమ్మర్దయే ద్దినం। పాఠా నిర్గుం బిల్వమూలార్ద్రకై స్తథా। తతో మూషాగతంరుద్ధ్వావిపచే దూర్భధరే పుటే। మాషైకం మరిచ శుంఠీభ్యాం పాయయేచ్చ విచక్షణః। మంద మగ్నిం కరోత్యాశు కాలాగ్ని సమతేజసం। పర్వతా అపిజీర్యంతి ప్రా దస్య దేహినః। దుర్నామ పాండు శ్వయథుకుష్ఠ ప్లీహోదరాప హం। అంజనే నాథ వానస్యాత్ సన్నిపాతంజయేత్ ధ్రువం। జీవదరస నామాయం జీవం దాస్యతి దేహినః॥

వ్యా॥ రసభస్మ, తామ్రభస్మ, రజతభస్మ, ముండలోహభస్మ, తీక్ష్ణలోహభస్మ ము, తాళకము, మాక్షికభస్మ, చిత్రమూలము. వీ, వెలిగారము, త్రికటుకములు, వీటిని సమభాగములు గ్రహించి, చిరుబొద్ది వావిలి, చిత్రమూలము, మాచేనువేళ్ళ, అల్లము,వీటిచేమర్దించి, మూషయందుంచి సంధిబంధనముచేసి భూధరపుటము వేసుకొని, మాషప్రమాణము, మిరియాలు, శొంఠి, వీటిచేయిచ్చిన, మందగించిన జాఠరాగ్నిని ప్రళయకాలాగ్నితో సమానమైన దీప్తికలదానినిగా చేయును. ఈమందుసేవించిన వానికి పర్వతములు కూడ జీర్ణమగును. అర్శస్సు, పాండువు, సంజు, మష్టము, ప్లీహోదరము, వీటిని నశింపజేయును. కంటియందు కలికముగాగాని ముక్కుయందునస్యముగాగాని ఉపయోగించిన సన్నిపాతమును తప్పక నశింపజేయును. జీవరసమనెడి యిది ప్రాణులకు జీవమును యిచ్చును.

## పుష్పహాసరసం

శ్లో॥ సువర్ణ మభ్రకం ముక్తా తామ్రం నాగంచ వంగకం। పారదం గంధకం ఏలా కుంకుమం చందనం తథా। కేసరం జాతికోశంచ లవంగం మృగనాభకం। పిప్పలీ మరిచం పథ్యా కర్పూరం సమభాగకం। నీలోత్పలస్య నీరేణ మర్దయే త్త్రిప్రహరద్వయం। వటకా గుంజమాత్రేణ కరోతి వివిధాన్ గుణాన్ । మధుమేహం ఇక్షుమేహం సికతామేహమేవచ । బహుమూత్రం మూత్రకృచ్ఛ్రం ప్రమేహాన్ వింశంతిం జయేత్ । వీర్యవృద్ధి కరంపుంసాం శుక్ర స్తంభన ముత్తమం । ఉత్సాహం జనయేత్పుంసాం నారీణాంచ తథైవచ ! పుష్పహాసరసోనామ్నా పార్వతీపతి భాషితః॥

వ్యా॥ సువర్ణభస్మ, అభ్రకభస్మ, ముత్యభస్మ, తామ్రభస్మ, సీసభస్మ, వంగభస్మ, శురసము, శుగంధకము, ఏలకులు, కుంకుమపువ్వు, మంచిగంధము, నాగములు, జాపత్రి, లవంగములు, కస్తూరి, పిప్పళ్లు, మిరియాలు, కరక్కాయ, కచ్చూకరము, ఇవి సమభాగములు, నల్లకలువ రసముచే రెండుఝాములు, మర్దించుకొని, గుంజాప్రమాణము మాత్రలుచేసుకొని సేవించిన అనేకమంచిగుణములకలిగించును. మధుమేహము, ఇక్షుమేహము, సికతామేహము, బహుమూత్రము, మూత్రకృచ్ఛ్రము, ఇరవై ప్రమేహములు, వీటినిజయించును. వీర్యవృద్ధినిచేసి వీర్యస్తంభనమును చేయును. పురుషులకును, స్త్రీలకును, ఉత్సాహమును, కలిగించును. పుష్పహాస మనెడిపేరుచే ఈశ్వరునిచే చెప్పబడెను.

## జ్వరగణాంతకరసమ్

శ్లో॥ హింగులసంభవం సూతం గంధకం టంకణంతథా। తామ్రం వంగం మాక్షికంచ సైంధవం మరిచంతథా । సమంసర్వం సమాహృత్య ద్విగుణం స్వర్ణభస్మకం । తదర్ధం కాంతలోహంచ రౌప్యభస్మాపి తత్సమం । ఏతత్సర్వం విచూర్ణ్యాథ భావయేత్కనకద్రవైః । శేఫాలీదలజైశ్చాపి దశమూలరసేనచ । కిరాతతి___ ___ స్త్రివారం భావయేత్సుధీః । భావయిత్వా తతఃకుర్యా ద్గుంజాద్వయ మితాంవటీం । అనుపానం ప్రయోక్తవ్యం జీరకం మధుసంయుతం । జీర్ణజ్వరం మహాఘోరం చిరకాల సముద్భవం । జ్వర మష్టవిధంహంతి సాధ్యాసాధ్య మథాపివా । పృథగ్దోషాంశ్చ వివిధాన్ సమస్తాన్ విషమజ్వరాన్ । మేదోగతం మాంసగత మస్థిమజ్జాగతం తథా । అంతర్గతం మహాఘోరం బహిస్థంచ విశేషతః । నానాదోషోద్భవంచైవ జ్వరం శుక్రగతం తథా । నిఖిలం జ్వరనామాయం హంతి శ్రీశివశాసనాత్ । జ్వరగణాంతకనామాయం రసశ్శ్రీ శివనిర్మితః ॥

వ్యా॥ ఇంగిలీకములో నుంచి తీసినరసము, శుగంధకము, శు. టంకణము, తామ్రభస్మ, వంగభస్మ, మాక్షికభస్మ, సైంధవలవణము, మిరియాలు, ఇవి ఒక్కొక్క భాగము సువర్ణభస్మ, 2 భా, కాంతభస్మ, 1 భా. రజతభస్మ, 1 భా. వీటి నన్నిటిని నూరుపసు, ఉమ్మెత్త, వావిలిఆకు, దశమూలములు, నేలవేము, వీటి రసములచే మూడేసి సారులు భావనచేసి రెండు గురిగింజలప్రమాణము మాత్రలుచేసి జీలకర్ర, తేనె, వీటి అనుపానముతో సేవించిన, మహా ఘోరము చాలాదినములు అయిజనించిన జీర్ణజ్వరము, అసాధ్యమైనటువంటి ఎనిమిది విధములయిన జ్వరములు, సమస్తవిధమైన జ్వరము సమస్తమైన దోషములు, సమస్తవిషమజ్వరములు, మేదోగత జ్వరము, మాంసగతజ్వరము, అస్థిగత జ్వరము, మజ్జాగతజ్వరము, అంతర్గతజ్వరము, ఘోర జ్వరము, బహిర్గతజ్వరముసమస్తదోషజనితజ్వరము, వీటిని హరించుటయేగాక సమస్తమైన జ్వరమనే పేరును కూడా ఈశ్వరాజ్ఞచే హరింపజేయును. ఈ జ్వరగణాంతకరసము ఈశ్వరునిచే చెప్పబడెను.

## గ్రహణీగజకేసరీ రసం

శ్లో॥ సూతగంధకమభ్రంచ తారంలోహం సటంకణం । రసాంజనం మాక్షికంచ శాణమేకం పృథక్పృథక్ । లవంగం చందనం

ము స్తం పాఠాజీరకధాన్యకం । సమంగాతివిషాలోధ్రం కుటజేంద్ర యవ త్వచం । జాతీఫలం విశ్వాబిల్వాం కనకం దాడిమీత్వచం । వరాంగం ధాతకీకుష్ఠం ప్రత్యేకం రససమ్మితం । భావయే త్సర్వమేకత్ర కేశ రాజరసైః పునః । చణాభావటికాకార్యా ఖాగి మద్ధేన పేషితాం। అనుపానం ప్రదాతవ్యం దగ్ధబిల్వం సమంగుడైః । హంతి సర్వానతి సారాన్ గ్రహణీం చిరజామపి। ఆమసంపాచనోసమ్య గ్వహ్నివృద్ధి కర స్తథా । గ్రహణీ గజకేసరీ గ్రహణీరోగనాశనః ॥

వ్యా॥ శు. రసము, శు. గంధకము, అభ్రకభస్మ, రజతభస్మ, లోహభస్మ, వెలి గారభస్మ, రసాంజనం, మాక్షికభస్మ, లవంగములు, పంచిగంధము, తుంగగడ్డలు, చిరుబొద్ది, జీలకఱ్ఱ, ధనియాలు, మంజిష్టి, అతివస, లొద్దుగ, కొడిశపాలవిత్తులు, కొడిశపాలపండ్లుచెక్క, జాజికాయ, శుంఠి, మారేడు, ఉమ్మెత్తవిత్తులు, దానిమ్మ బెరడు, దాసెనచెక్క, ఆరెవువ్వు, చంగల్వకోష్టు, ఇవన్నియు, ఒక్కొకకర్ష ప్రమాణము, గ్రహించి, గుంటగలగరరసముచె భావనచేసి మేకపాలతో నూరి కుని సెనగగింజలంత మాత్రలు చేసుకుని, మారేడుపసి, చెల్లము, వీటిఅనుపానముతో యిచ్చిన, సమస్తఅతిసారములను చిరకాలగతగ్రహణీ రోగమును, హరింప జేయును. ఆమమును పక్వమును జేయును. అగ్నిదీప్తిని చేయును. ఈ గ్రహణీగజకేసరీ రసము గ్రహణిరోగములను నివారింపజేయును.

# కనకసుందరరసం

శ్లో॥ రసభస్మచతుర్థాంశం హేమభస్మ ప్రకల్పయేత్ । తాలకం రసకంతుల్యం మాక్షికం గంధకం శిలా । రసమానానియుంజీత సూత పాదంచ టంకణం । దినైకైకం క్రమేణైవ తత్సర్వం మర్దయే ద్దృఢం । అర్కక్షీరం జయంతీచ భృంగంవాశాచలాంగలీ । అగస్తి చిత్రకం పాఠా మర్ద్యం తేషాం ద్రవైః పృథక్ । ద్విగుంజం భక్షయేన్నిత్యం అనుపానం మృగాంకవత్ । క్షయం హంతి మహాతీవ్రం రసః కనకసుం దరః ॥

వ్యా॥ రసభస్మ 1 భా, సువర్ణభస్మ $\frac{1}{4}$ భా, శుతాళకము 1 భా, పాలతుత్థం 1 భా, మాక్షికభస్మ 1 భా, శుగంధకము 1 భా, శుమణిశిల 1 భా, పావెలిగారము $\frac{1}{4}$ భా, వీటిని, జిల్లేడుపాలు, తెక్కలి గుంటగలగర, అడ్డసరము, చెన్నచర్లగడ్డ, అవిసి, చిత్రమూలము, చిరుబొద్ది, వీటియొక్కరసములచే ఒక్కొక్కరోజు దృఢము గామర్దించి, మృగాంకరసమునకు చెప్పిన అనుపానములతో రెండుగురిగింజల ప్రమా ణము, సేవించిన ఈ కనకసుందరరసము, మహాతీవ్రమైన క్షయను నశింపజేయును,

## మహాకనక సుందర రసం

శ్లో॥ రసస్యతుల్యభాగేన హేమభస్మప్రయోజయేత్ । మనశ్శిలా గంధకంచతుత్థంమాక్షికతాలకం । విషంటంకణకం సర్వంరసతుల్యం ప్రదాపయేత్ । మర్దయేత్సర్వ మేకత్రఖల్వ పాత్రేచనిర్మలే । జయంతి భృంగరాజోర్ద్ధ పాఠాయూవాసకస్యచ । అగస్తిలాంగలాగ్నినాంస్వరసైశ్చ పృథక్పృథక్ । భావయిత్వావిశోష్యాధ పునశ్చార్ద్రికవారిణా । సప్తధా భావయిత్వాచ రసః కనకసుందరః । గుంజాద్వయంత్రయంవాస్య రాజయక్ష్మ ప్రశాంతయే । మధునాపిప్పలీభిర్వా మరిచైర్వా ఘృతాన్వితం । సన్నిపాతే ప్రదాతవ్యమార్ద్రికస్వరసేనవై । జయపాలరజోభిర్వాగుల్మేశూలరోగిణే । అమ్లవర్జ్యం చరేత్పథ్యం బల్యం హృద్యం రసాయనం । వర్జయేల్లవణంహింగు తక్రందధివిదాహియత్

వ్యా॥ రసభస్మ, సువర్ణభస్మ శుమనశ్శిల, శుగంధకము, శుమైలతుత్థము, మాక్షికభస్మ, శుతాళకము శునాభి, పావెలిగారము, ఇవి సమభాగములు శుభ్రమైన ఖల్వమందుంచి, కొక్కిలి, గుంటగలగర, చిరుబొద్ది, అడ్డసరము అవిసి, చన్నచెర్లగడ్డ చిత్రమూలము, వీటిరసములచే వేరువేరుగా భావనచేసి ఎండించి తిరిగి అల్లపురసముచె ఏడుసారులు భావనచేసుకునిన, కనకసుందరరస మనబడును, ఇది రెండులేక మూడు గురిగింజల ప్రమాణము, తేనె, పిప్పళ్ళచూర్ణముతోగాని, మిరియాలు చూర్ణము, నెయ్యితోగాని, సేవించిన, క్షయ, అల్లపురసముతో సేవించిన, సన్నిపాతము, నేపాల చూర్ణముతో సేవించిన గుల్మము, శూల, వీటిని నశింపజేయును. ఈమందు సేవించిన ప్పుడు, పులుసు పదార్థములు, ఉప్పు ఇంగువ, మజ్జిగ, పెరుగు, వేడిచేయువస్తువులు వీటిని సేవింపరాదు, బలకరము, హితము, రసాయనము, అగుపదార్థములను సేవింపవలయును.

## లఘుకనకసుందర రసం.

శ్లో॥ మరిచ బలిహింగు లైగ్గరల పిప్పలీ టంకణైః సువర్ణభవ బీజకైః సమలవైః దినార్ధావధి । జయారసవి మర్దితైః కనకసుందరః సుందరి స్మృతో జ్వరాతి సృతివహ్నిమాంద్యాపహః॥

వ్యా॥ మిరియాలు, శుగంధకము. శు. ఇంగిలీకము, శునాభి, పిప్పళ్ళు, పా. టంకణము, శు. ఉమ్మెత్తవిత్తులు లవంగములు, ఇవిసమభాగములు ఒకపూట గంజాయి ఆకురసముచే మర్దించిన, కనకసుందరరసమని చెప్పబడును. ఇది జ్వరము, అతిసారము, రక్తస్రావము, అగ్నిమాంద్యము, వీటిని పోగొట్టును.

# మహాసువర్ణకనకసుంధర రసం

శ్లో॥ రసగంధక నాగాశ్చ రసకోమాక్షి కాభ్రకే కాంతవిద్రుమ ముక్తానాం వంగభస్మచ తారకం । భస్మకృత్వాప్రయత్నేన ప్రత్యేకం కర్షసంమితం । సర్వతుల్యం శుద్ధహేమభస్మ కృత్వా ప్రయోజయేత్॥ మర్దయేత్ త్రిదినం సర్వం హంసపాదీర సర్భిషక్। తతో వైగోలకాన్ కృత్వా కాచకుప్యాం వినిక్షిపేత్। రుద్ధ్వా తత్కాచ కూపీంచసప్తవస్త్రేణ వేష్టితాం । తతోన్నైసికతాయంత్రే త్రిదినం చోక్తవహ్నినా । పశ్చాత్తం స్వాంగశీతంచ పూర్వోక్తరస మర్దితం । వినిక్షిప్యకరండేథ సంపూజ్య రసరాజకం । మహాకనకసుందరో రాజయక్ష్మహరఃపరః । పాండురోగం శ్వాసకాసం కామలాగ్రహణీగదాన్ । క్రిమిశోఫోదరావర్త గుల్మమేహాగుదాంకురాన్ । మందాగ్నిం ఛర్దిమరుచి మామశూల హలీమకాన్ । జ్వరాన్ ద్వంద్వాదికాన్ సర్వాన్ సన్నిపాతాం త్రయోదశ । పైత్యరోగమ పస్మారం వాతరోగాన్విశేషతః। రక్తపిత్తప్రమేహాంశ్చ స్త్రీణాంరక్త స్రవాంస్తథా । వింశతి శ్లేష్మరోగాంశ్చ మూత్రరోగాన్నిహంత్యసౌ । హేమవర్ణ్యశ్చ బల్యశ్చ అయుఃశుక్రవివర్ధనః । మహాకనక సింధూరః కాశ్యపేన వినిర్మితః॥

వ్యా॥ శురసము, శుగంధకము, సీసభస్మ, శుహాలతుద్ధము, మాక్షికభస్మ, అభ్రకభస్మ, కాంతభస్మ, పగడభస్మ, ముత్యభస్మ, వంగభస్మ, రజతభస్మ, ఇవివక్కొక కర్ష ప్రమాణము, వీటిఅన్నిటికి సమానము సువర్ణభస్మ, వీటిని ఖల్వమందుంచి హంసపాది రసముచే మూడురోజులు మర్దించి మాత్రలుచేసి కాచ కుప్పెయందుంచి మూతమూసి మట్టిరాసిన వస్త్రములచే కుప్పెఏడుసారులుచుట్టి వాలుకాయంత్రమందు మూడురోజులు క్రమాగ్నులచే వండుకుని చల్లారిన పిదప తీసి హంసపాదిరసముచే మరల నూరుకుని భరిణియందుంచుకుని రసరాజును పూజింపవలయును. ఈ మహాకనక సుందరరసము, రాజయక్ష్మ, పాండు, శ్వాస, కాస, కామిర్లు, గ్రహణి, క్రిమి వ్యాధులు, నంజు, ఉదరము, ఉదావర్తము. గుల్మము, మేహములు. మూలవ్యాధి, అగ్నిమాంద్యము, వాంతి, అరుచి, ఆమము, శూల, హలీమకము, ద్వంద్వ జ్వరము, మొదలగు సమస్తజ్వరములు, పదమూడు సన్నిపాతములు, పైత్యవ్యాధులు, అపస్మారము, వాతవ్యాధులు, రక్తపిత్తము, ప్రమేహములు, స్త్రీలయొక్క, శ్వేతరక్త ప్రదరములు, ఇరవై శ్లేష్మవ్యాధులు, మూత్రరోగములు, వీటిని నశింపజేయును, బంగా

రపుకాంతి, బలము, ఆయుర్వృద్ధి, శుక్రవర్ధి, వీటినిచేయును. ఇది కాశ్యపునిచే నిర్మింపబడిన, మహాకనకసుందరరసము, అగును.

## నవరత్న కనకసుందర రసం

శ్లో॥ శుద్ధసూతంచ చత్వారితులా నిక్షిప్యయత్నతః । శుద్ధ స్వర్ణం త్రపుస్తార రజశ్చైవతులం పృథక్ । హేమమాక్షికం తులంచైవ నవరత్నంతులేనచ । ఏతేషాం గంధకం చైవద్విగుణాం చ వినిక్షిపేత్ । నవాసారంచ చత్వారి తులానిక్షిప్యయత్నతః । సర్వం ఖల్వతలేక్షిప్య మర్ద్యం చూర్ణంచకారయేత్ । కాచకుప్యాం తునిక్షిప్య పాతాలయంత్రకేతతః । త్రియామంచ పచేదగ్నౌ సాంగశీతల ముద్ధరేత్ । అను పాన విశేషేణదేయం గుంజాచతుష్కకం। క్షయంపాండుం శ్వాసకాసం పైత్యరోగమ పస్మారకం । రక్తపిత్తం ప్రమేహాంశ్చ శ్వేతరక్త ప్రదరం తథా । రసః కనకసుందరః సీతానాథ ప్రకల్పితః ॥

వ్యా॥ శురసము, 4 తులములు, శుబంగారరజను, శువంగరజను, శువెండిరజను శు,హేమమాక్షికము,, శునవరత్నములు, ఇవిపక్కొకతులము, వీటిఅన్నిటికి రెట్టింపు, శు, గంధకము, నవాసారము, 4 తులములు, వీటినన్నిటిని ఖల్వమందుంచి మర్దించిచూర్ణముచేసి కాచకుప్పెయందుంచి పాతాలయంత్రమందు మూడుఝాములువండి చల్లారనిచ్చి తీసి అనుపానవిశేషముచే నాలుగుగురిగింజలు ప్రమాణముయిచ్చిన, క్షయ, పాండు, శ్వాస, కాస, పైత్యవ్యాధులు, అపస్మారము, రక్తపిత్తము, ప్రమేహములు, శ్వేతప్రదరము, రక్తప్రదరము, వీటిని, సీతానాథునిచే చెప్పబడిన, ఈ కనక సుందరరసము, నివారింపజేయును.

## శూలకులకంటక రసం.

శ్లో॥ లోహమభ్రం తామ్రభస్మ రసగంధకతారకం । ఏతాని పలమాత్రాణి కారయేచ్చ పృథక్తతః । జాతీఫల లవంగాబ్ద త్వగేలా టంకరామఠం । జీరకంపత్రకంచైవ అజాజీవిశ్వసైంధవం । మరిచం త్రివృతంక్షీరం ప్రత్యేకంస్వపలోన్మితం । ధాత్రీరసేవటీంకుర్యా చ్చతుర్గుంజాప్రమాణతః । హంతిశూలంతథాగుల్మం ఆమవాతంసుదారుణం । హృచ్ఛూలంపార్శ్వశూలంచ చక్షుశ్శూలం హలీమకం । శిరశ్శూలం కటీశూలం ఆనాహం అష్టశూలకం । క్రిమిరోగాణ్యుదరం వాతరక్తం

భగందరం । ఉపదంశమతీసారం గ్రహాణ్యర్శః ప్రవాహికాం । శూలకు లకంటకోయం మహేశేన ప్రకాశితః॥

వ్యా॥ లోహభస్మ, అభ్రకభస్మ, శుద్ధరసము, శుద్ధగంధము, రజతభస్మ, ఇవి వక్కాక ఫలము, జాజికాయలు, లవంగములు, తుంగగడ్డలు, దాల్చినచెక్క, ఏలకులు, శుద్ధటంకణము, శుద్ధఇంగువ, జీలకర్ర, ఆకుపత్రి, శుంఠి, సైంధవలవణము, మిరియాలు, తెగడ, యవక్షారం, ఇవి రెండేసిపలములు, వీటిని ఉసిరికరసము చేనూరి నాలుగుగురిగింజల ప్రమాణము సేవించిన, శూల, గుల్మము, ఆమవాతము, హృదయశూల, పార్శ్వశూల, నేత్రశూల, హలీమకము, శిరశ్శూల, కటిశూల, కడుపుఉబ్బరము, ఎనిమిదిశూలలు, క్రిమిరోగములు, ఉదరవ్యాధి, వాతరక్తము, భగందరము, ఉపదంశము, అతిసారము, గ్రహణి, అర్శస్సు, జిగటువిరేచనములు, వీటినిహరించును. ఈ శూలకులకంటకము మహేశునిచే చెప్పబడెను.

## అర్ధనారీశ్వరం

శ్లో॥ సువర్ణం పారదంమ్లేచ్ఛం మాక్షికం చమనశ్శిలా । ఏతాని సమభాగేన మర్దితం ఖల్వమధ్యకే । శ్వేతతృణరసే భాండే స్థాప్యం ద్వియామకంతథా । డోలాయంత్రేపచేత్సమ్యక్ తచ్ఛేషరస భావితం । మేషక్షీరాను పానేనసర్వ జ్వరనివారణం । దక్షిణ స్తన్యానుపానాత్తత్పార్శ్వ జ్వరనాశనం । వామ స్తన్యాను పానేన వామపార్శ్వ జ్వరం హరేత్ । అర్ధనారీశ్వరో నామరసోయం సర్వరోగజిత్ ॥

వ్యా॥ సువర్ణభస్మ, శు. రసము, శు. ఇంగిలీకము, మాక్షికభస్మ, శు. మణిశిల, ఇవి సమ భాగములు ఖల్వమందుంచి నూరుకుని, డోలాయంత్రమందు తెల్లగరిక రసముచే రెండు ఝాములు వండుకుని మిగిలిన రసముచే భావనచేసుకొని మేకపాలతో యిచ్చిన సమస్తజ్వరములను హరించును. కుడివైపు స్తన్యముతో యిచ్చిన కుడిపార్శ్వ జ్వరమును, ఎడమ స్తన్యముతో యిచ్చిన ఎడమపార్శ్వజ్వరమును, హరించును. ఈ అర్ధనారీశ్వరరసము, సమస్తవ్యాధులను హరించును.

## ప్రమేహగజకేసరీ రసమ్.

శ్లో॥ హింగుల సంభవంసూతం బలిరాఖువిమర్దితః । తయోర్ద్విగుణితం కాంతం కన్యారసవిమర్దితం । అభ్రకం వంగకం రౌప్యం ఖర్పరం మాక్షికంతథా । సమంసర్వం సువర్ణంచ ప్రత్యేకంచ రసార్ధకం । తత్సర్వం కన్యకాద్రావైర్మర్దయేద్భావయేత్తతః । క్షేకపర్ణీ రసేనైవ

గుంజాద్వయవటీంతతః । సితయాభక్షయేచ్చాపి సోమరోగనివృత్తయే । ప్రమేహాన్వింశతింహాంతి బహుమూత్రంచ దారుణం । బహుదోషం బహువిధం ప్రమేహం మధుసంజ్ఞకం। అస్థిమేహమిక్షుమేహంలాలామేహం వినాశయేత్ । వాతికంపైత్తికంచైవ శ్లైష్మికం సోమరోగకం ! నాశయేచ్చ సర్వవ్యాధీన్ మేహగజకేసరీయం॥

వ్యా॥ ఇంగిలీకములోనుంచి తీసినరసము 1 భా. శు. గంధకము 1 భా. వీటిని ఎలుకచెవికూరరసముచె మర్దించి కాంతభస్మ, 4 భా. కలుపుకుని కలుబందరసముచె మర్దించుకుని, అభ్రకభస్మ, 4 భా. వంగభస్మ, 4 భా, శు. కపురి 4 భా. మాక్షీకభస్మ, 4 భా. సువర్ణభస్మ 1 భా. ఇటుల వీటిని కలుపుకుని కలుబందరసముచె మర్దించుకుని మండూకపర్ణీరసముచె భావనచేసుకుని రెండుగురిగింజల ప్రమాణముమాత్రలుచేసుకుని పంచదారతో సేవించిన సోమరోగము, వింశతిప్రమేహములు, కఠినమయిన బహుమూత్రము, బహుదోషములు కలిగిన అనేక విధములయిన మధుమేహము, అస్థిమేహము ఇక్షుమేహము లాలామేహము వాతికపైత్యకశ్లేష్మికసోమరోగమువీటినినశింపజేయును. ఈ మేహ గజకేసరి సమస్త వ్యాధులను నశింపజేయును.

## కఫకుఠారరసం

వ॥ శుద్ధిచేసిన వెండి వక తులమును శుద్ధిచేసిన రాగి వకతులమును, ప్రత్యేకముగా గొట్టములు చేయించి శు, రసము 1 తు. శు. గంధకము 1 తు, ఈ రెంటిని నూరుకుని పై వెండి గొట్టములో పోసి అదిమి పైరాగిగొట్టమును, ఈ వెండి గొట్టమునకు బోర్లించి తోడిగి, గోధుమపిండితో రెండు మూడు పర్యాయములు కవచమిచ్చి ఆరినపిదప మెత్తని మన్నుతో శీలమన్నులిచ్చి బాగా ఆరనిచ్చి దానిని వకక్రొత్తకుండలో వుంచి పైన ఇసుకపోసి పొయ్యిమీదపెట్టి దీపాగ్నిచే నాలుగు ఝాములు వండిన పిదప ఆ ఇసుకమీద గడ్డిపరకలు వేస్తే కాలిపోవును అప్పుడు ఔషధము తయారు అయినదని గ్రహించి మంటనుతీసి చల్లారిన పిదప తీసి పైన యిచ్చిన కవచములు చక్కగా తీసివేసి ఆ వెండి గొట్టము, రాగిగొట్టము, అంతయు కలియనూరితే భస్మమగును. దీనిని వీసమెత్తు యిస్తే శ్లేష్మములు, దగ్గు, వగర్పు, వాతవ్యాధులు, శ్లేష్మవ్యాధులు, మొదలగునవి పోవును.

## శ్లేష్మాంతక రసం

శ్లో॥ మృతసూతాభ్రకం భస్మ హేమార్కం తీక్ష్ణభస్మకం । మాక్షికంతాలకంగంధం మర్దయేత్తుల్యభాగకం ।వజ్రవల్లీరసేనైవ తులసీ చిత్రకాంబునా । వటకాన్ ఛాయయాశుష్కాన్ అనుపానవిశేషతః । త్రిగుంజాందాపయే ద్వైద్యో శ్లేష్మ కోపేవిశేషతః । శ్వాసేషుచ సమస్తేషు కాసరోగేత్రధైవచ । క్షయేపాండౌతథా శూలేవాతశ్లేష్మగదేషుచ । శ్లేష్మాంతకరసోనామా సూర్యవాక్యార్య భాషితం ॥

వ్యా॥ రసభస్మ, అభ్రకభస్మ, సువర్ణభస్మ, తామ్రభస్మ, తీక్ష్ణలోహభస్మ, మాక్షికభస్మ, శు. తాళకము, శుగంధకము, ఇవి సమభాగములు, నల్లేరు, తులసి, చిత్రమూలము, వీటిచేమర్దించి ఉప్పులు కట్టుకుని, అనుపానవిశేషములచే మూడు గురిగింజల ప్రమాణము శ్లేష్మప్రకోపము, సమస్తశ్వాసలు, కాసక్షయ, పాండు, శూల వాతవ్యాధులు, శ్లేష్మవ్యాధులు, వీటియందు యివ్వవలయును, శ్లేష్మాంతకరస మనెడి యిది సూర్యునిచే చెప్పపడెను,

## బడబానల రసం

సీ॥ రసకాంత హాటకాభ్రక హేమమాక్షిక తామ్రభస్మంబులు తాళకమును । నీలాంజనము శుద్ధనీరధీ ఫేనముల్ లవణపంచకమును లాలితముగ । సమభాగములు బొమ్మజెముడు పాలనునూరి దినము భూధర యంత్రముననువండి । తీసి యల్లపురసముచే దగనూరిననది మహాబడబానల మనగనెగడి । సకలరుజములను మాన్పును శకటదనుజ గర్వపర్వత శంభవిక్రమ విడంబి । పిప్పలిమూల క్వాథమున పిప్పలినైనను మాషమాత్ర మింపరలగ । లోనికింగొనగ నుద్ధృతశృంఖల దండవాతముల్ । కుప్పున బాహుజాను కటిగుల్ఫధనుర్ధర పక్షవాతముల్ ॥

వ్యా॥ శు. రసము కాంతభస్మ, సువర్ణభస్మ, అభ్రకభస్మ. హేమమాక్షిక భస్మ తామ్రభస్మ, శు తాళకము, నీలాంజనము, సముద్రనురుగు, పంచలవణములు, ఇవి సమభాగములు బొమ్మజెముడుపాలచేనూరి భూధరయంత్రమందునకరోజువండి తీసి అల్లపురసముచే నూరిన మహాబడబానలమనబడును. ఇది సమస్తవ్యాధులను పోగొట్టును. మోడికషాయముచేగాని పిప్పళ్ళ కషాయముచేగాని మాషప్రమాణము సేవించిన కఠినమైన, శృంఖలావాతము, దండవాతము, బాహువాతము, జానువాతము, కటివాతము, గుల్ఫవాతము, ధనుర్వాతము, పక్షవాతము, వీటిని నివారింపజేయును,

## మహాబడబానలరసమ్

శ్లో॥ కాంతంచసూతం హరితాలగంధంసముద్రఫేనం లవణానిపం
చ । నీలాంజనంతుత్థకమేవరౌప్య భస్మప్రవాలానివరాటకంచ । వైక్రా
తశంబూక సముద్రశుక్తిసర్వాణిచైతాని సమానికుర్యాత్ । సూతంభవే
ద్ద్వాదశకంచసన్నిహ్యార్కదుగ్ధేన విమర్దయేచ్చ । దినత్రయంవహ్ని రసైస్త
తశ్చనివేశ యేత్తామ్రజసంపుటేతత్ । మృదాచసంలిప్య రసంపుటేత్తద్రస
స్తత స్స్యాద్బడబానలాఖ్యః । తద్పాదభాగేనవిషంనియోజ్య కృశానుతో
యేన దినంవిమర్ద్యతత్ । వాతప్రధానేచకఫప్రధానేనియోజయే త్ర్యూ
షణ చిత్రయుక్తం । దోషత్రయోత్థేపిచసన్నిపాతే వాతాధికత్వాద్వి
హానూతకోక్తః । అగ్నిమాంద్య మజీర్ణంచ అతిసారంచ శూలకం ।
ఆధ్మానంగ్రహణీమామంకుక్షిశూలంమహోదరం । నాశయేన్నాత్రసందే
హో సర్వవ్యాధి వినాశనః॥

వ్యా॥ కాంతభస్మ, శు. రసము. శు. తాళకము, శు. గంధకము, సముద్రనురుగు, పంచలవణములు, నీలాంజనము, శు. మైలతుత్థము, వెండిభస్మ, పగడభస్మ, గవ్వలభస్మ, వైక్రాంతభస్మ. నత్తగుల్లలభస్మ, ముత్యపుచిప్పలభస్మ, ఇవన్నియువకొక్కక భాగము, శు. రసము 12 భా, వీటిని జెముడుపాలు, జిల్లేడుపాలు, చిత్రమూలరసము వీటిచే మూఁడేసి రోజులుమర్దించి ఆమందు తామ్రపాత్రసంపుటమందుంచుకొని మట్టిచే పూసుమని పుటముపెట్టుకునిన, బడబానలరసమనబడును. మందును నాలగవభాగము శు. నాభికలుపుకునిచిత్రమూలరసముచేవకరోజుమర్దించి త్రికటుకములు, చిత్రమూలములతో వాత ప్రధానవ్యాధులయందును, కఫప్రధాన వ్యాధులయందును, యిచ్చుచునేది. సన్నిపాతము మూడుదోషములవలన పుట్టినను వాతము ప్రధానముగావుండుటవలన ఈ మందు బాగుగపనిచేయును. మరియు అగ్నిమాంద్యము, అజీర్ణము, అతీసారము శూల కడుపుఉబ్బరము, గ్రహణీ, ఆమము కడుపునొప్పి, మహోదరము, వీటినితప్పక నివారింపజేయును. సమస్తవ్యాధులనుకూడ నశింపజేయును.

## శూల విధ్వంసన రసం

శ్లో॥ టంకణం జారితం స్వర్ణం శుల్బంశంఖం మృతంరసం। దినైకం
చార్ద్రకద్రావై ర్ [illegible] రుద్ధ్వాపుటేపచేత్ । శూల విధ్వంసనో నామా
అసాధ్యం శ్వయథుంజయేత్ । శూల గుల్మ మధార్మాంసినాశయ
శు దేహినాం॥

వ్యా॥ హ. వెలిగారము, సువర్ణభస్మ, తామ్రభస్మ, శంఖభస్మ, రసభస్మ ఇవిసమ భాగములు, అల్లపురసముచే వకరోజుమర్దించి మూషళ్ళయందుంచి పుటమువేసుకు నేది. ఈ శూల విధ్వంసనము, అసాధ్యమైన నంజు శూల, గుల్మము మూలరోక, వీటిని హరింపజేయును.

# శంఖచూల రసం

శ్లో॥ రసాభ్రహేమ భస్మాని వైక్రాంతం సర్వతుల్యకం । సర్వైః పంచగుణం శంఖచూర్ణం శుష్కంవిమర్దయేత్ । లేహయేన్మధునామాష చతుష్కం సానుపానకం । హిక్కాం పంచవిధాంహంతి ముమూర్షోర రపి తత్ క్షణాత్॥

వ్యా॥ రసభస్మ, అభ్రకభస్మ, సువర్ణభస్మ ఇవి సమభాగములు వీటి అన్నిటికి సమానము వైక్రాంతభస్మ, అన్నిటికి అయిదురెట్లు శంఖభస్మ వీటిని పాడిగా నూరు కుని నాలు మాషముల ప్రమాణముతేనెతో అనుపానముతో యిచ్చిన మరణసంసిద్ధు నియొక్క కూడ అయిదువిధములైన ఎక్కిళ్ళను వెంటనే హరించును.

# పంచామృత రసం.

శ్లో॥ భస్మీభూతసువర్ణతారదినకృత్ కృష్ణాభ్రసూతైః క్రమాత్ ।ప తేషాంఖలుభాగవృద్ధిరపి తత్ కృత్వా శుభాంకజ్జలీం । నిర్గుండీదశమూల వహ్నిరజనీ వ్యోషార్ద్రకైర్భావితం । గోలీకృత్య విశోష్యతన్నిగదితః పంచామృతస్స్యాద్రసః । నానేనసదృశఃకోపినాస్త్యేవభువనత్రయే। నిహంతి సకలాన్ రోగాన్ భవరోగమివాచ్యుతః । అయంపంచామృతోన్ఱ్రాణాం త్రిదశానామివామృతం॥

వ్యా॥ సువర్ణభస్మ, 1 భా. రజితభస్మ, 2 భా. తామ్రభస్మ, 3 భా. అభ్రక భస్మ, 4 భా. రసభస్మ 5 భా. వీటిని నూరుకుని, వావిలి, దశమూలములు, చిత్రమూలము, పసుపు, త్రికటుకములు, అల్లము, వీటిరసములచే భావనచేసి కుప్పెలుకట్టుకొని ఆరనిచ్చుకొనవలయును. ఇదిపంచామృతరసమని చెప్పబడును. మూడులోకములయందును దీనితోసమానమైన మందులేదు. విష్ణువు సంసారరోగమును హరించురీతి సకలవ్యాధులను హరించును. ఈ పంచామృతరసము అమృతము దేవతులకువలె మనుష్యులకు అమృతతుల్యమగును.

# కుష్ఠప్రలయ రసం

శ్లో॥ మృతంసూతంగంధకంచచూర్ణంకృత్వాతుకజ్జలీం । కజ్జలే

నచ భాగేన షోడశాంశంచతామ్రకం । ఖల్వమధ్యేవినిక్షిప్యమర్దయేంచా మృతవారిణా । పుటందేయంసూర్యవర్ణం చంద్రవర్ణంచ సంభవం । ఉదుంబరేణసంయుక్తం కుష్ఠమష్టాదశంజయేత్ । అనుపానవిశేషేణసర్వ రోగవినాశనం॥

వ్యా॥ రసభస్మ, శు, గంధకము, వీటిని చూర్ణించి కజ్జలిచేసి ఈ కజ్జలికి 16 వ భాగము తామ్రభస్మ, కలుపుకొని, ఖల్వమందుంచుకొని తిప్పతీగ రసముచే మర్దించుకొని పుటమువేసిన సూర్యచంద్రవర్ణ తుల్యంబుగ నుండును. దీనిని మేడిచూర్ణముతో పుచ్చుకొనిన పదునెనిమిదికుష్టులను జయించును. అనుపానవిశేషముచే సమస్తవ్యాధులను హరించును.

## కుష్ఠకుఠారరసం

శ్లో॥ శుల్బ స్యగగనస్యాపి హేమధాతో రథాపివా । సమాంశకం పిష్టకం కృత్వా అంధమూషానివేశితం । నింబ పంచాంగ సంయుక్తం కుష్ఠమఖిలంచజయేత్ । కుష్ఠకుఠారనామాయం శంభునా పరికీర్తితం॥

వ్యా॥ తామ్రభస్మ, అభ్రకభస్మ, సువర్ణభస్మ, ఇవి సమభాగములునూరి అంధమూషయందుంచి పుటమువేసికొని పంచనింబములతో సేవించిన సమస్తకుష్ఠువులను, జయించును. ఈ కుష్ఠకుఠారరసము, విష్ణువుచే చెప్పబడెను.

## శూలకుఠారం

శ్లో॥ రసభస్మం అభ్రలోహం కాంతం నాగంచవంగకం।ప్రవాలం, రజతం తామ్రం వరాటంశంఖ శృంగకం । పారదంగంధకంనా భీదరదం తాలకంశిలా । సర్వేసమం వినిక్షిప్య వహ్నిమూలరసేనచ । జంబీరార్ద్ర రసేనైవ దినైకం మర్దయేత్ పృథక్ । ఘూమానిర్గమనం చైవదృఢ మృద్వస్త్ర లేపనాత్ । ద్వియామండోల కాయంత్రే పాచయేద్వహ్ని కషాయకైః । సాంగశీతల మాదాయ ఖల్వమధ్యే వినిక్షిపేత్ । వజ్రవల్లి ఆర్ద్రివహ్ని త్రిదినం మర్దయేద్దృఢం। గులికాన్ కారయేచ్చైవ ఛాయాశుష్కాన్ చకారయేత్ । గోఘృతస్యాను పానేనద్వి గుంజం భక్షయేత్సుధీః । అజీర్ణం అరుచింవాంతిం గ్రహణీం మష్మపిత్తకం । కాసంశ్వాసం కఫంచైవ వాతవ్యాధీన శేషతః। అనుపాన విశేషేణ సర్వ

శూల నివారణం । మైలసత్వప మమ్లంచ త్రికమిత్యాది వర్జయేత్ ।
శూలకుఠారనామ్నాయం రాధానాథప్రకల్పితః ॥

వ్యా॥ రసభస్మ, అభ్రకభస్మ, లోహభస్మ, కాంతభస్మ, సీసభస్మ, వంగభస్మ, పగడభస్మ, రజితభస్మ, తామ్రభస్మ, గవ్వలభస్మ, శంఖభస్మ, శృంగభస్మ, శు. పాదరసము, శు. గంధకము, శు. నాభి, శు. ఇంగిలీకము శు. తాళకము, శు., ఇవన్నియు సమభాగములు ఖల్వమందుంచి, చిత్రమూలము, నిమ్మకాయలు, అల్లము, వీటి రసములచే వక్కొక్క రోజు మర్దించి పంచని మూస మూసి పైన మేసంపుటమట్టి గుడ్డలచే దృఢముగా సంధిబంధనము చేసి డోలాయంత్రమున చిత్రమూలకషాయముచే రెండుఝాములు వండుమని, స్వాంగశీతలమున తీసి ఖల్వమందుంచి, సన్నెరు అల్లము, చిత్రమూలము, వీటిరసములచే మూడు దృఢము మర్దించి పప్పులుకట్టుకుని రెండుగురిగింజలప్రమాణము, ఆవునెయ్యి అనుపానముతో పుచ్చుకొనిన అజీర్ణము, అరుచి, వాంతి, గ్రహణి, అమ్లపిత్తము, దగ్గు, ఉబ్బసము, కఫవ్యాధులు, వాతవ్యాధులు వీటిని హరించును. అనుపాన విశేషముచే సమస్తశూలలను హరించును దీనిని సేవించునప్పుడు, మూనె, ఆవ, పులుసు, మజ్జిగ, మెంతులగునవి వర్జించవలయును ఈ శూలకుఠారము, కృష్ణునిచే చెప్పబడెను.

# సూతికాభరణం

సీ॥ తాళకంబును నాభి తామ్రము మణిశిల పార్వతీంద్రియము పారదమును । అమృతవంగము లోహమభ్ర నాగంబును హేమటంకణ కాంతహింగులమును । శుంఠి పిప్పలి మిరియ శుద్ధ నేపాలంబు త్రాక భస్మము నీలితప్పిటమును । శంఖతుత్థక్షార జాతీఫలంబును మత్స్యకూర్మ మయూర మహిషమేకరి । ఛాగశార్దూలంబు శశ గైధిక చేదుల సమభాగములు గూర్చి సంఖ్యతోను । ఖల్వంబులోనుంచి ఘనమేఘనాదంబు చిత్రార్ద్రజంబీరశ్రీ తులసిని । అయిదుదినంబులు మర్దింప అమృతమగును మాషమాత్ర ప్రమాణంబు మాత్రగొనిన । సూతికావాత సర్వాంగ శుష్కవాత పక్షవాతంబులు పారిపోను । సూతికాభరణ మిదియును శుభము కలది॥

వ్యా॥ శు తాళకము, శు. నాభి తామ్రభస్మ, శు. మణిశిల, శు. గంధకము, శు. రసము, గరళము, వంగభస్మ, లోహభస్మ, అభ్రకభస్మ, సీసభస్మ సువర్ణభస్మ పొ, వెలిగారము, కాంతభస్మ శు ఇంగిలీకము, శుంఠి, పిప్పళ్ళు, మిరియాలు, పెద్ద నేపాళములు, రజితభస్మ, నీలిమందు, శంఖభస్మ. శు. మైలతుత్థము, యవక్షారము. జాజికాయలు, ఇవియు, చేప, తాబేలు, నెమలి, దున్నపోతు, మొసలి, మేక,

పుల్లి, చవలపిల్లి, ఉడుము, వీటియొక్క చేదులు ఇవన్నియు సమభాగములు ఖల్వమం దుంచి, తుంగడ్డలు, చిత్రకూర, చిత్రమూలము, అల్లము, నిమ్మకాయలు, తులసి, వీటి రసములచే అయిదురోజులు మర్దించిన అమృతతుల్యమగును. ఇది మూషప్రమాణము ప్రచ్ఛమనిన, సూతికావాతములు, సర్వాంగవాతము, శుష్కవాతము, పక్షవాతము, ఇవి పోవును. ఈ సూతికాభరణము శుభమును జేయును.

# వంటసూతికాభరణం

శ్లో॥ మృతాభ్రం హేమవైక్రాంతంతీక్ష్ణంతామ్రామృతంసమం। వారదంగంధకంరౌప్యం నాగంవంగంసమంసమం । సర్వం నిర్గుండికా ద్రావైర్మర్దయేత్ ఖల్వకేతతః । భృంగీపునర్నవాపాఠా చిత్రకం వాస కామృతా । తులసీఅర్కదుత్తూరముండీజంబీరలాంగలీ । కుమారీకారవల్లీ చపభిర్ద్రావైశ్చ మర్దయేత్ । కాచకుప్యాంతరే క్షిప్త్వా విలేప్యవస్త్ర మృత్తికాం । దినైకం వాలుకాయంత్రే పచేన్నిత్యాథచూర్ణయేత్ । మత్స్యస్యవరాహస్య కమఠీమాహిషస్యచ । మయూరస్య ఫణేశ్చాపి కుక్కుటఛాగదంతినాం । గైధికాశ్వకపోతంచ మకరాణాంచపిత్తకైః । భావయేత్పూచికాగ్రేణభక్షయే త్సూతికాగదే । ప్లీహంగుల్మోదరం పైత్యం గ్రహణీమతిసారకం । ధనుర్వాతం కంపవాతం హిక్కాబధిర మూకతాం । కాసంశ్వాసమపస్మారం విభ్రమంసన్నిపాతకాన్ । తత్క్ష ణేననిహంత్యాశు ఇచ్ఛాపథ్యం ప్రదాపయేత్ । నారికేలోదకందాహే దధ్యన్నంచప్రదాపయేత్ । తృష్ణార్తేశీతలం నీరమిక్షుఖండానిభక్షయేత్। సూతికాభరణంనామ రసోయం సర్వరోగజిత్ ॥

వ్యా॥ అభ్రకభస్మ, సువర్ణభస్మ, వైక్రాంతభస్మ ఖడ్గలోహభస్మ, తామ్రభస్మ శు. నాభి. శు. పాదరసము, శు. గంధకము, రజతభస్మ, సీసభస్మ, వంగభస్మ ఇవి సమభాగములు, ఖల్వమందుంచి, వావిలి, గుంటగలగర, గలిజేరు, చిరుబొద్ది, చిత్ర మూలము, అడ్డసరము, తిప్పతీగ, తులసి, జిల్లేడు, ఉమ్మెత్త బోడసరము, నిమ్మకా యలు, చన్నచర్లదుంప, కలుబంద, కాకర, వీటిరసములచే మర్దించి కాచ కుప్పెయం దుంచి మట్టిచే పూయబడిన వస్త్రముచుట్టి వకరోజు వాలుకాయంత్రమందు వండితీసి చూర్ణముచేసి, చేప, అడవిపంది, తాబేలు, దున్నపోతు, నెమలి, తాచుపాము కోడి మేక, ఏనుగు, ఉడుము, గుర్రము, పావురము, మొసలి, వీటియొక్క పిత్తములచే భావనచేసి సూదికొనకు వచ్చినంతమందు యిచ్చిన, సూతికావ్యాధులు ప్లీహము. గు ల్మము, ఉదరవ్యాధి, పైత్యవ్యాధులు, గ్రహణి, అతిసారము, ధనుర్వాతము, కంపవాత ము. ఎక్కిళ్ళు, చెముడు మూగ, దగ్గు వగర్పు, అపస్మారము భ్రమ, సన్నిపాతములు,

వీటిని వెంటనే నశింపజేయును. ఇచ్ఛా పథ్యముచేయించవలయును. వేడిచేసి శరీరతాపను కలిగినయడల, గొబ్బరికాయనీళ్ళు, పెరుగుఅన్నము, యివ్వవలయును. దప్పిక కలిగినయెడల, చల్లటినీళ్ళు, చెరుకుముక్కలు, యివ్వవలయును. సూతికాభరణము వెడి ఈ మందు సర్వరోగములను జయించును.

## లఘుసూతికాభరణం

వ॥ రసభస్మ, గరళము, శు. వత్సనాభి, తామ్రభస్మ, మెలతుత్థము, ఇవి చిత్రమూలరసముచే నూరుకుని మత్స్యపిత్తముచే భావన చేసుకుని సూదికొనకు వచ్చినంతయిచ్చిన, సూతికా వాతములు సూతికాజ్వరములు, సన్నిపాతములు, వాతవ్యాధులు, శ్లేష్మవ్యాధులు, పోవును.

## సువర్ణాది సూతికాభరణం

సీ॥ సువర్ణ అభ్రకగంధక లోహముల్ నాభియు తామ్రంబు నాగభస్మ వంగభస్మ। వైక్రాంతము రసము నివి యన్నియు సమముగగూర్చి నిర్గుండికాకర నిమ్మరసము। గలిజేరు గుంటగలగర చిత్రమూలము తులసి జిల్లేడుకలుబంద। బోడతరము చిరుబొద్ది పొత్తిదుంప తిప్పతీగ వీట్లరసములచే మర్దనముచేసి। కాచకుప్పెలో నునిచి వండితీసి చూర్ణముచేసి। సూకరమాయూర కుక్కుటకాకోదరమహిష తురగ। నరచేదులువేసి నూరిననది సూతికాభరణంబు ధరిత్రిన్ ॥

టీ॥ సువర్ణభస్మ, అభ్రకస్మ, శు. గంధకము, లోహభస్మ, శు. నాభి, తామ్రభస్మ, సీసభస్మ, వంగభస్మ, వైక్రాంతభస్మ, శు, రసము, ఇవన్నియుసమభాగములు గ్రహించి, వావిలి కాకర, నిమ్మకాయలు, గలిజేరు, గుంటగలగర, చిత్రమూలము తులసి, జిల్లేడు, కలుబంద, బోడతరము, చిరుబొద్ది, పొత్తిదుంప, తిప్పతీగ, వీటిరసములచే, మర్దించి, కాచకుప్పెయందుంచి వండుకునితీసి చూర్ణముచేసి అడవిపంది నెమలి కోడి, గద్ద, దున్నపోతు, గుర్రము, మనిషి, వీటియొక్క చేదులుచేర్చి నూరినయడల ఇది సూతికాభరణమనబడును.

## అమృతసూతికాభరణం

శ్లో॥ సూతంవంగంచ తారాబలి కనకయుతం నాగవజ్రంసమాంశం। భాగోత్తత్సర్వ ఫేనం విషగరళయుతం ధూర్తతోయేన భావ్యః। మాయూరం మత్స్యపిత్తం అజమహిషయుతం దైవి కేమానుషేనా

నామ్నా సూతాఖ్య్య భరణో ముని కథితయుతం ప్రాణినాం జీవితాఖ్యే। అనుపానవిశేషేణ దేయం గుంజాప్రమాణతః । సూతికాశూలగుల్మంచ పక్షకంప తిమిరంజయేత్ । శ్లేష్మికం వాతికంవాపి వ్యాధినాశనముత్తమం । విషజ్వరం సన్నిపాతం నానాదోషనివారణం॥

వ్యా॥ శు, రసము, వంగభస్మ, రజతభస్మ, శు. గంధకము, సువర్ణభస్మ, సీస భస్మ,వజ్రభస్మ, శు. నల్లమందు, శు,నాభి, గరళము, ఇవిసమభాగములు ఉమ్మెత్తరస మునే భావనజేసి, నెమలి, చేప మేక, దున్నపోతు, వీటిపిత్తములను కలుపుకునిన సూతికాభరణమనబడును. ఇది ప్రాణులయొక్క జీవనమునిమిత్తము మునీశ్వరులవల్ల చెప్పబడెను. అనుపానవిశేషముచే గుంజాప్రమాణముయిచ్చినసూతికావ్యాధులు, శూల గుల్మము, పక్షవాతము కంపవాతము తిమిరవాతము, శ్లేష్మవ్యాధులు, వాతవ్యాధులు, విషజ్వరము, సన్నిపాతము సమస్తదోషములను నివారింపజేయును.

## విషసూతికాభరణం

శ్లో॥ పారదాభ్ర తారతామ్ర గంధతాళకం శిలా । హాటక ప్రవాలహేమమాక్షికంచ భస్మ మౌక్తికం। తీక్ష్ణలోహ మశ్మసార కాంతలోహకంబుకం । వైక్రాంత తుత్థనాభకరసాంజనం సమభాగికం యథా । నిత్యనాథసిద్ధవేదితం మర్ద్యం త్ర్యహః పరం । మాషబీజ మాత్రకైశ్చ కాచకూప్యపూరితం। వాలుకానుయంత్రకేన పాచితం దినత్రయం । సాంగశీతల మౌషధం సతుల్యవత్సనాభకం। మర్దయే త్తూర్మ్యబర్హిమకరసర్పపిత్తకైః । ఛాగమాహిషవారాహకుక్కుటైర్గైధిక పిత్తకైః। దంతిబీజకచిత్రమూలకరసేనచ భావయేత్ । సింధువార భృంగకైశ్చ నింబనీరపేషితం। వల్లమాత్ర మౌషధంచ సర్వరోగ శాంతయే । సూతికాది వాతరోగ శ్లేష్మరోగశాంతయే। సూతికా భరణ యోగనామ మంత్రిజేన కథ్యతే॥

వ్యా॥ శు.రసము, అభ్రకభస్మ, రజతభస్మ, తామ్రభస్మ శు.గంధకము, శు.తాళ కము, శు.మణిశిల, సువర్ణభస్మ, పగడభస్మ, హేమమాక్షికభస్మ, మౌక్తికభస్మ, ఖడ్గలోహభస్మ ఇనుపభస్మ, కాంతభస్మ, శంఖభస్మ, వైక్రాంతభస్మ, శు. మైల తుత్థము, శు. నాభి, రసాంజనము, ఇవి సమభాగములు గ్రహించి మూడు రోజులు మర్దించి మినపగింజలంత మాత్రలుచేసి కాచకుప్పెయందుంచి, వా లుకాయంత్రమందు మూడురోజులు వండుకుని చల్లారినపిదపతీసి అమందుకుసమ భాగము శు నాభి, కలుపుకుని, తాబేలు, నెమలి, మొసలి, తాచుపాము, మేక దున్న

పాతు, అడవిపంది, కోడి ఉడుము, వీటియొక్క పిత్తములచేతను, శు. నేపాళపుగింజలు, చిత్రమూలము, వీటిరసములచేతను భావనచేసుకొని వాని, గుంటగలగర, నేపచక్క, వీటిరసములచే మర్దించుకొను, వల్లప్రమాణము మందును సేవించిన, సమస్తరోగములు, సూతికావాతము మొదలగు వాతివ్యాధులు, శ్లేష్మరోగములు, వీటిని శాంతి పొందించును, మంత్రిజునిచే చెప్పబడిన, సూతికాభరణ మనుపేరును,

## పాషాణ సూతికాభరణం

శ్లో॥ రసహింగులతాలంచ కాంతం కనకమభ్రకం । మాక్షికం కునటీగంధం తామ్ర నేపాళ తుత్థకం । సైంధవం ఆఖుపాషాణం పిప్పలీ మరిచటంకణం । సర్వైస్సమాంశ మమృతం మర్దయే చ్చిత్రకాంబునా। వటికాశ్చ ఘటేక్షిప్త్వా రుధ్వా యామ చతుష్టయం । సాంగశీతల ముద్ధృత్య పాదాంశం మంచామృతం । యథా సంభావితో గరలం మహిషీ పిత్తమర్దితం । సూచికాగ్ర ప్రవర్తేన జిహ్వామధ్యే ప్రదాపయేత్ । సన్నిపాతం మహాఘోరం శీఘ్రం జయతి నిశ్చయం । సర్వాంగ వ్యాపకం వాతం సూతికారోగమేవచ । పిత్తజనితతాపేతు స్నానం యథేష్టవారిణా । నారికేళజలం దద్యాత్ శీతంచందన లేపనం । ఇక్షుఖండఫలైర్భక్ష్యం తక్రభక్తం యథేప్సితం । బ్రహ్మాస్త్రరస విఖ్యాతం సూతికాభరణనామకం॥

వ్యా॥ శు.రసము, శు. ఇంగిలీకము, శు, తాళకము, కాంతభస్మ, సువర్ణభస్మ, అభ్రకభస్మ, మాక్షికభస్మ శు. మణిశిల, శు.గంధకము, తామ్రభస్మ శు. నేపాళములు, శు.మైలతుత్థము, సైంధవలవణము, ఉల్లిపాషాణము, పిప్పళ్లు, మిరియాలు, శు, టంకణము, ఇవిసమభాగములు, వీటి అన్నిటితోను సమానము శు.నాభి, వీటినన్నిటిని చిత్రమూలరసముచే మర్దించి మాత్రలుచేసి కుండయందుంచి పైనమూకుడుమూసి సంధిబంధనముచేసి నాలుగు ఝాములువుడుకుం చల్లారినపిదప తీసి ఈమందుకు నాలగవభాగము, మిరియాలు, శు. నాభి, గరళము; ఇవికలుపుకొని గేదె పిత్తముచే మర్దించుని సూదికొనకువచ్చినంతిమందును నాలుకమధ్యయందుంచిన, మహాఘోరమైన సన్నిపాతము, సర్వాంగవాతము, సూతికారోగములు వీటిని వెంటనేజయించును. ఈమందువలన తాపముకలిగినయడల, ఇష్టమువచ్చినట్లు స్నానముచేయించవలయును. గొబ్బరికాయనీళ్ళు, చల్లటినీళ్ళు, యివ్వవలయును, మంచిగంధలేపము, చేయించవలయును. చెరుకుముక్కలు, ద్రాక్షమొదలగు పండ్లు మజ్జిగఅన్నము, ఇవి కావలసినంత యివ్వవలయును. ఈ సూతికాభరణమునకు, బ్రహ్మాస్త్రరస మని కూడా పేరుకలదు,

## రసామృత రసం

సీ॥ నాగముతార తామ్రములు నాభియు మాక్షిక దంతి బీజ ముల్ । బాగుగ నింగిలీకమును పారద గంధక వంగముల్ । సమముగా గని శృంగవేరమున గట్టిగ నూరియు సేవచేసినన్ । వేగమె సన్నిపాత ములు వేకులువాతము లాదియౌ మహా । రోగములన్ హరించు నిది । రూఢి రసామృతమందు రచ్యుతా॥

వ్యా॥ సీసభస్మ, రజతభస్మ, తామ్రభస్మ, శు. నాభి, మాక్షికభస్మ, శు. నేపాళపువిత్తులు, శు, ఇంగిలీకము, శు. రసము, శు. గంధకము, వంగభస్మ, ఇవిసమ భాగములు గ్రహించి అల్లపురసముచే గట్టిగనూరి సేవించిన, సన్నిపాతములు, వాత వ్యాధులు, మొదలగు మహారోగములను, వెంటనే హరించును. దీనిని రసామృతరస మందురు.

## ప్లీహాంతక రసం

శ్లో॥ హాతశుల్బంచ తారంచ గగనాయసమౌక్తికం । దరదం శంఖకం సూతం గంధకం నవమంతథా । గుగ్గులు త్రికటూరాస్నా ఇంద్ర వారుణకం తథా । త్రిఫలా కటుకాదంతీ దేవదారీతు సైంధ వం । త్రివృతం చయవక్షారం వాతారీ తైలమర్దితం । అష్టోదరాణి పాండుత్వ మానాహం విషమజ్వరం । అజీర్ణమమ్లపిత్తంచ కఫంచ సర్వ శూలకం । కాసంశ్వాసంచ శోఫంచ సర్వమాశు వ్యపోహతి । ప్లీహాం తకరసోనామ ప్లీహోదర వినాశనః । యకృద్వ్యాధి వినాశశ్చ మల బంధం తథైవచ॥

వ్యా॥ తామ్రభస్మ, రజతభస్మ, అభ్రకభస్మ, అయస్కాంతభస్మ, ముత్యభస్మ, శు. ఇంగిలీకము, శంఖభస్మ, శు. రసము, శు.గంధకము, శు. గుగ్గులు, త్రికటుకములు, సన్నరాష్ట్రము, చెదుపుచ్చకాయ, త్రిఫలములు, కటుకరోహిణి, శు. నేపాళములు, దేవదారు, సైంధవలవణము, తెగడ, యవక్షారము, ఇవి సమభాగములు గ్రహించి ఆము దముచే మర్దించుచును సేవించిన ఎనిమిది ఉదరములు, పాండువు, కడుపుఉబ్బరము, విషమజ్వరము, అజీర్ణము, అమ్లపిత్తము, కఫవ్యాధులు, సమస్తశూలలు, కాస, శ్వాస, నంజు, ప్లీహోదరము, యకృద్వ్యాధులు, విరేచనబద్ధకము,వీటినన్నిటిని ఈప్లీహాం తకరసము, వెంటనే నశింపజేయును.

## గ్రహణీకుఠార రసం.

శ్లో॥ రసగంధకయోశ్చాపి కర్షమేకం సుశోధితం। ద్వయోః కజ్జలికాం కృత్వా హాటకం షోడశాంశకం। లవంగం నింబపత్రంచ జాతీకోశ ఫలే తథా। ఏతేషాం కర్షచూర్ణేన సూక్ష్మైర్మేలాం సహమేల యేత్। ముక్తాగృహేచ సంస్థాప్య పుటపాకేన సాధయేత్। గుంజా పంచప్రమాణేన ప్రత్యహం భక్షయేన్నరః। సూతికా గ్రహణీరోగం హరత్యేష స్సునిశ్చితః। దుర్వారం గ్రహణీరోగం చామశూలంచ నాశయేత్। అర్శోఘ్నో దీపనంచైవ బలపుష్టి ప్రసాదనః। కాస శ్వా సాతిసారఘ్నో వీర్యవృద్ధికరఃపరః। సంసారలోకరక్షార్థం ఏవం రుద్రేణ భాషితః॥

వ్యా॥ శు. రసము 1 కర్షము శు. గంధకము 1 కర్షము, వీటిని కజ్జలిచేసి సువర్ణ భస్మ, 1/16 కర్షము, లవంగములు, వేపఆకు, జాపత్రి, జాజికాయ చిన్నయేలకులు ఇవి ఒక్కొక్క కర్షము వీటిని, ముత్యపుచిప్పలయందుంచి పుటపాకము చేసుకుని అయిదు గురిగింజల ప్రమాణము ప్రతిదినము సేవించిన, సూతికా స్త్రీయొక్క గ్రహ ణిరోగము, కఠినమైన గ్రహణిరోగము, ఆమశూల, అర్శస్సు, కాస, శ్వాస, అతిసా రము వీటిని హరించును. అగ్నిదీప్తి, బలము, శరీరపుష్టి, వీర్యవృద్ధి, వీటినిచేయును. సంసారములను రక్షించు నిమిత్తము ఈ ప్రకారముగా ఈశ్వరునిచే చెప్పబడెను.

## శూలాంతక రసం

శ్లో॥ టంకణం హారిణం శృంగం స్వర్ణం గంధం మృతంరసం। దినైకమార్ద్రిక ద్రావై ర్మర్ద్యం రుద్ధ్వా పుటే పచేత్। శూలాంతకరసో హ్యస్య మాషైకం మధుసర్పిషా। సైంధవం జీరకం హింగు మధ్వా జ్యంచ లిహేదను। సర్వశూలహరోఖ్యాతో యామమాత్రా న్నసంశ యః। అజీర్ణం పాకశూలంచ వాతశూల హరం తథా। ఆమాతిసారం గ్రహణీం అగ్నిమాంద్య మరోచకం॥

వ్యా॥ శు, వెలిగారము, లేడికొమ్ముభస్మ, సువర్ణభస్మ. శు, గంధకము, రస భస్మ, ఇవన్నియు సమభాగములు, అల్లపు రసముచే ఒకరోజు మర్దించి మూసలోనుం దుంచుకొని పుటము వేసికొనవలయును. ఈ శూలాంతక రసము మాషప్రమాణము తేనె, నెయ్యి, వీటితో పుచ్చుకుని సైంధవలవణము, జీలకర్ర, ఇంగువ, తేనె, నెయ్యి

వి అనుపానముగా పుచ్చుకొనిన, సమస్తశూలలను ఏక ఝామములో హరించును. అజీర్ణము పరిణామశూల, వాతశూల, ఆమము, అతిసారము, గ్రహణీ, అగ్నిమాంద్యము, అరుచి, వీటిని నివారింపజేయును.

## మహా శూలాంతక రసం

శ్లో॥ టంకణం శృంగకం గంధం సువర్ణం తామ్రకం పృథక్ । ఏకద్విత్రి చతుఃపంచ క్రమాచ్చ భస్మసూతకం । చాంగేర్యాశ్చ ద్రవైర్మర్ద్యం దినైకం గోలకీకృతం । గంధకం తామ్రపర్ణ్యాథ గోలకాంశం ప్రమర్దయేత్ । గోలకం లేపయేత్తేన తతోవస్త్రేణ వేష్టయేత్ । మృగాంకc పాచయేత్ స్థాల్యాం వాలుకాభిశ్చ పూరితే । ఉద్ధృత్య చూర్ణయేత్ శ్లక్ష్ణం శూలాంతక రసోత్తమః । మృగాంకవత్ క్షయంహంతి తద్వన్మాత్రానుసారతః । మహాశూలహరం ఖ్యాతం వాత పాకి శూలం తథా । ఆమశూలము దరజం సర్వవ్యాధిహరం తథా॥

వ్యా॥ పా. టంకణము 1 భా, శృంగభస్మ 2 భా, శు. గంధకము 3 భా, సువర్ణభస్మ, 4 భా, తామ్రభస్మ, 5 భా, రసభస్మ, 6 భా, ఇవి చాంగేరీరసముచే ఏకరోజు మర్దించి ఉండచేసి గోలకముతో సమానము శు. గంధకము, తామ్రపణీ రసముచే మర్దించి గోలకమునకు పూసి బట్టచేచుట్టి మృగాంకరసమువలె ఇసుకపోసిన కుండయందు నంపుటపని, తీసుకుని మెత్తగనూరుకొనవలయును. ఈ శూలాంతకరసము, మృగాంకరసమువలె క్షయను హరింపజేయును. మాత్రాభేదముచే మహాశూలలు, వాతశూల, పరిణామశూల, ఆమశూల, ఉదరశూల, వీటిని హరించుటయేగాక సర్వవ్యాధులను హరించును.

## గ్రహణీరిపు రసం

శ్లో॥ ముక్తాసువర్ణం రసగంధటంకం అభ్రంకపర్దో మృతతుల్యభాగః । సర్వైస్సమం శంఖకచూర్ణమత్ర ఖల్వేచభావ్యోతి విష్ణాదవేణా । గోలంచకృత్వా మృదుకర్పటస్థం సంపాచ్యభాండే దివసార్ధకంచ । సర్వాంగశీతో రసపషభావ్యో దుత్తూరవహ్ని ముసలీద్రవైశ్చ । లోహాస్యపాత్రే పరిభావితంచ సిద్ధోభవేత్సంగ్రహణీ కవాటః । వాతోత్తరాయాం మరిచాజ్యయుక్తః పిత్తోత్తరాయాం మధుపిప్పలీభిః । కఫోత్తరాయాం విజయార్ధసేన కటుత్రయేణాజ్య యుతో గ్రహణ్యాం। క్షయే

జ్వరే చార్శసి షట్ భగందరే ఆమాతిసారా రుచిషీనసేచ। మేహేచ కృచ్ఛ్రే గతధాతువర్ధనే గుంజాద్వయం చాస్యమహామయఘ్నం॥

వ్యా॥ ముత్యభస్మ, సువర్ణభస్మ తు. రసము, తు. గంధకము, తు, టంకణము, అభ్రకభస్మ, గవ్వలభస్మ తు. నాభి ఇవి సమభాగములు వీటి అన్నిటితో సమానము శంఖభస్మ కలుపుకొని ఖల్వమందుంచుకొని అతి వసకషాయముచే భావనచేసుకొని, ఉండ చేసుకొని సన్నని మూకుడు యందుంచుకొని పుటమందుంచి ఒకటిన్నర రోజు వుంచుకొని స్వాంగశీతలమున తీసి, ఉమ్మెత్త, చిత్రమూలము, నేలతాడి వీటిరసములచే లోహపాత్రయందు భావనచేసుకొనిన సిద్ధము అగును. దీని వాతప్రధానమైనవ్యాధియందు మిరియాలు, తేనెతోను, పిత్త ప్రధానమైన వ్యాధియందు, తేనె, పిప్పళ్ళచూర్ణముతోడను, కఫ ప్రధానమైనవ్యాధియందు అంజాయిరసముతోడను, గ్రహణియందు త్రికటుచూర్ణము నెయ్యితోడను, యివ్వవలయును. క్షయ, జ్వరము, అర్శస్సు, ఆరుభగందరములు, ఆమదోషము, అతిసారము, అరుచి, జలుబు, మేహము, మూత్రకృచ్ఛ్రము. వీర్యనష్టము, వీటియందు రెండుగురిగింజల ప్రమాణము యివ్వవలయును. మహావ్యాధులనుగూడ హరించును.

## రసాయన రసము

శ్లో॥ రసం భస్మీకృతం తోలం గంధకం శోధితం సమం। లోహం కర్షద్వయం తామ్ర మర్ధతోలకసంయుతం। సువర్ణం మారితం దద్యాచ్ఛాణార్ధం సువిచక్షణః। అభ్రం కర్షద్వయం దద్యాచ్ఛాణార్ధం చంద్రచూర్ణకం। శ్యామాబీజం వరీం చైవ బలా మతిబలాంతథా। ఏలాంచ దేవపుష్పంచ శాణమానం వినిక్షిపేత్। జలేన వటకాన్ కృత్వా గుంజామాత్రం ప్రదాపయేత్। సేవనాదస్య కందర్ప రూపో భవతిమానవః। సహస్రం యాతి నారీణా ముత్సాహో జాయతేధికః। నిత్యం స్త్రీసేవనాద్యస్తు క్షీణశుక్లో భవేన్నరః। మహాశుక్లోభవేత్సోపి సేవనాదస్యనాన్యథా। మహాబలోమహాబుద్ధిర్జాయతేనాత్రసంశయః। స్థూలానాం కర్షకః శ్రేష్ఠః కృశానాం పుష్టికారకః। రసోవినాశయేత్సర్వాన్ రుజః స్తోహ భక్షణాత్। రసాయనరసోనామ శ్రేష్ఠంచైవ రసాయనం।

వ్యా॥ రసభస్మ 1 తులము, శు, గంధకము 1తు, లోహభస్మ, 2 కర్షములు, తామ్రభస్మ $\frac{1}{2}$తు, సువర్ణభస్మ $\frac{1}{2}$ శాణము, అభ్రకభస్మ, 2 కర్షములు, పచ్చకర్పూరము, $\frac{1}{2}$ శాణము, పిప్పళ్లు, పిల్లిపీచర, చిన్నముత్తవపులగము విలకులు, లవంగములు, ఇవి ప్రత్యేకముగా శాణప్రమాణము, వీటిని జలముచే నూరుకొని కుప్పెలు

కట్టుకొని గుంజప్రమాణము సేవించిన మన్మథరూపముకలవాడై వెయ్యిమంది స్త్రీల నురమించును. మిక్కిలి ఉత్సాహము కలుగును. నిత్యము స్త్రీ సేవనచే క్షీణించిన శుక్లము కలవాడుకూడ మిక్కిలి శుక్లము కలవాడగును. మిక్కిలి బలమును మిక్కిలి జ్ఞానమును కలుగును. స్థూలురను కృశింపజేయును. కృశించివారలను పుష్టిని చేయును. ఇది యేడు రోజులు సేవించిన సమస్తవ్యాధులను నశింపజేయును. ఈ రసాయనరసము శ్రేష్ఠమైన రసాయనము.

## మేహాఖండన రసం

శ్లో॥ మృతసూతాభ్రకం నాగం స్వర్ణంతుల్యం ప్రకల్పయేత్ । మహానింబస్య చూర్ణంతు చతుర్భి స్సమమాహరేత్ । మధునా లేహయేన్మాషం లాలామేహ ప్రశాంతయే । సక్షౌద్రరజనీచూర్ణం లేహ్యాం నిష్కద్వయం తథా । అసాధ్యం నాశయేన్మేహం మేహాఖండనకో రసః॥

వ్యా॥ రసభస్మ, అభ్రకభస్మ, సీసభస్మ, సువర్ణభస్మ ఇవిసమ భాగములు, ఈనాలిగింటికిసమభాగము పంచనింబచూర్ణము కలుపుకొని మాషప్రమాణము తేనెతో పుచ్చుకొని రెండునిష్కముల ప్రమాణము, తేనెతో కూడిన పసపుచూర్ణము పుచ్చుకొనిన, లాలామేహమును, నశింపజేయును. ఈమేహాఖండనరసము, అసాధ్యమైన మేహవ్యాధులను కూడ నశింపజేయును.

## మూత్రకృచ్ఛ్రాంతక రసం.

శ్లో॥ పారదాభ్రకవైక్రాంత హేమకాంతానిగంధకం । మౌక్తికం విద్రుమం చైవ ప్రత్యేకం స్యాత్సమంసమం । జంభీరసేన సంమర్ద్యం మూషాయాం సన్నిరోధయేత్ । పంచవింశత్పుటం దత్వా తత ఏనం విచూర్ణయేత్ । మాషమాత్రం రసందద్యా న్నవనీత సితాయుతం । మూత్రకృచ్ఛ్రాశ్మరీమేహ వాతపిత్తకఫామయాన్ । క్షయాన్నిఖిలరోగాంశ్చ నాశయే న్నాత్రసంశయః॥

వ్యా॥ శు. రసము, అభ్రకభస్మ, వైక్రాంతభస్మ, సువర్ణభస్మ, కాంతభస్మ, శు. గంధకము, ముత్యభస్మ, పగడభస్మ, ఇవన్నియు సమభాగములు, నిమ్మకాయలరసముచే మర్దించి మూసయందుంచి సంధిబంధనముచేసి ఇరవైఅయిదు పిడకలచే పుటము పెట్టితీసి చూర్ణముచేసి మాషప్రమాణము, వెన్న, పంచదార, వీటితో యిచ్చిన, మూత్రకృచ్ఛ్రము, అశ్మరి, మేహము, వాత, పైత్య, కఫ, వ్యాధులు, క్షయలు, సమస్తవ్యాధులు, వీటిని నశింపజేయును.

## కాలకూట రసం

శ్లో॥ రుద్రసంఖ్యామృతంచైవ త్రిభాగం సూతమేవచ గంధకం పంచభాగంచ శిలాయా ఋతుభాగకం తామ్రభస్మ చతుర్భాగం ఋషిభాగంచ టంకణం। తాలకం నవభాగంచ వహ్నిమూలం తథైవచ। త్రిఫలాచ త్రికటుకం దశ ద్వాదశకం తథా। హింగుభాగైక సంఖ్యాన ముగ్రగంధా తథైవచ। ఏవం ఖల్వేచ సంస్థాప్య హ్యార్ద్రకం వహ్నిమూలకం। జంబీరం లశునంచైవ శార్ఙ్గిశిగ్ర్వర్కమూలకం। లాంగలీ హంసపాదీచ సింధుర్నాగదలానిచ। అంకోల శిగ్రుమూలాన్ప్రత్యేకం యామమాత్రకం। పంచకోలకషాయేణ పంచమూలేన మర్దయేత్। గుంజామాత్రాం వటీంకృత్వా శృంగవేరం పిబేదను। అసాధ్యం సన్నిపాతంచ సర్వజ్వరహరం పరం। సప్తదోష వినాశశ్చ సన్నిపాతకులం హరేత్। స్నానంకుర్యా త్ప్రయత్నేన శ్రీగంధం లేపమాచరేత్। పథ్యం దధ్యోదనంచైవ ఖర్జూరాది ఫలాన్యపి। తాంబూల చర్వణంకుర్యా త్క్రమేణైవం సమాచరేత్। కాలకూటరసోనామ్నా త్రీశ్వరేణైవ భాషితం। భిషగ్వరాశ్చ కుర్వీరన్ రోగాణాం కులనాశకృత్॥

వ్యా॥ శు. నాభి 11భా, శు. పాదరసము 3 భా, శు. గంధకము 5 భా, శు. మనశ్శిల, 6 భా, తామ్రభస్మ 4 భా, శు. టంకణము 6 భా శు. తాళకము 9 భా, చిత్రమూలము 9 భా, త్రిఫలములు 10 భా, త్రికటుకములు 12 భా, ఇంగువ 1 భా, వస 1భా, ఇట్లు ఖల్వమందుంచి, అల్లము, చిత్రమూలము, నిమ్మకాయలు, వెల్లుల్లి, బండిగురివెంద,కారుమునగ, జిల్లేడువేళ్లు, చన్నచర్లగడ్డ, హంసపాది, వావిలి,తమలపాకులు,ఊడుగ, మునగవేళ్ళు వీటిరసములచే వర్యొక్క ఝాము మర్దించుమని పంచకోల కషాయముచేతను, పంచమూలకషాయముచేతను మర్దించుమని గురిగింజంత మాత్రలు చేసుకుని అల్లపురసముతో యిచ్చిన, అసాధ్యసన్నిపాతము, సర్వజ్వరములు, సప్తదోషములు, సన్నిపాతసముదాయములు వీటెని హరించును. దీనియందు స్నానము, మంచిగంధలేపనము పెరుగుఅన్నము భుజించుట, ఖర్జూరాదిఫల భక్షణము, తాంబూలము వేసుకొనుట, వీటిని క్రమముగా నాచరించవలయు. ఈ కాలకూటరసము, ఈశ్వరునిచే చెప్పబడెను. వైద్యులుచేసి ప్రయోగించినయెడల సమస్తరోగములను నశింపజేయును.

## అమృత కాలకూట రసం

శ్లో॥ సూతం సర్పవిషం హేమతారం తామ్రంచ పిత్తలం।

నాగవంగం మృతంకాంతం మాక్షికం మౌక్తికం శిలా । పాషాణత్రిత
యంచైవ గంధకం మ్లేచ్ఛటంకణం । కాంశ్యం తీక్ష్ణంచ వైక్రాంతం
తుత్థకం నటభూషణం । ఇత్యేవం సమభాగాని సూక్ష్మచూర్ణాని కార
యేత్ । సర్వాం తదర్ధమమృతం నిక్షిపే న్మతిమాన్ భిషక్ । మత్స్య
మాహిష మాయూర వారాహ ఛాగసంభవైః । ఇత్యేవం పంచపి
త్తైశ్చ దినైకైకం విమర్దయేత్ । అర్క శిగ్రుకసారేణ వహ్ని దుగ్ధా
లాంగలీ । స్నుహ్యండీ భృంగిముండ్యాచ త్రిపాదీ నాగవల్లికా । మాతులుం
గామృతంచైవ మాలూర శ్చతురంగులః । కరవీరాగ్నిమంధాచ రావ
ణో బహుపుత్రికా । ఇత్యేవం క్రమమర్ద్యంచ మర్దితం త్వాథశోషితం ।
ఫణిపిత్తైః పునర్భావ్యం ముద్గద్వయ ప్రమాణకం । ఆర్ద్రకస్య రసేనైవ
సన్నిపాతం నిహంతిచ । శ్లేష్మజాన్వివిధాన్ వ్యాధీన్ వాతవ్యాధీన్
తథైవచ । తత్ క్షణేన నివర్తంతి రసస్యాస్య ప్రభావతః । రసతాపేతు
కర్తవ్యం భోజనం కారయేత్తతః । ఉశీరవ్యజనైర్వాయుం దేయం
శీతోదకేనచ । కాలకూటరసోనామ విష్ణునా నిర్మితంపురా॥

వ్యా॥ శు. రసము, గరళము, సువర్ణభస్మ, రజతభస్మ, తామ్రభస్మ, ఇత్తడి భస్మ, సీసభస్మ, వంగభస్మ, కాంతభస్మ, మాక్షికభస్మ, ముత్యభస్మ శు మనశ్శిల, శుద్ధిచేసిన గౌరీపాషాణము, దొడ్డిపాషాణము, ఉల్లిపాషాణము, శు. గంధకము, శు. ఇంగిలీకము, పా. టంకణము, కంచుభస్మ, లోహభస్మ, వైక్రాంతభస్మ, శు. మైలతుత్థం, శు, తాళకము, ఇవిసమభాగములు మెత్తగనూరి వీటికి సగము శు. నాభి, కలుపు మని, చేప, దున్నపోతు, నెమలి, అడవిపంది, మేక, ఈఅయిదిటియొక్క పిత్తములచే వక్కొక్కరోజు మర్దించుమని జిల్లేడు, మునగవేళ్లు, చిత్రమూలము, ఉమ్మెత్త, లాంగలిదుంప, వావిలి, గుంటగలగర, బోడతరము, హంసపాది, తమలపాకులు, మాదీఫలము, తిప్పతీగ, మారేడు, శేల, గన్నేరు, నెల్లి, పెద్దనుమ్మడు, వాకుడు, వీటిరసములచే క్రమముగా మర్దించి ఎండించి, పాముపిత్తముచే మరలభావనచేసి, రెండుపెసరగింజలంత ప్రమాణము,, అల్లపురసముతో యిచ్చిన,,సన్నిపాతము, సమస్తశ్లేష్మవ్యాధులు, సమస్తవాతవ్యాధులు, వీటిని వెంటనే దీనియొక్క ప్రభావమువలన నివారించును. ఇది వేడిచేసినయెడల భోజనముపెట్టి నీళ్లుచల్లిన వట్టివేళ్లవిసనకర్రలచే విసరవలయును. ఈకాలకూటరసము, విష్ణువుచే పూర్వమందు నిర్మించబడెను.

## మహా కాలకూట రసం

శ్లో॥ తాలకం గంధకం సూతం శిలా టంకణ మాక్షికం ।దరదం

లోహభస్మంచ మాక్షికంచ ఫణోర్విషం । హిరణ్యాతారతామ్రంచ సర్వత్ర ద్వయనాభకం । మాతులుంగరసైర్మర్ద్యంజంబీర స్వరసేనచ । కాలాహి పిత్తసంభావ్యం త్రిణిదినాని మర్దయేత్ । గుంజామాత్ర ప్రమాణేన అనుపానవిశేషతః । దోషజ్వరం విషంహంతిదాహతాప నివారణం। కాలకూటరసోనామ సోమనాథ వినిర్మితం॥

వ్యా॥ శు. తాళకము, శు. గంధకము. శు. రసము, శు. మణిశిల, శు. టంకణము మాక్షికభస్మ, శు. ఇంగిలీకము, లోహభస్మ, ముత్యభస్మ, తాచుపాము విషము, సువర్ణభస్మ, రజతభస్మ, తామ్రభస్మ, ఇవి సమ్యేకభాగము, వీటికి రెట్టింపు శు. నాభి, ఇవి మాదీఫలములు, నిమ్మకాయలు, వీటిరసముచే మర్దించుకొని నల్లతాచుపాము పిత్తముచె భావనచేసి మూడురోజులు మర్దించుకొని గుంజాప్రమాణము అనుపాన విశేషములచే యిచ్చిన, దోషజ్వరము, విషజ్వరము, దాహము, తాపము, వీటిని నివారింపజేయును. ఈ కాలకూటరసము, సోమనాథునిచె నిర్మించబడెను.

## మౌక్తికాది కాలకూటరసమ్

శ్లో॥ మౌక్తికంచ రసంచైవ శిలాగంధకతాలకం । కంకుష్టంచ విషంహేమకృష్ణ సర్పవిషంసమం । తీక్ష్ణం తారంచ తామ్రంచ నాగభస్మసమన్వితం । ఏతత్సమాంశం మతిమాన్ అర్కక్షీరేణ పేషయేత్ । మత్స్యమాహిషమాయూర వారాహిఛాగపన్నగైః । ఏతైః పిత్తైస్సమన్విమ్మిలితం దినమేకం పృథక్‌పృథక్ । కాలకూటరసోనామ ముద్గమాత్రం ప్రయోజయేత్ । దారుణం సన్నిపాతఘ్నం తరుణజ్వరనాశనం । అనుపానవిశేషేణ సర్వరోగహరంపరం ॥

వ్యా॥ ముత్యభస్మ, రసభస్మ, శు. మణిశిల, శు. గంధకము, శు. తాళకము, కంకుష్టము, శు. నాభి, సువర్ణభస్మ, నల్లతాచుపాము విషము, ఖడ్గలోహభస్మ, రజితభస్మ, తామ్రభస్మ, సీసభస్మ, ఇవి సమభాగములు జిల్లేడుపాలచే నూరుకుని చేప, దున్నపోతు, నెమలి, అడవిపంది, మేక, పాము, వీటి పిత్తములచే నక్కొకరోజు భావనచేసి ఈ కాలకూటము పెసరగింజంత యిచ్చిన దారుణమయిన సన్నిపాతము, తరుణజ్వరము వీటిని నివారింపజేయును. అనుపాన విశేషములచే సమస్తరోగములను

## పాషాణ కాలకూటరసం

శ్లో॥ సువర్ణం పారదంచైవ అష్టలోహంచ గంధకం । సర్వే

షాంచ సమాయుక్తం అష్టభాగం హాలాహలం । మనశ్శిలా ద్వాదశ
కంచ గరలం సూతతుల్యకం । తాలకం రసకంచైవ పాషాణత్రితయం
తతః । హింగులం ద్వాదశంచైవ మాక్షికం హింగులభాగకం । చిత్ర
కం వరుణంశిగ్రు న్యగ్రోధాది గణేనచ । దశమూల కషాయేణ మర్ద్యం
మర్ద్యం పునఃపునః । కాచకుప్యాం వినిక్షిప్య వాలుకాయామమాత్రకం।
స్వాంగశీతలముద్ధృత్య ఖల్వమధ్యే వినిక్షిపేత్ । జంబీరవారు
ణైర్మర్ద్యం కాకఘండాలి భావితం । మత్స్యమాహిష మాయూర
వారాహా ఛాగపన్నగాః । పారావతకపోతంచ గృధ్రమార్జాలకచ్ఛపైః।
ఏతైశ్చ భావనాయుక్తం యామంయామం పృధక్పృధక్ । ముద్గ
మాత్ర ప్రమాణేన అనుపానవిశేషతః । సన్నిపాతాన్ మహాఘోరాన్
శ్లేష్మవ్యాధీన్ తథైవచ । వాతవ్యాధీన్ తథాహన్యా న్నాత్రకార్యా
విచారణా । రసతాపేతుకర్తవ్యం భోజనం కారయేత్తతః । ఉశీరవ్యాజనై
ర్వాయుం దేయం శీతోదకేనచ । కాలకూటరసోనామ కాలకూట-
ప్రకాశకః । ఉమాశంకరసంవాదే విష్ణునా కధితం పురా॥

వ్యా॥ సువర్ణభస్మ, 1 భా, శు. పాదరసము, 1 భా, రజతభస్మ, 1 భా, తామ్ర
భస్మ, 1 భా, లోహభస్మ, 1 భా, కాంతభస్మ, 1 భా, ఇత్తడిభస్మ, 1 భా, కం
చుభస్మ 1 భా, సీసభస్మ, 1 భా, వంగభస్మ, 1 భా, శు. గంధకము, 1 భా, శు. నా
భి, 8 భా, శు. మణిశిల 12 భా, గరళము, 1 భా, శు. తాళకము 1 భా, శు. కపరి,
1 భా, శు. గౌరీపాషాణము, శు. ఉల్లిపాషాణము, శు. దొడ్డిపాషాణము, ఇవి 1 భా,
శు ఇంగిలీకము 12 భా, మాక్షికభస్మ, 12 భా, ఇవి చిత్రమూలము, ఉప్పి, మునగ
న్యగ్రోధాదిగణము, దశమూలములు, వీటికషాయములచే బాగుగ మర్దించి కాచకుప్పె
యందుంచుమని వాలుకాయంత్రమందు ఏకఝామము వండుమని చల్లారనిచ్చి తీసి ఖల్వ
మందుంచి, నిమ్మకాయలు ఉలిమిరి, కాకరాకు, ఏలి, వీటి రసములచే భావనచేసి
చేప, దున్నపోతు, నెమలి, అడవిపంది, మేక, పాము పావురము, గువ్వ, గద్ద,
పిల్లి, తాబేలు, వీటి చేదులచె వక్కొక్కఝాము భావనచేసి, అనుపానవిశేషముచే
పెసరగింజంత యిచ్చిన మహాఘోరమయిన సన్నిపాతములు శ్లేష్మవ్యాధులు, వాతవ్యా
ధులు, వీటిని తప్పక హరించును. మందు వేడి చేసినయడల అన్నము పెట్టవలెను. పిద
ప చల్లని నీళ్ళు చల్లిన వట్టివేళ్ళ విసనకఱ్ఱలచే విసరవలయును. ఈ కాల కూటరసము,
పార్వతీపరమేశ్వరుల సంవాదమందు విష్ణుదేవునిచే పూర్వమందు చెప్పబడెను.

# మేహ కేసరి రసం.

శ్లో॥ మృతంవంగం సువర్ణంచ కాంతలోహంచ పారదం। ముక్తా పుష్పత్వచంచైవ సూక్ష్మైలా పత్రకేసరం। సమభాగం విచూర్ణ్యాథ కన్యానీరేణ భావయేత్ । ద్విమాషాంవటికాంఖాదే దుగ్ధాన్నంప్రపిబేత్తతః। ప్రమేహం నాశయత్యాశు కేసరీ కరిణం యథా । శుక్ర ప్రమేహం శమయే త్త్రిరాత్రాన్నాత్ర సంశయః చిరజాతంప్రమేహంచ మధుమేహంచ నాశయేత్॥

వ్యా॥ వంగభస్మ, సువర్ణభస్మ, కాంతభస్మ, శు, రసము, ముత్యభస్మ, లవంగములు, దాసినచెక్క, చిన్న ఏలకులు, ఆకుపత్రి, నాగకేసరములు, ఇవిసమభాగములు గ్రహించి కలుబందరసముచే భావనచేసి రెండు గురిగింజలప్రమాణపు మాత్రను సేవించి పాలు అన్నము పుచ్చుకొనిన సింహము ఏనుగును హరించురీతి ప్రమేహమును వెంటనే నశింపజేయును. మూడురాత్రులలో శుక్లనష్టమును నిస్సందేహముగా నశింపజేయును. దీర్ఘకాలప్రమేహమును, మధుమేహమును కూడ నశింపజేయును.

# శ్లేష్మాంతక రసం

శ్లో॥ పారదం గంధకం తాలం రౌప్యం తామ్రం మనశ్శిలాం। కృష్ణాక్వాథైః స్నుహీక్షీరై ర్దినైకం మర్దయేత్సుధీః ద్విగుంజా శ్లేష్మకంరోగంహంతియుక్త్యనుపానతః। శ్లేష్మాంతకరసోనామ ఛాగదుగ్ధం పిబేదను॥

వ్యా॥ శు. రసము, శు. గంధకము. శు. తాళకము, మాక్షికభస్మ, తామ్రభస్మ శు. మణిశిల, ఇవి సమభాగములు, పిప్పళ్ల కషాయము చేతను, జెముడుపాల చేతను ఒకరోజు మర్దించి ఈ శ్లేష్మాంతకరసమును, రెండుగురిగింజల ప్రమాణము తగిన అనుపానముతోయిచ్చి మేకపాలను త్రాగించిన శ్లేష్మరోగములను హరించును.

# జ్వరాతిసార గ్రహణిరిపు రసం

శ్లో॥ కపర్దకా శంఖకమౌక్తికానాం భస్మాభ్రగంధాతి విషావిషంచ। అఫేనసూతం కనకంసకాంతం సటంకణం సర్వసమానభాగం।

జంబీరనీరేణ దినం విమర్ద్యం భావ్యం జయోన్మత్తకశృంగవేరైః ।
మాషప్రమాణం మధునాలిహేదం జ్వరాతిసారగ్రహణీగదేషు॥

వ్యా॥ గవ్వలభస్మ, శంఖభస్మ, ముత్యభస్మ, అభ్రకభస్మ, శు.గంధకము, అతివస శు. నాభి, శు. నల్లమందు, శు. రసము, సువర్ణభస్మ, పా. కాంతభస్మ, వెలిగారము, ఇవి, సమ భాగములు, నిమ్మకాయాలరసముచే ఏకరోజు మర్దించి, తెక్కలి, ఉమ్మెత్త అల్లము, వీటిని రసములచే భావనచేసుకు॥ మాషప్రమాణము తేనెతో, జ్వరము, అతి సారము గ్రహణి ఈ వ్యాధులయందు పుచ్చుకొనవలయును.

## గ్రహణికపాట రసం

శ్లో॥ తారమౌక్తికహేమాని సారశ్చైకైకభాగికం। ద్విభాగోగంధకస్సూతః త్రిభాగో మర్దయేదిమాన్ । కపిత్థస్వరసైర్గాఢం మృగశృంగే తతఃక్షిపేత్ । పుటేన్మధ్య పుటేనైవ తతఉద్ధృత్యమర్దయేత్ ! బలారసైస్సప్తవేల మపామార్గ రసైస్త్రిధా । లోధ్ర ప్రతివిషా ముస్త ధాతకీం ద్రయవామృతాః । ప్రత్యేకమేతత్ స్వరసైర్భావనాస్యాత్ త్రిధా త్రిధా మాషమాత్రంరసో దేయో మధునా మరిచైస్తథా ॥ హన్యాత్సర్వానతీసారాన్ గ్రహణీం సర్వజామపి । కపటో గ్రహణీరోగే రసోయం వహ్నిదీపన

వ్యా॥ రజతభస్మ 1 భా, ముత్యభస్మ 1 భా, సువర్ణభస్మ 1 భా, హేమమాక్షికభస్మ 1 భా, శు. గంధకము 2భా, శు. రసము 8 భా, వీటిని వెలగ రసముచే దృఢముగా మర్దించి. లేడికొమ్ములయందుంచి మధ్యమ పుటము వేసి తీసి, ముత్తవపులగము రసముచే ఏడురోజులు, ఉత్తరేణి, లొద్దుగ, అతివస, తుంగగడ్డలు, ఆరెపువ్వు కొడిశపాలవిత్తులు, తిప్పతీగ వీటిరసములచేప్రత్యేకముగా మూడేసి సార్లు భావనచేసి మాష ప్రమాణము, తేనె, మిరియాల చూర్ణముతో యిచ్చిన సమస్త అతిసారములను త్రిదోషజగ్రహణిని, నశింపజేయును. ఇది అగ్నిదీప్తిని జేయును.

## చంద్రరసం

శ్లో॥ రసభస్మ త్రిభాగంచ భాగైకం తారభస్మకం । మృతమభ్రంచ కాంతంచ కాసీసంతు శిలాజతు । ఏతానిసమభాగాని ఖల్వే

మధ్యే వినిక్షిపేత్ । నిర్గుండీ ముసలీవాసా జయాజై రగ్నిమంథజైః । అభయార్ద్రికజైర్మర్ద్యం సప్తాహంచ పృథక్ పృథక్ । తద్గోలం కూపికాయంత్రే పచ్యామంతు తుషాగ్నినా । ద్విగుంజం భక్షయేన్నిత్యం సర్వమేహ ప్రశాంతయే । నింబబీజకషాయంచ మధుయుక్తం పిబేదను అయం చంద్రసోనామా సర్వమేహకులాంతకః॥

వ్యా॥ రసభస్మ 3 భా, రజతభస్మ 1 భా, అభ్రకభస్మ 1 భా, కాంతభస్మ 1 భా, కాసీసభస్మ 1 భా, శిలాజతుభస్మ 1 భా- వీటినిఖల్వమందుంచి వావిరి, నేలతాడి, అడ్డసరము, తెక్కలి, నెల్లి, కరక్కాయ, అల్లము, వీటిరసములచే ప్రత్యేకముగా ఏడేసిరోజులు మర్దించి ఉండచేసి, కూపికాయంత్రమందు ఊక నిప్పుచే ఆరుఝాములు వండుకుని నిత్యము రెండు గురిగింజల ప్రమాణము సేవించి వేపగింజల కషాయము తేనెకలిపి త్రాగిన సమస్తమేహములు శాంతించును. ఈ చంద్రరసము సమస్తమేహసముదాయమును అంత మొందించును.

## ప్రదరాంతక రసం

శ్లో॥ శుద్ధసూతం తథాగంధం భస్మవంగక రౌప్యకం । ఖర్పరంచ ప్రవాలంచ శాణమానం పృథక్ పృథక్ । తృతీయతోలకం గ్రాహ్యం కాంతభస్మక్షిపేత్సుధీః । కన్యాసీరేణ సంమర్ద్య దినమేకం భిషగ్వరః । అసాధ్యం ప్రదరంహంతి భక్షణా న్నాత్రసంశయః॥

వ్యా॥ శు రసము. శు, గంధకము, వంగభస్మ, రౌప్యభస్మ, శు, కపురి, పగడభస్మ, ఇవి వక్కొక్క శాణప్రమాణము, కాంతభస్మ ⅓ తు, వీటిని ఖల్వమందుంచుకుని కలుబందరసముచే వకరోజు మర్దించుకుని యిచ్చిన అసాధ్యమైన ప్రదరమునునిస్సందేహముగా వారించును.

## వాతమారక రసం

శ్లో॥ వజ్రం మృతాభ్ర హేమార్కం తీక్ష్ణం ముండం క్రమోత్తరం । మరీచైర్మర్దయేదమ్లవర్గేణ దివసత్రయం । ద్విక్షారం పంచలవణం మర్దితంస్యాత్సమంసమం । తతో నిర్గుండికా ద్రావై ర్మర్దయే

ద్దివసత్రయం । శుష్యమేత ద్విచూర్ణ్యాథ విషంచాస్యాష్టమాం శకం టంకణం విషతుల్యాంశం దత్వా జంబీరజద్రవైః। భావయే ద్దినమేకంతు రసోయం వాతమారకః । దాతవ్యో వాతరోగేషు సన్నిపాతేవిశేషతః । ద్విగుంజా మార్ద్రికద్రావై ఘృతైర్వా వాతరోగిణే । నిర్గుండీ మూల చూర్ణంతు మహిషాక్షంచ గుగ్గులుం । సమాంశం మర్దయేదాజ్యే తద్వటీకర్షసంమితా । అనుయోజ్యం ఘృతైర్నిత్యం స్నిగ్ధ ముష్ణంచ భోజనం । మండలాన్నాశయే ద్రోగాన్వాతరోగా న్విశేషతః । సన్నిపాతే పిబేచ్చాను తాలమూలీ కషాయకం॥

వ్యా॥ వజ్రభస్మ 3భా, అభ్రకభస్మ 2భా, సువర్ణభస్మ 3భా, తామ్రభస్మ4భా, తీక్ష్ణలోహభస్మ 5భా, ముండలోహభస్మ6భా, మిరియాలు, ఆమ్లవర్గము, వీటిరసముచే మూడురోజులుమర్దించిక్షారద్వయముపంచలవణములు ఇవిఏకోన్నక్క భాగము కలుపునని వా విలిరసముచే మూడురోజులుమర్దించునని ఎండించునని ఈమందుకు8వభాగము శు. నాభి నాభితో సమానము పా.టంకణము,కలుపునని నిమ్మకాయరసముచేవక రోజు భావనచేసు నని వాతమారక రసమనబడును. దీనిని వాతవ్యాధులయందును, తరచు సన్నిపాత ములయందును, యివ్వవలయును. రెండు గురిగింజల ప్రమాణము నిమ్మ అల్లపురసము తోగాని నెయ్యితోగాని వాతరోగికియిచ్చి, వావిలివేళ్లు చూర్ణము, శు. మహిసాక్షి గుగ్గులు ఇవి సమభాగములు నెయ్యితో మర్దించి కర్ష ప్రమాణము మాత్రచేసునని నేతితో ఈమందు ఇచ్చినవెంటనే యిచ్చి, స్నిగ్ధగుణము, ఉష్ణవీర్యముగల భోజనము చేసిన యెడల మండలమురోజులకు సమస్తవ్యాధులను, ప్రధానముగా వాతవ్యాధులను నశింపజేయును. సన్నిపాతమందు ఈమందుయిచ్చిన వెంటనే తాటివేళ్ళ కషాయము యివ్వవలయును.

## ముఖారి రసం

శ్లో॥ మృతసూతం మృతంస్వర్ణం ద్వాభ్యాం తుల్యాంమనశ్శిలాం విమర్దయేచ్చ తైలేన చాతసీ సంభవేనచ । తద్గోలం లేపయేచ్చ సమంతతః । అతసీఫలకల్కేన డోలాయంత్రే త్ర్యహంపచే ఉద్ధృత్యధారయే ద్వక్త్రే జిహ్వా దంతాస్య రోగజిత్॥

వ్యా॥ రసభస్మ, సువర్ణభస్మ, ఇవి సమభాగములు. వీటితో సమానము మణిశిల, వీటిని అవిసినూనెచేమర్దించి ఉండచేసి బట్టయందుకట్టి అవిసి కాయ

కల్కముచే అంతటను పూసి డోలాయంత్రమందు అవిసికపాయము చేమూడురోజులు వండుకుని తీసి మాత్రలుచేసి నోటియందుంచుకునిన జిహ్వారోగములు, దంతరోగములు ముఖరోగములు, వీటిని జయించును.

## వాతనాశన రసం

శ్లో॥ సూతం హాటకవజ్రాని తామ్రం లోహంచ మాక్షికం। తాలం నీలాంజనం తుత్థం సింధుఫేనం సమాంశకం। పంచానాం లవణా నాంచ భాగైకం విమర్దయేత్ । వజ్రీరసైర్దినైకం తు రుద్ధ్వాతం భూధరేపచేత్ । మాషైక మార్ద్రకద్రావైర్లిహ్యాద్వాత వినాశనం। పిప్పలీ మూలకం క్వాథం సకృష్ణ మనుపానయేత్ । సర్వాన్ వాతవికారాంశ్చ నిహంత్యాక్షేపకాదికాన్। వాతనాశనకోనామా రసోయం యోగ్య మౌషధం॥

వ్యా॥ శు. రసము, సువర్ణభస్మ, వజ్రభస్మ, తామ్రభస్మ, లోహభస్మ, మాక్షికభస్మ, శు. తాళకము నీలాంజనము, శు. మైలతుత్థము, సముద్రఫేనము, పంచలవణములు ఇవన్నియు, ఏకైకభాగము నల్లేరురసముచే ఏకరోజుమర్దించి మూసయందుంచి భూధరపుటమువేసుకుని మాషప్రమాణము అల్లపురసముతో సేవించి, మోడి, పిప్పళ్లు వీటికషాయము త్రాగిన ఆక్షేపకము మొదలగు సమస్తవాతవ్యాధులను హరించును. ఈ వాత నాశన రసము మిక్కిలి యోగ్యమయినది.

## చతుర్ముఖ రసం

శ్లో॥ రసగంధకలోహాభ్రం సమం సూతాంఘ్రిం హేమచ। సర్వం ఖల్వేవినిక్షిప్త్వా కన్యా స్వరసమర్దితం। ఏరండపత్రైరావేష్ట్య ధాన్యరాశౌ దినత్రయం। సంస్థాప్యచ తదుద్ధృత్య సర్వరోగేషు యోజయేత్ । ఏతద్రసాయనవరం త్రిఫలాం మధుసంయుతాం। తద్యథాగ్నిబలం ఖాదే ద్వలీపలితనాశనం। క్షయమేకాదశవిధం కాసంపంచవిధం తథా। కుష్ఠ మష్టాదశవిధం పాండురోగం ప్రమేహకాన్ । శూలం శ్వాసంచ హిక్కాంచ మందాగ్నిం చామ్లపిత్తకం। వ్రణాన్ సర్వానాఢ్య వాతం విసర్పం విద్రధిం తథా। అపస్మారం మహోన్మాదం సర్వార్శాంసి

త్వగామయాన్ । క్రమేణ సేవితోహంతి వృక్షమింద్రాశనిర్యథా । పుష్టిదం వృష్యమాయుష్యం పుత్రప్రసవకారణం । జగతాంచ హితార్థాయ చతుర్ముఖ ముఖోదితః । రసశ్చతుర్ముఖోనామా చతుర్ముఖ ఇవాపరః ॥

వ్యా శు. రసము, శు. గంధకము, లోహభస్మ, అభ్రకభస్మ, ఇవి వక్కొక్క భాగము సువర్ణభస్మ $\frac{1}{4}$ భా, ఇటుల వీనిని ఖల్వమందుంచి కలుబంద రసముచేమర్దించి ఆముదపాకులచేచుట్టి ధాన్యరాశియందు మూడురోజులువుంచి పిదప తీసి ఈరసాయన శ్రేష్ఠమును అగ్నిబలానుసారముగా త్రిఫలములు, తేనె, వీటితోసమస్త వ్యాధులయందును, యివ్వవలయును. శరీరము ముడతలుపడుట, వెంట్రుకలు నెరయుట, ఏకాదశక్షయలు, పాండురోగము, ప్రమేహములు, శూల, శ్వాస, ఎక్కిళ్లు అగ్నిమాంద్యము, అమ్లపిత్తము, సమస్తవ్రణములు, ఆఢ్యవాతము. విసర్పము, విద్రధి, అపస్మారము, ఉన్మాదము, సమస్తమూలశంకలు, చర్మవ్యాధులు, వీటిని క్రమసేవనచే, పిడుగు వృక్షములవలె నశింపజేయును. శరీరపుష్టి, వీర్యవృద్ధి, ఆయుర్వృద్ధి, పుత్రసంతానప్రాప్తి, వీటిని కలిగించును. ఈ చతుర్ముఖరసము, లోకములయొక్క మేలుకొఱకు బ్రహ్మదేవునిచే చెప్పబడెను.

# సర్వవాతహర రసం

హేమార్క కాంతలోహాభ్రం సూతభస్మంచ గంధకం వైక్రాంతం విద్రుమంచైవ తారం తాలసమన్వితం। సుముహూర్తే ఖల్వమధ్యే చిత్రమూలస్యచ ద్రవైః । చతుర్యామంచ సంమర్ద్యం ఛాయాశుష్కంచ కారయేత్ । కుక్కుటీ పుటపాకేన స్వాంగశీతల్ల ముద్ధరేత్ ! ఇదంచ చూర్ణితం శ్లక్ష్ణం తదర్థం సూతభస్మకం । సూతతుల్యం మృతం తాలం సర్వంఖల్వే విమర్దయేత్ । చిత్రకార్ద్రికనీరేణ నిర్గుండీ వారుణా ద్రవైః। వాసా నింబస్యనీరేణ సప్తభావ్యం పృథక్ పృథక్ । గుంజామాత్ర ప్రయోగేణ కణామధ్వాజ్య సంయుతం । సుప్తవాతం వాతశూలం వేదనా వాతమేవచ । స్నాయుకంపం గాత్రభంగం పక్షవాతంహనుగ్రహం వాతమూర్ఛాంచ తిమిరం వాతాశీతంచ నాశయేత్ । వంధ్యాచ లభ

తేపుత్రం నష్టవీర్యే ప్రశస్యతే। సర్వవాతహరోనామా సర్వరోగనివారకః। లోకోపకారణార్థాయ హ్యశ్వినీదేవ నిర్మితః॥

వ్యా॥ సువర్ణభస్మ, కాంతభస్మ,లోహభస్మ,అభ్రకభస్మ, రసభస్మ, శుగంధకం, వైక్రాంతభస్మ, పగడభస్మ, రజతభస్మ, శు.తాళకము, వీటిని సుముహూర్తమందు ఖల్వమందుంచి చిత్రమూలరసముచే నాలుగుఝాములు మర్దించి నీడను ఎండించి మూషల్యయందుంచుకొని కుక్కుటపుటకువేసుకొని చల్లారిన పిదప తీసి మెత్తగనూరి ఈ మందును సగము రసభస్మ,రసభస్మతోసమానము తాలకభస్మకలుపుకుని చిత్రమూలము, అల్లము, వావిలి ఉప్పి,అడ్డసరము,వేప, వీటిరసములచే ప్రత్యేకముగా ఏడేసి రోజులు భావనచేసి గుంజా ప్రమాణము, పిప్పళ్లు, నెయ్యి, తేనె, వీటితోయిచ్చిన సుప్తివాతము, వాతశూల, బాధతో కూడినవాతము, స్నాయుకంపము ఒడలు చితక కొట్టినట్లుండుట పక్షవాతము హనుగ్రహము, వాతమూర్ఛ, తిమిరవాతము, ఎనుబది వాతములు, వీటిని నశింపజేయును. వంధ్యాస్త్రీసంతానమును పొందును. ఇంద్రియనష్టమంటు ప్రశస్తమైనది, ఈసర్వవాతహరరసము, సమస్త వ్యాధులను నివారించును. లోకోపకారము నిమిత్తము అశ్వినీ దేవతలచే చెప్పబడెను.

## వాతకులాంతక రసం

సీ॥ గాంగేయ తామ్రముల్ కాంతభస్మము లోహతారంబు వైక్రాంత తాలకంబు। బలిరసభస్మముల్ పగడచూర్ణంబును ఏకాంశలన్నియు జోకమరియు। వావిలి జిల్లేడు పరిహంసపాదియు అడ్డసర గుంటగలగరాకు రసము। వేపచక్కరసము వెసనిమ్మపులుసును గలిజేరుసారముల కలియనూరి। వజ్రమూస నునిచి వరుసనొక్కొకఝాము వాలుకాయంత్రాన వండి మరియు। కుప్పివెడలించి పునర్నవను పోసగనూరి ఘుటికలు గావించి పూటకుపరకయెత్తు। సేవజేసిన జనులకుక్షేమమరయు। సర్వరోగములన్నియు సమసిపోవు। దానినామంబు వాతకులాంతకంబు॥

వ్యా॥ సువర్ణ తామ్రభస్మ, కాంతభస్మ, లోహభస్మ,రజితభస్మ,వైక్రాంతభస్మ, శు.తాళకము, శు. గంధకము రసభస్మ, పగడభస్మ, ఇవన్నియు వక్కొక్క

భాగము వేసికొని, వావిలి, జిల్లేడు, పిల్లితేగలు, హంసపాది, అడ్డసరము, గుంటగలగర, వేపచెక్క, నిమ్మకాయలు, గలిజేరు, వీటి రసములచే నూరి వజ్రమూషయందుంచి వాలుకాయంత్రమందు మందమధ్యను తీవ్రాగ్నులచే నొక్కొక్కఝాము వండుమని మూసను విదల్చి మందుతీసుకొని గలిజేరు రసముచే బాగుగనూరి మాత్రలుచేసుమని పూటకు పరకయెత్తు సేవించిన క్షేమను కలుగును. సమస్తవ్యాధులు పోవును. దీనిని వాతకులాంతక మనియెదరు.

# సర్వ వాతకులాంతక రసం

శ్లో॥ సువర్ణం రజతం తామ్రం వైక్రాంతం కాంతమభ్రకం । నిరుద్ధలోహభస్మంచ సర్వాణిచ సమాంశకం । గంధకా ద్విగుణంతాలం తాలా ద్విగుణకాశిలా । శిలామూః ద్విగుణం రౌప్యం పాదాంశం రసభస్మకం । ఖల్వమధ్యే వినిక్షిప్య మర్దయే ద్దివసద్వయం । సర్వస్యాష్టమభాగేన మేలయేచ్ఛ హాలాహలం । విషతిందుకజైద్రాద్రైః పిష్ట్వాగోలకమాచరేత్ । కాచకుప్యాం వినిక్షిప్య వాలుకాయంత్ర మధ్యతః । సాంగశీతల ముద్ధృత్య శుద్ధం హింగ్వష్టమాంశకం । భావయే ద్బీజపూరేణ సప్తయామం విభావయేత్ । చిత్రమూల కషాయేణ సర్వవాతకులాంతకం । ఘృతేన సహితో పేయం వల్లద్వయ ప్రమాణకం । నిహంత్యశీతిం వాతానాం గుల్మాని విధానిచ । చతుర్విధమందాగ్నిం శూల చర్ద్యుదరాణ్ క్రిమీన్ । ఆధ్మానంచ తథాహిక్కాం అతీసార మరోచకం । ఏకాదశక్షయరోగాన్ సర్వవాతకులాంతకః॥

వ్యా॥ సువర్ణభస్మ, రజతభస్మ, తామ్రభస్మ, వైక్రాంతభస్మ, కాంతభస్మ, అభ్రకభస్మ, లోహభస్మ, శు.గంధకము, ఇవి వక్కొక్క భాగము, శు.తాళకము: 2 భా, శు. మణిశిల 4 భా, హేమమాక్షికభస్మ 8 భా, రసభస్మ $\frac{1}{4}$ భా, వీనిని ఖల్వమందుంచి రెండురోజులునూరి ఆమందునకు 8 వ భాగము శు. నాభి, కలుపుమని విషముష్టికషాయముచే నూరుమని మాత్రలుచేసుమని కాచకుప్పెయందుంచుమని వాలుకాయంత్రమందు వండుమని సాంగశీతలముగతీసి ఈమందునకు శుద్ధిచేసిన ఇంగువ 8 వ భాగము కలుపుమని, మాదీఫలరసము, చిత్రమూలకషాయము వీటిచే ఏడేసిఝాములు భావనచేసుమని ఈ 'సర్వవాతకులాంతకము'ను రెండువల్లముల ప్రమాణము నెయ్యితో పుచ్చుకొనిన ఎనుబదివాతములు, ఎనిమిది గుల్మములు, నాలుగు అగ్నిమాంద్యములు, శూల, వాంతి, ఉదరవ్యాధులు, కృమివ్యాధులు, కడుపుఉబ్బరము, ఎక్కిళ్లు, అతిసారము, అరోచకము, పదకొండు క్షయలు, వీటిని హరించును. ఇది సర్వవాతకులాంతక మనబడును.

# వసంతకుసుమాకరం

శ్లో॥ పృధగ్ద్వౌ హాటకంచంద్రం త్రయోవంగాహికాంతజం । చత్వారస్సూతమభ్రంచ ప్రవాలం మౌక్తికంతధా। భావనాగవ్యదుగ్ధేక్షువాసాశ్రీ ద్విజకైర్నిశా । మోచకందరసైః సప్తక్రమాద్భావ్యం పృధక్పృథక్ । శతపత్రరసేనైవ మాలత్యాః కుసుమైస్తథా। పశ్చాన్మృగమదైర్భావ్యః సుసిద్ధో రసరాడ్భవేత్ । కుసుమాకర విఖ్యాతోవసంతపదపూర్వకః ।. వల్లద్వయమితస్సేవ్యస్సితాజ్యమధుసంయుతః । వలీపలితహృన్మేధ్యః కామదఃసుఖదస్సదా । మేహఘ్నః పుష్టిదఃశ్రేష్టఃపరంవృష్యో రసాయనః । ఆయుర్వృద్ధికరః పుంసాం ప్రజాజననముత్తమం । క్షయకాసతృషోన్మాద శ్వాసరక్త విషార్తిజిత్ । సితాచందనసంయుక్తమమ్లపిత్తాదిరోగజిత్ । హంతిపాండ్వామయాన్శూలాన్ మూత్రఘాతాశ్మరీంజయేత్ । యోగవాహీత్వీదంసేవ్యం కాంతిశ్రీబలవర్ధనం । సుసాత్మ్య మిష్టభోజీచ రమయేత్ప్రమదాశతం । మదనంమదయేన్మదముజ్జ్వలయన్ ప్రమదానివహానతివిహ్వలయన్ । సురతైస్సుఖదైర్గతి విప్యచనైర్భవసారజుషామయమేవసుహృత్ ॥

వ్యా॥ సువర్ణభస్మ 2 భా. రజతభస్మ, 2 భా. వంగభస్మ 3 భా, సీసభస్మ 3 భా కాంతలోహభస్మ 3 భా, సూతభస్మ, 4 భా, అభ్రకభస్మ 4 భా, పగడభస్మ 4 భా, ముత్యభస్మ 4 భా, వీటిని ఖల్వమందుంచి, ఆవుపాలు, చెరుకు, అడ్డసరము, చందనము, వట్టివేళ్లు, కురువేరు, పసపు, అరటిదుంప, కమలములు, మాలతీ పుష్పములు, వీటి రసములచే ప్రత్యేకముగా ఏడేసి సార్లు భావనచేసుకుని, పిదప కస్తూరితో భావనచేసుకునిన వసంత కుసుమాకర మను పేరంబరగు దీనిని రెండు వల్లముల ప్రమాణము, పంచదార, నెయ్యి, తేనె, వీటితో సేవించిన, ముసలి తనముచే శరీరము ముడతలు పడుట, వెంట్రుకలు నెరయుట, మేహములు, వీనిని నశింపజేయును. బుద్ధిబలము, కామము, సుఖము, శరీరపుష్టి, వీర్యపుష్టి, ఆయుర్వృద్ధి, సత్సంతానము, వీటిని కలిగించును. ముసలి తనమును వ్యాధులను పోగొట్టును. క్షయ, దగ్గు, దప్పిక, ఉన్మాదము ఆయాసము, రక్తదోషములు, విషదోషము, వీటిని జయించును. పంచదార, మంచిగంధము వీటితో సేవించిన అమ్లపిత్తము, మొదలగు వ్యాధులను నశింపజేయును. పాండువ్యాధులు, శూలలు, మూత్రాఘాతము, అశ్మరి, వీటిని హరించును. అనుపానభేదములచే అన్నివ్యాధులను హరించును. శరీరకాంతి, లక్ష్మి, బలము, వీటిని వృద్ధిపొందించును. సాత్మ్యము, ఇష్టము, అయినఆహారము భుజింపుచుండిన నూరుగురు స్త్రీలను రమించుశక్తిగలవాడై మిక్కిలి కామోద్రేకము కలవాడై సుఖకరములైన

సుగంధములచే స్త్రీసముదాయములయొక్క మదమును అణగించును. సంసారసుఖమును అనుభవించువారలకు ఈ ఔషధము స్నేహితునివలె హితమును కలుగజేయును.

## వసంత కుసుమాకరమ్ (ప్రకారాంతరమ్)

శ్లో॥ మృతసూతాభ్రకం స్వర్ణం రౌప్యం కాంతంచతీక్ష్ణకం। ప్రవాలముక్తాభసితం భసితంనాగవంగయోః। తదర్ధంభస్మవైక్రాంతం గవ్యదుగ్ధేనమర్దయేత్। జాతిపుష్పసముద్భూతై రసైస్తుదివసత్రయం। శాల్మలీకదళీద్రాక్షా ద్రవైర్గాంధారికాద్రవైః। ఏతైస్తుభావితం సప్తస మృగకస్తూరికాయుతం। శతపత్రరసేనైవ కుంకుమాగరుజద్రవైః। వల్ల ద్వయమిదంసేవ్యం సితాజ్యక్షీరసంయుతం। ప్రదరాన్ప్రమేహాణి య క్ష్మకృచ్ఛ్రాదికాన్ హరేత్। బహుమూత్రం ఖండమూత్రం రక్తస్రావ ప్రవాహికాః। తత్తద్రోగానుపానేన సర్వరోగనివారణం। సర్వపై త్త్యోపశమనం వసంతకుసుమాకరః॥

వ్యా॥ రసభస్మ, అభ్రకము, సువర్ణము, రజతము, కాంతము, ఖడ్గలోహము, పగడములు, ముత్యములు, సీసము, వంగము, వీటి భస్మములుఒక్కొక భాగము, వైక్రాంతభస్మ ½ భా, వీటిని ఆవుపాలచే నూరుకుని, జాజిపువ్వులరసముచే మూడురోజులు నూరుకుని, బూరగ, అరటి, ద్రాక్ష, గాంధారి, వీటిరసములచే ప్రత్యేకముగా ఏడేసి సారులు బాగుగ భావనచేసుకొని. కస్తూరి కలుపుకుని, పద్మములు, కుంకుమపువ్వు, అగరుచెక్క, వీటిరసములచే, భావనచేసుకుని రెండువల్లములప్రమాణము పంచదార నెయ్యి, పాలు, వీటితో సేవించిన, సమస్తశ్వేతరక్త ప్రదరములు, ప్రమేహములు, రాజయక్ష్మ, మూత్రకృచ్ఛ్రము మొదలగువ్యాధులు, అతిమూత్రము, మూత్రము ఆగిఆగి పడుట, రక్తస్రావము, జిగటవిరేచనములు వీటిని హరింపజేయును. ఆయారోగానుపానములచే సమస్తవ్యాధులను నశింపచేయును. ఈ వసంతకుసుమాకరము సర్వపైత్త్యవ్యాధులను కూడశమింపజేయును.

## వసంత కుసుమాకరం

(వంటయోగము.)

శ్లో॥ ఏకభాగం రుద్రవీర్యం గంధకంచ ద్విభాగకం। హేమ రౌప్యం ప్రవాలంచ మౌక్తికం హేమమాక్షికం। కాంతంగగన వైక్రాంత త్రిభాగంచ పృథక్పృథక్। పంచభాగం భుజంగంచ వంగకంపంచభాగక

సర్వాణిఖల్వమధ్యేతు నిక్షిప్య లికుచద్రవైః । ద్రాక్షాఖర్జూర విజయా ఆర్ద్రిగోక్షు రక్షీరకైః । మర్దనం త్రిదినంకృత్వా కాచకుంభే వినిక్షిపేత్। క్రమాగ్నౌ వాలుకాయంత్రే పాచయేదష్ట యామకం । సాంగశీతలము ద్ధృత్య ఖల్వమధ్యే వినిక్షిపేత్ । కస్తూరికాంచ కాశ్మీరం కర్పూరం జాతి కాఫలం । ప్రత్యేకమేక భాగంచ సమాయుక్తం భిషగ్వరైః । కాం తారకం చందనం రంభావిదారీ ముసలీవరీ । శాల్మలీ పుష్పజలజం మాలతీ కుసుమంతథా । ఇందీవరంచ మందారం పన్నీరేణచ భావ యేత్ । సర్వైరసై ర్విభావ్యంతు త్రిదినంచ పృథక్పృథక్ । వల్లమాత్ర ప్రమాణేన అనుపానవిశేషతః । సేవితంప్రాత రుత్థాయ మేహావింశతి నాశనం । చతుర్వింశతి పైత్యంచపాండు ఛర్ది క్షయాపకం । శ్వాసకాసగ దాన్ హంతి హార్ద్రిద్రా శుక్లమేహకం । ఇక్షుమేహం మధుమేహం బహు మూత్రంచ తంతుకాం । లాలామేహం వసామేహం మూత్రకృచ్ఛ్రా శ్మరీంతథా । రక్తపిత్త మమ్లపిత్తం నారీణాంప్రదరంతథా । అంగదా హం లింగదాహం వృద్ధోపితరుణోభవేత్ । నపుంసో పుంస్త్వ మాప్నోతి వంధ్యాపుత్రవతీ భవేత్ । కుసుమాకర నామ్నాయం వసంత పదపూర్వకం । సర్వరోగాన్ నిహంత్యాశు శంభునాపరికల్పితః॥

వ్యా॥ శురసము 1 భా, శు. గంధకము 2 భా, సువర్ణభస్మ, రజతభస్మ, పగడ భస్మ, ముత్యభస్మ, హేమమాక్షికభస్మ, కాంతభస్మ, అభ్రకభస్మ, వైక్రాంతభస్మ, ఇవి ప్రత్యేకముగా 3 మూడేసి భాగములు, సీసభస్మ, 5 భా, వంగభస్మ 5 భా, వీ టినన్నిటిని ఖల్వమందుంచి, నిమ్మకాయలు, ద్రాక్షపండ్లు, ఖర్జూరపుకాయలు, గం జాయి, అల్లము, పల్లేరు, వీటిరసములచేతను ఆవుపాలచేతను ప్రత్యేకముగా మూడేసి రోజులు మర్దించి కాచకుప్పెయందుంచి వాలుకాయంత్రమందు క్రమాగ్నులచే 8 ఝాములువండుకుని సాంగశీతలమునతీసి ఖల్వమందుంచుకుని, కస్తూరి 1 భా, కుంకుమ పువ్వు 1 భా, పచ్చకర్పూరము 1 భా, జాజికాయలు 1 భా, ఇటుల వీటిని కలుపు కుని, చెరుకు, చందనము. అరటి, నేలగుమ్మడి, నేలతాడి, పిల్లిపీచర, బూరుగుపుష్ప ములు, కురువేరు, మాలతీపుష్పములు, నల్లకలువ మందార పుష్పములు, వీటిరసముల చేతను, పన్నీరుచేతను ప్రత్యేకముగా మూడేసి రోజులు భావనచేసుకుని వల్లప్రమా ణము అనుపాన విశేషములచే ఉదయమునలేచి సేవించిన, ఇరువదిమేహములు, ఇరువది నాలుగు పైత్యములు, పాండు, వాంతి, క్షయ, శ్వాస, కాస. హార్ద్రిద్రామేహము, శుక్లపక్షము ఇక్షుమేహము, మధుమేహము, మూత్రకృచ్ఛ్రము, అశ్మరి, రక్తపిత్తము, అమ్లపిత్తము, స్త్రీలకుకలుగు ప్రదరవ్యాధులు, శరీరతాపము, లింగతాపము, శ

రింపజేయును. దీని సేవనచే వృద్ధుడుకూడ యౌవనవంతుడగును. నపుంసకుడు పుంస్త్వమును పొందును, గొడ్డురాలు సంతానవంతురాలు అగును. శివునిచే చెప్పబడిన ఈవసంతకుసుమాకరము, సర్వరోగములను వెంటనే నశింపజేయును.

# కజ్జలీ, వసంత కుసుమాకరమ్

శ్లో॥ హేమతారప్రవాలంచ వజ్రివైడూర్య మౌక్తికం । అభ్రకం మృతలోహంచ ద్విగుణం సూతభస్మకం। వంగంచానీల వైక్రాంతం నాగభస్మసమాంశకం । సర్వాణిచసమాదాయఅశ్వగంధా విదారిభిః । రంభాగోక్షురశాల్మలీ ఇక్షువాశాశతావరీ । మృణాలచందనోశీరజాతీపుష్పంచవాలకైః । ద్రాక్షాఖర్జూరకూష్మాండ కదల్యార్ద్రికసారిబైః। మర్దయిత్వాపృథక్త్రీణి దినసానిభిషగుత్తమః । ఘనసారంమృగనాభిం ప్రత్యేకమేకభాగకం । మేలయిత్వాప్రయత్నేన లవంగకుంకుమద్రవైః । మాలతీజాతిపుష్పైశ్చ నిశాగరుశతపత్రైః। సమస్తపుష్పజాత్యాచ పన్నీరేణచభావయేత్ । కుసుమాకరవిఖ్యాతో వసంతపదపూర్వకః। అనుపానవిశేషైశ్చ వల్లమాత్రనిషేవణాత్ । ఇక్షుమేహం మధుమేహం బహుమూత్రం చతంతుకాం । రక్తమేహంమూత్రకృచ్ఛ్రం అశ్మరీంపిష్టమేహకం । లాలామేహం వసామేహం హరిద్రాశుక్లమేహకం । వివిధాంశ్చప్రమేహాన్ నాశయేన్నాత్రసంశయః । రక్తపిత్తం చామ్లపిత్తం నారీణాంప్రదరంతథా। క్షయశోషారుచిశ్వాసకాసపాండ్వామయాన్హరేత్ । ఛర్దిహిక్కామపస్మారం ఉన్మాదంమూర్ఛరోగకం। అంగదాహం లింగదాహం వృద్ధోపితరుణాయతే । నపుంసోపుంస్త్వమాప్నోతివంధ్యాపుత్రవతీభవేత్ । సర్వరోగాపహరత్యేషః వృష్యం చైవరసాయనం । ఆయుర్మేధాబలకరం నవనాథేనభాషితః ॥

వ్యా॥ సువర్ణము, రజతము, పగడములు, వజ్రము, వైడూర్యము, ముత్యములు అభ్రకములోహము, కీటియొక్క భస్మము, ఒక్కొకభాగము, రసభస్మ 2 భా, వంగము నీలములు, వైక్రాంతము, సీసము, వీటిభస్మములు, వక్కొకభాగము, వీటినన్నిటిని ఖల్వమందుంచి, పెన్నేరు, నేలగుమ్మడి, అరటిదుంప, పల్లేరు, బూరగ, చెరుకు, అడ్డసరము, పిల్లిపీచర, తామరతూండ్లు, మంచిగంధము, వట్టివేరు, జాజిపువ్వులు, కురువేరు ద్రాక్షపండ్లు, ఖర్జూరకాయలు, బూడిదగుమ్మడికాయ, అరటిస్తంభములోని రసము,

అల్లము, పాలసుగంధి, వీటిరసములచే ప్రత్యేకముగా మూడేసిరోజులు మర్దించి పచ్చ కర్పూరము 1 భా, కస్తూరి 1భా, కలుపుకొని,లవంగములు, కుంకుమపువ్వు, మాలతీ పుష్పములు, జాజిపువ్వులు, పసపు, అగరుచెక్క, పద్మములు, అన్నిరకములైన పుష్పజాతులు, వీటిరసములచేతను, పన్నీరుచేతను, భావనచేసుకునిన, వసంతకుసుమా కరమనెడి పేరంబరగు. దీనిని అనుపానవిశేషములచే వల్లప్రమాణము సేవించిన ఇక్షుమేహములు, మధుమేహము, అతిమూత్రము, తంతుమేహము, రక్తమేహము, మూత్రకృచ్ఛ్రము, అశ్మరి, పిష్టమేహము, లాలామేహము, వసామేహము, హరిద్రా మేహము, శుక్లమేహము, అన్నివిధంబులైన ప్రమేహములు, వీనినితప్పక నశింప చేయును. రక్తపిత్తము, అమ్లపిత్తము, శ్వేతరక్తప్రదరములు, క్షయ, నంజు, అరుచి, శ్వాస, కాస, పాండువ్యాధి, వాంతులు, ఎక్కిళ్ళు, అపస్మారము, ఉన్మాదము, మూర్ఛరోగము, శరీరతాపము, లింగతాపము, వీటిని నశింపజేయును. దీనిసేవనచే వృద్ధుడుకూడ యౌవనవంతుడు, నపుంసకుడు పుంస్త్వముకలవాడు, గొడ్డురాలు, సంతానముకలది, అగును, సర్వరోగములను హరించును. రసాయనంబు వీర్యవృద్ధి, ఆయుర్వృద్ధి, బుద్ధిబలము, వీటినిచేయును. ఇది నవనాధునిచే చెప్పబడెను.

# మహావసంతకుసుమాకరం.

## (వంటయోగం)

శ్లో॥ సువర్ణతామ్రకిట్టంచ వైక్రాంతం తీక్ష్ణమాయసం। ముక్తాఫలం విద్రుమంచ పారదం గంధకంతథా। ప్రత్యేకంచైవ భాగంచ నాగంవంగంచకాంతకం। అభ్రకంచశిలాచూర్ణం చంద్రంవజ్రంచటంకణం। ప్రత్యేకం వేదభాగంచ ఉత్పలద్రవమర్దితం। వాశావిదారీ కూష్మాండ చందనోశీరవాలకైః। మర్దితం త్రిదినంగాఢం కాచకుప్యాంతు నిక్షిపేత్। పాచితం తు క్రమేణైవ ఏకరాత్ర మతంద్రితః। సాంగశీతలముద్ధృత్య పునఃఖల్వే వినిక్షిపేత్। గుడూచీసత్వసిందూరం ప్రత్యేకం వేదభాగకం। ఘనసారం మృగనాభిం ప్రత్యేకం చైకభాగకం। ఖల్వమధ్యే వినిక్షిప్య సర్వాంసం మిశ్రితంతథా। శతపత్రరసేనైవ గవ్యదుగ్ధేనచాష్టధా। ముసలీక్షుగణేనాష్ట ఉశీరంవాలకంతథా। భావయేదష్టరాత్రాణిహరిద్రాద్వయజీరకైః। రంభాకాండ రసేనైవ భావయేదష్ట రాత్రకం। ఇందీవరం చవరీచ చందనద్వయజాతిభిః। సమస్తపుష్పజాత్యాచ భావయే దష్టవారకం। వసంతకుసుమాకర నామ్నాయం మహచ్ఛబ్ద విభాసితం। ద్వివల్లంవాథవల్లంవా అనుపాన నిషేవితం। నానామేహ

ప్రశమనం మూత్రకృచ్ఛ్రం తథాశ్మరీం । క్షయంపాండుంచ పిత్తంచ అంగదాహాంతథైవచ । కరపాదదాహం శూలంనేత్రదాహం శిరోరుజం। అతిమూత్రం మధుమేహం కాసంశ్వాసం తథార్శసం । ప్రదరంయోని శూలంచ వంధ్యాదోషంచ యోషితాం । వృష్యం రసాయనం శ్రేష్ఠం బుద్ధీంద్రియబలప్రదం॥

వ్యా॥ సువర్ణము, తామ్రము, మాండూరము, వైక్రాంతము, తీక్ష్ణలోహము, ఇనుము, ముత్యములు, పగడములు, వీటిభస్మలు, ఏకైక భాగము, శు. పాదరసము 1 భా, శు. గంధకము 1 భా, సీసము, వంగము, కాంతము, అభ్రకము, శిలాజత్తు, వెండి, వజ్రములు, టంకణము, వీటిభస్మములు, నాలుగేసి భాగములు, వీటిని నల్లకలువ, అడ్డసరము, నేలగుమ్మడి, బూడిదగుమ్మడి, మంచిగంధము, వట్టివేళ్ళు, మరువేరు, వీటిరసములచే మూడేసిరోజులు ప్రత్యేకముగా మర్దించి కాచుప్పెయందుంచి వాలుకాయంత్రమందు క్రిమాగ్నులచే ఏకరోజువండుమని సాంగశీతలమునతీసి ఖల్వమందుంచి, తిప్పసత్తు 4 భా, రససిందూరము 4 భా, పచ్చకర్పూరము 1 భా, కస్తూరి 1 భా, కలుపుమని పద్మములు, అవుపాలు, నేలతాడి, చెరుకు, వట్టివేరు, పసపు, మానుపసపు, జీలకర్ర, అరటిస్తంభము, నల్లకలువ, పిల్లిపీచర, మంచిగంధము, ఎర్ర చందనము, జాజిపువ్వులు, అన్నిరకముల పువ్వులు, వీటిరసములచే ప్రత్యేకముగా ఎనిమిదేసి రోజులు భావనచేసుకునిన, 'మహావసంతకుసుమాకరము'నబడును. దీనిని రెండు ఎల్లముల ప్రమాణము, లేక వల్లప్రమాణము, అనుపానవిశేషములచే సేవించిన, సమస్తప్రమేహములను, మూత్రకృచ్ఛ్రము, అశ్మరి, క్షయ, పాండు, పైత్యవ్యాధులు, శరీరతాపము, కాళ్లుచేతులు మంటలు, శూల, కళ్లమంటలు, తలనొప్పి, అతిమూత్రము, మధుమేహము, కాస, శ్వాస, మూలశంక, స్త్రీలకు కలుగు శ్వేతరక్తప్రదరములు, యోనిశూల, వంధ్యాదోషము, వీటిని నశింపజేయును. ముసలితనము రోగములను పోగొట్టును. వీర్యవృద్ధి, బుద్ధిబలము, వీటిని కలుగజేయును.

## వసంత కుసుమాకరం

### (వంటయోగం) ప్రకారాంతరం.

సీ॥ హాటకరౌప్యకాంతాభ్రకభస్మముల్ రసగంధకంబు లింపెసగసమము । గూరిచిలెస్సగా గోక్షీరములనూరి గుళికలు గావించి కుప్పెనుంచి । త్రివిధాగ్నులం దొక్కదినము వాలుకాయంత్రాన నొండ యౌషధమునకు సమము । పగడము త్రియ సీసతగరభస్మంబులు రస భూతి రససిందురమును మరియు । కస్తూరియును పచ్చకర్పూరమును మంచి కుంకుమపువ్వునుగూర్చి ద్రాక్ష । పళ్ళ ఖర్జూర పండుల నుసిరిక

పండుల నరటిపండుల రసముల । నేలతాడియు మల్లిపూల రసంబుల మర్దించి పూటకు మాషమెత్తు । మధ్వాజ్యశర్కరముల్ మధురోష్ణ ధారలు మొదలుగా ననుపానములను గొనుచు । మధురాన్నపానముల్ మాంసమద్యంబును బహువిధభక్ష్యముల్ ఫలములమర । భుజియింప దేహసంపుష్టితుష్టియు దృష్టిగలిగించు సంసర్గకామదంబు । కాంతి సుఖ దంబు సంతానకరణంబు । నాయురారోగ్యవృద్ధి యీనవని నివ్వవసంత కుసుమాకరమున । దయాంతరంగ కంసమదభంగ శ్రీరంగ ఖగ తురంగా॥

వ్యా॥ సువర్ణభస్మ, రజతభస్మ, కాంతభస్మ, అభ్రకభస్మ, శు. రసము, గంధకము, ఇవి సమభాగములు గ్రహించి ఆవుపాలచేనూరి మాత్రలుచేసి కుప్పెయందుంచి వాలుకాయంత్రమందు అగ్నిత్రయముచే వక్కరోజునండి పగడభస్మ, ముత్యభస్మ, సీసభస్మ, వంగభస్మ, రసభస్మ, రససిందూరము, కస్తూరి, పచ్చకర్పూరము, కుంకుమపువ్వు, ఇవన్నియుకలసి పైవండగావచ్చిన మందుతో సమానము కలుపుమని ద్రాక్షపండ్లు, ఖర్జూరపండ్లు, ఉసిరిపండ్లు, అరటిదుంప, నేలతాడి, మల్లిపువ్వులు, వీటి రసములచే మర్దించి పూటకు మాషప్రమాణము చొప్పున తేనె, నెయ్యి, పంచదార, తియ్యటి ఉష్ణధారలు మొదలగు అనుపానములచే సేవించుచు తియ్యటి అన్నపానములు, మాంసము, మద్యము, అనేక విధములైన పిండివంటకములు, పండ్లను భుజించుచుండిన శరీరపుష్టి, మనస్సంతోషము, దివ్యదృష్టి, మన్మథోద్రేకము, శరీర కాంతి, సుఖము, సంతానము, ఆయుర్వృద్ధి, ఆరోగ్యవృద్ధి, వీటిని ఈ వసంతకుసుమాకరము కలుగజేయును.

## క్షయరాజ మృగాంక రసం

సీ॥ పాలు తామ్ర విభూతిపాల్ రెండుమనఃశిల గంధకంబును తాళకంబును నట్టె । పాళ్ళురెండును సూతభస్మంబు గలవేసి తద్భాగ హేమ భస్మంబునొసగి । మేకపాలను యిన్ని యేకంబుగా నూరి గవ్వల ద్వాలనిండ కలకముంచి । గంటుపై వెలిగారంబు మెత్తగాపాలతో నూరి నముచేసి । కుండలోపలబోసి మృత్తిక బూసిగజ పుటంబుగ వేసి

గవ్వలోని చూర్ణయోగము దీసియహివల్లి యార్ద్ర/

స్వరసాల యదియునూరి । కణికలు రాజమృగాంకంబు గావించి యా యాయుదోడ్తోన హారణమయిన । అనుపానములతోడ నడ్డిగెత్తగ

పూటచొప్పున సేవించి । యుప్పుపులుసు ఆవనూనెయు నెయ్యి నః
ష్ణముల మాని । విసుగకన్నంబు పెసరపప్పు కుడుచుచుండిన రోగకుల
మెల్ల శాంతించు బహువిధక్షయములు బాసిపోను । అరుచిమందాగ్ని
గుల్మరక్తార్శః శూలపాండు । శోఫాంత్రరాధ్మాన వాయుకీల । శ్వాస
కాసాతిసారముల్ శాంతినొందగు । రక్తగతమైన జీర్ణజ్వరంబు
లుడుగు॥

టీ॥ తామ్రభస్మ 1 భా, శు. మణిశిల, 2 భా, శు. గంధకము 2 భా, శు. తాళకం 2 భా, రసభస్మ 2 భా, సువర్ణభస్మ 2 భా, వీటిని మేకపాలచేనూరి గవ్వలయందుంచి మేకపాలచే నూరబడిన వెలిగారముచే ఆగవ్వల ముఖములుమూసి కుండలో వుంచి మూకుడు కప్పిసంధి బంధనముచేసి గజపుటమువేసి తీసి గవ్వలయందలిచూర్ణము తీసి, తమలపాకులు, అల్లము, వీటిరసములచే నూరి మప్పెలు కట్టుకునిన రాజమృగాంకమనబడును. ఇది ఆయావ్యాధిహారణమైన అనుపానములతో పూటకు అడ్డిగయెత్తు సేవించుచు, ఉప్పు, పులుసు, ఆవ, నూనె, నెయ్యి, వేడిచేయుపదార్థములు వీటిని మాని, పెసరపప్పు అన్నము, విసుగులేకుండ తినుచుండిన, అన్నివిధములైన రోగములు, అన్నిక్షయలు, అరుచి, అగ్నిమాంద్యము, గుల్మము, రక్తార్శస్సు, శూల, పాండు, నంజు, అంత్రవృద్ధి, కడుపుఉబ్బరము, వాతవ్యాధులు, శ్వాస, కాస, అతిసారము, జీర్ణమై రక్తగతమైన జ్వరములు, వీటిని శాంతి పొందించును.

## మహామృగాంకరసం.

శ్లో॥ నిరుద్ధభస్మ సౌవర్ణం ద్విగుణంభస్మ సూతకం । త్రిగుణం
భస్మ ముక్తోత్థం శుకపుచ్ఛం చతుర్గుణం । మృతరౌప్యంచ పంచాంశం
తారభస్మ చతుర్గుణం । సప్తభాగం ప్రవాలంచ రసతుల్యంచ టంకణం ।
సర్వమేకత్రసంమర్ద్య త్రిదినంలుంగవారిణా । తతశ్చగోలకంకృత్వా శోష
యిత్వాఖరాతపేలవణైః పాత్ర మాపూర్యతన్మధ్యేగోలకంక్షిపేత్ । తన్ము
ఖంతు మృదారుద్ధ్వాపచేద్యామచతుష్టయం! ఆకృష్య చూర్ణితంసర్వం
ప్రదేయం పూర్వభాగికం । వజ్రంవాతదభావే వైక్రాంతంతత్సమాంశకం।
మహామృగాంకః ఖలుసిద్ధఏషశ్రీనందినాథ ప్రకటీకృతోయం । వల్లోస్య
సేవ్యోమరిచాజ్యయుక్తః సేవ్యోథవా పిప్పలికాసమేతః । తత్రోపచారాః
కర్తవ్యాస్సర్వే క్షయగదోదితాః । ముద్గంఘృతంచ భోక్తవ్యం త్యా
జ్యం సూతవిరోధియత్ । యక్ష్మాణం బహురూపిణం జ్వరగణం గుల్మం

తథావిద్రధిం మందాగ్నిం స్వరభేదకాసమరుచిం వాంతించ మూర్ఛా భ్రమం । అష్టావేవమహాగదాన్ గదగణాన్ పాండ్వామయం కామలాం। పిత్తార్తింసకలగ్రహాన్ బహువిధానన్యాం స్తథానాశయేత్॥

వ్యా॥ సువర్ణభస్మ 1 భా, రసభస్మ 2 భా, ముత్యభస్మ 3 భా, శు. గంధకము, 4 భా, హేమమాక్షికభస్మ 5 భా, రజతభస్మ, 4 భా, పగడభస్మ 7 భా, శు. టంకణము 2 భా, వీటిని మాదీఫలరసముచే మూడురోజులు మర్దించి ఉండచేసుకుని మట్టిచే పూయబడిన వస్త్రముచే చుట్టి తీవ్రమైన ఎండను ఎండించి వకకుండయందు ఉప్పుపోసిమధ్యయందు ఆగోలకమునుంచి కుండపై మూకుడుమూసి సంధిబంధనముచేసి నాలుగుర్ఖాములు వండుకుని తీసుకుని అంతయు నూరుకుని వజ్రభస్మ 1 భా. ఈభస్మలేనియెడల దానితో సమానము వైక్రాంతభస్మ కలుపుకొనవలయును. ఇట్లు సిద్ధమైనది మహామృగాంకము నబడును. ఇది నందిచే చెప్పబడెను. ఇది వల్లప్రమాణము మిరియాల చూర్ణము నెయ్యి వీటితోగాని, పిప్పళ్ళచూర్ణముతోగాని, సేవించవలెను. క్షయవ్యాధియందు చెప్పబడిన ఉపచారములన్నియు చేయవలెను. పెసరపప్పు, నెయ్యి, పుచ్చుకొనవలెను. పాదరసమునకు విరోధమైన వస్తువులు విడిచిపెట్టవలయును. అనేకవిధములైన క్షయ, జ్వరసముదాయము, గుల్మము, విద్రధి, అగ్నిమాంద్యము, స్వరభేదము, దగ్గు, అరుచి, వాంతి, మూర్ఛ, భ్రమ, వాతవ్యాధి అశ్మరి మొదలగు ఎనిమిది మహావ్యాధులు, వ్యాధిసముదాయములు, పాండు, కామిర్ల, పైత్యవ్యాధులు, సమస్తగ్రహములు, ఇతరమైన అనేక వ్యాధులు, వీటిని నశింపజేయును.

## మహామృగాంక రసమ్

శ్లో॥ శుద్ధసూతం స్వర్ణభస్మజంబీరైర్మర్దయేద్దినం । తయోర్ద్విగుణితంతామ్రం త్రిభిస్తుల్యంతుగంధకం । టంకణంగంధకార్ధంచ సర్వం జంబీరజైర్ద్రవైః। మర్దయించతుర్యామంగోలం వస్త్రేంబధ్వా విపాచయేత్ డోలాయంత్రేచారనాలే యామాదుద్ధృత్య శోషయేత్ । తతోమృణ్మయభాండాం తర్లవణం చాంగులద్వయం । ఊర్ధ్వాధ శ్చాప్యష్టకృత్వాచ గోలకంవస్త్రివేష్టితం। లవణైఃపూరయేద్భాండేమధ్యేధృత్వాదినంపచేత్ । పాచ్యంక్రమాగ్నినా సిద్ధోరసోమహామృగాంకకః । అనేనైవప్రకారేణ మృగాంకానాన్పాచయేద్రసాన్। రాజరోగనివృత్యర్థం దేయంసితాజ్యసంయుతం । దశభిర్మరిచైస్సార్ధం పిప్పలీమధునాపివా ॥

వ్యా॥ శు. రసము 1 భా, సువర్ణభస్మ, 1 భా, వీటిని నిమ్మకాయలరసముచే ఒకరోజు మర్దించి, తామ్రభస్మ, 4 భా, శు. గంధకము 6 భా, శు. టంకణము 3 భా, వీటిని నిమ్మకాయలరసముచే నాలుగుఝాములు మర్దించుకొని బట్టయందు మూటకట్టుకొని డోలాయంత్రమందు కలియందు ఒకఝాము వండుకొని తీసి ఎండించి ఒక కుండలో రెండుఅంగుళముల ఉప్పునుపోసి చుట్టుప్రక్కల, 8, అంగుళములఉప్పుపోసి ఆమందుమూటను ఆ ఉప్పుమధ్యయందుంచుకొని ఆఉప్పుచే కప్పి ఒకరోజు క్రమయాగ్నులచే వండుకొనవలయును. ఇట్లు సిద్ధమైనది, మహామృగాంకరసము, నబడును. ఈవిధము గనే మృగాంకరసములను వండుకోవలయును. ఇది రాజయక్ష్మ పోవుటకై పంచదార నెయ్యి, పదిమిరియాలుచూర్ణము, పిప్పలిచూర్ణము, తేనె, వీటితో యివ్వవలయును.

# మృగాంకరసం

శ్లో॥ రసభస్మ స్వర్ణభస్మ నిష్కం నిష్కం ప్రకల్పయేత్ శంఖగంధక ముక్తానాం ద్వౌ ద్వౌ నిష్కౌతు చూర్ణయేత్ । ముక్తాభావేవరాటోవా రసభాగంచ టంకణం । వహ్నిగోక్షుర క్వాథేన మర్దయేత్ప్రహరద్వయం । తద్గోలకం విశోష్యాథ భాండే లవణపూరితే । పచేద్యామ చతుష్కంచ మృగాంకోయం మహారసః । రోగరాజని వృత్త్యర్థం చతుర్గుంజామితం ఘృతైః । దాతవ్యం మరిచైస్సార్ధం పిప్పలీ మధునాపివా॥

వ్యా॥ రసభస్మ, 1 భా, సువర్ణభస్మ, 1 భా, శంఖభస్మ 2 భా, ముత్యభస్మ, అభావమందు, గవ్వలభస్మ, 2 భా, శుటంకణం 1 భా, వీటిని, చిత్రమూలము, పల్లేరువీటిరసములచె రెండుఝాములు మర్దించి ఉండచేసి ఎండించి ఉప్పుచేనింపబడిన కుండయందుంచి నాలుగుఝాములువండుకొని నాలుగుగుంజల ప్రమాణము నెయ్యి, మిరియాల చూర్ణముతోగాని, పిప్పళ్ళచూర్ణము, తేనెవీటితోగాని యిచ్చిన ఈ మృగాంకరసము, రాజయక్ష్మను నివర్తింపజేయును.

# లఘుమృగాంకరసం

శ్లో॥ రసభస్మ హేమభస్మ తుల్యంగుంజాద్వయం పృథక్ । పూర్వవదనుపానేన మృగాంకోయం క్షయాపహం । భాగ దుగ్ధానుపానేన పథ్యంచైవ యథాక్రమం॥

వ్యా॥ రసభస్మ, సువర్ణభస్మ, ఇవిసమభాగములు,కలుపుకొని నాలుగుగురిగింజల ప్రమాణము. ఇదివరకు చెప్పినఅనుపానములతో యిచ్చుచు మేకపాలు త్రాగించి సరియైన పథ్యముచేయించినయెడల ఈమృగాంక రసము, క్షయను పోగొట్టును.

## రాజమృగాంక రసం

శ్లో॥ రసభస్మ త్రిభాగంచ భాగైకం హేమభస్మకం । మృత తామ్రస్య భాగైకం శిలాగంధక తాలకం । ప్రతిభాగద్వయం శుద్ధమే కీకృత్వావి చూర్ణయేత్ । వరాటాన్ పూరయేత్తేన అజాక్షీరేణటంక ణం । పిష్ట్వాతేనముఖం రుద్ధ్వామృద్భాండే సన్నిధాపయేత్। శుష్కం గజపుటేపాచ్యం చూర్ణయేత్స్వాంగశీతలం । రసోరాజమృగాంకోయం చతుర్గుంజః క్షయాపహః ।ఏకోనవింశన్మరిచైర్ఘృతేన సహాభక్షయేత్। దశానాం పిప్పలీనాంచ చూర్ణందత్వా ప్రదాపయేత్ । క్షయేకాసే జ్వరే పాండౌగ్రహణ్యామతిసారకే॥

వ్యా॥ రసభస్మ 3 భా. సువర్ణభస్మ 1 భా, తామ్రభస్మ 1 భా, శు. మణిశిల 2 భా, శుగంధకము 2 భా, శుతాళకము 2 భా, ఇవికలుపుకొని నూరుకొని గవ్వలయం దుంచి మేకపాలతో టంకణమునూరి దానిచె ఆగవ్వలముఖములను మూసి కుండయం దుంచి మూకుడు కప్పుసంధి బంధనముచెసి ఎండినపిదప గజపుటమువేసుకొని స్వాంగ శీతలమున తీసి, చూర్ణము చేసుకొనవలెను. ఈ రాజమృగాంక రసము, నాలుగు గురిగింజల ప్రమాణము, 19 మిరియములు, 10 పిప్పళ్ళు వీటిచూర్ణమునెయ్యి వీటితో క్షయ, దగ్గు, జ్వరము, పాండు, గ్రహణి, అతిసారము, వీటియందుయివ్వవలెను.

## రత్నరాజ మృగాంకరసం

శ్లో॥ నీలం వజ్రంచ వైడూర్యం తార్క్ష్యకంచ ప్రవాలకం । గోమేదికం మౌక్తికంచ మాణిక్యం పుష్యరాగకం । తామ్రం తీక్ష్ణా భ్రకం కృష్ణం కాంతసిందూర స్వర్ణకం । గంధం సూతం విషం తాలం సమాంశం చిత్రకద్రవైః । విశ్వౌషధరసైర్మర్ద్యం వాలుకాయంత్ర కేపచేత్ । త్రిదినం లక్షణాద్యుక్తం స్వాంగశీతల ముద్ధరేత్ । మర్దయే చ్చూర్ణమాఖ్యాతం రత్నరాజ మృగాంకకం । ఏతస్య మాషమాత్రంచ భక్షయేత్ క్షయరోగజిత్ ॥

వ్యా॥ నీలము, వజ్రము, వైడూర్యము, పచ్చలు, పగడములు, గోమేదికము, ముత్యములు, కెంపులు, పుష్యరాగములు, తామ్రము, లోహము, అభ్రకము, మాం దూరము, కాంతము, సువర్ణము, వీటిభస్మములు శు, గంధకము, శు. రసము, శు. నాభి శు. తాళకము, ఇవి సమభాగములు చిత్రమూలము, శుంఠి వీటిరసములచే మర్దించి కాచకుప్పెయందుంచుకుని వాలుకాయంత్రమందు మూడురోజులు యధావిధిగా వండుకుని స్వాంగశీతలమునతీసి, నూరుకునవలయును. ఈ రత్నరాజమృగాంకము, మాషప్రమాణము భక్షించిన, క్షయను నశింపజేయును.

## మౌక్తికరాజమృగాంక రసం

శ్లో॥ రసేనతుల్యా కనకం తయోస్తు సామ్యేన యుంజ్యాన్నవమౌక్తికాని । రసప్రమాణోబలిరంఘ్రిభాగః క్షారశ్చసర్వంతుషవారిణాతు సంమర్ద్యవస్త్రేతునిధాయగోలం దినంపచేత్తం లవణేనపూర్ణే । భాండేమృగాంకోయమతిప్రగల్భః క్షయాగ్నిమాంద్యగ్రహణీగదేషు । సాజ్యోషణాభిర్మధుపిప్పలీభిర్వల్లోస్య దేయోనతతోధికస్తు । పథ్యంహితంశీతలమేవయోజ్యంత్యాజ్యం సదాపిత్తకరం విదాహి॥

వ్యా॥ శు రసము 1 భా, సువర్ణభస్మ 1 భా, ముత్యభస్మ 2 భా, శు గంధకము 1 భా, శు టంకణము 3 భా, ఇవన్నియు తాండ్రకషాయముచే నూరుకుని మాత్రలు చేసుకుని మట్టిపూసిన వస్త్రమందుంచుకుని దానిని ఉప్పుచే నిండించబడిన భాండమందుంచి ఒకరోజు వండుకునవలెను. గాఢమైన ఈ మృగాంకరసము, నెయ్యి, మిరియాల చూర్ణముతోను, తేనె పిప్పళ్ళచూర్ణముతోను, వల్లప్రమాణము, క్షయ, అగ్నిమాంద్యము, గ్రహణిరోగము, వీటియందు యివ్వవలయును. వల్లప్రమాణము కంటె ఎక్కువ యివ్వకూడదు. హితకరము, శీతవీర్యముకల పదార్థములనె యివ్వవలెను. పైత్యజనకములు, తాపజనకములు అగు పదార్థములను ఎంతమాత్రము సేవించరాదు.

## నవరత్నరాజమృగాంకరసం

శ్లో॥ సూతంగంధక హేమతారరసకం వైక్రాంతకాంతాయసం వంగంనాగ పవిప్రవాలవిమలా మాణిక్యగారుత్మతం । రౌప్యం మౌక్తిక పుష్యరాగజలజం వైడూర్యకం శుల్బకం । శుక్తిస్తాలక మభ్రహింగుల శిలాగోమేదనీలంసమం । గోక్షూరైః ఫణివల్లి సింహవదనా ముండీకణా

చిత్రకైరిక్షు భిన్నరుహాహరప్రియాజయాద్రాక్షావరీజద్రవైః। శోఫఘ్నీశత
పత్రికా మధుజలైస్సశాల్మలీధాతకీ జాతీసప్త బలాచతుష్టయ జలత్వ
గ్దేవపుష్పద్రవైః। తక్కోలైర్మదనాగ కేసరజలైర్భావ్యం పృథక్ సప్త
ఖాభాండే సింధుభృతే మృగాంకవదయంపాచ్యః క్రమాగ్నౌదినం। భూ
యఃప్రాక్సముదాహృతైర్ద్రవచయైస్సంభావయేత్పూర్వవత్పశ్చాత్తుల్య
భాగశీతలరజః కస్తూరికాభావనా। గోప్యాద్గోప్యతరం రసాయనమిదం
శ్రీశంకరేణోదితం। గుంజాసింధుయుతం కణామధుయుతం శోఫేచపాండ్వామ
యే। వాతవ్యాధి ముపద్రవైశ్చసహితం మేహాంస్తథా వింశతిం। సంయో
జ్యంచ హరీతకీ గుడయుతం వాతాస్రకే దుర్జయే। గంభీరేచ గుడూచి
సత్వచపలాక్షౌద్రైస్సు సంయోజిత స్త్వాధ్మానారుచి శూలమాంద్య
కసనాపస్మారవాతోదరాన్। శ్వాసాన్ సంగ్రహణీంహలీమక మథో సర్వ
జ్వరాన్నాశయేద్ధాతూన్పోషయతి క్షయం క్షపయతిశ్యామా శతంయా
వనం। ప్రౌఢాటోపయుతం కరోతి సహసాతారుణ్య గర్వోర్జితం। సిద్ధో
రాజమృగాంకఏషజయతి స్వస్యానుపానైర్గదాన్॥

వ్యా॥ శు. రసము, శు. గంధకము, సువర్ణభస్మ, రజతభస్మ శు, కఫరి, వైక్రాంతభస్మ, కాంతభస్మ, లోహభస్మ, వంగభస్మ, సీసభస్మ, వజ్రభస్మ, పగడభస్మ, విమలభస్మ, మాణిక్యభస్మ, మరకతభస్మ, హేమమాక్షికభస్మ, ముత్యభస్మ, పుష్యరాగభస్మ, శంఖభస్మ, వైడూర్యభస్మ, తామ్రభస్మ, ముత్యపుచిప్పలభస్మ, శు. తాళకము, అభ్రకభస్మ, శు. ఇంగిలీకము, శు. మణిశిల, గోమేదభస్మ, నీలములభస్మ, ఇవన్నియు సమభాగములు గ్రహించి, పల్లేరు, తమాలపాకులు, అడ్డసరము, బోడతరము, పిప్పళ్లు, చిత్రమూలము, చెరుకు, తిప్పతీగ, మారేడు, గంజాయి, ద్రాక్షపండ్లు, పిల్లిపీచర, గలిజేరు, శతపత్రిక, బూరుగ, ఆరెపువ్వు, జాజికాయలు, బలాచతుష్టయము, దాచెనచెక్క, లవంగములు, కంకోలములు, నాగకేసరములు, వీటిరసములచే ప్రత్యేకముగా ఏడేసిసారులు భావనచేసుకొని మాత్రలుచేసుకొని, మట్టిచే పూయబడినవస్త్రమందుంచుకొని ఉప్పుచే నింపబడినకుండయందు మృగాంకరసమువలెనే క్రమాగ్నులయందు ఒకరోజు వండుకొని తీసి పూర్వమందుచెప్పబడిన రసములచేతిరిగి పూర్వమువలెనే భావనచేసుకొని పచ్చకర్పూరము, కస్తూరి సమభాగములు కలుపుకొని కుప్పెలుకట్టుకొనవలయును. ఇదిమిక్కిలి గోపనీయము. రసాయనంబు, శంకరునిచే చెప్పబడినది. గురిగింజ ప్రమాణము, సైంధవలవణము, పిప్పలిచూర్ణము, తేనె, వీటితో సేవించిన, వంజు, పాండువ్యాధి, ఉపద్రవములతోకూడిన వాతవ్యాధులు, ఇరువదిమేహములు, వీటిని నశింపజేయును. కరక్కాయచూర్ణము, బెల్లము, వీటితోయిచ్చిన కఠినమైన, అంత

ర్శ్రేయమైన వాతరక్తమును, నశింపజేయును. తిప్పసత్తు, పిప్పళ్ళచూర్ణము, తేనె, వీటితో సేవించిన, కడుపుఉబ్బరము, అరుచి, శూల, అగ్నిమాంద్యము, దగ్గు, అపస్మారము, వాతోదరము, శ్వాస, సంగ్రహణి, హలీమకము, సమస్తజ్వరములు, క్షయ, వీటి నినశింపజేయును. ధాతువులను వృద్ధిపొందించును. మిక్కిలిమదించినవాడై యౌవనవంతులైన నూరుగురు స్త్రీలమొక్క మదమునుహరించును. ఈ 'రాజమృగాంకరసమును' ఆయా అనుపానములచే సమస్తవ్యాధులను నివారింపజేయును.

# నవరత్న మహారాజమృగాంక రసం

శ్లో॥రసభస్మ త్రిభాగంచ షడ్భాగంహేమ భస్మకం।మృతతామ్రం చైకభాగం ద్విభాగం రౌప్యభస్మకం। తత్తుల్యానాగ వంగౌచ వజ్రమేకం చతుర్గుణం। గోమేదకంచ ద్విగుణం కాశ్మీరం సప్తమౌక్తికం। పద్మరాగేంద్ర నీలంచ రాజావర్తం తథైవచ। గరుడోద్గారవైక్రాంతం ప్రవాలం హేమమాక్తికం। తీక్ష్ణంకాంతం వ్యోమగంధం పంచభాగం పృథక్పృథక్। కదలీకంద సారేణమాలతీ పుష్పజద్రవైః। ఉశీరద్వయ సారేణ గోక్షురేణ విమర్దయేత్ ।ఏలాలవంగ సారేణ ఘనసారశతావరీ। ముసలీమూల సారేణమర్దయేచ్ఛ పృథక్పృథక్। త్రియామం వాలుకాయంత్రే పాచయేత్కమలాగ్నినా। సాంగశీతల ముద్ధృత్య పూర్వద్రావైర్వి మర్దయేత్। మహారాజమృగాంకోయం రాజయక్ష్మరుజాపహం। పీనసశ్వాసకాసంచ పాండుకామల హృద్రుజాన్। మహోదరార్శోగ్రహణీ వాతపిత్త హలీమకం। దీపనం వృష్యమాయుష్యం కాంతిస్త్రీబల వర్ధనం। తుష్టిపుష్టికరం మేధ్యం సర్వరోగేషు యోజయేత్। వల్లక్రమమిదం సేవ్యందధ్యాజ్య మధుసంయుతం। వలీపలిత విధ్వంసికామదం శుభదంతథా। మేహఘ్నం ప్రీతిదంసేవ్యం పరదృగ్జ్ఞానసాధనం। పాండ్వాదిగ్రహణీశూలమూత్రాతీసారం। జ్వరఘ్నమతివృష్యంచ అతీవరతికారకం। మహారాజ మృగాంకోయం సర్వరోగ హారంపరం॥

వ్యా॥ రసభస్మ, 3 భా, సువర్ణభస్మ 6 భా' తామ్రభస్మ 1 భా, రజతభస్మ 2 భా, సీసభస్మ, 2 భా, వంగభస్మ 2 భా, వజ్రభస్మ 1 భా, గోమేదకభస్మ, 4 భా, కుంకుమపువ్వు 2 భా, ముత్యభస్మ 7 భా, కెంపుభస్మ 7 భా, నీలభస్మ 7 భా,

రాజావర్తభస్మ 7 భా, పచ్చలభస్మ, 5 భా' హేమమాక్షికభస్మ 5 భా, శు. గంధక ము 5 భా, లోహభస్మ, 5 భా, కాంతభస్మ, 5 భా, అభ్రకభస్మ 5 శు. గంధకము 5 భా, వీటిని అరటిదుంప, మాలతీపుష్పములు, వట్టివేళ్లు, తెల్లవట్టివేళ్ళు, పల్లేరు యాల కులు, లవంగములు, తుంగగడ్డలు, పిల్లితేగలు, నేలతాడి, వీటిరసములచే ప్రత్యేకము గా మర్దించి కాచుపప్పియందుంచి వాలుకాయంత్రమందు కమలాగ్నిచే మూడుఝా ములు వండుకుని సాంగశీతలమున తీసి పూర్వపురసములచే మర్దించుకొనవలయును. ఈ మహారాజమృగాంకరసము, వల్లప్రమాణము, పంచదార, నెయ్యి, తేనె, వీటితో సేవించిన, రాజయక్ష్మ, జలుబు, శ్వాస, కాస, పాండు కామిర్ల హృద్రోగము, మ హోదరము, అర్శస్సు, వాతవ్యాధులు, పైత్యవ్యాధులు, హలీమకము, సమస్తవ్యాధులు, ముడతలు పడుట వెంట్రుకలు నెరయుట మేహములు పొంగు మొదలగువ్యాధులు, గ్రహణి, శూల, మూత్రాఘాతము, అశ్మరి, జ్వరములు, వీటిని నశింపచేయును, మరి యు అగ్నిదీప్తి, వీర్యవృద్ధి ఆయుర్వృద్ధి, కాంతి, సంభోగశక్తి, మనస్సంతోషము, శరీరపుష్టి, బుద్ధికుశలత, కోరికలు, శుభములు, ప్రీతి పరదృష్టిజ్ఞానము, మిక్కిలి వీర్యవృ ద్ధి మిక్కిలి సంభోగశక్తి' వీటిని కలుగజేయును. ఈమహారాజ మృగాంకరసము, స మస్తరోగములను హరించును.

# విషూచీ విధ్వంసన రసం

శ్లో॥ టంకణం మాక్షికం శుంఠీ పారదం గంధకం విషం । గర లంసమభాగేన సర్వేషాం హింగులం సమం । మర్దయేత్ జంబీరద్రా వైర్వ టీకార్యా ప్రయత్నతః । శ్వేతసర్షపతుల్యాచ మృతసంజీవనీతథా। విషూచీం నాశయత్యాశు దధ్యన్నం పథ్యమాంచరేత్ । త్రిదోషోత్థమతీ సారకం సర్వోపద్రవసంయుతం॥

వా॥ శొ, వెలిగారము, మాక్షికభస్మ, శుంఠి, శు. పాదరసము, శు. గంధ కము, శు. నాభి, గరళము, ఇవి సమభాగములు, వీటిఅన్నిటితో సమానము, శు. ఇంగిలీకము, వీటి నన్నిటిని నిమ్మకాయరసముచే మర్దించుకుని తెల్లఆవాలంత మాత్ర లుచేసుకుని సేవించిన విషూచి (కలరా)ను వెంటనే నశింపజేయును. పెరుగుఅన్నము పథ్యముగా యివ్వవలయును. త్రిదోషములవలన పుట్టి సమస్త ఉపద్రవములతో కూడిన అతిసారమును నశింపజేయును.

# గోరోచనము మాత్రలు

వ॥ గోరోచనము 1 భా, రసకర్పూరము. 1 భా, రససిందూ రము 1 భా, మిరియాలచూర్ణము, 1 భా, కటుకరోహిణి 1 భా, నాభి

1/2 భా, కస్తూరి 1/2 భా, ఇటుల వీనిని లవంగకషాయముతో మర్దించుకుని పెసరగింజలంతమాత్రలు చేసుకుని చంటిపిల్లలకు చనుపాలతో యిచ్చుకునేది.

# గోరోచనము మాత్రలు

## (ప్రకారాంతరం)

వ॥ గోరోచనము 1 భా, కటుకరోహిణి 2 భా, ఇంగిలీకము 1 భా, రసకర్పూరము 1 భా. కుంకుమపువ్వు 1 భా, ఆకలకర్ర 1 భా, లవంగములు 1 భా, నాభి ½ భా వీటిని మిరియాల కషాయముచే మర్దించుకుని పెసరగింజలంత మాత్రలుచేసుకుని చనుపాలతోగాని లేక ఆయా అనుపానములతో పసిపిల్లలకు యిచ్చుకునేది.

గుణములు—జలుబు, జ్వరము, దగ్గు, వాంతి, అజీర్ణము, విరేచనములు, ఎగరొప్పు, కడుపుఉబ్బరము, మలబంధము, మొదలగు వాటిని నశింపజేయును.

ఆయా రోగానుపానములతో పెద్దవారలకుకూడ వాడవచ్చును.

# మృగాంక పోటలీరసం

శ్లో॥ శంఖనాభింగవాంక్షీరైః పేషయేన్నిష్కషోడశ । తేన మూషా ప్రకర్తవ్యాతన్మధ్యే భస్మసూతకం । నిష్కార్ధం గంధకాత్త్రీణి చూర్ణీకృత్య వినిక్షిపేత్ । రుద్ధ్వాతద్వేష్ట యేద్వస్త్రై మృత్తికాం లేపయేద్బుధైః । శోష్యం గజపుటే పాచ్యం మూషయా సహ చూర్ణయేత్ । గుంజామాత్రః క్షయం హంతి మృగాంక పోటలీరసః॥

వ్యా॥ శంఖముయొక్క మొదటిభాగములను, 16 నిష్కములు గ్రహించి ఆవుపాలచే నూరుకుని దానిచే మూష (డిప్ప) చేసుకుని దానిమధ్యయందు రసభస్మ 1/2 నిష్కము, శు, గంధకము 3 నిష్కములు వీటిని చూర్ణముచేసుకుని ఉంచుకుని మూతమూసి బట్టచుట్టి పైన మట్టిపూసి ఎండించుకుని గజపుటముచేసుకుని మూషతోకూడ చూర్ణముచేసుకుని గుంజా ప్రమాణము సేవించిన ఈ మృగాంకపోటలీరసము క్షయను హరించును.

# ఆనంద రసమ్

శ్లో॥ నాగంవంగంతామ్రభస్మ శుద్ధపారదగంధకం ।అయస్కాం తం అభ్రలోహం రాజావర్తంచమౌక్తికం । విద్రుమమంమృతతారంచ కృష్ణారంభాప్రసూనకైః । స్వరసేనచఖల్వేచత్రిదినం మర్దితంపృధక్ ।కాచకుప్యాం నివేశ్యాధయంత్రే విద్యాధరేపచేత్ । సాంగశీతలముద్ధృత్య గంధపుష్పాక్షతార్చనం ।ధూపందీపంచనైవేద్యం తాంబూలంచసమర్పణం । తధారసైఃపునర్భావ్యం కస్తూరీకుంకుమంసమం । కర్పూరంనాగముస్తైశ్చమర్దయే ద్యామమాత్రకం । తతస్సంచూర్ణితంకృత్వావల్లమాత్రంప్రయోజయేత్ । సక్షౌద్రమాగధీచూర్ణం భక్షితంచక్షయాపహం। పాండూదరాన్ పంచకాసాన్ పీనసం చహలీమకం । జీర్ణజ్వరంయక్ష్మరాజంప్లీహానం ప్రదరగుల్మకే । సర్వవాతామయాన్ పిత్తాన్ క్షయకాసజ్వరాపహం । దీపనంవృష్యమాయుష్యం తేజో ధాతువివర్ధనం । బుద్ధిమాన్‌నీతిమాన్ భూత్వాబహుస్త్రీణాంభవేత్సఖీ । ఆనందరసవిఖ్యాతం సర్వరోగం హరంపరం॥

వ్యా॥ సీసభస్మ, వంగభస్మ, తామ్రభస్మ. శు. రసము, శు. గంధకము, అయస్కాంతభస్మ, అభ్రకభస్మ, లోహభస్మ, రాజావర్తభస్మ, ముత్యభస్మ, పగడభస్మ, రజితభస్మ, ఇవి సమభాగము గ్రహించి పిప్పళ్ళకషాయము చేతను అరటిపువ్వు రసము చేతను మూడేసిరోజులు ప్రత్యేకముగా మర్దించి కాచకుప్పెయందుంచి విద్యాధర యంత్రమందు వండుకుని సాంగశీతలమునతీసి మంచిగంధము, పుష్పములు, అక్షతలు చేతను పూజించి, ధూపము, దీపము, నైవేద్యము, తాంబూలము, వీటిని సమర్పించి మరల పూర్వపు రసములచే భావనచేసుకుని, కస్తూరి, కుంకుమపువ్వు, పచ్చకర్పూరము ఇవి వక్కొక్క భాగము కలుపుకుని, నాగముస్తల రసముచే వకఝామునుమర్దించుకుని పిదప చూర్ణముచేసుకుని వల్లప్రమాణము సేవించి తేనెతోకూడిన పిప్పళ్ళ చూర్ణమును [illegible]ంచిన, క్షయ, పాండు, ఉదరము, అయిదుదగ్గులు, జలుబు, హలీమకము, జీర్ణ [illegible]రము, రాజయక్ష్మ, ప్లీహవ్యాధి, ప్రదరము, గుల్మము, సమస్తవాతవ్యాధులు, పైత్యవ్యాధులు, క్షయశ్వాస జ్వరము, వీటిని పోగొట్టును. అగ్నిదీప్తి, వీర్యవృద్ధి, ఆయుర్వృద్ధి, తేజస్సు, ధాతువృద్ధి, వీటిని కలిగించును.బుద్ధిమంతుడు నీతివంతుడుఅయి సుఖముగా అనేకమంది స్త్రీలను రమించును. ఈ ఆనందరసము సమస్తరోగములను నివారింపచేయును.

## పారదాది లేపం

శ్లో॥ పారదం మర్దయేన్నిష్కం కృష్ణధత్తూరక ద్రవైః । నాగవల్లీ ద్రవైర్వాథ వస్త్రఖండం ప్రలేపయేత్ । తద్వస్త్రంమస్తకే బధ్వా ధార్యం యామత్రయం తతః । యూకాః పతంతి నిశ్చేష్టాః సలిక్షా నాత్రసంశయః॥

వ్యా॥ నిష్క ప్రమాణము పాదరసమును నల్లఉమ్మెత్త రసముచేగాని తామల పాకులరసముచేగాని మర్దించుకొని పిదపచిన్నవస్త్రమునకు పూసుకొని ఆవస్త్రముతలకు కట్టుకొని మూడుఝాములు ఉంచుకొనిన, పేలున్ను, ఈళ్ళున్ను తప్పక చచ్చిపడిపోవును.

## ఉదయమార్తాండ రసం

(తామ్రమైనం)

శ్లో॥ పలోన్మితస్య శుల్బస్య సూక్ష్మ పత్రాణికారయేత్ । తత్స మంగంధకం దత్వా ఖల్వే సర్వం వినిక్షిపేత్ । జంబీర రససంయుక్తం దినం ఘర్మేనిదాపయేత్ । తతః శుల్బేద్రవీభూతే రసకర్షం నియోజయేత్ । తత్సిద్ధ ముదరేయోజ్యం శోఫేచైవ భగందరే । నామ్నాతు దయమార్తండ రసఏషః ప్రకీర్తితః॥

వ్యా॥ శుద్ధమైన ఒకపలము తామ్రము పలచని రేకులుగాచేయించి ఒకపలము శుద్ధ గంధకమునుగ్రహించి ఈరెంటిని ఖల్వమందుంచి నిమ్మకాయలరసమునుపోసి ఎండయం దుంచుకొని తామ్రపు రేకులుకరిగినపిదప రసభస్మ ఒకకర్షముకలుపుకొని సిద్ధమైనదానిని ఉదరవ్యాధి, నంజు, భగందరము, వీటియందు యిచ్చుకొనవలయును. ఇది ఉదయమార్తండరసమని చెప్పబడెను.

## కృచ్ఛ్రాంతక రసం

శ్లో॥ సూతం స్వర్ణంచ వైక్రాంతం మృతంతుల్యంచ మర్దయేత్ । మధుయష్టీ ముస్తరసైః ద్వియామంతచ్చగోలకం । శుష్కంబధ్వాపుటేచ్చాపహః కరీషాగ్నౌ మహాపుటే । మాషమాత్రం లిహేత్ క్షౌద్రై ర్మూత్రకృచ్ఛ్రప్రశాంతయే । జయంతీ వాజయా శ్లేష్మకృచ్ఛ్ర నుత్తండు లోదకైః॥

వ్యా॥ రసభస్మ, సువర్ణభస్మ, వైక్రాంతభస్మ, ఇవిసమభాగములు, యష్టిమధుకము, తుంగగడ్డలు, వీటిరసముచే రెండుఝాములునూరుకొని ఉండలుచేసుకొని ఎండించి,

మూషుళ్ళయందుంచి సంధిబంధనముచేసి ఏరుపిడకలచే ఒకరోజు పెద్ద పుటము వేసుకుని మాష ప్రమాణము తేనెతో పుచ్చుకొనిన మూత్రకృచ్ఛమును శాంతిపొందించును. తెక్కలిగాని కరక్కాయగాని బియ్యపుకడుగుతో పుచ్చుకొనిన శ్లేష్మమూత్రకృచ్ఛమును నశింప జేయును.

# కర్పూర రసం

శ్లో॥ హింగుల మహిఫేనంచ ముస్తకేంద్ర యవంతథా । జాతీ ఫలంచ కర్పూరం సర్వం సంమర్ద్య యత్నతః । జలేన వటికా కార్యా ద్విగుంజాపరిమాణతః । జ్వరాతి సారిణేచైవ తథాతీసారరోగిణే । గ్రహణీష ట్ప్రకారేచ రక్తాతీసార ఉల్బణే॥

వ్యా॥ శు. ఇంగిలీకము, శు. నల్లమందు, తుంగగడ్డలు, కొడిశపాలవిత్తులు, జాజికాయ, హారతికర్పూరము, ఇవన్నియు జలముచేనూరుకుని రెండుగురిగింజల ప్రమాణము మాత్రలుచేసుకొని, జ్వరాతిసారము, అతిసారము, ఆరువిధములైన గ్రహణి, ప్రవృద్ధమైన రక్తాతిసారము, వీటియందు యివ్వవలయును.

# క్షయేశ్వర రసం

శ్లో॥ రసగంధకయో శ్చూర్ణ మేకీకృత్యాభ్రకం తథా । హేమ భస్మ సమంకృత్వా మర్దయేద్యామకం ద్వయం । త్ర్యూషణానిలవంగై లాటంకణం హేమతుల్యకం । కంటకార్యార్రసై ర్భావ్య మేకవింశతి వారకం । శిగ్రుబీజార్ద్రకరసై స్సప్తధా భావయేత్ పృథక్ । రసః క్షయేశ్వరోనామ కాసశ్వాసక్షయాపహః । అనుపానం ప్రయోక్తవ్యం

వ్యా॥ శు. రసము, శు, గంధకము, అభ్రకభస్మ, సువర్ణభస్మ, ఇవి రెండుఝాములు నూరుకుని, త్రికటుకములు, లవంగములు, ఏలకులు, పొ, వెలిగారము, ఇవన్నియు సమభాగములు కల్పుకుని నేలములగరసముచే 21 సారులును, మునగగింజలరసముచేతను, అల్లపురసముచేతను ప్రత్యేకముగా ఏడేసిసారులు భావనచేసుకొనవలయును. ఈక్షయేశ్వరరసము, దగ్గు, వగర్పు, క్షయ, వీటిని నశింపజేయును. తానికాయపై బెరడు అనుపానముగా యివ్వవలయును.

# రసదోషారియోగః

శ్లో॥ గంధకం మాషయుగ్మంచ నాగవల్లీ దళైస్సహా । ఖాదయే త్పారదగ్రస్తో దోషశాంతి స్తదాభవేత్॥

వ్యా॥ శు. గంధకము రెండుమాషములప్ర[redacted] తమలపాకులతో రసదోష ముకలవాడుతినిన రసదోషము వెంటనే శాంతించును.

## బడబానల రసం

శ్లో॥ శుద్ధసూతం సమంగంధం మృతం తామ్రాభ్రటంకణం। సాముద్రంచ యవక్షారం స్వర్జిసైంధవనాగరం। అపామార్గస్యచ క్షారం పాలాశం వత్సనాభకం। ప్రత్యేకం సూతతుల్యం స్యాచ్చణకామ్లేన మర్దయేత్। హస్తికన్యాద్రవైశ్చాపి ఆర్ద్రియుక్తం పుటేల్లఘు। మాషైకం భక్షయన్నిత్యం రసోయం బడబానలః। సర్వాగుల్మంనిహంత్యాశు గ్రహణీంచ విశేషతః। సర్వాజీర్ణప్రశమనం సర్వశూలవినాశనం॥

వ్యా॥ శు. రసము, శు. గంధకము, తామ్రభస్మ, అభ్రకభస్మ పొ, వెలిగారము, సాముద్రలవణము, యవక్షారము, స్వర్జికాక్షారము, సైంధవలవణము, శుంఠి, ఉత్తరేణిక్షారము, మోదుగక్షారము, శు. నాభి, ఇవిసమభాగములు గ్రహించి సెనగపులుసు కలుబంద, అల్లము, వీటిచే వకరోజు మర్దించి లఘుపుటము వేసుకొని మాషప్రమాణము సేవించిన ఈ బడబానలరసము సమస్తగుల్మములను, గ్రహణిని, సమస్తఅజీర్ణములను, సమస్తశూలలను హరించును.

## కస్తూరికా రసం

శ్లో॥ హింగులంచ విషంటంకం జాతీకోశఫలం తథా। మరిచపిప్పలీచైవ కస్తూరీచ సమాంశకా। రక్తిద్వయంతతఃఖాదేత్సన్నిపాతే సుదారుణే। శ్లేష్మరోగేషు సర్వేషు వాతరోగే తథైవచ॥

వ్యా॥ శు, ఇంగిలీకము, శు. నాభి, పొ, వెలిగారము, జాజికాయ, మిరియాలు పిప్పళ్లు, కస్తూరి, ఇవి సమభాగములు గ్రహించి రెండు రక్తులప్రమాణము, దారుణసన్నిపాతము, సమస్తశ్లేష్మవ్యాధులు, వాతవ్యాధి, వీటియందు పుచ్చుకొనవలయును.

## మధుమేహాంతక రసం

శ్లో॥ స్వర్ణం రౌప్యం మాక్షికంచవిశుద్ధంచశిలాజతు। లోహభ్రంతథారౌప్యం మధుయష్టీచపిప్పలీ। మరిచంవిశ్వకంచేతి సర్వాసమంకారయేత్। మర్దయేంచప్రహారంయత్నాత్ కజ్జలాకృతిసన్నిభం। భృంగరాజంచ నింబంచజంబూస్వరసేపృథక్। ప్రమేహంవివిధం హంతిమధుమేహం సుదుస్తరం। వాతపిత్తసముద్భూతం తథాకఫసముద్భవం। మధుమేహాంతకోనామ ప్రమేహకులనాశనః॥

రజతభస్మ, ముత్యభస్మ, శు, శిలాజతు, లోహభస్మ, అభ్రకస్మ, మాక్షికభస్మ, యష్టిమధుకం, పిప్పళ్ళు, మిరియాలు, శుంఠి, ఇవన్నియు సమభాగములు గ్రహించి ఏకరఘూము కౌటుకపలెనూరుకని, గుంటగలగర, వేప, నేరేడు, వీటి రసములచే ప్రత్యేకముగా మర్దించుకుని సేవించిన సమస్తప్రమేహములు కఠినమైన మధుమేహము, వాతము, పిత్తము, కఫము, వీటివలనపుట్టిన మధుమేహము, వీటినినశింపజేయును. ఈ మధుమేహాంతకము ప్రమేహసముదాయమును నశింపజేయును.

# రక్తగుల్మాంతకరసం

శ్లో॥ తామ్రం దశగుణం స్వర్ణాత్ స్వర్ణపాదంకటుత్రికం। త్రికటు త్రిఫలాతుల్యా త్రిఫలార్థమయోరజః । ఆయసార్ధం విషంచైవ సర్వాంసం మర్దయత్నతః । రక్తగుల్మాంతకోనామ రౌధిరం గుల్మనాశనం ॥

వ్యా॥ తామ్రభస్మ 10 భా, సువర్ణభస్మ 1 భా, త్రికటుకములు $\frac{1}{4}$ భా, త్రిఫలములు $\frac{1}{4}$ భా, లోహభస్మ 1/8 భా, శు. నాభి 1/16భా, వీటినన్నిటిని కలిపినూరుకునిన గుల్మాంతకమనబడును: ఇది స్త్రీలకు సంభవించు రక్తగుల్మమును నశింపజేయును.

# మహా మేహాంతక రసం

శ్లో॥ సువర్ణం తామ్ర తీక్ష్ణంచ ఆయసం నాగవిద్రుమం । ముక్తాఫలం కంబుకంచ పారదం గంధకం తథా । ఏతాని అర్ధభాగంస్యాత్పంచ భాగంచ రౌప్యకం । తత్సామ్యం కాంతలోహంచ సతుల్యం అభ్రకం తథా । తత్తుల్యం త్రపుసంచైవ శాల్మలీరసమర్దితం । కాచకుప్యాం వినిక్షిప్య వాలుకాయంత్ర పాచితం । సాంగశీతలముద్ధృత్య ఖల్వ మధ్యే వినిక్షిపేత్ । సర్వతుల్యం శిలాచూర్ణం తత్పాదాంశంర సేంద్రకం। మృగాండజం అర్ధభాగంస్యా త్రిఫలారసమర్దితం । అమృతాచందనో శీరవటాశ్వత్థశతావరీ । ముసలీక్షురగణేనాపి కన్యారసవిమర్దితం । వల్లద్వయ ప్రమాణంతు అనుపాన విశేషకైః । సేవితో మధుమేహంచ సోనామేహ నివారణం । శుక్లమేహం మూత్రసారం మూత్రకృచ్ఛ్రం । వసామేహం సురామేహం మజ్జామేహంచ తాపకం । లింగదాహం మూత్రదాహం శ్వేతరక్త ప్రదరం తథా । క్షయరోపాండుం శ్వాసకాసం నిద్రానాశం శిరోవ్యథాం । మేహాంతకరసోనామ సరమేహకులాంతకః॥

వ్యా॥ సువర్ణము, తామ్రము, తీక్ష్ణలోహము, ఇనుము, సీసము, పగడము, ముత్యములు శంఖములు, వీటిభస్మలు ప్రత్యేకముగా ½ భా, శు. రసము, ½ భా, శు గంధకము ½ భా, రజతభస్మ, 5 భా, కాంతభస్మ, 5 భా, అభ్రకభస్మ 5 భా, వంగభస్మ, 5 భా, బూరుగరసముచే మర్దించి కాచకుప్పె యందుంచి వాలుకాయంత్రమందు వండుమని స్వాంగశీతలమునతీసి ఖల్వమందుంచి, ఆమందుకు సమానభాగము శిలాజతుభస్మ, నాలగవభాగము, రససిందూరము, సగముభాగము కోడిగుడ్ల పెంకులు వీటినన్నిటిని, త్రిఫలములు, తిప్పతీగ మంచిగంధము, వట్టివేళ్ళు, మర్రి, పిల్లిపీచర నేలతాడి, చెరకసముదాయము, కలుబంద, వీటిరసములచే మర్దించి అనుపాన విశేషములచే రెండువల్లముల ప్రమాణము, సేవించిన మధుమేహము, సమస్తమేహముల శుక్లమేహము, అతిమూత్రము, మూత్రకృచ్ఛ్రము,అశ్మరి,వసామేహము, సురామేహము మజ్జామేహము, శరీరతాపము, మేఢ్రమందుమంట, మూత్రమునకు పోవునప్పుడు మంట, శ్వేత ప్రదరము, రక్త ప్రదరము, క్షయ, పాండు, శ్వాస, కాస, నిద్రలేకపోవుట, తలనొప్పి, వీటిని ఈ మేహాంతకరసము, సర్వమేహములను నివారించును.

# మహామేహాంతకరసం

శ్లో॥ మాండూర స్వర్ణతారాభ్రకరవిరసశిలాజిత్ వైక్రాంత ముక్తం । గంధంనాగం ప్రవాలాయస్త్రపు భసితం కాంతభస్మా పితుల్యం । లామజ్జావాలుకాశ్రీమలయజపయసా సప్తవారం ప్రపిష్ట్వా । సేవ్యోముద్గప్రమాణో యదిసకలరుజాన్ హంతిమేహాంతకోయం । రక్తమేహం మూత్రకృచ్ఛ్రం ఉదకం శుక్లమేహకం । క్షయం పాండుంజ్వరం శోషం శ్వాసంకాసం తథారుచిం । అనుపాన విశేషేణ సర్వమేహ వినాశనం॥

వ్యా॥ మాండూరము, సువర్ణము, రజతము, అభ్రకము, తామ్రము, రసము, శిలాజతు, వైక్రాంతము, ముత్యములు, వీటి భస్మములు, శు, గంధకము, సీసము, పగడము, తీక్ష్ణలోహము, వంగము, కాంతము వీటి భస్మములు, ఇవి సమభాగములు గ్రహించి, వట్టివేళ్లు, కురువేరు, మంచిగంధము, వీటి రసములచేతను, ఆవుపాలచేతను, ప్రత్యేకముగా ఏడేసిరోజులు నూరుకుని పెసరగింజలంత సేవించిన ఈ మేహాంతకము, సకల వ్యాధులను, రక్తమేహము, మూత్రకృచ్ఛ్రము, ఉదకమేహము, శుక్లమేహము, క్షయ, పాండు, జ్వరము, కృశించుట, శ్వాస, కాస, అరుచి, వీటిని జయించును అనుపానవిశేషములచె సమస్తమేహములను హరించును.

## మహా మేహాంతకరసం

శ్లో॥ ద్వౌ భాగౌ కనకం భస్మ తుల్యం శుద్ధంచ గంధకం । లోహ భస్మ త్రయోభాగాశ్చత్వారో రసభస్మకం । వంగభస్మ త్రిభాగం స్యాత్ త్రిభాగం నాగభస్మకం । ప్రవాలంమౌక్తికంచైవ గరుడానాం సమాసమం। ఖల్వమధ్యే వినిక్షిప్య మాతులుంగరసేనచ । ఇక్షుఖండరసే నైవ శతావర్యారసేనచ । దినమేకం విమర్ద్యంతు ద్రాక్షాఖర్జూరసంయుతం । వటాశ్వత్థ కషాయైశ్చ త్రిదినంచవిమర్దయేత్ । ద్విగుంజేన ప్రమాణేన నవనీతేన సేవయేత్ । వాతమేహం శుక్లమేహం ఇక్షుమేహంచ కృచ్ఛ్రకం। రక్తమేహం మూత్రఘాతం క్షయకాసజ్వరాపహం । మేహాంతకరసోనామ పూజ్యపాదేన భాషితం॥

వ్యా॥ సువర్ణభస్మ 2 భా, శు, గంధకం 2 భా, లోహభస్మ 3 భా, రసభస్మ 4 భా, వంగభస్మ, సీసభస్మ, పగడభస్మ, ముత్యభస్మ, పచ్చలభస్మ, ఇవిప్రత్యేకముగా మూడేసి, భాగములు, ఖల్వమందుంచి, మాదీఫలములు, చెరుకుముక్కలు, పిల్లిపీచర, ద్రాక్షపండ్లు, ఖర్జూరపండ్లు, వీటి రసములచే వక్కొకరోజు, మర్రి, రావి, వీటి కషాయములచే మూడేసి రోజులు, మర్దించుకుని, రెండుగురిగింజల ప్రమాణము, వెన్నతో సేవించిన, వాతమేహము, శుక్లమేహము, ఇక్షుమేహము, మూత్రకృచ్ఛ్రము, రక్తమేహము, మూత్రాఘాతము, క్షయ, కాస, జ్వరము, వీటిని నశింపచేయును. ఈ మేహాంతకరసము, పూజ్యపాదునిచే చెప్పబడినది.

## మహామేహాంతక రసం

వ॥ సువర్ణభస్మ 1 భా, తామ్రభస్మ 1 భా, లోహభస్మ 1 భా, సీసభస్మ 1 భా, పగడభస్మ 1 భా, ముత్యభస్మ 1 భా, వజ్రభస్మ1భా, వైక్రాంతభస్మ 1 భా, శు. రసము 1 భా. శు. గంధకము 1 భా, రజత భస్మ 5 భా, కాంతభస్మ 5 భా, అభ్రకభస్మ 5 భా, వంగభస్మ 5భా, వీటిని కలుబంద, నల్లకలువ, త్రికటుకములు. వీటిరసములచే మర్దించుకుని వాలుకాయంత్రమందు వకరోజువండుకుని చల్లారినపిదపతీసి, శిలాజతు భస్మ, తిప్పసత్తు, పచ్చకర్పూరము, లవంగములు, జాజికాయలు, ఇవి ప్రత్యేకముగా మందులో నాలుగవవంతు, కస్తూరి ½ భా, ఇటులపిమ్మట

కలుపుకుని, తుంగగడ్డలు, వట్టివేళ్లు, మంచిగంధము, కురువేరు, వీటి రసములచే మర్దించుకుని మూడుగురిగింజల ప్రమాణము, పంచదార, వెన్న, తేనె, మొదలగు అనుపానములతో సేవించిన, ఇక్షుమేహము, అతిమూత్రము, మధుమేహము, సురామేహము, వసామేహము, హరిద్రామేహము,శుక్లమేహము, పాండు, క్షయ, కృశించుట, దగ్గు, దౌర్బల్యము, ఉత్థాపన శక్తి లేకపోవుట. కాళ్ళుచేతులుమంటలు, తలనాదు, నడుమునొప్పులు, మూత్రమునకు పోవునప్పుడుమంట, జీర్ణజ్వరము, అజీర్ణము, రక్తార్శస్సు, గ్రహణి, ప్రదరములు, మొదలగు వ్యాధులను పోగొట్టును. శరీరకాంతి, బుద్ధి కుశలత, ఇంద్రియబలమును గలుగజేయుటయేగాక అనేకమంది స్త్రీలతోరమించు శక్తిని కలుగజేయును. ఈమేహాంతకరసము, వీర్యవృద్ధిని జేయును. ముసలితనమును వ్యాధులను పోగొట్టును.

## మహామేహాంతకరసం
(పుటయోగం)

శ్లో॥ చతుర్భాగం హాటకంచ రసభస్మచ రౌప్యకం । తీక్ష్ణభస్మ వంగభస్మ నాగం వైక్రాంతమభ్రకం । శిలాచగంధకం చైవ ప్రత్యేకం త్రీణిభాగకం । సుముహూర్తే క్షిపేత్ ఖల్వే త్రిఫలాద్రవమర్దితం ।మోదకాన్ ఛాయయాశుష్కాన్ ప్రపుటేత్సాంగశీతలం । ఉశీరచందన రసైశ్చత్వారో భావనా స్తథా । చతుర్గుంజా ప్రమాణేన శర్కరామధుసంయుతం । మధుమేహం ఇక్షుమేహం అంగతాపంచనాశయేత్ । ఉదకం శుక్లమేహంచ లాలాతంతు వినాశనం । క్షయమేకాదశంహంతి కాసశ్వాసంనిహంతిచ। లింగదాహం శిరోదాహంనానారోగాన్ని వారయేత్। బలపుష్టికరం వృష్యం భక్షణాద మృతంభవేత్। మేహాంతకరసోనామ్నా మూత్రరోగనివారణః॥

వ్యా॥ బంగారుభస్మ 4 భా, రసభస్మ, రజతభస్మ, తీక్ష్ణలోహభస్మ, వంగభస్మ, సీసభస్మ, వైక్రాంతభస్మ, అభ్రకభస్మ, శిలాజతుభస్మ, శు, గంధకము, ఇవిమూడేసి

భాగములు, సుముహూర్తమందు ఖల్వమందుంచి, త్రిఫలరసముచే మర్దించుకుని మాత్రలుచేసుకుని ఎండించుకుని మూకుళ్లయందుంచుకుని పెద్దపుటమువేసుకుని సాంగశీతలమున తీసి, వట్టివేళ్లు, మంచిగంధము, వీటిరసములచే నాలుగుభావనలుచేసుకుని నాలుగుగురిగింజలప్రమాణము, పంచదార, తేనె, వీటితోసేవించిన, మధుమేహము, ఇక్షుమేహము, శరీరతాపము, ఉదకమేహము, శుక్లమేహము, లాలామేహము, తంతుమేహము, ఏకాదశక్షయలు, కాస, శ్వాస, మేఢ్రమందలిమంట, శిరస్సువేడి, సమస్తరోగములను, నివారించును. బలము, శరీరపుష్టి, వీర్యవృద్ధి, వీటినిచేయును. సేవనచేఅమృతతుల్యంబగును. ఈ మేహాంతకరసము, సమస్తమూత్రసంబంధమైనవ్యాధులను హరించును.

## క్రమవృద్ధిమహామేహాంతకరసం

సీ॥ ముందుగానొకపాలు ముత్యభస్మంబును పగడభస్మము రెండుపాళ్లుబెట్టి । తామ్రభస్మము మూడునమరంగనుంచియు నాగభస్మము నాల్గువరసగాను । అమరైనలోహము అయిదుభాగంబులు కాంతమారునుపాళ్ళు ఘనతగను । ఆరునొకభాగముల్ అభ్రకసిందూర వంగ మెనిమిదిపాళ్ళు నైనముగను । ఖల్వంబులోనుంచి కచ్చూరరసమున వుప్పిబూరుగ చెరుకు వుస్తిరసమున। నాల్గుదినంబులు నమరంగమర్ధించి పూటకడ్డిగెత్తు పుచ్చుకొన్న । వాతపైత్యశ్లేష్మ వణుకురోగ పాండురోగంబు మేహముల్ పారిపోవు । మూత్రరోగంబు క్షయలును మూర్ఛలణచు । సకలవ్యాధులను మాన్పను చాలియుండు । మేహాంతకరసంబను పేరితో మేలుజేయు॥

వ్యా॥ ముత్యభస్మ 1 భా, పగడభస్మ 2 భా, తామ్రభస్మ, 3 భా, సీసభస్మ, 4 భా, లోహభస్మ 5 భా, కాంతభస్మ 6 భా, అభ్రకసిందూరము 7 భా, వంగభస్మ 8 భా, ఇటులవీన్నిని ఖల్వమందుంచి, కచ్చూరాలు, ఉప్పి, బూరుగ, చెరుకు, ఉస్తి వీటిరసములచే నాలుగురోజులుమర్ధించి పూటకు అడ్డిగఎత్తుపుచ్చుకునిన, వాతవ్యాధులు, పైత్యవ్యాధులు, శ్లేష్మవ్యాధులు, వణుకురోగములు, పాండురోగములు, మేహములు, మూత్రవ్యాధి, క్షయలు, మూర్ఛలు,సమస్తవ్యాధులను, మాన్పును, ఈమేహాంతకరసము, మిక్కిలిమేలునుజేయును.

## మహామేహాంతకరసమ్ (వంటయోగం)

శ్లో॥ చతుర్భాగం హాటకంచ రౌప్యకం రసభస్మకం । లోహం

తామ్రంగంధకంచ మాండూరం తాలమభ్రకం । విద్రుమంమౌక్తికం వజ్రం వైక్రాంతం నాగవంగకం । సర్వాణిచసమాయుక్తం ప్రత్యేకం త్రీణిభాగకం । సర్వమేకత్ర సంచూర్ణ్యఖల్వమధ్యేవినిక్షిపేత్ । న్యగ్రోధ త్రిఫలానీరైర్మర్దితందినత్రయం। కాచకుప్యాం వినిక్షిప్యపాచితం సాంగశీతలం । విశుద్ధకమఫేనంచ పాదభాగం వినిక్షిపేత్ । మృగనాభిం వినిక్షిప్య చందనోశీరకైరసైః । చాతుర్జాతరసైర్భావం యామేయామేచ భావనాత్ । క్షిపేచ్చంద్రం భావనాంతే గుంజామాత్రప్రమాణతః అనుపానవిశేషేణ సర్వమేహాన్‌వ్యపోహతి । నిశ్చితం తేన నశ్యంతి మధుమేహామతిధ్రువం ।బహుమూత్రం మహారోగాన్ కాసంశ్వాసంక్షయంతథా। జ్వరాతిసారమర్శసం కుష్ఠిగుల్మభగందరం । వివిధాన్ ప్రదరాన్‌హంతి రక్తపిత్తంచదారుణం । తత్తద్రోగానుపానేన సర్వరోగహరంపరం। వంధ్యాచలభతే గర్భం వృద్ధోపితరుణాయతే ।తుష్టిపుష్టికరం చైవవృష్యం చైవ రసాయం । మేహాంతకరసోనామ బ్రహ్మణానిర్మితంపురా॥

వ్యా॥ బంగారభస్మ 4 భా, రజతభస్మ, రసభస్మ, లోహభస్మ, తామ్రభస్మ, శు. గంధకము, మాండూరభస్మ, శు. తాళకము, అభ్రకభస్మ, పగడభస్మ, ముత్యభస్మ, వజ్రభస్మ, వైక్రాంతభస్మ, సీసభస్మ, వంగభస్మ, ఇవిప్రత్యేకముగా మూడేసి భాగములు, వీటిని ఖల్వమందుంచి మర్రి, త్రిఫలములు, వీటిరసములచే మూడురోజులు మర్దించుకుని కాచకుప్పెయందుంచుకుని వాలుకాయంత్రమందు వండుకుని స్వాంగశీతలమునతీసి, శుద్ధిచేసిన నల్లమందు, పైమందుకు నాలగవభాగము కలుపుకుని, మంచిగంధము, వట్టివేళ్లు, చాతుర్జాతకములు, వీటిరసములచే వక్కొక్కజాము భావనచేసుకుని, పిదప పచ్చకర్పూరము, కలుపుకుని అనుపానవిశేషములచే గుంజాప్రమాణము సేవించిన, సర్వమేహములు, మధుమేహము, తప్పకనశించును. మరియు ఇక్షుమేహము, శుక్లమేహము, అశ్మరి, తంతుమేహము, అతిమూత్రము, కఠినవ్యాధులు, కాస, శ్వాస, క్షయ, జ్వరము, అతిసారము, మూలశంక, ఉదరవ్యాధులు, గుల్మము, భగందరము, సమస్తశ్వేతరక్తప్రదరములు, కఠినమైన రక్తపిత్తము, వీటిని హరించును. ఆయారోగానుపానములచే సమస్తరోగములను హరించును. వంధ్యాస్త్రీ గర్భమును ధరించును. వృద్ధుడుకూడపడుచువాడగును. మనస్సంతోషము,శరీరపుష్టి, వీర్యవృద్ధి, వీటినిచేయును. రసాయనము, ఈ మేహాంతకరసము పూర్వమందు బ్రహ్మచే చెప్పబడెను.

# తామ్రరసాయనం

శ్లో॥ తామ్రభస్మ త్వజాక్షీరే పాచ్యం తుల్యేఘృతేపచేత్ ।

తత్తామ్రం శుద్ధసూతంచ గంధకంచ సమంసమం। నిర్గుండ్యుత్థద్రవైర్మర్ద్యం దినంతద్గోలమాహరేత్। యామైకం వాలుకాయంత్రే పాచ్యం యోజ్యం ద్విగుంజకం। బీజపూరస్యమూలంతు సజలంచానుపాయయేత్। తామ్రరసాయనం నామఉదరం శూలమూలకం। అశ్మరీంవిద్రధింకుష్ఠంకఫవ్యాధీనశేషతః। అజీర్ణంతిమిరంహంతిగుల్మరోగంచనిశ్చితం।

వ్యా॥ తామ్రభస్మ మేకపాలయందు పచించుకొని, సమానమైన నేతియందు పచించుకొని ఆతామ్రభస్మ, శు. రసము, శు. గంధకము, ఇవిసమభాగములు, వావిలిరసముచే వకరోజుమర్దించుకొని ఉండలుచేసుకొని వాలుకాయందు వకఝామువండుకొని రెండుగురిగింజల ప్రమాణము పుచ్చుకొని, మాదీఫలపువేళ్ళను జలముతో త్రాగిన ఈ తామ్రరసాయనము, ఉదరము, శూల, మూలవ్యాధి, అశ్మరి, విద్రధి, కుష్ఠము, సమస్తకఫవ్యాధులు, అజీర్ణము, తిమ్మిర్లు, గుల్మరోగము, వీటిని నశింపచేయును.

# త్రిపురభైరవ రసం

శ్లో॥ భాగొరసస్యభాగశ్చ హేమ్నః పిష్టంవిధాయచ। తథాద్వాదశభాగాని తామ్రపత్రాణిలేపయేత్। ఊర్ధ్వాధోగంధకందత్వా ఫలమాత్రింసమంతతః। క్షారస్యమృగశృంగస్య చూర్ణంయోజ్యం సమంతతః। సించేన్మత్స్యాక్షీనీరేణ రుధ్వాయామచతుష్టయం। పచేచ్చూలహరః సూతో భవేత్త్రిపురభైరవః। మాషో మధ్వాజ్యసంయుక్తో దేయో స్యపరిణామజే। అన్యేష్వేరండతైలేనకటుత్రయయుతోహితః॥

వ్యా॥ శు, రసము, 2 భా, బంగారము 1 భా, ఇవి నూరుకొని, 12 భా తామ్రమును పలచటి రేకులుగా చేసుకొని ఆరేకులకు పూసి అవి మూకుడ్లోయందుంచి క్రిందను మీదను అంతటను వకపలము శు. గంధకమును ఉంచుకొని, యవక్షారము, లేడికొమ్ము చూర్ణమును అంతటను చల్లుకొని పొన్నగంటికూరరసమును చల్లుకొని సంధిబంధనము చేసుకొని నాలుగుఝాములు వండుకొనిన త్రిపురభైరవరసమగును. ఇది మాష ప్రమాణము తేనె, నేతితో యిచ్చిన శూలను పరిణామశూలను హరించును. ఇతరములైన గుల్మము, ఉదరము, మొదలగు వ్యాధులయందు త్రికటు చూర్ణముతో ఆముదముతో కలిపి యివ్వవలయును.

## పాషాణవజ్రక రసం

శ్లో॥ శుద్ధ సూతంత్రి భాగంధం ద్రవైః శ్వేతపునర్నవైః । మర్ద యిత్వా దినం ఖల్వే రుధ్వాతదత్వాభధరేపచేత్। పాషాణభేద చూర్ణంతు సమయుక్తం ద్విమాషకం । భక్షయేదశ్మరీం హంతి రసః పాషాణ వజ్రకః॥

వ్యా॥ శు. రసము, 1 భా, శు. గంధకము 3 భా ఇవి తెల్లగలిజేరు రసముచే ఖల్వమందు ఒకరోజు మర్దించుకుని తీసుకుని సంధిబంధనముచేసుకుని భూధరయంత్రమందుపచించుకుని ఆమందుకు సమానము పాషాణభేది చూర్ణమును,కలుపుకుని రెండుమాషముల పరిమాణము సేవించిన ఈ పాషాణ వజ్రరసము అశ్మరిని హరించును.

## మేహాంతక రసం

సీ॥ కాంతంబు నొక్కటి గగనభస్మము మూడు వంగభస్మము రెండుపాళ్ళు । శుద్ధిసల్పు శిలాజతు షడ్భాగములువేప చక్కనీటను నూర । చెలువుగాంచు మేహాంతకము పాలమీగడచే గ్రోల వహ్ని రోగంబుల వడిహరించు । జీరకరసమున నారగించిన మేహావాతముల్ పిత్తముల్ దగ్ధమౌను । ద్రాక్షాకషాయమున గొన దాహమడచు గస గసాలరసమున కాకలణచు । త్రిఫలకల్కముచే శుష్కతెవులడంచునవని మేహాంతకంబును నాఖ్యదనరి॥

వ్యా॥ కాంతభస్మ 1 భా. అభ్రకభస్మ, 4 భా, వంగభస్మ 2 భా, శిలాజతు 6 భా, ఇవి వేపచక్క కషాయముచే నూరిన, మేహాంతకంబగు, ఇది పాలమీద మీగడచే పుచ్చుకొనిన, అగ్నిమాంద్యములను, జీలకర్రరసముతో పుచ్చుకనిన్, మేహవాతములను, పైత్యవ్యాధులను, ద్రాక్షపండ్లరసముచే తాపములను, గసగసాలరసమున కాకలను, త్రిఫలకల్కముచే కృశించుటను, మేహాంతకంబనిపేరున హరించును,

## మేహాంతకరసం

వ॥ కాంతభస్మ 1 భా, వంగభస్మ 2 భా, లో

3 భా, అభ్రకభస్మ, 3 భా, సీసభస్మ 3 భా, రససిందూరము 3 భా, ముత్యభస్మము 1 భా, శు, గంధకము 2 భా, వీటిని, ద్రాక్షపండ్లు, నిమ్మకాయలు, కలుబంద, జీలకర్ర, త్రిఫలములు, వీటి రసములచే మర్దించి కుప్పెలుకట్టుకుని పూటకు మూడు గురిగింజలప్రమాణము అనుపాన విశేషములచే సేవించిన, శుక్లమేహము, వసామేహము, తంతుమేహము మొదలగు సమస్త మేహవ్యాధులు, క్షయ, పాండు, అగ్నిమాంద్యము, శరీరతాపము, బలహీనము, బుద్ధిమాంద్యము, కాళ్లు చేతులు మంటలు, నడుమునొప్పి, కాళ్లులాగుట, కృశించుట, కరడ్లు మంటలు, పైత్యవ్యాధులు, మూర్ఛ, అపస్మారము, వీర్యముపలచనగుట గుండెదడ, నోటిపూత, ఉత్సాహము లేకపోవుట, అతిమూత్రము, మూత్ర మందుమంట, దగ్గు, వగర్పు, సమస్త ప్రదరవ్యాధులు, రక్తపిత్తము, రక్తార్శస్సు మొదలగువ్యాధులను ఈ మేహాంతకము వెంటనే నివారింప జేయును.

## మేహాంతకరసం

వ॥ శిలాజతుభస్మ 2 భా, వంగభస్మ 3 భా, సీసభస్మ 4 భా, అభ్రకభస్మ 5 భా, రససిందూరము 3 భా, రసము 1 భా, గంధకము 1 భా, వీటిని ఖర్జూరకాయల కషాయముచే మర్దించి కుప్పెలుకట్టుకుని పూటకు మూడు గురిగింజల ప్రమాణము అనుపాన విశేషములచే సేవించిన, మేహములు, రక్తార్శస్సు, మూత్రకృచ్ఛ్రము, తాపము, గ్రహణీ దోషము, శుష్కించుట, దగ్గు, మొదలగు వ్యాధులు పోవును.

## క్రమవృద్ధి మేహాంతకరసం

శ్లో॥ రసేంద్రమేకభాగంచ ద్విభాగం గంధకస్యతు। త్రిభాగం వంగభస్మంచ చతుర్భాగంచ నాగకం। పంచమంవ్యోమ భాగంచ ప్రవాలం షష్టభాగకం। శిలాజిత్సప్త భాగంచకుంకుమం

కం । సర్వమేకృతం చూర్ణం జంబీరామ్లేనమర్దితం । మేహాంతకర సోనామ సర్వమేహ వినాశనం । సమస్తపైత్యరోగంచ మూత్రాఘాతంతథైవచ । అతిమూత్రం బుద్ధిమాంద్యం అపస్మారం గ్రహణీగదం । అంగదాహం నేత్రదాహం నారీణాం ప్రదరంతథా । వీర్యదోషం రజోదోషం నాశయేన్నాత్రసంశయః॥

వ్యా॥ శు. రసము 2 భా, శు గంధకము, 2 భా, వంగభస్మ 3 భా, సీసభస్మ 4 భా, అభ్రకభస్మ, 5 భా, పగడభస్మ, 6 భా, శిలాజతుభస్మ 7 భా, మంచుమ పువ్వు 8 భా, వీటిని నిమ్మకాయపులుసుచే మర్దించినది. ఈ మేహాంతకము,సమస్త మేహములు, సమస్తపైత్యవ్యాధులు, మూత్రాఘాతము,అతిమూత్రము,బుద్ధిమాంద్యము, అపస్మారము, గ్రహణీదోషము, శరీరతాపము, నేత్రములుమంట ప్రదరవ్యాధులు, శుక్లదోషములు, రజోదోషములు, వీటిని హరించును.

## లఘుమేహాంతక రసం

శ్లో॥ అభ్రకంగంధకం సూతంవంగభస్మ సమాంశకం । ఏలా శిలాజతుంచైవ రంభాసారేణమర్దయేత్ । ప్రమేహాన్వింశతింహన్యాత్కామలాపిత్తనాశనం॥

వ్యా॥ అభ్రకభస్మ, శు. గంధకము, శు. రసము, వంగభస్మ, ఏలకులు, శిలాజతు, వీటిని సమభాగములుగ్రహించి, అరటిదుంపరసముచే మర్దించవలెను. ఇది ఇరవై ప్రమేహములు, కామిర్లు, పైత్యము, వీటిని నశింపజేయును.

## విజయేశ్వర రసం

శ్లో॥ శుద్ధతాలం మృతం సూతం తుల్యంతాభ్యాం చతుర్గుణా । భర్జిత్వావిజయాయోజ్యాసర్వతుల్యం గుడం క్షిపేత్ । శ్వేతకుష్ఠహరం నిష్కంరసోయం విజయేశ్వరః । దార్వీఖదిర నింబానాం క్వాథంతదను పాయయేత్

వ్యా॥ శు. తాళకము, రసభస్మ, ఇవిసమభాగములు, ఈరెండిటికి నాలుగురెట్లు వేయించిన గంజాయిఆకు వీటిఅన్నిటితోను సమానముబెల్లము ఇటుల వీటినెల్లనుకలుపు

కుంకునిష్కప్రమాణము సేవించి ప్రమానుపసపు, చంద్ర,వేప, వీటియొక్క కషాయమును త్రాగిన ఈవిజయేశ్వరరసము శ్వేతకుష్ఠమును (బొల్లిని) హరించును.

# జేపాలరసం

శ్లో॥ జేపాలేనసమైః సూతవ్యోషటంకణగంధకైః । నారాచః స్యాద్రసోహ్యేషః మాషః సర్పిః సితాయుతః । హంత్యుదావర్తమానాహ ముదరాణిచ గుల్మకం॥

వ్యా॥ శు. రసము, త్రికటుకములు, శు. టంకణము, శు. గంధకము, ఇవిసమ భాగములు వీటి అన్నిటితో సమానము శు. జేపాళములు కలుపుకొనవలయును. ఇది నారాచ రసమనబడును. ఇది మాషప్రమాణము నెయ్యి పంచదారతోయిచ్చిన ఉదావర్తము, కడుపుబ్బరము, ఉదరవ్యాధి గుల్మము వీటిని నశింపజేయును.

# షడ్వర్గ సిందూరం

వ॥ స్వర్ణం 1 భా, గంధకం. 8 భా, వెలిగారము 8 భా, కాంతము 2 భా, ఖడ్గలోహం 12 భా, పాదరసం 5 భా, వీటిని కలుబంద రసముచే మర్దించుకుని వాలుకాయంత్రమందు వండుకుని తీసి మరల కలుబందరసముచే నూరుకొని కుప్పెలుకట్టుకుని, నంజు, పాండు, కామిర్లు అశీతివాతములు, అండవాతము, శిరోవాతము మొదలగు వాటియందు యిచ్చుకునేది.

# సూతశేఖర రసం

శ్లో॥ శుద్ధం సూతం మృతంస్వర్ణం టంకణంవత్సనాగకం ।వ్యోషమున్మత్తబీజంచ గంధకం తామ్రభస్మకం । చతుర్జాతం శంఖభస్మ బిల్వమజ్జాకచోరకం । సర్వం సమం క్షిపేత్ ఖల్వే మర్ద్యం భృంగరసైర్దినం । గుంజామాత్రాం వటీంకృత్వాద్విగుంజే మధుసర్పిషీ । భక్షయేదమ్లపిత్తఘ్నో వాంతిశూలామయాపహః। పంచగుల్మాన్ పంచకాసాన్ గ్రహణ్యామయనాశనః । త్రిదోషోత్థాతిసారఘ్నః శ్వాసమందాగ్ని

నాశనః । ఉగ్రహిక్కా ముదావర్తం దేహయాప్యగదాపహః । మండలాన్నాత్ర సందేహః సర్వరోగహరః పరః । రాజయక్ష్మహరః సాక్షాద్రసోయం సూతశేఖరః॥

వ్యా॥ శు. రసము స్వర్ణభస్మ, శు, వెలిగారము. శు. నాభి, త్రికటుకములు శు. ఉమ్మెత్తవిత్తులు, శు. గంధకము, తామ్రభస్మ, చాతుర్జాతములు, శంఖభస్మ, మారేడు గుంజు, కచూరాలు, ఇవన్నియు సమభాగములు ఖల్వమందుంచి గుంటగలగరరసముచే వకరోజు మర్దించి గురిగింజప్రమాణము మాత్రలుచేసుకొని రెండు గురిగింజలప్రమాణము తేనె, నెయ్యి, వీటితో పుచ్చుకునిన అమ్లపిత్తము వాంతి, శూలీ, అయిదుగుల్మములు, అయిదుదగ్గులు, గ్రహణీవ్యాధులు, త్రిదోషములవలన పుట్టిన అతిసారము, శ్వాస, అగ్నిమాంద్యము, కఠినమైన ఎక్కిళ్లు, ఉదావర్తము, యాప్యవ్యాధులు సమస్తవ్యాధులను మండలము రోజులలో తప్పక హరించును. ఈ సూతశేఖరరసము రాజయక్ష్మను తప్పక హరించును.

## రామబాణ రసం

శ్లో॥ తాలకం రసకర్పూరం గౌరీపాషాణ శంఖకం । ఏతాని సమభాగాని కృష్ణ ధత్తూరపత్రకైః । మర్దితంచ యథాగాఢం గుంజామాత్రప్రమాణతః । జీరకస్యానుపానేన శీతజ్వర వినాశనం । సన్నిపాతం జ్వరం సర్వం హరత్యేవ న సంశయః॥

వ్యా॥ శు.తాళకము, రసకర్పూరము, శు.గౌరీపాషాణము, శు,శంఖపాషాణము ఇవిసమభాగములు నల్లఉమ్మెత్తఆకులరసముచే బాగుగమర్దించుకుని గురిగింజప్రమాణముజీలకర్ర రసముతోపుచ్చుకునిన, శీతజ్వరము, సన్నిపాతజ్వరము, సమస్తజ్వరములను తప్పకహరించును.

## ప్రవాల పంచామృత రసం

శ్లో॥ ప్రవాల ముక్తాఫల శంఖశుక్తి కపర్దికానాంచ సమాంశభాగం । ప్రవాల మాత్రం ద్విగుణం ప్రయోజ్యం సర్వైస్సమాంశంరవిదుగ్ధమేవ । ఏకీకృతం తత్ ఖలుభాండమధ్యే క్షిప్త్వా ముఖే బంధన ... శీతలేచ ఉద్ధృత్య తద్భ

క్కరండే । నిత్యం ద్వివారం ప్రతిపాకయుక్తం వల్లప్రమాణం హి నరేణ సేవ్యం । ఆనాహగుల్మోదరప్లీహ కాసశ్వాసాగ్ని మాంద్యాన్ కఫమారుతోత్థాన్ । అజీర్ణముద్గార హృదామయఘ్నం గ్రహణ్యతీసార వికార నాశనం । మేహామయఘ్నం మూత్రరోగం మూత్రకృచ్ఛ్రం తథాశ్మరీం । నాశయేన్నాత్ర సందేహః సత్యం గురువచోయథా । పథ్యాశితం భోజన మాదరేణ సమాచరేన్నిర్మల చిత్తవృత్త్యా । ప్రవాల పంచామృత నామధేయో యోగోత్తమస్సర్వ గదాపహారీ॥

వ్యా॥ పగడములు, 2 భా, ముత్యములు, శంఖము, ముత్యపుచిప్పలు, గవ్వలు, ఇవియొక్కొక్క భాగము, వీటిఅన్నిటితోసమానముజిల్లేడుపాలు, ఇవన్నియుకలుపునని సండయందుంచుకుని ముఖమునూసి పుటమువేసి బాగుగచల్లారినపిదపతీసి ఆభస్మభరణి యందుంచుకుని రోజుకు రెండుసార్లు వల్లప్రమాణము సేవించిన, కడుపుఉబ్బరము, గుల్మము, ఉదరము, ప్లీహవ్యాధి, దగ్గు, ఆయాసము, అగ్నిమాంద్యము, కఫవ్యాధులు, వాతవ్యాధులు, అజీర్ణము, త్రేణుపులు, హృద్రోగము, గ్రహణి, అతిసారము, మేహవ్యాధులు, మూత్రరోగము, మూత్రకృచ్ఛ్రము, అశ్మరి, వీటిని తప్పక నశింపజేయును. నిర్మలమైన చిత్తవృత్తితోకూడుకొనినవాడై పథ్యయుక్తమైన భోజనమును ఆదరముగా భుజించవలయును. ప్రవాలపంచామృతమనెడి ఈరసశ్రేష్టము సమస్తవ్యాధులను హరించును.

## వాయి సంజీవనీ రసం

వ॥ ఇంగిలీకం 1 తు, రసకర్పూరము 1 తు, సౌవీరము 1 తు, పటిక 2½ తు, రససింధూరము 1 తు, మృద్దారుసింగు 1 తు; ఇట్లు వీటిని తీగజెముడు, గుంటగలగర, వీటిరసములచే చురకాయిచ్చి చివరకు 1 తు, తేనెమైనమువేసుకొని దించపోవునప్పుడు 1 తు, శుంఠి చూర్ణమువేసుకుని కొద్దిగతేనెవేసుకొని బఠాణీ గింజలంతమాత్రలు కట్టుకుని సవాయి, కొరుకు షేహ్రవణములు మొదలగు వ్యాధుల యందు పథ్యముతో వాడుకునేది.

## రసప్రతాప మార్తాండ రసం

శ్లో॥ రసహింగుల నేపాలం పృథ్వీ దంత్యంబు మర్దితం । దినార్ధేన జ్వరం హన్యాత్ గుడేన సితయాసహా । చతుర్వల్ల మితం ఖాదేత్సర్వ

వ్యా॥ శు, రసము, శు. ఇంగిలీకము, శు. నేపాళములు, ఇవి నేలదంతిరసముచే మర్దించుమని నాలుగు వల్లముల ప్రమాణము బెల్లముతోగాని పంచదారతోగాని సేవించి న అర్ధదినములో జ్వరమును హరించును. సమస్తజ్వరములను హరించును.

# తరుణార్క రసం

శ్లో॥ గంధకం టంకణం చాభ్రం నాభి దుత్తూర బీజకం। కృష్ణసర్పస్య గరలం రక్తచందన వంగకం। ఏతాని సమభాగాని సర్వత్ర సమహింగులం। మాతులుంగరసైర్మర్ద్యం త్రిదినంచ మహామృదు। వటీస్సర్షపమాత్రేణ హ్యనుపాన విశేషతః। తరుణాఖ్యరసో ఖ్యాతస్సర్వ జ్వరనివారణః॥

వ్యా॥ శు. గంధకము, శు. వెలిగారము, అభ్రకభస్మ, శు. నాభి, శు. ఉమ్మె త్తవిత్తులు, నల్లతాచుపాము విషము, రక్తచందనము, వంగభస్మ ఇవిసమభాగములు. వీటి అన్నిటికి సమము శు. ఇంగిలీకము, ఇటులవీటిని మాదీఫలరసముచే మూడురో జులుబాగా మృదువుగ మర్దించి ఆవాలంతమాత్రలుచేసి అనుపాన విశేషము చే యిచ్చిన ఈతరుణార్కరసము, సర్వజ్వరములను హరించును.

# సమగరళ తరుణార్కం

శ్లో॥ గోదంతం హింగులం తుల్యం ద్వయోస్తుల్యం హాలాహలం। త్రయాణాం గరలంతుల్యం గరలం కృష్ణసర్పజం। మాతులుంగరసైర్మ ర్ద్యందినమేకంతు కజ్జలీం। ముద్గప్రమాణ వటికాం నారికేలోదకే నచ। దాతవ్యం సన్నిపాతార్తే తతశ్శైత్యముపాచరేత్। తరుణార్క రసోనామ మృత్యుంజయతి నిశ్చయం॥

వ్యా॥ శు. తాళకము. 1 భా, శు. ఇంగిలీకము, 1 భా, శు. నాభి, 2 భా, నల్లత్రాచుపాముయొక్క గరళము 4 భా, ఇవి మాదీఫలరసముచేనొకరోజు మర్దించి పెసరగింజలంత మాత్రలుచేసి అందొక దానిని గొబ్బరికాయనీళ్ళతో సన్నిపా తోగికియిచ్చి శీతలోపచారము చేయవలయును. ఈ తరుణార్కరసము మృత్యువునని శ్చయముగా జయించును.

# మహా తరుణార్కం

శ్లో॥ అభ్రకం గంధకం తామ్రం టంకణం నాగవంగకం। మాక్షి కంలోహ భస్మంచ మాక్షికం ఫణినోవిషం। జాంబూన దోన్మత్తబీజ

ప్రవాలం రక్తచందనం। తవాక్షీరీచ కస్తూరీసులోహితమనశ్శిలా। ఏతత్సర్వం సమాంశంచ సర్వతుల్యాంతు నాభకం। సర్వేషాం పాదభాగం చస్వచ్ఛసూతంచ హింగులం। సర్వం ఖల్వేవినిక్షిప్య జంబీరార్ద్రకి చిత్రకైః। మర్దయేత్త్రిదినం ఖల్వేనవనీతసమం మృదు। గుంజాయుగ్మం ప్రదాతవ్యం మాత్రాహంతి త్రయోదశ। త్రిదోషజనితాన్పుంసాంరజో దోషంచయోషితాం। సర్వవ్యాధీన్నిహంత్యేవ అనుపాన విశేషతః। ద్రాక్షాదాడిమ ఖర్జూరఫలం దేయంచఖాదయేత్। దేయం ఉష్ణోదకం చైవతృష్ణార్తేతు ప్రకల్పయేత్। అతిభయేన మనసాపథ్యం చాపిసమాచ రేత్। మహాతరుణార్క నామాయం బాలరోగప్రశాంతికృత్॥

వ్యా॥ అభ్రకభస్మ, శు. గంధకము, తామ్రభస్మ, శు, టంకణము, సీసభస్మ వంగభస్మ, మాక్షికభస్మ, లోహభస్మ, ముత్యభస్మ, త్రాచుపాము విషము సువర్ణభస్మ ఉమ్మెత్తవిత్తులు, పగడభస్మ, రక్తచందనము, తవాక్షీరి, కస్తూరి, శు. రక్తమణిశిల, ఇవన్నియు సమభాగములు, వీటి అన్నిటితో సమానము, శు, నాభి అన్నిటికి నాల్గవ భాగము. శు. పాదరసము, పాదరసముతో సమానము, శు. ఇంగిలీకము, వీటిని ఖల్వమందుంచి, నిమ్మకాయలు, అల్లము చిత్రమూలము, వీటిరసములచే మూడురోజులు వెన్నవలె మెత్తగ మర్దించి రెండు గురిగింజల ప్రమాణము మాత్రను యిచ్చిన పద మూడుసన్నిపాతములను, పురుషులయొక్క త్రిదోషజనితవ్యాధులను, స్త్రీలయొక్క రజో దోషమును, అనుపానవిశేషముచే సమస్తవ్యాధులను హరించును. ఈమందు సేవించున నప్పుడు, ద్రాక్షపండ్లు, దానిమ్మపండ్లుఖర్జూరపండ్లు, యిచ్చి తినిపించవలయును. దప్పికఅయిన యెడల వేడినీళ్ళు యివ్వవలెను. మిక్కిలి భయముతోకూడినమనస్సుతో పథ్యముచేయవలయును ఈమహాతరుణార్కరసము, బాలురవ్యాధులనుకూడ శాంతిం ను.

# రత్నమహాతరుణార్కం

శ్లో॥ హింగులం తాలకం చైవ రసగంధక టంకణం। సమాంశం చసమంనాభీ సమాంశం తీక్ష్ణతామ్రకం। కాంతాభ్ర స్వర్ణభస్మాని ప్రవాలం మౌక్తికం తథా। రజతం నాగవంగంచ మాక్షికంచ మన శ్శిలా। వైక్రాంతం వజ్రవైడూర్యం పుష్యరాగేంద్రనీలకం। ఏతైస్సమం కృతం చైవ గరలం కృష్ణసర్పజం। మాతులుంగ రసేనైవ మర్దయేద్దివ సత్రయం। చిత్రమూలరసేనైవ మర్దయే ద్దినపంచకం। హంసపాదిరసే నైవ మర్దయేద్దివ సద్వయం। శిగ్రుమూలరసేనైవ జంబీరామ్లైద్దినత్రయం।

తత్కాచకుప్యాం నిక్షిప్య వాలుకాయంత్ర మధ్యతః । మృద్వగ్నినాపచే ద్ధీమాన్ యామమాత్రంపచేత్క్రమాత్ । సాంగశీతలమాదాయమర్దయే ద్గులికాన్‌తతః । స్తన్యానుపాన సంయుక్తం ద్విగుంజాంచ ప్రదాపయేత్ । సర్వరోగాన్ హరత్యేవ తత్ క్షణేననసంశయః । అనుపాన విశేషేణ సర్వరోగ హారంపరం । రత్నేన తరుణార్కంచ మహాయోగేన నిర్మితః॥

వ్యా॥ శు.ఇంగిలీకము, శు.తాళకము, శు.రసము, శు.గంధకము, పొంగలిగారము, శు. నాభి, లోహభస్మ, తామ్రభస్మ, కాంతభస్మ, అభ్రకభస్మ, సువర్ణభస్మ, పగడభస్మ, ముత్యభస్మ, రజతభస్మ, నాగభస్మ, వంగభస్మ, మాక్షికభస్మ, శు. మనశ్శిల, వైక్రాంతభస్మ, వజ్రభస్మ, వైడూర్యభస్మ, పుష్యరాగభస్మ, ఇంద్రనీలభస్మ, నల్లతాచుపామువిషము, ఇవిసమభాగములు ఖల్వమందుంచి, మాదీఫలరసముచే మూడురోజులు, చిత్రమూలరసముచే అయిదురోజులు, హంసపాది, మునగవేళ్లు, నిమ్మకాయరసము, వీటిచేమూడేసిరోజులు మర్దించి కాచకుప్పెయందుంచి వాలుకాయంత్రమందుంచి మందాగ్నిచే వకర్ఝాముమాత్రము వండుకొని సాంగతలమునతీసి నూరుకొని కుప్పెలుకట్టుకొని రెండుగుంజలప్రమాణము చనుపాలు అనుపానముతోయిచ్చిన వెంటనేసర్వరోగములను నిస్సందేహముగా హరించును. అనుపానవిశేషములచే ఈరత్నమహాతరుణార్కము, సర్వరోగములను హరించును.

## పాషాణ తరుణార్కం

శ్లో॥ రసభస్మం తథా స్వర్ణం మాక్షికం రౌప్యభస్మకం । హింగులం వత్సనాభంచ లోహం కాంతాభ్ర తామ్రకం । గోదంతంచ శిలాతాలం ద్విక్షారం బలిసంయుతం । ఏతాని సమభాగాని సంగృహ్యాచభిషగ్వరైః । సర్వేషాంత్రిగుణం యోజ్యం పాషాణత్రయమేవచ । మాతులుంగరసేనైవ సర్వం మర్ద్యం దినావధి । గులికాన్ ఛాయయా శుష్కాన్ కాచకుప్యాం నివేశయేత్ । వాలుకాయంత్రకే పాచ్యంత్రియామం కమలాగ్నినా । సాంగశీతల ముద్ధృత్య హింగులంచ రసాత్మకం । సూతభాగంచగరలం సర్వ తుల్యంతు నాభకం । ఖల్వమధ్యే వినిక్షిప్య మర్దయేన్మాతులుంగకైః । సూర్యావర్త మునిభృంగత్రిపర్ణీ చేంద్రవారుణీ । దుత్తూర తులసీదంతీ బృహతీ కంటకారికా । స్నుహ్యర్క విజయాముండీ కటుతుంబీజయామృతా । ఏతేషాంచ రసేనైవ దినం మర్ద్యం పృథకృథక్ । మత్స్యమాహిషమాయూర వారాహిఛా

× పన్నగైః । భావనాసప్త దివసాన్ కణాక్వాథే దినం దృఢం ।
ఆర్ద్రికస్యానుపానేన మాక్షికస్యానుపానతః । సన్నిపాతజ్వరేఘోరే
త్రిదోషే చాహికజ్వరే । పురాణే తరుణేవాపి చాతుర్థిక త్రిరాత్రకే ।
అన్యత్ర వివిధేదోషే శమనంచ వ్రణాన్ జయేత్। సహాన్యాద్దుర్బలం
జాతం ముహుర్ముహుస్సముద్ధరేత్ । అనేన చానుపానేన సర్వరోగ
హారం పరం । ద్రాక్షాదాడిమ ఖర్జూరఫలం దేయంచ ఖాదయేత్ ।
దేయం ఉష్ణోదకం చైవ తృష్ణార్తేతు ప్రకల్పయేత్ । యావనాలోదకం
చైవ పథ్యం చాపి సమాచరేత్ । వాతవ్యాధీనశేషాన్ శ్లేష్మవ్యాధీన్
తథైవచ । తరుణార్క రసోనామ అపమృత్యు హారం పరం॥

వ్యా॥ రసభస్మ, స్వర్ణభస్మ, మాక్షికభస్మ, రజతభస్మ, శు, ఇంగిలీకము, శు, నాభి, లోహభస్మ, కాంతభస్మ, అభ్రకభస్మ, తామ్రభస్మ, శు, మనశ్శిల, శు. పత్రతాళకము, సద్యఃక్షారము, యవక్షారము, శు, గంధకము, ఇవి సమభాగములు, వీటికి మూడు రెట్లు, శు. గౌరీపాషాణము, ఉల్లిపాషాణము, దొడ్డిపాషాణము, ఇవికలిపి మాదీఫలరసముచే అన్నియు వకరోజుమర్దించి మాత్రలుచేసుకుని నీడను ఎండించుకుని వకుప్పెయందుంచుకుని వాలుకాయంత్రమందు కమలాగ్నిచే మూడుఝాములు వండుకుని చల్లారినపిదప తీసి, శు. ఇంగిలీకము $\frac{1}{2}$ భా, తాచుపాముివిషము, 1 భా, మొత్తము అన్నిటితో సమానము శు. నాభి, ఇటుల వీటినెల్ల ఖల్వమందుంచుకుని మాదీఫలము, సూర్యకాంతము, అవిసి, గుంటగలగర, పర్ణత్రితయము, చేదుపుచ్చ, కాచికూర, ఉమ్మెత్త, తులసి, నేపాలము, నేలములక, వావిడు, జెముడు, జిల్లేడు, గంజాయి, బోడసరము, చేదుఅనప చెక్కలి, తిప్పతీగ వీటి రసములచే ప్రత్యేకముగా వక్కొక, రోజులమర్దించి చేప, దున్నపోతు, నెమలి, అడవిపంది, మేక తాచుపాము, వీటిచేదుకట్లచే ఏడు ఏడురోజులు భావనచేసుకుని పిప్పళ్ళకషాయముచే వకరోజు దృఢముగా మర్దించుకుని అల్లపురసము తేనె, వీటి అనుపానములతో ఘోరమయిన సన్నిపాతజ్వరము త్రిదోషములవలనపుట్టిన అహికజ్వరము, పురాణమైన తరుణమైనగాని చాతుర్థికజ్వరము త్ర్యాహికజ్వరము ఇతరమైనఅనేకదోషములు వీటియందుయివ్వవలయును. వ్రణములను నశింపజేయును.దుర్బలుడయిన రోగిని నశింపజేయును. కాన మాటిమాటికి చూచుచుండవలయును. పై అనుపానముచే సర్వరోగములను హరించును. ద్రాక్షపండ్లు దానిమ్మపండ్లు,ఖర్జూరపండ్లు, యివ్వవలెను. దప్పికఅయిన యెడల వేడినీళ్ళుయివ్వవలయును. యవగంజి యివ్వవలెను. పథ్యముచేయించవలయు. ఈ తరుణార్కరసము సమస్తవ్యాధులను సమస్త శ్లేష్మవ్యాధులను మృత్యువును హరించును.

# మహావిషతరుణార్కం

శ్లో॥ రసభస్మం హేమభస్మ మాక్షికస్యాపిభస్మక । హింగులం వత్సనాభంచ గౌరీపాషాణమేవచ । ఏతాని సమభాగాని గృహీత్వా చ భిషగ్వరైః । సర్వేషాం త్రిగుణం సర్పవిషం సంగృహ్య యత్నతః। మాతులుంగ రసేనైవ సర్వంమర్ద్యం దినావధి । గులికాన్ ఛాయయా శుష్కాన్ కాచకుప్యాం నివేశయేత్ । వాలుకాయంత్ర మధ్యస్థం పాచితంచ ద్వియామకం । సాంగశీతల ముద్ధృత్య రసస్యార్థంచ హింగులం । తావత్సర్పవిషందత్వా మర్దయే త్పూర్వవద్రసైః । ఏతస్య మాషమాత్రంతు సర్వరోగేషు యోజయేత్ । సన్నిపాతే మహాఘోరే నారికేలోదకేన తత్ । అనేనచానుపానేన దత్వాచైనం మహారసం। ద్రాక్షాదాడిమ ఖర్జూరంఫలందేయంచ ఖాదయేత్ । యావనాలోదకంచైవ పథ్యంచాపి సమాచరేత్ । ఉశీరవ్యజనై ర్వాయుంరంజనీయం తథామహాత్ । తరుణార్కరసోనామ మృత్యుంజయతి నిశ్చయం । ప్రియత్నాద్రోగిణాం సర్వం సన్నిపాతేనపీడితం। పూర్వోక్తై రుపచారై ర్జీవయత్యేవనసంశయః॥

వ్యా॥ రసభస్మ, సువర్ణభస్మ, మాక్షికభస్మ, శు. ఇంగిలీకము, శు. గౌరీపాషాణము, ఇవి సమభాగములు, గ్రహించి వీటి అన్నిటికి మూడురెట్లుత్రాచుపాము విషము కలపి అన్నియు మాదీఫలరసముచే వకరోజుమర్దించి మాత్రలుచేసినీడనుఎండించి కాచకుప్పెయందుంచుకుని వాలుకాయంత్రమందు రెండుఝాములువండి చల్లారిన పిదపతీసి శు. ఇంగిలీకము, $\frac{1}{2}$ భా, గరలము $\frac{1}{2}$ భా, కలపిమాదీ ఫలిరసముచే ఒకరోజు మర్దించుకుని, మాషప్రమాణము సమస్తరోగములయందును. యివ్వవలెను. మహాఘోరమైన సన్నిపాతమందు గొబ్బరికాయనీళ్ళతో యివ్వవలయును. ద్రాక్షపండ్లు దానిమ్మపండ్లు ఖర్జూరపండ్లు, యివ్వవలెను. యవగంజియివ్వవలయును. పథ్యము చేయించవలయును. వట్టివేళ్ళ విసనకర్రలచే చక్కనిగాలి వచ్చునట్లు విసరవలెను. ఈతరుణార్కరసము,మృత్యువును జయించును. జాగ్రతగయిచ్చి, పూర్వమందు చెప్పబడిన "ఉపచారములుచేసినయెడల సన్నిపాతరోగినిజీవింపజేయును.

# కాసశ్వాస హర రసం

శ్లో॥ రసగంధకణా పథ్యా కలిద్రుఫల వాసకాః । భార్గిచేతి క్రమాత్ వృద్ధై రేతద్బబ్బూలజద్రవైః।పిష్టంవింశతి యేకాంతాత్ కుర్యాత్ క్షౌద్రేణగోలకాన్ । కర్షప్రమాణ మేతస్వత మేకం।ప్రాతరుత్థితః ।

దద్యాన్మాసత్రయం క్షుద్రాక్వాథం దశకణాయుతం । పిచేత్తదను కాసాచ్ఛశ్వాసాచ పరిముచ్యతే॥

వ్యా॥ శు, రసము 1 భా, శు, గంధకము 2 భా, పిప్పళ్ళు 3 భా, కరక్కాయ 4 భా, తానికాయ 5 భా, అడ్డసరము, 6 భా, గంటుభారంగి 7 భా, వీటిని తుమ్మెకషాయముచే 20 రోజులు మర్దించి తేనెతోకర్ష ప్రమాణము మాత్రలుచేసి శుని పకమాత్రను ఉదయమున లేచి పదిపిప్పళ్లు చూర్ణముతోకూడిన నేలములగ కషాయముల ఆనానముతో మూడుమాసము సేవించిన దగ్గు, ఆయాసము ఇవినశించును.

# నయనామృతమ్

శ్లో॥ రసేంద్రభుజగా తుల్యౌ తయోర్ద్విగుణ మంజనం । సూతతుర్యాంశ కర్పూర మంజనంనయనామృతమ్ । తిమిరంపటలంకాచం శుక్రమర్మార్జునానిచ । క్రమాత్ పథ్యాశినోహంతి తథాన్యా నపిదృగ్గదాన్॥

వ్యా॥ సూతము, సీసము, ఇవిసమభాగములు వీటికి రెట్టింపురసాంజనము, సూతములో నాల్గవవంతు పచ్చకర్పూరము ఇటుల వీనిని అంజనవేసి మనుచూపథ్యముగా భుజించుచుండిన, తిమిరము, పటలము, కాచము, శుక్రము, అర్మము, అర్జునము, మొదలగు నేత్రవ్యాధులుపోవును.

# చంద్రప్రభారసమ్

శ్లో॥ శుద్ధసూతం ద్విధాగంధం మర్ద్యం నింబమయూరయోః । ద్వయోరాత్రివైస్న గోమూత్రైర్దినం వాకుచికాద్రవైః । ముస్తాపిండీతకంక్షిప్త్వాతం రుధ్వాభూధరేపుటేత్ । సాంగశీతం సముద్ధృత్య చూర్ణాద్దశగుణంక్షిపేత్ । తథాచ వాకుచీబీజం గోమూత్రే మర్దయేద్దినం ద్వినిష్కాంవటికాం ఖాదేత్ శ్విత్రకుష్ఠవినాశినీ। ఖ్యాతాచంద్ర ప్రభాహ్యేషాకుర్యాత్తక్రేణ భోజనం । కాకోదుంబరికామూలం జలైర్ఘృష్టం పిబేదను॥

వ్యా॥ శు, రసము 1 భా, శు, గంధకము, 2 భా వీటినివేప, నెమలియాకు వీటిరసములచే పక్కొకరోజు మర్దించి పిదపగోమూత్రము, బావంచరసములతో మర్దించి తురగము స్లు, మంగకాయ, వీటిచూర్ణముకలుపుకని భూధరపుటంబిడి చల్లారినపిదప తీసిదానికిపదిరెట్లు బావంచివిత్తులచూర్ణముకలుపుకొని గోమూత్రముతోపకరోజు మర్దించి రెండునిష్కములప్రమాణము మాత్రలుచేసిబ్రహ్మమేడివేళ్ళనుఉదకముతోనూరి

ఆరసము అనుపానముతో సేవించుచు మజ్జిగఅన్నము భుజించుచుండిన ఈ చంద్రప్రభారసము శ్వేతకుష్ఠువును హరించును.

# వజ్రీకరసమ్

శ్లో॥ సూక్ష్మచూర్ణంతు మండూరం గోమూత్రేపాచయేద్దినం। వజ్రవల్లీం సమాంశంచ చించాత్వక్ క్షారసంయుతాం। భక్షితంచాక్షమాత్రంతువ్యా సాధ్యం శ్వయథుంజయేత్॥

వ్యా॥ మాండూరమును సూక్ష్మముగ చూర్ణముచేసి గోమూత్రములో వకదినము వండిపిదప దానికిసమము నల్లేరుచూర్ణమును చింతబెరళ్ళబూడిదను కలుపుకొని గచ్చకాయలంత మాత్రలుచేసుకొని పుచ్చుకొనిన అసాధ్యమైన వంజులను హరించును.

# సువర్ణసూర్యావతి

## (వంటయోగం)

శ్లో॥ సువర్ణం రజతం వంగం శశివైక్రాంతమాక్షికం। ప్రవాలం నాగకాసీసం గుడూచీ సత్వమేవచ। టంకణం సత్తుభస్మంచ ఏకభాగం పృథక్ పృథక్। ద్విభాగం గగనంచైవ సిందూరంచ చతుర్దశ। ఇత్థంచ వస్తుసంయుక్తం సమంసర్వైశ్చహింగులం। తద్వస్తుభస్మ శుద్ధంచ ఖల్వమధ్యేతు నిక్షిపేత్। ద్రాక్షామలక ఖర్జూర కార్పాసకుసుమద్రవైః। కార్పాసబీజ సారేణ జంబీరరస మర్దితం। కపిత్థబిల్వమూలానాం రసేనచ విమర్దయేత్ ధాన్యకార్ద్రికనారంగ జీరక్షుద్రామ్లికారసైః। మాదీఫల రావరేతయోశ్చణకంచ సదాడిమం। కాకబీజస్య సారేణమర్దితంచ యత్నతః। తదౌషధం కుక్కుటాండే బిల్వమూలరసేనచ। డోలాయంత్రేయామమాత్రం పాచితంచ భిషగ్వరైః। సాంగశీతలమాదాయ మృత్తికాలేప మాచరేత్। ఔషధంపుటపాకేన కుమారీరసమర్దితం। ముద్గమాత్రం ప్రదాతవ్యం అనుపానవిశేషతః। రాజయక్ష్మక్షయాన్ హన్తి హిక్కాంచ వమనానిచ। సర్వపైత్యంచ తాపంచ సర్వజ్వరనివారణం। సర్వవా నం సర్వమేహ వినాశనం। తత్తద్రోగానుపానేన రోగాన్ నికృంతయేత్। తుష్టిపుష్టికరం కాంతివరనం బలవర్ధనం సురసూర్యావతిః రసోనామ్నా విష్ణునా నిర్మితంపురా॥

వ్యా॥ సువర్ణభస్మ, రజతభస్మ, వంగభస్మ, పచ్చకర్పూరము, వైక్రాంతభస్మ, ముత్యభస్మ, పగడభస్మ, సీసభస్మ, అన్నభేదిభస్మ, తిప్పసత్తు, పా. వెలిగారము, సత్తుభస్మ, ఇవి ప్రత్యేకముగా వక్కొక్కభాగము, అభ్రకభస్మ 2 భా, రససింధూరము భా, వీటిఅన్నిటితోను సమానము, శు, ఇంగిలీకము, ఇట్లు వీటిని ఖల్వమందుంచి ద్రాక్ష, ఉసిరిక, ఖర్జూరపుకాయలు, ప్రత్తిపువ్వులు, ప్రత్తివిత్తులు, నిమ్మకాయలు, వెలగ్రవేళ్ళు, మారేడువ్రేళ్లు, ధనియాలు, అల్లము, నారింజ, జీలకర్ర, పులిచింత, మాదీఫలములు, దబ్బకాయ, సెనగ, దానిమ్మ, కాకిదొండవిత్తులు, వీటిరసములచే బాగుగమర్దించి ఆఔషధమును కోడిగ్రుడ్లయందుంచి మారేడువ్రేళ్ళరసముచే డోలాయంత్రిమందు వకర్ఝామ పచించుకుని చల్లారినపిదప తీసి ఆఔషధమును పుటపాకము చేసుకొని కలుబందరసముచే మర్దించుకొని అనుపానవిశేషముచే పెసరగింజంత యిచ్చిన రాజయక్ష్మ, క్షయ, ఎక్కిళ్లు, వాంతులు, సమస్తపైత్యములు, తాపము, సమస్తజ్వరములు, సమస్తవాతములు, సమస్తమేహములు, ఆయారోగానుపానములచే సమస్తవ్యాధులను ఖండించును. మనస్సంతోషము, శరీరపుష్టి, కాంతి, బలము, వీటిని వృద్ధిం దించును. ఈ గుటికసూర్యావర్తీ పూర్వమందు విష్ణువుచే నిర్మించబడెను.

గద్య. ఇతి శ్రీ గోదావరీమండలమండనాయమాన కోనసీమాంతర్వర్తి మోడేకుర్రుగ్రామవాసి భూసురాగ్రగణ్యాశ్రీపాదోప నామకకౌశికస గోత్రపవిత్ర వేంకటేశ్వరపౌత్ర సోమయాజిపుత్ర సుబ్బమాంబాగర్భశుక్తిముక్తాయమాన సద్గురుసేవాసమాసాదిత సాహితశబ్దశాస్త్రాయుర్వేదాదివిద్యానిధానభిషగ్వారాయుర్వేదభూషణాదిబిరుదావళీవిరాజమాన విద్వత్ప్రభుసభాస్థానసన్మానన భ్రాజమానసకలసజ్జనవిధేయ కృష్ణమూర్తిశాస్త్రినామధేయప్రణీతాయుర్వేదౌషధరత్నాకరే తృతీయగుచ్ఛః సమాప్తః.

ఇతి

ఆయుర్వేదౌషధరత్నాకరమ్

సమాప్తమ్.



ఈ పుస్తకము కావలసినవారు

డాక్టర్ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి,

బెజవాడ

అని వ్రాసికొనవలయును.



# భస్మ ప్రకాశిక.

నేను ఆయుర్వేదౌషధ రత్నాకరమును రచించి ప్రచురించిన పిదప ప్రతివారును వారు యింకను ఏమైనను గ్రంథములను రచించితిరా? భస్మములనుగూర్చి విపులముగా ఒక గ్రంథమును తప్పక వ్రాయవలెను. ఫలానియోగము నందలి ఫలాని భస్మ ఎట్లు తయారు చేసుకొనవలెను. ఈమొదలగు సంగతులనుగూర్చి అనేకమంది అనేకజాబులను వ్రాయుచున్నారు. మరియు కొందరుస్వయముగావచ్చిసంగతులను తెలుసుకొని వెళ్లుచున్నారు. ప్రతివారికిని సమాధానము వ్రాయుటయు సమాధానముచెప్పుటయు శ్రమయని తలంచి నేనదివరకే వ్రాయదలచుకొనియున్న ఈభస్మ ప్రకాశికను వ్రాసితిని. ఇందుఆయా భస్మముల నిమిత్తము ఎటువంటి ద్రవ్యములను గ్రహించవలసినదియు ఎటువంటి ద్రవ్యములను విసర్జించవలసినదియు శుద్ధిచేసుకొనదగిన విధానభేదములును ఇందు నిమిత్త ముపయోగించు ద్రవ్యములును భస్మచేసుకొనదగిన విధాన భేదములును ఇందు నిమిత్తముపయోగించు ద్రవ్యములును ఎంతవరకు భస్మచేసుకొనవలసినదియు భస్మ చేసుకొనునప్పుడు ముద్దకట్టుట రంగుమారుట గట్టిపడుట మొదలగునవి సంభవించిన ఏమి చేయవలసినదియు ఆయాప్రక్రియలచే భస్మ ఏరంగులో తయారగునదియు మొదటవేసిన పరిమాణమునకు ఎంతతగ్గునదియు సిద్ధభస్మపరీక్షావిధానము విశేషగుణములు మోతాదు మొదలగునవన్నియు ప్రతిభస్మమునకును వరుసగ విపులముగ వ్రాయబడినవి. ప్రతివిషయమునకును శ్లోకమును చక్కని తెలుగు వ్యాఖ్యయు అనుభవముతో కూడిన విపులమైన విమర్శనయు కలవు. మరియు ఇంగిలీకములోనుండి రసమును తీసుకొన దగిన విధానములు సమస్త పాషాణముల యొక్కయు శుద్ధులు భస్మవిధానములు మైనములు కట్లు మాత్రలు పలాస్త్రిలు మోతాదు అనుపానము గుణములు పథ్యము మొదలగునవియు ఇంగిలీకపు కట్లు మైనములు సిందూరములు భస్మములు మొదలగునవియు తామ్రమైనము పచ్చకర్పూరముచేయువిధానము నారికేళరసాయనము గంధకపుష్పము మూడుజీరుపట్లు మైలతుత్థభస్మ తాలకభస్మ అనేక పలాస్త్రిలు మొదలగునవన్నియు అనుభవ పూర్వకముగ అతివిపులముగ వ్రాయబడినవి. గ్రంథమంతయు అనుభవముతో నిండియున్నది. ఇటువంటిగ్రంథము ఆంధ్రదేశమునందు యిదివరకు ఎన్నడును వెలువడియుండలేదు. ఈగ్రంథసహాయమున ప్రతివారును గొప్ప వైద్యులు కావచ్చును. వెంటనే ఆర్డరు పంపినవారికే పైగ్రంథము లభించగలదు. వెల రు. 1-0-0.

గ్రంథకర్త — ఆయుర్వేద భూషణ భిషగ్వర శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి. యమ్.ఏ.సి., ప్రిన్సిపాల్ శ్రీరామమోహన ఆయుర్వేద కళాశాల అండు సీనియర్ డాక్టరు శ్రీరామమోహన అయుర్వేద ధర్మ వైద్యశాల అండ్ రామమోహన అయుర్వేద ఫార్మసి, బెజవాడ.

పై గ్రంథము కావలసినవారు

డాక్టర్, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి,

బెజవాడ.

అని వ్రాసుకొనవలెను.

# ఆంధ్ర భైషజ్యరత్నావళి.

సంస్కృతమునందున్న భైషజ్యరత్నావళిని ఆంధ్రవైద్యులందరును వినియోగి దురు. ప్రకృతము విశేషముగ వాడబడుచున్న ఆసవ అరిష్ట చూర్ణ లేహ్య గుటికాదులకిదియే ఆధారమనియు ఇందు అమూల్యములైన యోగరాజములు కలవనియు క వినియోగింతురు. ఆంధ్రదేశమునందు ప్రసిద్ధములైన రసౌషధములను సంగ్రహించి ఆం ర్వౌషధరత్నాకరము అనెడిపేరుతో నొక గ్రంథమును రచించిన వాడనైన మిగిలిన ఆసవారిష్టాది యోగములుకూడ ఆంధ్రవైద్య సోదరులకు అందింప జేయవలసిన భార ముకూడ నామీద నేయున్నదని గ్రహించి ప్రసిద్ధములై వాడుకలోనున్న ఆసవ అరిష్ట చూర్ణ లేహ్య ఘృత తైలాదుల నన్నిటిని చేర్చి పై గ్రంథమును వ్రాసితిని. ఇందు అశోకారిష్టము సారస్వతారిష్టము ద్రాక్షారిష్టము అశ్వగంధారిష్టము అర్జునారిష్టము మొదలగు సమస్త అరిష్టములును లోహాసవము చందనాసవము సారిబాద్యాసవము మొదలగు సమస్త ఆసవములును అశ్వగంధాది చూర్ణము పుష్యానుగచూర్ణము ద్రాక్షాది చూర్ణము చందనాదిచూర్ణము రసోత్తమాది చూర్ణము మొదలగు సమస్తచూర్ణములును అశ్వగంధాదిలేహ్యము మదనకామేశ్వరిలేహ్యము నారసింహలేహ్యము శతమూలికాదిలేహ్యము వాసావలేహ్యము త్రిఫలాలేహ్యము కూష్మాండలేహ్యము సారిబాదిలేహ్యము మొదలగు సమస్తలేహ్యములును నారాయణతైలము మాషతైలము చందనాదితైలము బలాతైలము మొదలగు సమస్తతైలములును సారస్వతఘృతము అశోకఘృతము పంచతిక్త గుగ్గులు ఘృతము మొదలగు సమస్తఘృతములును సమస్తగుగ్గులును మాత్రలు కషాయములు మొదలగునవియు కలవు. గ్రంథాంతమునందు పరిశేషితాను బంధములు అనునొక ప్రకరణముచే మహాదీఫలరసాయనము భృంగామలక తైలము అమృతామలకతైలము భావనకరక్కాయ భావనజీలకర్ర దంతధావన చూర్ణములు పలాస్త్రిలు మొదలగు ననేకములు చెప్పబడినవి. ప్రతియోగమునకును శ్లోకమును చక్కని తెలుగు వ్యాఖ్యయు అనేక సంవత్సరముల నుంచి అనేక సారులు తయారుచేసిన అనుభవజ్ఞానముతో కూడిన విమర్శనయు కలవు. అందుచే ప్రతియోగమును స్త్రీలుకూడతయారుచేసుకొని వాడుకొనుటకు తగిన విధముననున్నవి. కొద్దిప్రతులే అచ్చువేయించినాము. గ్రంథప్రాశస్త్యమువలన త్వరలో ఖర్చుఅగుచున్నవి. కాన వెంటనే పుచ్చుకొనిన వారికే పైగ్రంథము లభించును.

వెల. రు. 2—0—0

గ్రంథకర్త— ఆయుర్వేదభూషణ భిషగ్వర శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి ఏ.యమ్. ఏ.సి. ప్రిన్సిపాల్, శ్రీరామమోహన ఆయుర్వేదకళాశాల అండ్ సీనియర్ డాక్టర్, శ్రీరామమోహన ఆయుర్వేద ధర్మవైద్యశాల అండ్ రామమోహన ఆ ర్వేద ఫార్మసీ, బెజవాడ.

ఈ గ్రంథము కావలసినవారు,
డాక్టర్. శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి,
బెజవాడ.
అని వ్రాసుకొనవలయును